## ప్రజానాయకుడు

# స్టాలిన్



యారస్లావిస్కీ



ప్రజాశక్తి కార్యాలయం
గవర్నరుపేట : : బెజవాడ

D



స్టాలిన్
బాల్యంలో



స్టాలిన్
యౌవ్వనంలో

# బాల్యం : యౌవనం

ఒకప్పుడు టిఫ్లిస్ అని పిలవబడేరాష్ట్రంలో గోరీపట్టణపు పేటలలో ఒక చిన్నయింట్లో 1879 డిసెంబరు 21 వ తేదీన పుట్టేడు స్టాలిన్. కామ్రేడ్ స్టాలిన్‌తో పాటు ఒకేబడిలో చదువుకున్న డి. గోగోఖియా తన జ్ఞాపకాల్ని వివరిస్తూ "ఆ కుటుంబం నివసించిన గది ఐదు చదరపు గజాలకిమించిలేదు. అది ఆయింటి వంటశాల నానుకుని వుంది. గదిగుమ్మం సరాసరి ముంగిట్లోకే వుంది. ఆఖరికో మెట్టుకూడా లేదు. నేలని ఇటుక పరవబడింది. ఒకచిన్న కిటికీలోంచి రావాలి వెలుతురు. ఆ గదిలోవున్న సామానల్లా ఒక చిన్న మేజా, ఒక కుర్చీపీట, ఒక పెద్దసోఫా. ఈ సోఫా నేలలో బిగించివేసిన పెద్ద భోషాణంలావుంది. పైన ఒక గడ్డిపరుపు వుండేది."— అన్నాడు.

స్టాలిన్ తన చిన్నతనాన్ని గడిపిన ఆ నిరాడంబరమైన గదిని చూసి, ప్రతిఏటా గోరీనగరాన్ని చూడడానికి వచ్చే వేలకొద్దీ దర్శకుల హృదయాలు సంచలితం అవుతూంటాయి. అతని తల్లిదండ్రులు చాలాపేదలు. ఆయన తండ్రి విసారియన్ జుగాష్విలీ బూట్లుకుట్టుపనివాడు. చాలాకాలం అదెల్ఖానోవ్ ఫ్యాక్టరీలో పనిచేసేడు. కొంతకాలం ఇంటివద్దనే చెప్పులుకుట్టుకుని జీవించేడు. విసారియన్ జుగాష్విలీయొక్క 'పనిముట్లని'— ఒక ఊగీసలాడే కుర్చీ, సుత్తి, అచ్చులని— ఆ యింట్లో ఇప్పటికీ చూడొచ్చును. స్టాలిన్‌తల్లి ఎకాటెరీనా చాలా శ్రమపడి పనిచేసే స్వభావంగలది. రాత్రింబగళ్ళు పనిచేస్తేనేతప్ప ఆ బీదయింట్లో రోజు గడవదు. అందుచేత ఆమె చాకలిపని చేస్తూండేది. బాగా చిన్ననాటినుంచీ స్టాలిన్ దారిద్ర్యం - లేమి అనుభవించాడు. ఏమూలచూసినా కూలీల - రైతుల కఠోర దారిద్ర్యమే కనబడి, అతని చిన్నిహృదయంలో పీడితప్రజలయెడ సానుభూతి మొలకలెత్తించి.

ఆయన చిన్ననాటి మిత్రులెందరో స్టాలిన్‌కి సంబంధించిన తమతమ జ్ఞాపకాల్ని వ్రాసేరు. వారంతా ఆయన చాలా చురుకైనవాడనీ, అన్నీ తెలుసుకోవాలనే ఆతురతగలవాడనీ, తనసహచరుల అభిమానాన్ని పొందేడనీ, వ్రాసేరు. ఏడోఏట అక్షరాలు నేర్చుకున్నాడు. ఒక ఏడాదినాటికి మొదట జార్జియన్‌భాషనీ, తర్వాత రష్యన్‌భాషనీ చదవగలశక్తి సంపాదించేడు. ఆయన 1888 మొదలు 1894 వరకూ గోరీలోని ఒక మతపాఠశాలలో చదివేడు. లెనిన్‌లాగే స్టాలిన్‌కూడా మంచి పాటుబడి చదివేవాడు. హెచ్చుమార్కులు తెచ్చుకునేవాడు. చదువుతోనూ,

ఆటలలోనూ కూడా అందెవేసిన చెయ్యి. అన్ని ఆటలలోనూ నాయకుడు. మంచి స్నేహపాత్రుడు. బడిపిల్లలందరి అభిమానాన్నీ సంపాదించేడు. ఆయనకి చదవడం, బొమ్మలు గీయడం, పాటలు పాడడం అంటే సరదా.

ఇంకా బడిలో చదువుకుంటూన్న రోజుల్లోనే తరుచుగా కూలీలనీ, రైతుల్నీ కలుసుకొని మాట్లాడుతూ, స్టాలిన్ వారికి వారి దారిద్ర్య కారణాల్నిగూర్చి తెలియ చెబుతూండేవాడు. స్టాలిన్‌తోపాటుగా ఒకేబడిలో చదువుకున్న జి. ఎలిజాబెదాష్వెలీ ఆనాటి విషయాన్ని ఒకదానిని చెబ్తూంటాడు. వారిద్దరూ పొలాలమీదుగా పోతూ వుంటే ఒకపొలంలో అలుపుతీర్చుకుంటూన్న రైతులు కొందరు కనపడ్డారట :

"ఆ రైతుల్లో వొకడు ఎంతో ఆప్యాయంగా ఇంతరొట్టే, చిక్కుడుగింజలూ తింటూంటేచూసి స్టాలిన్ అతని దగ్గిరికి వెళ్ళేడు.

"అంతబలహీనమైన తిండి తింటావేం ? నువ్వే దున్నురావు, చల్లుతావు, పంట నువ్వే పోగుచేసుకుంటావు. నువ్వింతకన్న బాగా బ్రతుకవచ్చునే"- అని ప్రశ్నించేడు.

"నిజమే. పంట మేమే కోసుకుంటాం. కాని, పోలీసు యిన్‌స్పెక్టరుకీ, మఠాచార్యుడికీ వారివారి వాటాలంటూ ఇవ్వాలిగా ? ఆమీద ఇంక మాకు మిగిలే దెంతోవుండదు!"—అన్నాడా రైతు.

"ఇంక సంభాషణ ఆరంభం అయింది. రైతులు అంత దరిద్రంలో ఎందుకుంటున్నారో, వారిని పీల్చిపిండేస్తూన్న దెవ్వరో, వారి మిత్రులెవ్వరో, శత్రువులెవ్వరో నెమ్మదినెమ్మదిగా నచ్చచెప్పేడు. ఎంతో బాగా అర్థమయ్యేలాగ, విసుగు పుట్టనిపద్ధతిలో చెప్పేడేమో ఆరైతు లాతని నింకోమాటువచ్చి మాట్లాడమని అడిగేరు."

చాలా చిన్నవయస్సులోనే ఇంకా మఠపాఠశాలలో చదువుతూన్నరోజుల్లోనే మంచి విమర్శనాబుద్ధీ, విప్లవభావాలూ గలవాడుగా తయారయ్యేడు. డార్విన్ సిద్ధాంతాలు చదివి, నిరీశ్వరవాది అయ్యేడు.

జి. గ్లర్జె, స్టాలిన్ చిన్ననాటి మిత్రుల్లో వొకడు ఇల్లా వ్రాసేడు.

"నేను దేవుణ్ణి గురించి చెప్తూంటే జోసెఫ్ అంతా పూర్తిఅయ్యేదాకా విని, ఓనిమషం వూరుకుని అందుకున్నాడు :

"వాళ్ళు మనల్ని దద్దమ్మల్నిగా చేస్తూన్నారని తెలుసా నీకు ? దేవుడనే వాడు లేడు...."

"ఆమాటలకి నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. అల్లాంటి మాట లిదివర కెన్నడూ విన్నదిలేదు.

"ఎల్లాగ అనగలిగే వామాట, సోసో ?" అన్నాను.

"నీకో పుస్తకం ఇస్తాను, చదువు. ఈప్రపంచం ఈజీవజాలం నువ్వు అనుకుంటూన్నమాదిరిగా లేవనీ, దేవుడిని గూర్చిన ఈమాటలన్నీ వట్టి తెలివితక్కువప్రసంగంమాత్రమేననీ ఆపుస్తకం నిరూపిస్తుంది" అన్నాడు.

"ఏమిటా పుస్తకం :"—అన్నాను.

"డార్విన్, నువ్వు చదవవలసిన పుస్తకం."—అని నాకు నచ్చచెప్పేడు."

గోరీలో స్టాలిన్‌తో చదువుకున్న కామ్రేడ్ వానోకెష్కోవెలీ తమ బడి రోజులనాటి జ్ఞాపకాలు వ్రాస్తూ, కొన్ని సంగతులు చెప్తున్నాడు.

"వసంతంలోనూ, ఆకురాలుకాలంలోనూ ఆదివారాలనాడు పొలాలమీద తిరుగుతూండేవాళ్ళం. గోరిజ్వారీపర్వతపు పంచలోవున్న ఒకచిన్న ఖాళీస్థలం మాఅభిమానప్రదేశం.

"ఏళ్ళు గడిచిపోయినాయి : వాటితో మాచిన్నతనపువాంఛలూ, కలలూ కూడా గతించిపోయినాయి.

"గోరీస్కూలులో పైతరగతిలో చదువుతూన్నరోజుల్లో మాకు జార్జియన్ వాఙ్మయంతో పరిచయం ఏర్పడింది. కాని, మా అభివృద్ధికి దారిచూపి, మాభావాలని సరియైనమార్గంలో పెట్టగల మార్గదర్శిలేడు. * చావ్‌చావాజే వ్రాసిన "దొంగ కోకో" అనేగీతం మామనస్సులమీద ముద్రితం అయిపోయింది. కాజ్బేగీయొక్క వీరులు మాహృదయాలలో దేశభక్తి రేకెత్తించేరు. స్కూలుని విడిచిపెట్టేక దేశ సేవ చెయ్యాలనే ఆతురత మాలో ప్రతివారిలోనూ బయలుదేరింది. కాని, ఈ సేవ ఏమాదిరిగా వుండాలో మాలో ఒక్కరూ స్పష్టంగా ఎరగరు."

స్టాలిను గోరీలోని మతపాఠశాలలో చదువుతూన్న రోజుల్లోనే డార్విన్ పుస్తకాలతోపాటు మార్క్సిస్టు వాఙ్మయంతోకూడా మొట్టమొదటిసారిగా పరిచయంపొందేడు. 1894 లో ప్రత్యేకయోగ్యతలతో గోరీస్కూలు వదిలేడు. అక్కడినుంచివెళ్ళి టిఫ్లిస్‌లోని ఆధ్యాత్మికకళాశాల (Seminary) లో చేరేడు. ఇక్కడ అమలుపరచబడుతూన్న పద్ధతుల కలవాటుపడడం అతనికి చాలాకష్టంగా తోచింది. ఆ కళాశాలకి బహిస్సంపర్కం శూన్యం. విద్యార్థులు కూపస్థమండూకాలమాదిరిగా బయటిప్రపంచంతో సంబంధంలేకుండా జీవించాలి. ఉపాధ్యాయులు సన్యాసులు. విద్యార్థులకి దేవుడు, ప్రభువు, దేవాలయం, వ్యక్తిగతఆస్తిహక్కుల యెడ భక్తి విశ్వాసాలు నూరిపొయ్యడమే వారిపని. మఠాలలోమాదిరిగా ఇక్కడకూడా నిర్ణీతాలయిన గంటలలో విద్యార్థుల్ని ప్రార్థనలకి ఆహ్వానిస్తూ గంటలు కొట్టబడతాయి. పాఠ్యవిషయాలలో ప్రాధాన్యత ఆధ్యాత్మికత్వానిది. "బల్లాంయొక్క గాడిద ఏభాషలో మాట్లాడింది ?" వగైరా విషయాలమీద విద్యార్థుల వ్యాసరచన. విద్యార్థుల్ని గూఢచారులు కనిపెట్టివుండేవారు. వారి ప్రతిపనీ పరీక్షించబడేది. పిచ్చి ఎత్తించే, ఈ మతబోధకుల పీడాకరమైన హయాంలో విద్యార్థులనేకుల మెదళ్లు యావజ్జీవం పనికిరాకుండా చెయ్యబడేవి. ఈ మత పాఠశాలలూ, సెమినరీలూ, జారుకీ ఆయన ప్రభుత్వానికీ విశ్వాసపాత్రులయిన సేవకుల్నీ, కర్త్రీలేని మోసగాళ్ళనీ, విద్రోహుల్నీ తయారుచేసిపెట్టేవి. నికోలాయి చెర్నిషేవ్‌స్కీ, * లాడో కెష్కోవెలీ, మిఖా తాఖాకాయాలవంటి విప్లవకారులెందరో ఆగోడల మధ్యనుంచి రాకపోలేదు. కాని, వారి విప్లవభావాలు ప్రజా

సామాన్యంపడే బాధలలో పుట్టేయి. విద్యార్థులు చదవకూడదని నిషేధించబడిన పుస్తకాలు చదవడంవలన అవి బలపడ్డాయి. మత పాఠశాలలు, సెమినరీలు, తదితరాలయిన జారిస్టుపాఠశాలలూ విద్యార్థులని దుర్భరాలయిన సంకెళ్ళలో అణిచిపెట్టి, ఉక్కిరిబిక్కిరిచేసి, వారిలో తీవ్రమైనఅసంతుష్టి కలిగించేవి. జర్మన్ గ్రంథకర్త ఎమిల్ లడ్విగ్‌కి ఇచ్చిన ఇంటర్వ్యూలో ఈ ఆధ్యాత్మిక కళాశాల తనలో కలిగించిన భావాల్ని గురించి స్టాలినే ఇల్లాగ చెప్పేడు :

"ఆ సెమినరీలో అమలుపరచబడుతూన్న అవమానకరమైన పాలనా, వంచనా పద్ధతులకి అసమ్మతిగా నేనొక విప్లవకారుణ్ణి కావడానికి సిద్ధంగా వుండే వాడిని. చివరికి అయ్యేనుకూడా. మార్క్సిజమే నిజమైన విప్లవసిద్ధాంతం అని నమ్ముతూన్న విప్లవకారుడి నయ్యేను."

మార్క్సిస్టులతో మైత్రి నేర్పరచుకొని, మార్క్సిస్టు వాఙ్మయం చదివేనాటి కింకా స్టాలిను పదిహేనేళ్ళ కుర్రవాడు.

"నేను విప్లవోద్యమంలో నా పదిహేనోయేటనే చేరేను. ట్రాన్స్‌కకేషియాలో వున్న రష్యనుమార్క్సిస్టుల రహస్యసంఘాలతో నాకప్పుడే పరిచయం ఏర్పడింది. ఈదళాలు నన్ను తమ పలుకుబడిలోకి తెచ్చుకున్నాయి. రహస్యమైన మార్క్సిస్టు వాఙ్మయంలో నాకు అభిరుచి కలిగించేయి," అని ఎమిల్ లడ్విగ్‌తో స్టాలినే చెప్పేడు.

ఆ రోజుల్లో టిప్లిస్‌లో మార్క్సిస్టు వాఙ్మయాన్ని సంపాదించడం అంత సులభమైనపని కాదు. సోవియటు యూనియను కమ్యూనిస్టు పార్టీ (బోల్షివిక్) యాజమాన్యాన 1938 లో ప్రచారకుల సమావేశం జరిగింది. ఆ సమావేశంలో స్టాలిను టిఫ్లిస్‌లోని యువకమార్క్సిస్టులు తమ దగ్గరున్న కానులు పోగుచేసి, ఆరోజుల్లో టిఫ్లిస్‌లో దొరికిన మార్క్సుయొక్క కాపిటలు ఒకేఒక ప్రతినుంచి వ్రాయించి ఎలాగ వ్రాతప్రతి సంపాదించుకోవలసి వచ్చిందో వివరించేడు. దానిని రహస్యంగా చదివేరు. ఇలా రహస్యంగానే మార్క్సు, ప్లెఖనోవ్, చెర్నిషేవ్‌స్కీ, పిసారేవ్, బెలిన్‌స్కీ, దోబ్రోల్యూబోవ్, హెర్జెన్‌ల రచనలు చదవబడ్డాయి.

ఇప్పటికే స్టాలిను రష్యను, జార్జియనుభాషలలో ఎన్నో పుస్తకాలుచదివేడు. విదేశపు వాఙ్మయంయొక్క అనువాదాలు చదివేడు. ఆయనకిగల ఆసక్తి అపరిమితం. జ్ఞానం సర్వతోముఖం. దానిని విస్తరింపచేసుకుందుకూ, దానికి తగుసాధనా లేర్పరచుకుందుకూ ఆయన నిరంతరం కృషిచేసేవాడు. షేక్స్పియరు, ష్కిల్లరు, టాల్‌స్టాయిల ఉద్గ్రంథా లాయనకి కరతలామలకం. చెర్నిషేవ్‌స్కీ, పిసారేవ్‌ల రచనలు చదివేడు. సాల్టికోవ్-ష్చెడ్రిన్, గోగోల్, చెఖోవ్‌ల రచనలంటే ఆయనకి మహాప్రీతి. వారి గ్రంథాల నాయన తరుచుగా వుదహరిస్తూ వుంటాడు.

రూస్టవెలీ, ఎరిస్టావీ, చావ్‌చావాజే మొదలైన జార్జియను రచయితల రచనలతో ఆయనకి మంచి పరిచయంవుంది. నాగరికతాయుగపు చరిత్రనీ, సమాజ పరిణామశాస్త్రాన్నీ (Sociology) చదివేడు, రసాయనికశాస్త్రం, భూతత్వశాస్త్రం

అంటే అసక్తిమెండు. ఆయనకి గీతాలంటే మహాప్రీతి. ఆయన ఎన్నో ఉత్తమ గీతాలు వ్రాసేడనీ, 1895 లో అవి ఇబెరియా అనే పత్రికలో 'సోసెలో' అనే పేరున ప్రకటించబడ్డాయనీ చాలా కొద్దిమందిమాత్రమే ఎరుగుదురు. ఆనాటి గీతాలలో వొకటి :

హద్దుపద్దూలేని - కాయకష్టంచేత
వంగిపోయిన వీపుతో ।
నిన్న నేటీవరకు - బానిసత్వపు బ్రతుకు
మోకరిల్లిన - మానవుండే ।
భావిసౌఖ్యాశలను - రెక్కబలమునలేచి
సర్వోన్నతిని నిల్చుచో ।
పర్వతశ్రేణులే - ఈర్ష్యాన్వితములైన
చూపులన్ ప్రసరింపకున్నే ॥

' బహువీనుడే సర్వోపరి నిలుచు ' నన్న రష్యన్ ఇంటర్నేషనలు మాటలలో ఈ 16 ఏళ్ళ బాలుడు భావిని గూర్చి విశ్వాసంతో పాడేడు. యౌవనోద్వేగ భరితాలైన స్టాలినుగీతాలు అభివృద్ధికివాంఛించే జార్జియన్ మేధావుల మన్ననలు పొందేయి. జార్జియనుగ్రంథకర్త రాఫెల్ ఎరిస్టావీయొక్క జయంతిసందర్భంలో ప్రకటించబడ్డ గీతాంజలిలో స్టాలినుగీతంకూడా చేర్చబడింది.

జి. పార్కాజే ఈ కాలానికి సంబంధించిన జ్ఞాపకాలు వ్రాస్తూ స్టాలిన్ యొక్క, ఆయన సహపాఠులయొక్క వైజ్ఞానికాన్వేషణలని చాలావిస్పష్టంగా చిత్రించేడు :

" మాకుర్రవాళ్ళకి తెలుసుకోవాలనే వాంఛ మహావుండేది.

" ఈప్రపంచం అంతా ఆరురోజుల్లో సృష్టిఅయిందనే కట్టుకథని మా సెమినరీవిద్యార్థుల మనస్సులలోంచి పారదోలడానికి మేము భూతత్వశాస్త్రరీత్యా భూమి పుట్టుకనీ, వయస్సునీగురించి తెలుసుకుని, వాటిని వాదనలలో నిరూపించగలజ్ఞానం సంపాదించవలసివుండేది ; డార్విను బోధలు మనస్సుకి బాగాపట్టించుకోవాలి. ఈవిషయంలో గెలీలియో, కోపెర్నికసు, కామిల్లె ఫ్లామారియసుల అద్భుతరచనలు మాకు బాగా తోడ్పడ్డాయి. ల్యాల్ యొక్క ' మానవుని ప్రాచీనత, ' డార్విను యొక్క ' మానవుని పరిణామం' చదివేము. డార్విన్ పుస్తకం సెచానోవ్ చేత ప్రకటించబడ్డ ఒకఅనువాదం. కామ్రేడ్ స్టాలిను సెచానోవ్ యొక్క శాస్త్రీయ గ్రంథాలనెంతో శ్రద్ధతో చదివేడు.

"వర్గసమాజంయొక్క పరిణామాన్నిగురించి క్రమంగా అధ్యయనం చెయ్యనారంభించేం. అది మార్క్సు, ఏంగిల్సు, లెనినుల రచనలకి దారితీసింది. ఆరోజుల్లో మార్క్సిస్టువాఙ్మయం చదవడం ఒకవిప్లవకార్యంగా పరిగణించబడి, శిక్షించబడేది. డార్విన్ పేరుకూడా అసభ్యమైన దూషణగా గణించబడ్డ ఆ సెమినరీలో ఈశిక్షయొక్క ఫలితం స్పష్టంగా కనబడేది.

"ఒకమూల సామాజికవిషయాలకీ, ఆర్థికవిషయాలకీ సంబంధించిన వాఙ్మయం చదువుతూన్నా మేము ఖగోళశాస్త్రంమీదా పదార్థవిజ్ఞాన, రాసాయనిక శాస్త్రాలమీదా అభిరుచిని వదలలేదు. లడ్విగ్, ఫ్యూయర్‌బాక్‌యొక్క "క్రైస్తవ మతసారం" అనేపుస్తకం మాకు బాగావుపయోగించింది.

"ఈపుస్తకాలన్నీ మాదృష్టిలోకితెచ్చింది కామ్రేడ్ స్టాలినే. మొట్టమొదట్లో మనం చెయ్యవలసిన పని నిరీశ్వరవాదులం కావడమే నంటూండేవాడు. మాలో చాలమందిమి ఆధ్యాత్మికవిషయాన్ని అశ్రద్ధచేసి భౌతికవాదదృక్పథాన్ని అలవరుచుకోసాగేం.

"మేము అనేకములయిన విజ్ఞానశాస్త్రశాఖలకి సంబంధించిన పుస్తకాలు చదివేం. ఈచదవడం ఆసెమినరీలో అలవడే అసహ్యకరాలయిన సంకుచిత భావాలనుంచి తప్పించుకుందుకు మాకు బాగా తోడ్పడింది. అంతేకాదు. మామనస్సులు మార్క్సిస్టుభావాలని పట్టించుకుందుకు అవసరమైన పూర్వరంగాన్ని తయారుచేసింది. ప్రాచీనవస్తుశాస్త్రంమీదగానీ, భూతత్వశాస్త్రం, ఖగోళశాస్త్రంమీద గానీ, ప్రాచీననాగరికతమీదగానే మేముచదివిన ప్రతిపుస్తకమూ మార్క్సిజం యొక్క యాదార్థ్యంలో విశ్వాసంకలిగించడానికే తోడ్పడింది.

"ఆరోజుల్లో పుస్తకాలు సంపాదించడమేకాదు చదవడంకూడా ఎంత కష్టమో నేటియువకులు ఊహించనుకూడాలేరు. ఒకటి చూడండి : సెమినరీఅధికారులు కామ్రేడ్‌స్టాలిన్ దగ్గరనుంచి విక్టర్ హ్యూగోవ్రాసిన (Toilers of the Sea) పుస్తకాన్ని తీసేసుకున్నారు. అసిస్టెంటు సూపర్వైజరు రిపోర్టులో చెప్పినట్లు 'స్వాధీనపరుచుకోబడిందట. హ్యూగోవ్రాసిన 'తొంభై మూడు' అనే స్టాలిన్‌యొక్క మరో పుస్తకానికికూడా అదేగతి పట్టింది.

"కిరోచ్నాయావీధిలోని గ్రంథాలయంనుంచి మేము పుస్తకాలు తెచ్చుకునేవాళ్ళం. అక్కడికి హెచ్చుగా టీచర్లూ, యితరపండితులూ చేరుతూండేవారు. 1900 ప్రారంభంలో మాక్సిం గోర్కీ దానిని ఉపయోగించుకున్నాడు. చదువుకుందు కుద్దేశించబడి అది స్థాపించబడింది. కాని, చాలా సాధారణంగా కనపడే పుస్తకాలనుంచి ఎంత రాజకీయవిజ్ఞానం సంపాదించగలిగేమో ఎవ్వరూ అనుమానించయినాలేదు.

"పుస్తకాల అర్థంలోతు గ్రహించడం యెలాగో కామ్రేడ్ స్టాలిన్ మాకు నేర్పేడు. ఏవిషయంమీదనైనా పుస్తకాలు లభ్యంకానప్పుడు మాసపత్రికలలోని వ్యాసాలనీ, విమర్శలనీ, యాదృచ్ఛికవ్యాఖ్యలనీ వుపయోగించుకోవలసిన పద్ధతులు నేర్పేడు. దీనివలన చదివినవిషయాలని సంగ్రహంగా వ్రాసుకోవడమూ, ముఖ్యమైన అంశాన్ని కాపీచేసుకోవడమూ మాకు అలవాటయింది. చదువుకోవలసిన పుస్తకాల్ని సూచించేటప్పుడు స్టాలిన్ ప్రారంభంలో తేలికగా అర్థం అయ్యేవాటినీ తర్వాత కష్టమైనవాటినీ సూచించేవాడు. చదువుకొనేటప్పుడు అర్థంకాని దేమన్నా వుంటే కష్టపడి బోధించేవాడు.

"ఒకనాడు నేను మెండెవెయాప్‌యొక్క "రాసాయనికశాస్త్రి"న్ని తెచ్చేను. ఆపుస్తకం ఈనాటికీ యింకా నాకు జ్ఞాపకంవుంది. దానివిషయంలో స్టాలిన్ చాలాఅభిరుచి చూపించేను.

"సెమినరీ సూపర్వైజరు ఫాదర్ గెర్మోగెన్, జుగాష్వెలీ "ఒక చౌక లైబ్రరీకి చందాకట్టినట్లూ అక్కడినుంచి పుస్తకాలు తెచ్చుకుంటూన్నట్లూ కనబడుతూంద"ని రిపోర్టు చేసినట్లుగా సెమినరీ రికార్డులవల్ల మన కిప్పుడు తెలుస్తూంది.

"కామ్రేడ్ స్టాలినుకి చరిత్రఅంటే మహా ఆసక్తి. ఆ పుస్తకాలు ఎక్కడ సంపాదించేవాడో ఆశ్చర్యం. ఫ్రెంచి మహావిప్లవాన్నిగురించి 1848 విప్లవం, పారిస్‌కమ్యూన్, రష్యన్ చరిత్రలనిగురించి వ్రాయబడ్డ పుస్తకాలు ఆయనవద్ద వుండడం ఇప్పటికీ నాకు జ్ఞాపకం.

"1896 లో సెమినరీలో మొట్టమొదటి స్టడీసర్కిలు రహస్యంగా స్థాపించి, మార్క్సిజాన్ని ప్రచారంచెయ్యడం ఆరంభించేనాటికి స్టాలిన్ వయస్సు 17 ఏళ్ళు. తర్వాత ఏర్పడింది, మరో స్టడీ సర్కిల్. నేను ఆమొదటి స్టడీ సర్కిల్‌లోని వాడిని.

"ఆరోజుల్లో స్టాలినూ, అతని కామ్రేడ్సూ చదివిన పుస్తకాలలో ఈదిగువవి నాకు బాగాజ్ఞాపకం. 'కమ్యూనిస్టు ప్రణాళిక'; ఏంగిల్సువ్రాసిన 'ఇంగ్లండులో శ్రామికవర్గంయొక్క పరిస్థితులు'; లెనిన్ వ్రాసిన 'ప్రజాస్నేహితులు' ఎల్లాంటివారు, వారు సోషల్‌డెమాక్రట్లతో ఏలాగ పోరాడుతారు?' (లెనిన్ : సెలెక్టెడ్ వర్క్సు, సం. 1) బెల్టోవ్‌యొక్క (ప్లెఖనోవ్) Development of the Monistic view of history; రాజకీయార్థశాస్త్రంమీద ఆడం స్మిత్. డేవిడ్ రికార్డోలు వ్రాసిన పుస్తకాలు; తుగాన్-బారనోవ్‌స్కీ; స్పినోజాయొక్క 'ధర్మశాస్త్రం'; బకుల్స్‌వ్రాసిన 'ఇంగ్లండులో వచ్చిన నాగరికతయొక్క చరిత్ర'; లెటార్నోవ్రాసిన 'ఆస్తి పరిణామం'; జీబర్‌వ్రాసిన 'డేవిడ్ రికార్డో, కారల్ మార్క్సుల సామాజిక-ఆర్థికాన్వేషణలు'; తత్వశాస్త్రంమీద వ్రాయబడ్డ ఎన్నో పుస్తకాలు చదివేరు.

"కామ్రేడ్ స్టాలిన్‌కి కథలంటే ప్రీతి. సాల్టికోవ్-స్చెడ్రిన్‌యొక్క 'గోలోవ్‌ల్యోవ్‌ల కుటుంబం': గోగోల్‌యొక్క 'మృతాత్మ'లు; ఎర్క్‌మన్-చాట్రిన్‌యొక్క 'ఒక రైతుకథ': థాకరేయొక్క వేనిటీ ఫెయిర్ (Vanity fair) ఇంకా ఎన్నో చదివేడు. చిన్ననాటినుంచే స్టాలినుకి జార్జియన్ రచయితల పుస్తకాలతో పరిచయంవుంది? రూస్ట్‌ష్వెలీ, ఇల్యా చావ్‌చావాజే, వాజా షావెలా పుస్తకాలంటే అతని కిష్టం. వాఙ్మయంఅంటే మహాఉత్సాహం గలవాడు. టిప్లిస్ సెమినరీలోవున్న రోజుల్లో ఎన్నోగీతాలువ్రాసి ఇల్యా చావ్‌చావాజే సన్నుతిపొందేను. సెమినరీ విద్యార్థులు వార్తాపత్రికలకీ, మాసపత్రికలకీ వ్రాయగూడదనే కఠిన నియమం వున్నప్పటికీ కామ్రేడ్ స్టాలిన్‌యొక్క గీతాలు చావ్‌చావాజే సంపాదకత్వంలో వస్తూన్న పత్రికలో మొదటిపుటలో ప్రాముఖ్యతగా ప్రకటించబడేవి."

టిఫ్లిస్ సెమినరీలో స్టాలిన్‌సహపాఠిగావున్న కామ్రేడ్ జి. గ్లుర్జిజే (ఈయన యిప్పుడు గోరీసమీపంలోని ఒక సెకండరీ పాఠశాలలో టీచరుగా వున్నాడు.) తన జ్ఞాపకాలు వివరిస్తూ యిల్లాగ వ్రాసేడు.

“ఒక్కొక్కప్పుడు దేవాలయంలో ప్రార్థనలు జరిగేటప్పుడు పుస్తకాలు బల్లలవెనకదాచి చదువుకుంటూ వుండేవాళ్ళం. చాలా జాగ్రత్తపడేవాళ్ళం, లేక పోతే మాస్టర్లు పట్టేసుకుంటారు. పుస్తకాలు జోసెఫ్‌కి విడతియ్యరాని స్నేహితులు; భోజనాల వేళల్లోకూడా అతడు వాటిని వదిలిపెట్టేవాడుకాదు.... ఏదేనా ప్రశ్న అడిగేమా స్టాలిన్ కొద్దిసేపేనా ఆలోచించనిదే తొందరపడి ఎప్పుడూ సమాధానం యిచ్చేవాడుకాదు.

“దుర్భరమై ఉక్కిరిబిక్కిరిచేసేసే ఆ సెమినరీవాతావరణంలో పాటలు పాడుకోవడం మాకో కాలక్షేపం. సో సో అప్పటికప్పు డోజట్టుని పోగుచేసి, స్వచ్ఛమైన తన మధురకంఠంతో మాకు అతిప్రియమైన పల్లెటిపాటల్ని అందుకుంటే మహాసంతోషంగా వుండేది, ఎప్పుడూ.”

స్టాలిన్‌కి ఆ ఆధ్యాత్మికకళాశాలలో వున్న రోజుల్లోనే మొట్టమొదటిమాటు లెనిన్‌రచనలతో పరిచయం కలిగింది,

లెనిన్ ప్రారంభరచనలలో వొకటైన “ప్రజాస్నేహితులు ఏలాంటి వారు? వారు సోషల్ డెమాక్రట్లతో ఎలాగ పోరాడుతారు?” అనే పుస్తకాన్ని స్టాలిన్ మొదటిమాటు చదివిందిక్కడనే. “మన ఆర్థికాభివృద్ధివివరణకి సంబంధించిన విషయాలు” అనే వ్యాససంపుటాన్ని 1898 లో ఎలాసంపాదించేడో సంపాదించేడు. కాని, దానిని సెన్సారు తగలబెట్టేసేరు. అందులో ట్యులిన్ (లెనిన్) వ్రాసిన “నరోడిజంయొక్క ఆర్థికసారము: స్ట్రూవే పుస్తకంలోని దానిమీది విమర్శన” (లెనిన్ : సెలక్టెడ్ వర్క్స్, సం 1) అనే వ్యాసం వుంది.

స్టాలిన్‌తోపాటు ఆ సెమినరీలో చదివిన కామ్రేడ్ కాపనాజే “నాకో తమాషా విషయం జ్ఞాపకం వుందం”టూ వ్రాస్తున్నాడు. “1898 లో జరిగిందిది ఒకరోజున ఉదయంపూట భోజనంఅయ్యాక పుష్కిన్‌స్క్వేర్‌లోకి షికారుబల్దేరేను. అక్కడ కొందరు సహపాఠులమధ్య కూచ్చుని, జోర్దానియావ్యూహాల్ని బహుఆవేశంతో చర్చిస్తున్న స్టాలిన్ కనపడ్డాడు. ‘నేను మొట్టమొదటిమాటు లెనిన్‌నిగూర్చి విన్నదిక్కడే. ఇంతలో గంట మోగింది. మేమంతా మా క్లాసులకి పోయేం. జోర్దానియా వ్రాతలమీద స్టాలిన్‌ఇచ్చిన తీవ్రవిమర్శకి ఆశ్చర్యపడి తర్వాత ఆవిషయమై స్టాలిన్ను నడిగేను. అతడు తాను అంతక్రితమే ట్యులిన్‌యొక్క వ్యాసం చదివేననీ, అది బాగానచ్చిందనీ చెప్పేడు.

“ఏమైనాసరే ఆయన్ని కలుసుకుతీరాలి” అన్నాడు.

“తర్వాత ఎన్నో ఏళ్ళకి 1926 లో కామ్రేడ్ స్టాలిన్‌ని కలుసుకున్నప్పుడీ విషయం జ్ఞాపకంచేసేను. 1898 లో జరిగిన ఈఘట్టాన్ని ఆయనకూడా జ్ఞప్తికి తెచ్చుకున్నాడు.”

మంచి తెలివితేటలున్న విద్యార్థులంతా స్టాలిన్‌వేపు ఆకర్షితు లవుతూండ డాన్ని సెమినరీ అధికారులు గమనించేరు. వారు అతనిని ఆకుగడుగునా కనిపెట్టి చూస్తూ, రిపోర్టులమీద రిపోర్టులు పంపుతూండేవారు. 1898 సెప్టెంబరు 29 న సెమినరీ అధ్యక్షుడికి ఈవిధంగా రిపోర్టుపంపేరు. "రాత్రి తొమ్మిదింటికి భోజన శాలలో జోసెఫ్ జుగాష్విలీచుట్టూ కొందరు విద్యార్థులు గుమిగూడేరు. వారికి అతడు సెమినరీ అధికారుల అనుమతిలేని పుస్తకాలు చదివి వినిపిస్తున్నాడు. దానిమీద ఆ స్టూడెంట్లు సోదాచెయ్యబడ్డారు."

ఆ ఆధ్యాత్మిక కళాశాలలోని విద్యార్థుల ప్రవర్తనల నప్పుడప్పుడు నమోదు చేసే ప్రవర్తన పుస్తకంలో చిత్రమైన హంశాలు కనబడతాయి.

"జుగాష్విలీ ఒక చౌకలైబ్రరీ టిక్కెట్టు సంపాదించి దానినుంచి పుస్తకాలు తెచ్చుకుంటూన్నట్లు కనబడుతూంది. ఈవేళ విక్టర్ హ్యూగో వ్రాసిన టాయిలర్సు ఆఫ్ ది సీ. అనే పుస్తకాన్ని స్వాధీనపరచుకున్నా, అందులో పైచెప్పిన లైబ్రరీ టిక్కట్టు కనబడింది."— యస్. మ్యురాకోవ్‌స్కీ అసిస్టెంటు సూపర్వైజరు.

ఫాదర్ గెర్మోగెన్, సూపర్వైజరు.

ఈ రిపోర్టుకి ఒక నోట్‌కూడా జతచెయ్యబడి వుంది :

"చాలసేపు అతడిని శిక్షామందిరంలో నిర్బంధించు. ఇదివరకు ఒకమాటు విక్టర్ హ్యూగోయొక్క 'తొంభైమూడు' అనే పుస్తకం అనుమతిలేకుండా తెచ్చి నందుకు వార్నింగుయిచ్చాను." (ఈవిషయం 1896 నవంబరులో వ్రాయబడింది.)

"రాత్రి 11 గంటలవేళ జోసెఫ్ జుగాష్విలీనుంచి అతడు చౌకలైబ్రరీ నుంచి ఎరువుతెచ్చుకున్న, లెటార్నో వ్రాసిన "లిటరరీ ఇవల్యూషన్ ఆఫ్ ది నేషన్సు" అనే పుస్తకాన్ని తీసేసుకున్నా. ఆ లైబ్రరీ టిక్కట్టు ఆపుస్తకంలో కనబడింది. జుగాష్విలీ ఈపుస్తకాన్ని దేవాలయం మెట్లమీద చదువుతూ కన బడ్డారు. చౌకలైబ్రరీనుంచి తెచ్చుకున్న పుస్తకాలు చదువుతూండగా దొరకడం ఇది పదమూడోమాటు. ఆ పుస్తకాన్ని ఫాదర్ సూపర్వైజరు కిచ్చేను."— యస్. మ్యూరాకోవ్‌స్కీ, అసిస్టెంట్ సూపర్వైజరు.

ఈ రిపోర్టుతో ఒక నోట్‌కూడా వుంది :

"ఫాదర్ అధ్యక్షుని ఆజ్ఞల ప్రకారం అతనిని శిక్షామందిరంలో చాలసేపు నిర్బంధించు. గట్టిగా హెచ్చరించు." (ఇది 1897 మార్చిలో వ్రాయబడింది.)

అయిదో తరగతి స్టూడెంట్లని సోదాచేసేటప్పుడు జోసెఫ్ జుగాష్విలీ వారితో వాదనపెట్టుకోడాని కెన్నోమాట్లు ప్రయత్నించేడు. స్టూడెంట్లని మాటిమాటికి సోదా చెయ్యడం విషయంలో అసమ్మతి చూపించి, ఇతర సెమినరీలలో సోదాలెన్నడూ జరపబడ లేదన్నాడు. అధికారుల విషయములో జుగాష్విలీ సాధారణంగా మోటు గానూ, అగౌరవకరంగానూ ప్రవర్తిస్తాడు. పనికట్టుకుని తన మాష్టర్లలో ఒకరికి

(S. A. మ్యూర్కాకోవ్‌స్కీ) వందనం చేయడానికి నిరాకరిస్తాడు. ఈ టీచరు విషయాన్ని ఎన్నోమాట్లు ఫిర్యాదుచేసేడు. A. ర్జావెన్‌స్కీ; అసిస్టెంటు సూపర్వైజరు.

ఈ రిపోర్టుతో ఒక నోట్ వుంది :

"గట్టిగా హెచ్చరించబడ్డాడు. ఫాదర్ అధ్యక్షుని ఆజ్ఞలమీద ఐదుగంటల కాలం శిక్షామందిరంలో నిర్బంధించబడ్డాడు. ఫాదర్ డిమిట్రీ (1898 డిసెం. 16.)

ఫాదర్ డిమిట్రీ అప్పుడు సెమినరీ సూపర్వైజరుగా వుండేవాడు. ఆయన ఒకమారు సెర్చి అయిపోయేక స్టాలిన్ గదిలోకి వచ్చేడు. చూడనట్లుగా స్టాలిన్ చదువుకుంటూ కూర్చుకున్నాడు. ఆ సన్యాసి దగ్గిరకువచ్చి "నీకెదురుగా నిలబడ్డదెవ్వరో కనబడ్డం లేదా?" అన్నాడు.

స్టాలిన్ లేచి, కళ్ళు నులుముకొని, "ఒక నల్ల మచ్చ తప్ప నాకళ్ళముందు మరేమీ కనపడ్డం లేదు." అన్నాడు.

1899 మే 27న ఈ 'నల్లమచ్చ' ఫాదర్ డిమిట్రీ సెమినరీ కౌన్సిలులో "రాజకీయంగా అవిశ్వసనీయుడైన జోసెఫ్ జుగాష్వెలీని వెళ్ళగొట్టాల"ని తీర్మానం ప్రవేశపెట్టేడు. ఈ సూచన అంగీకరించబడింది. ట్యూషన్ జీతాలు చెల్లించలేకపోయినందుకూ, 'ఏవో తెలియరాని కారణాలతో పరీక్షకి కూర్చోనందుకూ', సెమినరీనుంచి వెళ్ళగొట్టబడ్డట్లు అధికారరీత్యా ప్రకటించబడింది. కాని, దీనికి అసలుకారణం అతని రాజకీయ వ్యవహారాలే. జార్ ప్రభుత్వానికి ప్రమాదకరాలైన వూహలు కలిగివున్నాడని అతడు సెమినరీనుంచి పంపివెయ్యబడ్డాడు. తర్వాత చాలా ఏళ్ళకి ఈవిషయమై ఆయనచేసిన వ్యాఖ్య వినతగింది. 1931 లో మాస్కోలోని స్టాలిన్ జిల్లాపార్టీ సమావేశానికివచ్చిన ప్రతినిధుల కొకప్రశ్నావళి యివ్వబడింది. దాంట్లో "చదువు" అనేది ఓప్రశ్న. దానికెదురుగా స్టాలిన్ వ్రాసిందిది. "మార్క్సిజాన్ని ప్రచారంచేసినందుకై ఆధ్యాత్మిక కళాశాలనుంచి గెంటివెయ్యబడ్డాను."

ఎక్స్పెల్‌చెయ్యడంతో పోలీసులు స్టాలిన్ మీద నిఘాపెట్టేరు; అతని చర్యలన్నీ గమనించబడి, నమోదుచెయ్యడానికి ఒకపుస్తకం పెట్టేరు. సెమినరీనుంచి గెంటివెయ్యబడినవాటికే స్టాలిను మార్క్సువ్రాసిన 'కాపిటల్' చదివేడు. మార్క్సిస్టుదళాలమధ్య అప్పటికే నాలుగేళ్ళ అనుభవం వుంది. అప్పటికే ఒక రహస్యపక్షపని-విద్యార్థిపత్రికని ప్రకటించేడు. సాంఘికశాస్త్రాలలోనూ, ప్రకృతి శాస్త్రాలలోనూ, అనేకవాట్లలో ఆయనకి అద్భుతజ్ఞానం వుంది. వీటిని వదలిపెట్టక యింకా అభివృద్ధిచేసుకుంటూనేవుంటాడు. ఎన్నోరంగాలలో ఆయనకిగల అపార జ్ఞానానికి ఆయాశాస్త్రాలని ప్రత్యేకకృషితో చదివినవారుకూడా ఆశ్చర్యపడుతుంటారు.

స్టాలిన్ సెమినరీని విడచిపెట్టిననాటికే పూర్తియైన మార్క్సిస్టుదృక్పథం కలిగివున్నాడు. ఆయనకి బీదవారి జీవితపద్ధతులలో పూర్తి పరిజ్ఞానంవుంది. ఆయన పుట్టినదే వారిలో నయ్యె. జారిస్టునిరంకుశత్వం అంటేనూ, అది నిలబడడానికి ఆధారంగావున్న సామాజికవిధానం అంటేనూ, ఆయనికిగల అసహ్యం తీవ్రతరం అయింది. ప్రజలంటే ప్రేమ ఎక్కువ అయింది.

# సోషల్ డెమాక్రాటిక్ వుద్యమం

స్టాలిన్ యొక్క ప్రారంభవిప్లవచర్యల్ని గురించి మాట్లాడేముందు ఆరోజుల్లో జార్జియా, ఆర్మీనియా, అజర్బయిజాన్‌లు ఎలావుండేవో తెలియచెప్పడం అవసరం.

ట్రాన్స్ కకేషియా జారుప్రభుత్వపు వలసప్రాంతం. దాని ఆర్థికవిధానంలో విశేషంగా మార్పులు వస్తూన్న రోజులవి. "రష్యాలో పెట్టుబడిదారీ విధానంయొక్క అభివృద్ధి" అంటూ లెనిన్ ఒక ఉత్తమగ్రంథం వ్రాసేడు. దానిలో కాకేససులో వలసవిధానం ఎంత తీవ్రంగా సాగించబడుతూందో, ఏ విధంగా కొత్త భూములు విశేషంగా సాగులోకి తేబడుతూన్నాయో వివరించేడు. దానిలో "ప్రాచీనంనుంచీ పాదుకునివున్న స్వదేశపు 'చేతి పరిశ్రమ'లు దిగుమతి చెయ్యబడుతూన్న మాస్కో వస్తువుల పోటీలో దిగతొక్కి వెయ్యబడుతున్నాయి....రష్యను పెట్టుబడిదారీవిధానం ఆవిధంగా కాకేససుని ప్రపంచ పరివ్యాప్తమైన సరుకుల ప్రసార రంగంలోకి ఈడుస్తూంది. దానికిగల స్థానిక ప్రత్యేకతలని ప్రాచీనంనుంచీవస్తూన్న స్వయంపూర్ణమైన పితృస్వామికవిధానపు శేషాలని చదును చేస్తూంది. తన ఫ్యాక్టరీలకి బజారుని నిర్మించుకుంటూంది. ....1863 లో కకేససులోని పట్టణాల ప్రజలసంఖ్య 350,000 మాత్రమే. అది 1897 నాటికి 900,000 అయింది.

ముఖ్యంగా ట్రాన్సు కకేషియాలోని నూనె పరిశ్రమ విదేశీ పెట్టుబడుల ననంతంగా ఆకర్షిస్తూ, విశేషంగా అభివృద్ధిచెందింది. "బాకూ అజర్బయిజాన్ భూగర్భంలోనుంచి పుట్టుకు రాలేదు. పైనుంచి, నోబెల్, రాత్స్ ఛైల్డు, విష్పే మొదలగువారి ప్రయత్నాలవల్ల నిర్మించబడింది" అన్నాడు స్టాలిను. (మార్క్సిజము: జాతి సమస్యలు, వలససమస్యలు. పుట 109, ఇంగ్లీషు ము. సం. 12. మార్క్సిస్టు-లెనినిస్టు లైబ్రరీ.)

పల్లెటి పట్టులకీ, పట్టణాలకి నడుమ నిశితమైన భేదం కనబడుతూంది. బాకూ పెద్ద పారిశ్రామిక కేంద్రం. అజర్బయిజాన్ మొత్తంమీద పితృస్వామిక-భూస్వామిక సంబంధాలతో బాగా వెనకబడివున్న దేశం." (ఆ పుస్తకమే.) అక్షరాలా అది జారు ప్రభువుల వలసే. కకేససులో నివసిస్తూంటే అసంఖ్యాకములైన జాతులన్నీ మూడు విధాలయిన పీడనావిధానంచేత క్రుంగిపోతున్నాయి. సైనికాధికారుల, భూస్వాముల ప్రాబల్యంగల జారు ప్రభువుల దుర్భర సామ్రాజ్యవాదపు పీడన; జాతిపీడనం; వర్గపీడనం. పరిస్థితు లెంతవరకూ వచ్చేయి అంటే తమ తల్లిభాష మాట్లాడే బడిపిల్లలు తమ మెడలో, నాలిక తేలవేసిన కుక్క తలబొమ్మని గుర్తుగా వేసుకోవలసివచ్చింది. కష్టజీవులు భూస్వాముల, బూర్జువాల వర్గపీడనకి

గురి అయ్యేవారు. కాని, ఈపీడనక్రింద విప్లవశక్తులు పనిచేస్తూన్నాయి. విప్లవ చైతన్యం తలఎత్తుతూంది.

కామ్రేడ్ ఎల్. బెరియా పుస్తకం ధర్మమాయని ట్రాన్స్‌కకేషియను బోల్షివిక్‌పార్టీని నిర్మించడంలో స్టాలిన్‌చేసిన కృషిని స్పష్టంగా తెలుసుకోగలుగుతున్నాం. ఆయన జీవితంలోని ఈ ముఖ్యకాలాన్నిగురించి స్పష్టంగా తెలపగల వ్రాతలనీ, వార్తలనీ చాలకొద్దిమందికి మాత్రమే తెలిసివున్నవాటిని కామ్రేడ్ బెరియా బయటికి తెచ్చేడు. "ట్రాన్స్‌కకేషియాలోని బోల్షివిక్ సంస్థల చరిత్ర మీద"నవే ,ఈపుస్తకం కమ్యూనిస్టు పార్టీచరిత్ర కొక అమూల్యాలంకారం. బోల్షివిక్‌పార్టీని నిర్మించడంలో స్టాలిన్‌చేసిన కృషివిషయమై మనం పూర్తియైన, విశ్వసనీయమైన అభిప్రాయం ఏర్పరచుకోడానికి తగు అవకాశాలని ఇస్తూంది. కామ్రేడ్ బెరియాచేసిన సేవ అమూల్యం. పార్టీ చరిత్రకారు డెవ్వడూ ఆయన పుస్తకాన్ని మరిచిపోలేడు.

గత శతాబ్దంయొక్క రెండోసగంలో జార్జియను సామాజికోద్యమంలో భూస్వామ్యవిధానపు అభివృద్ధిధోరణి ఒకటి సుప్రసిద్ధరచయిత ఇలియా చావ్‌చావాజే నాయకత్వాన కనబడుతూన్నట్లూ, జార్జి స్పెరిటెల్లీ నాయకత్వాన బూర్జువా ప్రోగ్రెసివ్‌ధోరణి కనబడుతూన్నట్లూ బెరియా పుస్తకంనుంచి మనం తెలుసుకోగలుగుతున్నాం.

కాని, 1890 లకో మరో 'మూడోదళం' బయలుదేరింది. దీనిని జార్జియన్ భాషలో మెస్సామే దాసూ అంటాడు. జార్జియను మేధావులలో మార్క్సియను భావాల పరివ్యాప్తికిది ఒక వుదాహరణ. అయినా మెస్సామే దాసూలో అధిక సంఖ్యాకులు ఈభావాలని బూర్జువా-జాతీయవాద దృక్పథంనుంచే చూసేరు. (వీరి నాయకుడు నొయా జోర్డానియా * ) అందుచేతనే వారు జార్జియాలోని శ్రామికుల, బూర్జువాల కార్యాచరణలో ఐక్యతని బోధించేరు. వారు జార్జియాలోని వర్గాలన్నింటి స్వార్థాలూ ఒకటే ననడానికి మూలం ఇదే.

యన్. జోర్డానియా వ్రాసిన 'ఆర్థికాభివృద్ధీ: జాతీయత' అనే వ్యాసంలో "లౌకికంగా ఐక్యత పొందిన జాతి సిద్ధాంతైక్యతనికూడా పొందినదే" నన్నాడు. "జాతీయ శ్రామికుల అభివృద్ధికోసం, జాతిని బలపరచడానికి ప్రతివాడూ ప్రయత్నిస్తారు. ....జాతియొక్క మహత్వప్రాప్తిలో బూర్జువా వర్తకుడి కెంత స్వార్థం వుందో రైతుకీ, కూలివానికీకూడా అంతే స్వార్థం వుంది." (బెరియా పుస్తకం "ట్రాన్స్‌కకేషియాలోని బోల్షివిక్‌సంస్థల చరిత్రమీద"లో ఉదాహరించబడింది.)

సాషా చులుకిజే మెస్సామే దాసూదళంలో 1895 లో చేరేడు. 1897 లో లాడో కెట్షోవెలీ చేరేడు. స్టాలిన్ 1898 లో చేరేడు. మార్క్స్, ఏంగిల్స్, లెనినుల మహత్తర సిద్ధాంతాలవలన ఏకీభావంపొందిన ఈముగ్గురు మార్క్సిస్టు యువకులూ ట్రాన్స్‌కకేషియాలో విప్లవకర మార్క్సిస్టుసంస్థ నిర్మించబడడానికి పునాదులు వేసేరు.

లాడో కెట్షోవెలీ బోల్షివిజంయొక్క ప్రతినిధులలో శ్రేష్ఠులలోవొకడుగా భవిష్యత్కాలం జ్ఞాపకంచేసుకుంటుంది. కమ్యూనిజంనిమిత్తమై అతడు హృదయాన్ని, ఆత్మనీ సమర్పించేడు. ట్రాన్స్‌కకేషియాలో మొట్టమొదటి విప్లవకర మార్క్సిస్టుసంస్థల నిర్మించడానికీ, రహస్యముద్రాయంత్రాన్ని స్థాపించడానికీ, స్టాలిన్ సాషాలతో కలిసి అద్భుతమైన కృషిచేసేడు. అండర్‌గ్రౌండ్ నిర్మాణానికి సంబంధించిన ఎక్కిరలుపనుల నెన్నింటినో లెనిను ఆదేశానుసారం నిర్వహించేడు. జారిస్టుఅధికారుల కతనంటే భయమూ, అసహ్యమూ. చివరకి ఆయన 1903 ఆగస్టు 17 న ఖైదుగదిలో కాపలాగావున్న సైనికుడిచేత కాల్చిచంపబడ్డాడు.

ఆరోగ్యవంతుడు గాకపోయినా, దుర్బలశరీరుడైనా సాషా చులుకిజే లాడో కెట్షోవెలీమాదిరిగానే అచంచలమూ అసాధారణమూనైన విప్లవావేశం గలవాడు. తన జీవితాన్ని విప్లవానికి పూర్తిగా ధారపోసేడు. స్టాలిన్‌తోకలిసి మెన్షివిక్కులతో అనేక వాదప్రతివాదాలలో పాల్గొన్నాడు. అచంచలమైన మార్క్సిస్టు - లెనినిస్టుధోరణిలో ఎన్నోవ్యాసాలని ఆయన రహస్యప్రచురణలకి వ్రాసేడు. ఈయన 1905 లో క్షయవ్యాధివలన చచ్చిపోయేడు.

మొట్టమొదటినుంచీ ఈ విప్లవకరమార్క్సిస్టుదళం మెస్సామే దాసూలోని అవకాశవాదులతో సంఘర్షణపడింది.

స్టాలిన్, సాషా చులుకిజే, లాడో కెట్షోవెలీల భావాలు స్థిరత్వంపొందడంలో శ్రామికవర్గవిముక్తిపోరాటసమితి (St పీటర్సుబర్గు) * ప్రముఖపాత్రని నిర్వహించింది. వాదప్రతివాదాలలోనూ, స్టడీసర్కిలులోనూ ఇప్పటినుంచి లెనిన్ పేరు పదేపదే వినబడుతూంది. పీటర్సుబర్గుపోరాటసమితిచేత నడపబడిన నిర్మాణయుక్తమైన శ్రామికోద్యమపు ప్రతిధ్వనులు పారిశ్రామికకేంద్రా లన్నిటిలోనూ ప్రజాసామాన్యాన్ని కదిలించేయి. 1900 లో లెనిన్ సహకారియైన V. కుర్నాటోవ్‌స్కీ టిఫలిస్‌కివచ్చేడు. కుర్నాటోవ్‌స్కీ లెనిన్‌మీద భక్తి - విశ్వాసాలుగలవాడు. విప్లవోద్యమంలో విశేషానుభవంవున్నవాడు. బాగాచదువుకున్న మార్క్సిస్టు. ఎకానమిస్టుల * కెదురెత్తుగా లెనిన్ వ్రాసిన అసమ్మతి పత్రంలో సంతకం పెట్టిన పదిహేడుగురు సోషల్ - డెమాక్రట్లలో ఈయన ఒకడు.

ఇతర సోషల్ డెమాక్రటిక్ నిర్మాతలలో ఆ రోజులలో వచ్చిన విభేదాలే మెస్సామే దాసూనిగూడా రెండుగా చీలదీసేయి. అధికసంఖ్యాకులైన అవకాశవాదిన్లు లొకమూలనూ, విప్లవకరులైన యువకులపక్షం ఒక మూలా ఏర్పడ్డాయి. విప్లవకర యువకపక్షానికి స్టాలిను నాయకుడు.

విప్లవకరమైన రహస్య పత్రికని స్థాపించడంతో వచ్చింది మొదటివిభేదం. అటువంటి పత్రిక స్థాపించబడాలని స్టాలిన్, కెట్షోవెలీ, చులుకిజేలు పట్టుపట్టేరు.

ప్రజాందోళన ప్రారంభించడం విషయమై రెండో విభేదం ఏర్పడింది. చట్టం సమ్మతించినంతవరకు ప్రచారంమాత్రమే సాగించాలని అధికసంఖ్యాకులైన అవకాశవాదిస్టుల వాదం; ప్రజాందోళన ప్రారంభించడానికి వారు బెదిరేరు. అది

చట్టంయొక్క హద్దుల్ని అతిక్రమించి విప్లవమార్గాన్ని తొక్కడమే మరి. ఉద్యమం పాత సంకెళ్ళని విదిలించేస్తూంది. ప్రచారకూటాల్ని మించి పెరిగిపోయిందది. ప్రజాందోళన సాగించవలసిన అవసరం అంతకంతకి అనుభవానికి రాసాగింది. అనాటి యూక్రేనియను ప్రచారకుడు జులెనాలీ మెల్నికోవ్ దీనినే అలంకార యుక్తమైన భాషలో "ఒక మనిషిని ఒక అంతస్థు ఎత్తుకిలేవదీసేకన్న ప్రజాసామాన్యాన్ని ఒక్క అంగుళం ఎత్తుకి లేపడం మంచిది" అన్నాడు.

ఆరోజులలో టిఫ్లిస్ శ్రామికులలో ప్రజోద్యమం వృద్ధిపొందుతూంది. రాజకీయచైతన్యంగల శ్రామికులకి విప్లవభావాల తరిఫీదునివ్వడం చాలాముఖ్యమని స్టాలిను నిశ్చయించేడు. ఆ నిశ్చయంతో మార్క్సిస్టులయిన శ్రామికులకి తరగతులు నడుపసాగేడు. స్టాలిను నిర్వహిస్తూన్న శ్రామికుల కూటాలకి హాజరవుతూ వచ్చిన సూల్వెస్త్రీ తోద్రియా ఆ నాటి విషయం ఒకటి చెప్తూన్నాడు. స్టాలిను ఈ తోద్రియాని మెస్సామే దాసూలోని అపర్ట్యూనిస్టులు సాగిస్తూన్న చట్టవిరుద్ధంగా వుందని ఒక ఆదివారపు పాఠశాలలో చెప్తూన్న దేమిటని అడిగేడుట. దానికి :

"నేను సూర్యు డెలా కదులుతున్నాదో చెప్తూన్నా రనేటంతకి స్టాలిను నవ్వేడు. 'విను. నేస్తం'. సూర్యుడిని గురించి నువ్వేం బెంగపడబోకు; అతడు తన సంచారరేఖనుంచి దారి తప్పడులే. విప్లవ వ్యవహారాలెల్లా సాగాలో నువ్వు నేర్చుకోడం అవసరం. ఓ చిన్న రహస్యముద్రా యంత్రాన్ని స్థాపించడంలో కాస్త సాయం చెయ్యి, అన్నాడు."

స్టాలిను నడిపిన స్టడీసర్కిల్స్‌కి హాజరయిన జార్జి నినువా అనే మరో కార్మికుడు తన అనుభవా లిల్లాగ చెప్పేడు.

"కామ్రేడ్ స్టాలిను మా కూటాన్ని రెండేళ్ళకి పైగా నడిపేడు. ఆయన తాను ఏ విషయంమీద మాట్లాడనీ, ముందుగా దానిని వేరువేరు అంశాలుగా విభజించేవాడు. పాశ్చాత్య దేశాలలోని శ్రామికవర్గోద్యమ చరిత్ర ఆయనకి బాగా తెలుసు. సోషల్‌డెమాక్రటిక్ విప్లవసిద్ధాంతాలలో గాఢమైన జ్ఞానంవుంది. ఆయన సంభాషణ శ్రామికులలో ఏకాగ్రతని నెలకొల్పుతుంది. స్టాలిను తరుచుగా నవలల నుంచీ, శాస్త్రీయ గ్రంథాలనుంచీకూడా వుదాహరణ లిస్తూంటాడు. మాకు వుపన్యసించేటప్పుడెప్పుడూ ఆయన యెదుట ఒక చిన్న నోట్‌బుక్కో, అందమైన వ్రాతతో నిండిన ఓ కాగితమో వుండేది. ఆయన ప్రతివుపన్యాసానికీ, ముందు తయారై వస్తాడని తెలిసినవిషయమే. మేము సామాన్యంగా సాయంకాలం పూటల చీకటి పడ్డాక సమావేశం అవుతూండేవాళ్ళం. ఆదివారాలనాడు ఐదుగురూ, పదేసిమందీ చొప్పున పొలాలమీదికి పోయి కాలం గడిచిందికూడా ఎరగకుండా చర్చలు సాగించేవాళ్ళం.

"కామ్రేడ్ స్టాలిను ఉపన్యాసాలు సామాన్యంగా పరస్పరం మాట్లాడుకున్నట్లే వుండేవి. మొదటివిషయం మాకు పూర్తిగా అర్థంఅయిందని తోచే

దాకా రెండోది ఎత్తుకొనేవాడు కాదు. ఆయనవేసిన ప్రశ్నలకి మేము మా కార్మిక జీవితంలోని ఘట్టాలని వుదాహరించేవాళ్ళం. ఫ్యాక్టరీలలో ఏమేం జరిగిందో, మానేజిమెంటూ, కంట్రాక్టర్లూ, ఫోర్మన్‌లూ, మమ్మల్ని ఏలాగ పీక్కుతింటు న్నారో చెప్పేవాళ్ళం. అటువంటి విషయాలని కామ్రేడ్ స్టాలిను ఎంతో శ్రద్ధతో వినేవాడు. శ్రామికుల నెన్నో ప్రశ్నలువేసి, సారాంశం తేల్చేవాడు. ఈ సారాంశాలు విప్లవోద్యమాని కెంతో అవసరం. అమూల్యాలు.

"కామ్రేడ్ స్టాలిను మా అధ్యాపకుడు. కాని, ఆయన తరుచుగా మానుంచే నేర్చుకున్నా నంటూంటాడు.

1890 లో టిఫ్లిస్‌లోని రైల్వేషాపుల్లోనూ, యింకా ఎన్నో యితరకర్మాగారాల్లోనూ సమ్మెలు జరిగేయి. స్టాలిన్నూ, లాడోకెత్షోవెలీల నాయకత్వాన విప్లవకర సోషల్ డెమాక్రటిక్ దళంవారు వాటిని నడిపించేరు. 1899 లో మొట్ట మొదటిమారు టిఫ్లిస్‌శ్రామికులు మేడినోత్సవం చేసేరు. 1899 ఆఖరున టిఫ్లిస్‌లో ట్రాంవేసమ్మె జరిగి కార్మికులు జయంపొందేరు. 1900 మే 1 న 500 కి పైబడ్డ శ్రామికుల సమావేశంలో స్టాలిన్ వుపన్యసించాడు.

ఈనాడు ఐదువందల శ్రామికులు సమావేశం అయ్యేరంటే ఆశ్చర్యంగా వుండదు. కాని, టిఫ్లిస్‌లో అంతమంది సమావేశంకావడానికి కదే మొదటిమాటు. శ్రామికుల మాస్ మీటింగ్‌లో మాట్లాడడానికి స్టాలినుకదే మొదటిమాటు.

1901 ఏప్రియలు 22 న స్టాలిను రెండువేలమంది కూలీంతో ఒక వూరేగింపు లేవదీసేడు. జారిస్టు అధికారులు దానిపై క్రూరచర్య తీసుకున్నారు. ఈఊరేగింపు కాకేససుయొక్క చరిత్రలో నూతనాధ్యాయాన్ని తెరిచిందని లెనిను, ఇస్క్రాలో (మిణుగురు) వ్రాసేడు. 'లాడో కెత్షోవెలీ' అంటూ చెరియా వ్రాసిన పుస్తకంలో "కాకేషస్‌లో విప్లవోద్యమం బహిరంగరూపంలో వృద్ధిపొందిన దీరోజు మొదలుకొనే"నని వ్రాసేడు.

1899 డిసెంబరు 28 నాటినుంచీ పోలీసు నిర్బంధం తప్పించుకుందుకు స్టాలిను రహస్యంగా జీవించవలసివచ్చింది. అదిమొదలుకొని 1901 మార్చి 21 వరకూ ఆయన టిఫ్లిస్‌లోని జియోఫిజికల్ అబ్జర్వేటరీలో అబ్జర్వరుగా పనిచేసి జీవించేడు. జార్యా వాస్తోకా (Dawn of the East) పత్రికలో వానో కెత్షోవెలీ తన జ్ఞాపకాలని "శ్రామికవర్గోద్యమారంభం" అనే పేరున ప్రకటించేడు. స్టాలిన్ జీవితంలోని ఈనాటిఘట్టాలు మనకా పుస్తకంలో దొరుకుతాయి:

"1899 డిసెంబరు ఆఖరున అబ్జర్వేటరీలో అబ్జర్వేటరుద్యోగం ఖాళీఅయింది లాడో సలహామీద కామ్రేడ్ స్టాలిన్ దానికి దరఖాస్తుచేసేడు. మేము రాత్రి తెల్లవార్లూ మేలుకొనివుండి, ఎంతో చిక్కయిన యంత్రాలసహాయంతో, నిర్ణీతకాల వ్యవధులలో నిరీక్షణలు (observations) సాగించవలసివచ్చేది. ఎంతో ఓపిక, విశేషంగా ఏకాగ్రత వుండాలి ఆపనికి. తరుచుగా ఈవుద్యోగం ఖాళీపడిపోతూం డేది. అందుచేతనే మొదట్లోనేను, తర్వాత స్టాలిను, ఆతర్వాత యం. దావిరాష్విలీ

ఆఖరున వానో బెర్జెనిష్విలీ (ఈయన 1900 ప్రారంభంలో సెమినరీ వదలిపెట్టేసేడు.) అతిసులభంగా అబ్జర్వేటరీలో ఉద్యోగం సంపాదించగలిగేం."

వానో కెత్ఖోవెలీ జ్ఞాపకాలేగాక వానో బెర్జెనిష్విలీ వ్రాతలుకూడా స్టాలిను అబ్జర్వేటరీలో పనిచేసినకాలంనాటి జీవితాన్ని తెలుపుతున్నాయి.

"సెకండ్ హాండ్ వస్తువులమ్మేవారినుంచీ కిరోచ్నాయావీధిలోని జైద్నోవా లైబ్రరీనుంచి మేము పుస్తకాలు తెచ్చుకుంటూ వుండేవాళ్ళం. ఈ గ్రంథాలయం మాకు అద్భుతంగా తోడ్పడింది. కామ్రేడ్ స్టాలిన్ రహస్యకరపత్రాలనీ, ఇస్క్రానీ సంపాదించి, తెచ్చి ఇస్తూండేవాడు; కాని, తాను వాటిని ఎక్కడినుంచి, ఎవరినుంచి తెస్తూన్నాడో మాకెవ్వరికీ తెలియనిచ్చేవాడుకాదు. చివరకి తాను ఎక్కడికి పోతూన్నదీ స్నేహితులకికూడా తెలియనిచ్చేవాడు కాదు అతను సాగిస్తూన్న శ్రామికుల రహస్య సమావేశాలకి అనేకమార్లు నేనూ వెళ్ళేనుగనక నాకుమాత్రం తెలుసు."

స్టాలిను, లాడో కెత్ఖోవెలీల పట్టుదలవల్ల 1901 లో బాకూలో మొదటి రహస్యముద్రాయంత్రం నెలకొల్పబడింది. ఆ సంవత్సరమే సెప్టెంబరులో జార్జియన్‌భాషలో 'బ్రడ్‌జోలా' (పోరాటం) అనే రహస్యపత్రిక టిఫ్లిస్‌నుంచి టిఫ్లిస్ రివల్యూషనరీ సోషల్‌డెమాక్రట్ల పత్రికగా వెలువడసాగింది. లెనిన్‌యొక్క ఇస్క్రా ధోరణిలోనే ఇదీ నడిచింది. ఆందోళన విశేషంగా సాగించబడాలని అది ప్రకటించింది. జారుకి, భూస్వాములకి, పెట్టుబడిదారులకి వ్యతిరేకంగా శ్రమజీవులు పోరాటం సాగించాలని ప్రబోధించింది. సోషలిజంకోసం సాగించే పోరాటంలో రష్యాలోని శ్రామికవర్గం అంతా వొక్కటై నడుస్తుందని అది హెచ్చరించింది.

బ్రడ్‌జోలా మొదటిసంచికలోని సంపాదకీయంలో "జార్జియన్ సోషల్ డెమాక్రటిక్‌వుద్యమం అఖిలరష్యావుద్యమంతో చేయిచేయీగలిపి సాగుతుంది. అది తాను రష్యన్ సోషల్‌డెమాక్రటిక్‌పార్టీ యాజమాన్యాన్ని అంగీకరిస్తూంది."- అని ప్రకటించబడింది. (యల్. బెరియా: ట్రాన్స్ కకేషియాలోని బోల్షివిక్ నిర్మాణాల చరిత్రపైద.)

బ్రడ్‌జోలా శ్రామికవర్గథియంత్రత్వసిద్ధాంతాన్ని స్వీకరించింది. లీగల్ మార్క్సిస్టులతోనూ, ఎకనామిస్టులతోనూ పోరాటం నడిపింది, శ్రామికవర్గం బహిరంగంగా విప్లవపోరాటం సాగించవలసివుందని పట్టుపట్టింది. రాబోయే బూర్జువా డెమాక్రటిక్‌విప్లవంలో శ్రామికవర్గం ప్రాధాన్యత వహించాలంది. జోర్దానియా, చెఖిడ్జే మొదలగువారు అనుసరిస్తూన్న అవకాశవాదనిస్టు చెరస్టీనిస్టు * భావాలని అది తీవ్రంగా ఎదుర్కొంది. ఈ పత్రికలోని ప్రధానవ్యాసాలు స్టాలిన్, లాడో కెత్ఖోవెలీలచేత వ్రాయబడేవి.

1901 మార్చి 21 వ తేదీన స్టాలిన్ లేనిసమయంలో ఆయనా, బెర్జనిష్విలీ నివసిస్తూన్న యింటిని పోలీసులు సోదా చేసేరు. ఈ విషయంలో బెర్జెనిష్విలీ వ్రాసిందిది:

"వాళ్ళు గదిలోకి విరుచుకుపడి, నీవెవరు? నీతో ఇంకా ఎవరున్నా రనే ప్రశ్నలతో సోదా ఆరంభించేరు. మొదట నాగది అంతా తిరగేసేరు. ఒకమాదిరి మార్క్సిస్టు పద్ధతిలో వ్రాయబడ్డ లీగల్‌ప్రచురణలు కొన్ని కట్టకట్టి సీల్ వేసేరు. వాటికోలిస్టు వ్రాసి నన్ను సంతకం పెట్టమన్నారు తర్వాత స్టాలిన్ గదికి బయలుదేరేరు. గదిలోవున్న సామానంతా చిందరవందర చేసేరు. మూలమూలా వెతికేరు. పక్క దులిపేరు. కాని, ఏమీ కనబడలేదు. కామ్రేడ్ స్టాలిన్ చదవడం పూర్తి అయ్యాక ఏపుస్తకాన్నయినా వెంటనే తిరిగి ఇచ్చివేసేవాడు. ఎప్పుడూ ఇంటిదగ్గర పెట్టుకునేవాడు కాదు. ఇంక రహస్య కరపత్రాలనీ, పుస్తకాలనీ, క్యూరాసదివొడ్డునవున్న ఒక ఇటికలగుట్టలో దాచేవాళ్ళం. ఈవిషయంలో కామ్రేడ్ స్టాలిన్ బహుజాగ్రత్తగా వుండేవాడు. రెండోగది సోదాలయ్యాక మరోలిస్టువ్రాసేరు గాని, వట్టిచేతులతో తిరిగిపోయేరు."

1901 నవంబరు 1 వ తేదీన అవ్లాబార్‌లో టిప్లిస్ సోషల్-డెమాక్రటిక్ సంస్థ మొదటిమారు సమావేశం అయింది. దానికి ఇరవైఅయిదుగురు ప్రతినిధులు వచ్చి, ర. సో. డె. లే. పా. * యొక్క టిప్లిస్‌కమిటీని ఎన్నుకున్నారు. స్టాలిను ఈకమిటీలో ఒకసభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. 1901 సంవత్సరం ఆఖరున టిప్లిస్ కమిటీ ఆయనని బాటుంలో సోషల్‌డెమాక్రటిక్ సంస్థని స్థాపించడానికి పంప తీర్మానించింది. అతని బాటుం కార్యకలాపా లిక్కడనుంచి ఆరంభం అయినాయి.

ఇంతకిపూర్వం కార్లో చెఖిడే వగైరా లీగల్-మార్క్సిస్టులు బాటుంలో పనిచేస్తూండేవారు. అక్కడ విప్లవసంస్థని స్థాపించడం అసంభవంఅని చెఖిడే స్టాలిన్‌కి నమ్మబలికేడు. స్టాలినుని ఆనగరంనుంచి వెళ్ళిపొమ్మని చెప్పేడు. కాని, చెఖిడేకంటె స్టాలినుకి శ్రామికవర్గంలో పెనగొంటూన్నశక్తులు బాగా ఎరుక. ఏం చెయ్యాలోకూడా ఆయన బాగా ఎరుగును. చావోబా (ఇప్పుడు దీన్ని స్టాలిన్‌జిల్లా అంటున్నారు) లో శ్రామికులమధ్య పెట్టేడు తన బసని. ఇంక ప్రారంభించేడు పని. బాటుం గొప్ప శ్రామికవర్గకేంద్రం. మాంటాషేవ్, సిదెరిదిస్, రాత్స్‌చైల్డు, నోబుల్ మొదలగువారి సంస్థలకి చెందిన నూనె రిఫైనరీలు ఎన్నో వున్నా యక్కడ. ఈకర్మాగారాలలోని రాజకీయచైతన్యంగల శ్రామికుల్ని భవిష్యత్తులో తనకార్యక్రమంలో తోడ్పడేటట్లు చేసేటందుకు ఇప్పుడు స్టడీసర్క్యుల్సులోకి తేవడానికి స్టాలిన్ తీవ్రమైన కృషి చేయసాగేడు. "ఆయనే స్వయంగా వారిలో ప్రచారం సాగించేవాడు. ఒక రహస్య ముద్రాయంత్రం స్థాపించి, తానే కరపత్రాలు వ్రాసి, శ్రామికుల సహాయంతో వాటిని ముద్రించేవాడు. బాటుంపోలీసులు ఈరోజు లలో ఇచ్చిన రిపోర్టులుపట్టిచూస్తే శ్రామికులు జోసెఫ్ జుగాష్విలిని ఎంతో గౌరవించేవారనీ, గురువుగా భావించేవారనీ తెలుస్తూంది."..... 1901 ఆఖరాలు కాలంలో, ర. సో. డె. లే. పార్టీ యొక్క టిప్లిస్‌కమిటీ తనసభ్యులలో ఒకడైన జోసెఫ్ జుగాష్విలీని బాటుం ఫ్యాక్టరీకూలీలలో ప్రచారంచెయ్యడానికి పంపింది. ఆనాటినుంచీ ఇక్కడ సోషల్‌డెమాక్రటిక్ వుద్యమం తీవ్రాభివృద్ధి పొందింది. జుగాష్విలీ శ్రమఫలితంగా బాటుం కర్మాగారాల్లో సోషల్‌డెమాక్రటిక్ సంస్థలు

బయలుదేరసాగినాయి. వీటిని టిఫ్లిస్ కమిటీ ప్రారంభంలో నడుపుతూండేది"....
అనివుంది, ఆనాటి ఒక పోలీసు రిపోర్టులో.

1901 డిసెంబరు 31 వ తేదీరాత్రి నూతన సంవత్సరాది ఉత్సవంపేరిట స్టాలిను ఒక శ్రామిక సమావేశాన్ని ఏర్పాటుచేశాడు. దీనికి మొత్తం 30 మంది హాజరయ్యేరు. ఈసమావేశంలో ర. సో. డె. లే. పార్టీయొక్క బాటుం కమిటీ ఏర్పడింది. బాటుంలో ఏర్పడ్డ మొట్టమొదటి ఇస్క్రాయిస్టు సోషల్ డెమాక్రటిక్ సంస్థ ఇదే.

ట్రాన్స్‌కకేషియాలోని ఆనాటివర్కర్సు ఈసమావేశాన్ని వర్ణిస్తూ చెప్తూన్న మాటలు హృదయాన్ని కదిలించివేస్తాయి. వారిలోఒకడైన రోదియన్ కోర్కియా స్టాలిన్ తన వుపన్యాసాన్ని "చూడండి! అరుణోదయం అవుతూంది. త్వరలోనే సూర్యు డుదయిస్తాడు. ఆ సూర్యుడు మనకోసమే ప్రకాశిస్తాడు. కామ్రేడ్స్! నామాటలు నమ్మండి," అనేమాటలతో ముగించేడని చెప్పేడు.

కొత్తగా ఏర్పరచబడ్డ ఈ శ్రామికసంస్థల సహాయంతో ర. సో. డె. లే. పా. యొక్క బాటుంకమిటీ 1902 ప్రారంభంలో ఆనగరంలో చాల సమ్మెలని సాగించింది. కర్మాగారాలలోని సమ్మెకమిటీలని స్టాలినే నడిపేవాడు. అంతకంతకి సమ్మెలు బలపడసాగినై. దానితో జారిస్టు అధికారులు భయపడిపోయి బాటుంలో మిలిటరీగవర్నరుని నియమించేరు. ఈగవర్నరు కూలీలని బెదిరించి, సమ్మెలు మానేలాగ చెయ్యాలని చూసేరు, గాని ఫలితం లేకపోయింది. మార్చి 7 వ తేదీన జరిగిన అధిక సంఖ్యాక ఎరస్టులు కూడా లాభకారికాలేదు. 1902 మార్చి 8 న స్టాలిన్ శ్రామికుల ఊరేగింపు లేవదీసేరు. అరస్టుచేసినవారిని విడిచిపెట్టమని వారి డిమాండు. కాని, ఆపనిచెయ్యడానికి బదులు పోలీసులు మరో మూడువందలమంది ఊరేగింపులో పాల్గొన్నవారిని అరెస్టుచేసేరు. మార్చి 9 న స్టాలిన్ వెనుకటిదాని కంటేనూ పెద్దఊరేగింపు బయలుదేరదీసేరు. రాత్స్‌చైల్డు, మాంటాషేవ్‌కర్మాగారాలలో సమ్మెచేస్తూన్న కూలీలేగాక ఈ ఊరేగింపులో డాక్‌పనివారు, రైల్వే పనివారు, తదితరులూ కూడా పాల్గొన్నారు. విప్లవగీతాలు పాడుతూ, ఎర్రజెండాలతో ఈ ఊరేగింపు అరెస్టుచేసినవారిని నిర్బంధించిన బారకీసులదగ్గిరికి నడిచింది. ఊరేగింపుపై కాల్పులు సాగించబడినాయి; పదిహేనుగురుకూలీలు చచ్చిపోయేరు. ఏభైనలుగురు గాయపడ్డారు. ఐ. దారాక్వెలిజే అనే ఆనాటి బాటుంపనివాడు ఆరోజు సంగతుల్ని యిల్లాగ చెప్తున్నాడు.

"ఉద్రేకభరితులై వున్న ఆ శ్రామికప్రజాసమూహం నడుమ కామ్రేడ్ సోసో (స్టాలిన్) నిలబడి స్వయంగా ఉద్యమాన్ని నడుపుతున్నాడు. కాలందాజే అనే పనివానికి భుజంమీద గాయం తగిలితే ఆతనినా జనసమ్మర్దంలోంచి తప్పించి, స్టాలినే స్వయంగా ఇంటికి తీసుకుపోయేరు."

మార్చి 9 న చనిపోయిన కూలీలకి, విప్లవకారులకి ఉచితమైన అంత్యక్రియలు జరపడానికి స్టాలిన్ ఏర్పాటుచేసేరు. కొద్దిరోజులక్రితమే కాల్పులు

జరిగినా. ఈ అంత్యక్రియలకి అసంఖ్యాకులుగా కూలీలు పోగుపడ్డారు. విప్లవావేశ పూరితమైన కరపత్రాన్ని ఒకదానిని స్టాలిన్ వ్రాసి బాటుంలోనూ. యితర నగరాల లోనూ విశేషంగా పంచిపెట్టించేడు : "సత్యంకోసం ప్రాణాలు విడిచిన మీకు జోహారు ! మిమ్మల్ని కనిపెంచిన తల్లులకి మా జోహారు ! మీ శిరస్సుల విరో చితమరణకిరీటం అలంకరించబడివుంది. అంతిమఘడియలలోకూడా మీ తడబడు తూన్న పెదవులు పోరాటవాక్యాలనే వుచ్చరించేయి. మీకు వందనాలు ! 'మా రక్తానికి ప్రతీకారం తీర్చుకోండ'ని మాచెవులలో నిరంతరం చెబుతూ మమ్మ విడవకుండా మాపై తిరుగుతూన్న మీనీడలకి మా జోహారులు !"

మొదట్లో స్టాలిను మాతే రుసీజే ఇంట్లో వుండేవాడు. తర్వాత కాషిం స్మిర్వా అనే రైతుఇంటికి మారేడు. 'జార్యా వాస్తోకా'లో వ్రాయబడిన తన "మరఫురానివారి కథ"లో నినుట్సా మోదెవాజే స్టాలిన్ ఎటువంటిపరిస్థితుల్లో కాలంగడిపేడో చిత్రించింది.

"కామ్రేడ్ స్టాలిన్ మాతే రుసీజేయింట్లో వుండేవాడు. అందులో రెండు గదుల్లో దారాక్వెవిజేసోదరులూ, కోట్సియా కాందెలాకీ వుండేవారు. అప్రక్కనే వున్న ఒక చిన్న గదిలో స్టాలిన్ వుండేవాడు. దానికి కిటికీకూడాలేదు ; బయటి వేపు గుమ్మానికి ఎప్పుడూ తాళం వెయ్యబడివుండి ఎవ్వరిదృష్టినీ ఆకర్షించేటట్లుగా వుండేదికాదు. లోపలి - బయటి తలుపులమధ్యనున్న సందు కడ్డంగా గుడ్డలు వ్రేలవెయ్యబడి అదొక గోడబీరువాలా కనిపించేది. (లోగుమ్మం యిప్పుడు తీసేసేరు.)

"ఇంట్లో మిగిలినవాటాలో ఇవిలియన్, దెస్పినే షావటావాలు నివసించే వారు.

"స్టాలిన్ గదిలోనే ప్రెస్సు పెట్టబడింది. అతను వ్రాసిన కరపత్రాలిక్కడే ముద్రించబడ్డాయి. రాజకీయచైతన్యంగల పనివారు ఆగదిలోనే మీటింగులు సాగించే వారు, అర్ధరాత్రివేళ :

"నాసోదరి దెస్పినే విశ్వాసపాత్రులయిన కామ్రేడ్స్ దగ్గరికి తరుచుగా కర పత్రాలు తీసుకుపోతూండేది. కామ్రేడ్ స్టాలిన్ ఆడవాళ్ళని విప్లవకార్యక్రమంలోకి ఆకర్షించి, వారితో విప్లవానికిసంబంధించిన విషయాలమీద చర్చలుసాగించేవాడు."

బాటుంలో కాషిం స్మిర్వా ఇంట్లో స్టాలిన్ ఒక రహస్యమైన ప్రెస్ పెట్టేడు. అబ్ఖాసియన్ జాతీయుడైన ఈ రైతు చాలా అమాయకుడు. చదువనుకూడా చేత కాదు. అయినా, ఈతడు పళ్ళబుట్టల్లోదాచి కామ్రేడ్ స్టాలిన్ ముద్రించిన కర పత్రాల్ని తీసుకుపోతూండేవాడు. వందలకొద్ది సాధారణప్రజలు-కూలీలు, రైతులు- విప్లవకార్యక్రమంలో కామ్రేడ్ స్టాలిన్‌కి సాయపడేవారు. ప్రజలకీ, ఆయనకీ మధ్య ఎప్పుడూ సన్నిహితసంబంధం వుంచుకునేవాడు. విప్లవజీవితమే వృత్తిగా పెట్టుకున్న ఆ మార్క్సిస్టు - లెనినిస్టు విప్లవకారునికి ప్రజలతో సన్నిహిత సంబం ధమే బలం కలిగించే మూలం.

పార్టీనాయకదళం 1902 ఏప్రియలు 5 వ తేదీన సమావేశం అయివున్న ప్పుడు పోలీసులు స్టాలిను నరస్టుచేసి, బాటుంజైలులో పెట్టేరు. ఈ జైలులో వున్నప్పుడుగాని, కుటైస్ జైలులో వున్నప్పుడుగాని, ఆయన తన విప్లవకార్య క్రమాన్ని నిలపనేలేదు. యింకా అప్పటికి బయటనేవున్న కామ్రేడ్సుతో సంబంధాలు ఏర్పరచుకుని, లెనిన్ మాదిరిగానే వారికి సాయంచేసేవాడు. స్టాలిన్ రాజకీయ ఖైదీలలో బహుపట్టుదలతో ప్రచారం సాగించేవు. వారు మార్క్స్, ఏంగిల్సు, లెనిన్ల మహోపదేశాల నర్థంచేసుకుందుకు సాయపడ్డాడు. బాటుం శ్రామికుల విప్లవోద్యమానికి ముఖ్యనాయకుడు, అధ్యాపకుడు అనే నేరంమీద జారిస్టుప్రభుత్వం స్టాలిన్‌కు శిక్షవిధించింది. టిఫ్లిస్ సోషల్ డెమాక్రటిక్ సంస్థవిషయమై కూడా కేసుపెట్టి దానిలో ఆయన్ని శిక్షించేరు.

1903 ఫిబ్రవరిలో కకేషియన్ సోషల్‌డెమాక్రటిక్ సంస్థయొక్క మొదటి కాంగ్రెసు జరిగింది దానిలో ర. సో. డె. లే. పార్టీయొక్క కకేషియన్ ఫెడరల్ కమిటీ ఏర్పడింది. జైలుగోడలమధ్య నిర్బంధింపబడివున్నా స్టాలిను కకేషియన్ ఫెడరల్ కమిటీలో సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు.

1903 జూలై 9 న స్టాలిన్ బహిరంగమైన పోలీస్‌నిఘాలో మూడేళ్ళు సైబీరియా తూర్పుభాగంలో ప్రవాసశిక్ష ననుభవించాలని ప్రకటించబడింది. ప్రవాసానికి తీసుకుపోయేముందు స్టాలిన్‌ని బాటుంజైలుకి మళ్ళీ మార్చేరు. 1903 నవంబరు ఆఖరున ఆయన తూర్పుసైబీరియాకి, ఇర్‌కుట్‌స్కురాష్ట్రంలో వలాగాన్‌స్కుజిల్లాలో నవోయా ఉదా అనేగ్రామానికి పంపబడ్డాడు. స్టాలిన్‌యొక్క ఈకాలంనాటి చిత్రాన్ని మన చిత్రకారులలో ఒకడు చిత్రించినదాన్ని చాలమంది చూసేవుంటారు. ఫెల్టుబూట్లుతొడిగి, శీతాకాలపు ఓవర్‌కోటు, ఫర్‌టోపీ వేసుకొని, ఒళ్ళంతా మంచులో మునిగివుండగా ఎత్తయిన దిబ్బమీదనిలబడి తను కలిసి పనిచేసిన స్త్రీ-పురుషులు నివసిస్తూన్న దిశగా ఎంతో ఆశతో చూస్తూన్నట్లుగా చిత్రించబడ్డాడు స్టాలిన్ అందులో.

ఈ మొదటి ప్రవాసకాలంనాటికే స్టాలిన్ మంచి పేరుపడ్డ అగ్రనేజరు. అద్వితీయుడైన ప్రజానాయకుడు. ట్రాన్స్‌కకేషియను బోల్షివిక్కులకి నాయకుడయ్యేడు. అతని అద్భుతఖ్యాతి ఒక్క ట్రాన్స్‌కకేషియాలోనేకాదు. ఈకాలంలో ఆయనచేసిన ఉత్కృష్టసేవలలో ఒకటి, లాదో కెత్షోవెలీ, సాషా చులుకిజే, మిఖా ష్టాకాయా మొదలయిన కామ్రేడ్సుతోగలిసి మొట్టమొదటి ఇస్క్రియిస్టు సోషల్ డెమాక్రటిక్ కమిటీలని ఏర్పరచడమూ, మొదటి రహస్య వాఙ్మయం ప్రచురించడం, ట్రాన్స్‌కకేషియాలో రహస్య ముద్రాయంత్రాల్ని స్థాపించడమూ. 'లీగలిస్టుల'తోనూ, 'ఎకానమిస్టులతో'నూ, జాతీయవాదులతోనూ, లెనిన్‌మాదిరిగా పట్టుదలతో నిరంతరాయంగా పోరాటంసాగించడం ఆయనచేసిన మరో ఉత్కృష్ట సేవ.

1903 లో ప్రవాసశిక్ష ననుభవిస్తూన్న రోజుల్లోనే ఆయన జాబులద్వారా లెనిన్‌తో పరిచయంలోకి వచ్చేడు. 1924 జనవరి 28 న క్రెమ్లిన్ మిలిటరీస్కూలులో లెనిన్ స్మారకసమావేశంలో మాట్లాడుతూ, ఈ విషయాలు చెప్పేడు :

"నాకు 1903 లో మొదటిమాటు లెనిన్‌తో పరిచయం కలిగింది. నిజానికది ముఖపరిచయంకాదు; జాబులద్వారా కలిగిన పరిచయం. కాని, అది నాలో మరువరాని భావాల్ని ముద్రించింది. నాపార్టీ జీవితంలో ఎన్నడూ ఆ అనుభవాన్ని మరువనేలేదు. ఆరోజుల్లో నేను సైబీరియాలో ప్రవాసంలో గడిపుతూన్నా. 18 వ శతాబ్దం ఆఖరునుంచీ, ముఖ్యంగా 1901 తర్వాత అంటే, ఇస్క్రా ప్రకటించబడినాక నాకు లెనిన్ విప్లవకార్యాచరణతో పరిచయముంది. అది నాలో లెనిన్ అసాధారణశక్తివంతుడనే నమ్మకం కలిగించింది. నేనాయన పార్టీనాయకుడని భావించలేదు. పార్టీ జన్మదాత యని నాభావం. పార్టీలో సారాన్నీ, దాని అవసరాలనీ, గుర్తించినవా డాయనొక్కడే. మన పార్టీయొక్క ఇతర నాయకులతో ప్లెఖనోవ్, మార్టొవ్, ఆక్సెల్రాడ్ మొదలగువారితో పోల్చిచూసినప్పుడు ఆయన పార్టీకి శిరస్సువంటివాడని తోస్తుంది. ఆయన పార్టీనాయకులలో ఒకడుకాడు. ఉత్తమతరగతికి చెందిన నాయకుడు. భయంఅంటే ఎరగని భైరిదేగ. ఎవ్వరూ నడిచివుండని రష్యన్ విప్లవోద్యమపథాలలో నిర్భయంగా పార్టీని నడిపించేడు. ఈభావం నాలో దృఢంగా ముద్రితం అయిపోవడంచేత ఈవిషయాన్ని రాజకీయ ప్రవాసితుడుగా విదేశాలలో నివసిస్తూన్న నామిత్రుడొకడికి ఒకజాబులో వ్రాసేను. అందులో నీ అభిప్రాయం ఏమిటో వ్రాయమని అడిగేను. కొంతకాలానికి నేను సైబీరియాలో ప్రవాసశిక్షని అనుభవిస్తూండగా — 1903 ఆఖరున నామిత్రుడు వ్రాసినజాబుతోపాటు ఒక సాధారణమైన విస్పష్టమైన లెనిన్ వ్రాసిన చిన్నజాబు చేరింది. లెనిన్‌జాబు ఇతరవానితో పోల్చిచూస్తే చాలా చిన్నదనేచెప్పాలి. కాని, దానిలో మనపార్టీ కార్యవిధానంమీద నిర్భయమూ, గంభీరమూనైన విమర్శన నిచ్చేడు. ఇకముందు మన పార్టీయొక్క కార్యసరణి ఎల్లావుండాలో అంతా సూక్ష్మములో స్పష్టంగా వ్రాసేడు. బహుచిక్కు విషయాల్నికూడా అంతసులభంగా, స్పష్టంగా, సంగ్రహంగా, ధైర్యంగా వ్రాయగలవా డొక్కలెనినే. రైఫిల్‌షాట్‌లాగ ప్రతివాక్యమూ తగులుతుంది. లెనిన్ మనపార్టీలో భైరిదేగలాంటివాడనే నాపూర్వభావాన్ని ఈజాబు దృఢపరచింది. ఈజాబుని రహస్య వర్కర్ల అలవాటుప్రకారం ఇతరజాబులతోసహా నిప్పుల్లో పారేసినందుకు ఇప్పుడు చాలా చింతిస్తూన్నా.

"అనాడే మొదలు నాకు లెనిన్‌తోగల పరిచయానికి"

(లెనిన్‌నుగూర్చి స్టాలిన్ : Little Stalin Library 3)

ప్రారంభంనుంచీ స్టాలిన్‌యొక్క విప్లవకార్యాలని గమనిస్తే మనకి అవి 18 శతాబ్దం ఆఖరునుంచీ. మనపార్టీ నిర్మాతయైన లెనిన్ కార్యకలాపాలతో పెనవడియున్నట్లు కనబడుతుంది. స్వతంత్రంగా నినాదాలను, సిద్ధాంతచర్చలకు సమాధానాలను స్టాలిన్ ఎన్నోసార్లు యిచ్చాడు. ఆ పనులన్నింటా మనకి....(లెనిన్‌లో

గనపడే మాదిరి) మార్క్సిస్టు విప్లవసిద్ధాంతానుసరణం స్పష్టంగా గోచరిస్తుంది. ఈ తయారీలు చేసుకుంటూన్న కాలంలో, మొదటి రష్యన్ విప్లవారంభకాలంలో ట్రాన్స్‌కకేషియాలో స్టాలిన్ సాగించిన కార్యక్రమంఅంతా రాబోయే విప్లవంలో శ్రామికవర్గం ప్రాముఖ్యత నిచ్చేపద్ధతిలోనే సాగినాయి.

1904 వసంతకాలంలో స్టాలిన్ ఇర్‌కుట్స్కులోని తాను ప్రవాసిగావున్న గ్రామంనుంచి తప్పించుకుని బాటుం వచ్చేసేడు. కాని, అనగరాన్నికూడా త్వరలోనే విడవక తీరిందికాదు. నటాలియా కిర్తా అనే ఆమె స్టాలిన్ ప్రవాసంనుంచి తప్పించుకు వచ్చేక జరిగిన విషయాలని వ్రాసింది :

"1904 మొదటిరోజుల్లో ఒక రాత్రివేళ నాతలుపుతట్టిన చప్పుడయింది. అప్పటికి అర్ధరాత్రి అయింది.

'ఎవరువారు ?', అని అడిగేను.

'నేను తలుపుతియ్యి'

'ఎవరునువ్వు ?'

'నేను సోసోని'

నాకది అసంభవంగా తోచింది. చివరకి సాంకేతికవాక్యం 'వెయ్యిమాట్లు చిరంజీవ' చెబుతేగాని నేను తలుపుతియ్యలేదు.

'నేనాతడు బాటుం ఏలావచ్చేడో అడిగేను.

'తప్పించుకున్నా' నని అతని సమాధానం.

"తర్వాత కొద్దిరోజులకే టిఫ్లిస్ తిరిగిపోయేడు. అక్కడనుంచి తరుచుగా జాబులు వ్రాస్తూండేవాడు. కామ్రేడ్ స్టాలిన్ కకేషియన్ ఫెడరల్ కమిటీ కార్యకలాపాలని నడుపుతూండేవాడు."

"1904 వసంతంలోనే సోసో మళ్ళీ బాటుం తిరిగివచ్చేడు. ఈపర్యాయం ఈయన బార్జ్‌ఖానాలోని యిలికో షరాషిజేయింట్లో మెన్షివిక్కులతో ఎన్నో వాగ్వాదాలు సాగించేడు."

# మొదటి రష్యన్ విప్లవం

బోల్షివిక్ సంస్థలచేత నడవబడ్డ ట్రాన్స్కకేషియాలోని విప్లవోద్యమం మొదటి రష్యన్ విప్లవంయొక్క అభివృద్ధికి విశేషంగా తోడ్పడింది. జారిస్టు నిరంకుశపాలనచేత నిరోధించబడిన మహత్తరవిప్లవశక్తులు అడ్డుకట్టల్ని తెంపేసేయి. జార్జియాలోని నగరాలలోనూ, పల్లెల్లోనూ, ప్రజోద్యమం, అసలయిన ప్రజోద్యమం రూపొందింది తమను అణచిపెడుతూన్నవారిమీద జార్జియనుప్రజల హృదయాలలో శతాబ్దాల తరబడిగా కుములుతూన్న ద్వేషాగ్ని ఒక్కసారి భగ్గుమంది. భూస్వాములంటేనూ, పెట్టుబడిదారులంటేనూ, జారిస్టుఅధికారులంటేనూ పల్లెలలోనూ, పట్టణాలలోనూకూడా ప్రజలకిగల అసహ్యం విప్లవరూపంలో విజృంభించింది.

ఈవుద్యమానికి నాయకత్వంవహింఛీ, ప్రజాసమూహాలకి రాజకీయప్రబోధం యిచ్చి స్టాలిన్ చాలా పనిచేసేడు. 1903 లో సైబీరియాకి ప్రవాసం పంపబడడం, 1904 జనవరిలో తప్పించుకుని టిఫ్లిస్ తిరిగిరావడం, అక్కడ ట్రాన్స్కకేషియన్ బోల్షివిక్‌పార్టీకి నాయకత్వం వహించడం మనం ఎరుగుదుం. సోషల్‌డిమాక్రెటిక్ పార్టీయొక్క రెండోకాంగ్రెసులో చీలికలు ఏర్పడ్డ అనంతరం నిర్మాణాత్మకంగానూ, సిద్ధాంతరూపంలోనూ, రాజకీయంగానూ, బోల్షివిక్‌పార్టీ ఒక ఆకారంలోకి వచ్చింది ఈరోజుల్లోనే.

స్టాలిన్, లెనినుల కార్యకలాపా లన్నింటా మన కొకేమాదిరి భావైక్యత కనబడుతుంది. పరిస్థితులు అతివేగంగా మార్పుచెందుతూన్న సమయాలలో స్టాలిన్ స్వయంగా కార్యవిధానం నిర్ణయించుకోవలసివచ్చిన ఘట్టాలలో ఈఐక్యత మనకి నిస్సందేహంగా స్పష్టంగా కనబడుతుంది.

విప్లవసిద్ధాంతాలకి, కార్యాచరణకి సంబంధించిన అనేక ప్రశ్నలవిషయమై సరియైన పద్ధతుల నవలంబించడంలో శ్రామికవర్గానికి లెనిన్‌రచన లన్నీ తోడ్పడ్డాయి. ఆయనవ్రాసిన ' ఏమిచెయ్యాలి ? (Little Lenin library సం. 4) అనేగ్రంథం పార్టీసభ్యులకు సిద్ధాంతరీత్యా తయారుకావడానికి తోడ్పడింది ; ఆయనదే ' ఒక అడుగు ముందుకి : రెండడుగులు వెనక్కి. (ఇంగ్లీషుముద్రణ : లారెన్సీ అండ్ విషార్టు) అనేది నిర్మాణాత్మకపద్ధతుల్ని నేర్పింది ; 'డెమాక్రటిక్ విప్లవంలో సోషల్‌డెమాక్రసీయొక్క రెండు ఎత్తుగడలు ' అనేది శ్రామికవర్గం యొక్క వ్యూహరచన, ఎత్తుగడలకి సంబంధించిన ప్రధానసమస్యలమీద రాజకీయజ్ఞానాన్ని యిచ్చింది. అదేవిధంగా మొదటి రష్యన్ విప్లవకాలంలో స్టాలిన్

వ్రాసిన అనేకరచనలు ట్రాన్స్‌కకేషియాలోని బోల్షివిక్ నిర్మాణాలకి సిద్ధాంత రంగంలోనూ, నిర్మాణంలోనూ, రాజకీయంగానూ తరిఫీదునిచ్చితోడ్పడ్డాయి. లెనిన్, మార్క్స్, ఏంగిల్సుల భావాల్ని స్టాలిన్ రచనలు ప్రజలలోకి తెచ్చేయి. అంతే కాదు. ఎన్నోసమస్యల్ని స్వయంగా విశదీకరించేయి. ఈరోజులలో ఆయన వ్రాసిన రచనలన్నీ మొత్తంమీద చూస్తే మార్క్సిజం - లెనినిజంలలో డైలెక్టికల్ సిద్ధాంతాలమీదా, చారిత్రక భౌతికవాదంమీదా, బోల్షివిక్‌ల వ్యూహరచన, ఎత్తుగడలు, నిర్మాణాలకి సంబంధించిన సమస్యలమీదా పూర్తి సమాలోచన నిస్తున్నాయి. (ఈ కాలంనాటి పుస్తకాలు కొన్ని : 'పార్టీలోని వైరుధ్యాలని గురించి, యిది 1905 ఆరంభంలో వ్రాయబడింది; 1906 జనవరిలో ప్రకటించబడిన 'రెండు విభేదాలు'; 'అరాజకవాదమా లేక సోషలిజమా' అనే శీర్షికతో ప్రకటించబడిన వ్యాసాలు - ఇవి అఖాలీ ష్ఖోవ్రెబా (నూతనజీవితం,) అఖాలీ ద్రోయెబా (నవయుగం) : చ్వేనీ ష్ఖోవ్రెబా (ప్రైమ్స్;) ద్రో (ప్రైమ్సు) మొదలయిన పత్రికలలో వ్రాయబడ్డాయి.)

ఆ విధంగా మొదటి రష్యనువిప్లవకాలంలో బోల్షివిక్ విధానాన్ని నిర్మించడంలో స్టాలిన్ లెనిన్‌తో చేయిగలిపి పనిచేసేరు.

ట్రాన్స్‌కకేషియాలోని బోల్షివిక్‌సంస్థల కార్యకలాపాలలో ప్రధానవిషయం అవ్లాబార్‌లోని రహస్యముద్రాలయం అని చెప్పితీరాలి. యిది స్టాలిన్‌యొక్క సలహాలమీద స్థాపించబడింది. దీనికిగల కట్టుదిట్టమైన నిర్మాణం మనకి తెలిసిన రహస్యముద్రాయంత్రాలలో దేనిలోనూ కనబడదు. ఎంతోకాలం దానిగుట్టుమట్లు పోలీసుకి తెలియనేలేదు. ఎప్పుడో 1906 లో ఏప్రియల్ 15 న ప్రభుత్వాధికారులు దానిని పట్టుకోగలిగేరు. ఈ దిగువ చెప్పిన ప్రకటనలూ, కరపత్రాలూ ఈప్రెస్‌లోనే ముద్రించబడ్డాయి. వీనిలో చాలభాగం స్టాలిన్ వ్రాసినవే: 'కకేషియన్ శ్రామికులకి;' 'నిజం ఏమిటి ?' 'కకేషన్ శ్రామికులారా! ప్రతీకారానికి సమయం వచ్చింది'; టిఫ్లిస్‌లోని నిర్మాణాలలోచేరిన శ్రామికులకి;' 'నూతనాగంతకులకి;' 'కామ్రేడ్స్ !' 'దగ్గరగావుంది మృగం'; 'యుద్ధం ఆగాలి;' 'కాకేషస్‌లోని శ్రమజీవులైన స్త్రీపురుషులకి, రైతులకీ;' 'రిజర్విస్టులకి ;' 'ఆర్మీనియన్లు: నిరంకుశాధికారులు ;' 'సోషల్‌డెమాక్రట్ల విచారణ ;' 'శ్రామికులకి ;' 'కాఖెటినో - కార్తాలియన్ రైతులకి ;' 'సోదరసైనికులారా!' 'ఇప్పుడే వచ్చిన వార్తలు ;' 'మొదటి మండలంలోని శ్రామికులకి'; 'ప్రిదోనోవ్ అండ్ కో వారి కన్ఫెక్షనరీ ఫ్యాక్టరీలోని శ్రామికుల పరిస్థితులు."

ఈప్రెస్‌లో రష్యను, జార్జియన్, ఆర్మీనియన్, అజర్బైజాన్ భాషలలో కరపత్రాలు ముద్రించబడేవి. ఇవి ఒక్క ట్రాన్స్‌కకేషియాలోనేగాక రష్యాలోని ఇతర ప్రదేశాలలోని పార్టీసంస్థలలోకూడా ప్రచారం చెయ్యబడేవి.

అవ్లాబార్ ప్రెస్‌లో ముద్రించబడ్డ కరపత్రాల పట్టిక ఇదిగో: లెనిన్, 'కూలీ-రైతుల విప్లవకర ప్రజాతంత్ర నియంతృత్వం'; లెనిన్, 'పల్లెటూరి

పేదలకు'; స్టాలిన్, 'పార్టీలోని వైరుధ్యాల్ని గురించి'; స్టాలిన్, 'రెండు ఘర్షణలు': 'అల్పసంఖ్యాకుల, అధికసంఖ్యాకులయొక్క అఖిలరష్యన్ సమావేశాలని గూర్చిన స్టేట్‌మెంట్'; ఇవిగాక 'గురియాలోని రైతుఉద్యమం'; 'నలుగురు సోదరులు'; 'పనిగంటలు'; 'మేడే'; 'ప్రతి శ్రామికుడూ తెలుసుకొని, జ్ఞాపకం వుంచుకోవలసింది'; 'సోషలిజం'; 'కొత్తబాట'; 'మూడవ పార్టీకాంగ్రెస్‌ను గూర్చిన స్టేట్‌మెంట్'; 'పార్టీ నియమాలు, కాంగ్రెస్ తీర్మానాలతోసహా'; 'మూడవ పార్టీకాంగ్రెస్‌లో నిర్ణయించబడిన ర. సో. డె. లే. పా. నియమాలు'; 'రెండవ కాంగ్రెస్ తీర్మానించిన ర. సో. డె. లే. పా. కార్యక్రమం'; 'ఈగలూ: సాలీళ్లూ'; 'విప్లవగీతాలు'; 'శ్రామికులూ, రష్యాలోని రాజ్యాంగపద్ధతులూ'; 'మన తాత్కాలికవాంఛలూ, పూర్తి కోరికలూ' అనే కరపత్రాలుకూడా ముద్రించబడ్డాయి.

అవ్లాబారు ముద్రాయంత్రాన్ని పట్టుకోవడం ఒకగొప్ప విజయంగా జారు ప్రభుత్వం భావించింది. బూర్జువాపత్రిక 'కావ్‌కాజ్' (కకేసస్) 1906 ఏప్రియలు 16 నాటి సంచికలో వచ్చిన ఈ దిగువవిషయం చూస్తే మనకి ముద్రాయంత్రాన్ని గురించి కొంత తెలుస్తుంది.

"రహస్య ముద్రాయంత్రం: అవ్లాబార్‌లోని అంటురోగాల ఆసుపత్రికి నూటయాభై-రెండువందల అంగల దూరంలో డి. రాస్తోమాష్విలీకి చెందిన ఒక ఖాళీయిల్లు, కొంచెం విడిగా, దూరంగా వుంది. ఈ యింటికోరడిలో ఏప్రియల్ 15 శనివారంనాడు 70 అడుగుల లోతున్న ఒకనుయ్యి కనుక్కోబడింది. గిలక, త్రాడు సహాయంతో ఈనూతిలోకి దిగొచ్చు. ఏభై అడుగుల లోతున మరొక నూతిలోకి చేరేటందుకు దారివుంది. ఈరెండో నూతిలోనుంచి 35 అడుగుల ఎత్తుగల నిచ్చెన సహాయంతో ఆయింటి కొట్టుగదికి దిగువనున్న ఒకగదిలోకి ఎక్కవొచ్చు. ఈగదిలో సమస్తపరికరాలతో రష్యన్, జార్జియన్, ఆర్మీనియన్ వైపులున్న ఒక ఇరవైకేసులతో 1500-2000 రూబుళ్ళు ఖరీదుచేసే ఒక హాండ్-ప్రెస్; బాంబులు తయారుచెయ్యడానికి కావలసిన అనేక ఏసిడ్‌లు, ప్రేలుడు జెలాటిన్, వగైరా సామగ్రులు; కట్టలకొద్దీ రహస్యవాఙ్మయం; అనేక రెజిమెంట్ల, ప్రభుత్వ సంస్థల తాలూకు సీళ్ళు; 15 పౌనుల డైనమైట్‌వున్న ఒక భయంకరయంత్రం కనుక్కోబడ్డాయి. ఏసిటలైన్ దీపాలద్వారా అక్కడ వెలుతురుకి ఏర్పాట్లు చెయ్యబడ్డాయి. ఎలక్ట్రిక్ సిగ్నలింగ్‌సిస్టం అమర్చబడింది. ఆయింటి ఆవరణలోవున్న ఒకపాకలో మూడు బాంబులూ, బాంబుగుల్లలూ, పైనచెప్పినలాంటిదే మరికొంత సామగ్రీ పట్టుబడింది. ఎల్వా (పిడుగు) పత్రికయొక్క సంపాదకీయ కార్యాలయంలో సమావేశం అయివున్న ఇరవైనలుగురు ఈసందర్భంలో అరస్టు చెయ్యబడ్డారు. ఎల్వాకార్యాలయం సోదాచేస్తే ఎన్నో రహస్యపుస్తకాలూ, కరపత్రాలూ, పేర్లు వ్రాయబడివుండని ఇరవై పాస్‌పోర్టు ఫారాలూ దొరికేయి. సంపాదకీయ కార్యాలయాలకి తాళాలువేసి సీలుచేసేసేరు. రహస్య ముద్రాయంత్రంవున్న గది నుంచి ఎలక్ట్రిక్‌తీగలు నలుమూలలకీ కనబడడంచేత ఇతర అండర్‌గ్రౌండ్

ప్రదేశాలు దొరకగలవనే ఆశతో తవ్వుదల సాగిస్తున్నారు. ఈ యంత్రశాలలో దొరికిన పరికరాలు అయిదుబళ్ళమీద కెత్తి తీసుకుపోబడినాయి. ఆసాయంకాలమే మరో ముగ్గుర్ని ఈసందర్భంలోనే అరెస్టుచేసేరు. ఈ నిర్బంధితులు జైలుకిపోతూ దారిపొడూగునా 'మార్సెయిలెస్' పాడేరు."

అవ్లాబార్ ముద్రాయంత్రపు కేసులో బయటపడ్డ విషయాలవలన మొదటి విప్లవకాలంలో స్టాలిన్ సాగించిన పనులు ఎంత బ్రహ్మాండమైనవో తెలుస్తాయి.

ప్రవాసంలో వుండడంచేత స్టాలిన్ రెండో పార్టీకాంగ్రెసుకి హాజరుకాలేక పోయాడని మనంఎరుగుదుం. ప్రవాసంనుంచి తిరిగివచ్చేక మూడో పార్టీకాంగ్రెసుని సమావేశపరచడానికి తీవ్రకృషి సాగించేడు. సోషల్ డెమాక్రెట్ పార్టీయొక్క కేంద్రసమితిలోవున్న ఉపశమనకారులతో పోరాటం సాగించేడు. మెన్షివిక్కులతో కలిసి వారు మూడవ పార్టీసమావేశం జరగకుండా అడ్డుపెడుతున్నారని ధృవపడ్డాక మెన్షివిక్కులు, ఉపశమనకారులతో నిండివున్న సెంట్రల్ కమిటీనుంచి వేరుపడ్డాడు. రెండవపార్టీ కాంగ్రెసులో బోల్షివిక్‌గా సెంట్రల్‌కమిటీకి ఎన్నుకోబడి, తర్వాత బోల్షివిక్కులకి ద్రోహంచేసి, పార్టీ కేంద్రపత్రికనీ, సెంట్రల్‌కమిటీని స్వాధీనపరచుకోడంలో మెన్షివిక్‌లకి సహాయపడ్డ గ్లెబోవ్ (నోస్కోవ్) యొక్క ద్రోహబుద్ధిని స్టాలిన్ బయటపెట్టేడు.

కకేషియన్ కమిటీల బోల్షివిక్కు సమావేశం స్టాలిన్ అధ్యక్షతక్రింద 1904 నవంబరులో టిఫ్లిస్‌లో జరిగింది. ఈ సమావేశం మూడవ పార్టీకాంగ్రెస్ సమావేశం జరగాలని తీర్మానించింది. రెండుకారణాలచేత ఇది అవసరంఅన్నారు. ఒకటి పార్టీలో శాంతి నెలకొల్పడంకోసం. రెండోది; "ఈనాటి చారిత్రకపరిస్థితులలో జారుల నిరంకుశాధికారంతో ఖండితంగా పోరాటం సాగించాలంచే పార్టీలోని వేరువేరుశాఖల కార్యక్రమాలలో ఏకీభావం, ఏకాగ్రతా వుండాలి." (యల్. బెరియా: 'ట్రాన్స్‌కకేషియాలోని బోల్షివిక్ సంస్థల చరిత్రమీద :)

1905-07 ల మధ్య ర. సో. డె. లే. పా. యొక్క కకేషియన్ ఫెడరల్ కమిటీని నడపడంలో స్టాలిన్‌తో మిఖా ష్ఖాకాయాకూడా పనిచేసేడు. ఈ కమిటీలోని ఇతరసభ్యులు సాషా చులుకిజే, స్టెపాన్ షెమ్యాన్, అల్యోషా జాపారిజే, బోగ్డాన్ క్నునియాంజ్, ఫిలిప్ మకరాజే; మిఖో బోకోరిజేలు.

బోల్షివిక్‌పార్టీ నిర్మాణానికై సాగించిన పోరాటంలో స్టాలిన్ అద్భుతమైన చాకచక్యంగల అగ్రనైజరుగా, మార్క్సిజం - లెనినిజంల భావాలని ప్రచారం చెయ్యడంలో అలుపుసొలుపు ఎరగనివాడుగా, శాస్త్రీయసోషలిస్టు సిద్ధాంతవేత్తలలో ప్రముఖుడుగా ప్రకాశించేడు. ట్రాన్స్‌కకేషియాలోని బోల్షివిక్కులు జోర్డానియా, జెరిటెల్లీ, రామిష్విలీ, చఖీజే, లోంకాతిజే వంటివారిచేత నడపబడుతూన్న మెన్షివిక్కులతో తీవ్రపోరాటం సాగించవలసివచ్చింది.

స్టాలినూ, యితరబోల్షివిక్కులూ, మెన్షివిక్కులతోటీ, సోషలిస్టు - రివల్యూషనరీలతోటీ, అనార్కిస్టులతోటీ వాదోపవాదాలు సాగించడానికై నిరంతరం

ట్రాన్స్‌కకేషియాలోని నగరాలూ, పెద్దపెద్దకేంద్రాలూ చుట్టివస్తూండేవారు. టిఫ్లిస్, బాకూ, కుటియాస్, గోరీ, చియాతురీ, ఖోనీ, బోర్చాలో మొదలైన ప్రదేశాలంకి - ఉద్యమం బలంగా వున్నచోట్లకి స్టాలినే స్వయంగావెళ్ళేడు. మార్క్సిస్టు-లెనినిస్టు విధానాన్ని అనుసరించడానికి అభ్యంతరంచెప్పే మెన్షివిక్కులతోటీ, తదితరులతోటీ వాగ్వాదాలు సాగించడమేకాదు ఈ సంచారాలలో చేసినపని. విశేషంగా నిర్మాణాత్మకకార్యాలుగూడా చేసేడు. చియాతురీలో పార్టీయొక్క బోల్షివిక్ రెజినల్ కమిటీని స్థాపించేడు. ఒకప్పుడు కుటియాస్‌రాష్ట్రంగా పిలువబడినభాగంలో పార్టీ సంస్థల్ని నడపడానికి కుటియాస్‌లో బోల్షివిక్ ఇమెరిటినో - మింగ్రిలియన్‌కమిటీ ఏర్పడడానికి స్టాలినే శ్రద్ధతీసుకున్నాడు. ఖోనీజిల్లాలోని మెన్షివిక్కులతో వాగ్వాదం జరిగినాక ఖోనీలో బోల్షివిక్‌కమిటీ ఏర్పడింది. బోల్షివిక్కులకి వ్యతిరేకులైన వారితో సాగించే ఈ వాగ్వాదాలలో స్టాలిన్‌చూపే, శాంతం, ఓర్పు, తనకార్యం యొక్క బలం - న్యాయంలో ఆయనకిగల విశ్వాసం చూసి, సభ్యులు ఆశ్చర్యపడిపోయేవారు. 1905 మేనెలలో ఇంచుమించు రెండువేలమంది శ్రామికులు ప్రోగుపడ్డ పెద్దమీటింగులలో ఆయనవుపన్యసించేడు. ఇక్కడ ప్రిన్స్ క్రోపాట్కిన్ అనుచరులైన గోగెలియా, జెరిటెల్లీ, మొదలగు అరాజ్వాదులతో వాగ్వాదం జరిగింది. ఆ మీటింగులోవున్న కేకెలిజే ఆసభనిగూర్చి ఇల్లా చెబుతున్నాడు: "మీటింగు ప్రారంభం అయింది, కోబా (స్టాలిన్) మొదట్లో మాట్లాడేడు. పెద్ద వాగ్వాదం జరిగింది.....ఎదిరిపార్టీవారు హుంకరించి, గర్జిస్తే, స్టాలిను బహునెమ్మదిగా వారి వాదా లన్నింటినీ ఖండించివేసేడు. ఆవిధంగా ఇక్కడకూడా బోల్షివిక్కులదే విజయం; శ్రామికులు కామ్రేడ్ కోబాని ఏకకంఠంతో సమర్థించేరు." (యల్. బెరియా పుస్తకంలో వుదాహరించబడింది.)

మొదటి రష్యన్‌విప్లవానికి నాందీగీతంపాడిన ఆ సుప్రసిద్ధమైన బాకూసమ్మె 1904 డిసెంబరులో ఆరంభం అయింది. బాకూ కార్మికుల ఈచర్య రష్యాఅంతటిలోనూ 1905 జనవరి, ఫిబ్రవరులలో జరిగిన మహత్తరకార్యాలకి సిగ్నలులా పనిచేసింది. 1904 ఆఖరులో బాకూ శ్రామికులు సమిష్టి ప్రయత్నాంగీకారాన్ని సంపాదించేరు. రష్యన్ శ్రామికవర్గోద్యమంలో ఇటువంటి దిదే మొదటిది. మెన్షివిక్కుల, సోషలిస్టు - రివల్యూషనరీల, అరాజ్వాదుల, కాడెట్ల, దాష్నాక్‌ల * నినాదాలని నిరాకరించి శ్రామికప్రజ బోల్షివిక్‌నినాదాలతో మొదటి విప్లవాన్ని ఆరంభించింది.

పోరాటంయొక్క ప్రధానసమస్య లన్నింటినీ-నిర్మాణాత్మకములు, సిద్ధాంత విషయకములు, రాజకీయాలు, ఎత్తుగడలకి సంబంధించినవి- స్టాలిన్ అసంఖ్యాకములయిన ఉపన్యాసాలలో, కరపత్రాలలో, వ్యాసాలలో శ్రామికులకి తెలియచెప్పేడు. ఈ నాటికప్పుడే ఆయన శక్తివంతుడైన ప్రచారకుడయ్యేడు. ఎంతో కఠినము, క్లిష్టమూనైన సమస్యలని శ్రామికులకి అర్థం అయ్యేటట్లు క్లుప్తంగా బోధించగల నేర్పు సంపాదించేడు.

భౌతికజీవితంలో వచ్చే మార్పులతో సమానంగా భావపరిణామం కలగదనే సూత్రాన్ని ఏవిధంగా బోధించేదో వుదాహరణకి చూడండి: ఒకప్పుడు తను స్వయంగా తన చిన్నషాపులో పనిచేసుకున్న ఒక చెప్పులుకుట్టేవాని నెత్తుకుందాం. అతడొక పెద్దవాని పోటీతో నిలబడలేక షాపు మూసివెయ్యవలసివచ్చి, తప్పని సరిగా ఏ ఫ్యాక్టరీలోనో పనికి కుదరవలసివచ్చిం దనుకుందాం. అతడు ఎప్పటికీ కూలిపనే చేసుకుందా మనే భావంతో అఫ్యాక్టరీలో పనికి వెళ్లడు. ఏతంటాలోపడి కొంతసొమ్ము పోగుచేసుకుని మళ్ళీ తనషాపు తెరుద్దామనే దృష్టితోనే బయల్దేరు తాడు. ఇప్పుడుచూడండి. ఈ చెప్పులుకుట్టేవాని హోదా శ్రామికునికంటె హెచ్చేం కాదు; కాని, అతనిభావాలుమాత్రం శ్రామికునిభావాలు కాదు. అవి నిస్సందేహంగా, పూర్తిగా పెట్టీ-బూర్జువాభావాలు. శ్రామికవర్గేతరమైన హోదా అతని గతంలో మాట. అయినా ఆపెట్టీబూర్జువా మనస్తత్వం ఇంకా వదలలేదు. అతని సాంఘిక హోదాతో సమంగా అది మారలేదు. ఆవిధంగా బాహ్యపరిస్థితులు, ప్రజల జీవిత పద్ధతులు ముందుగా మారుతాయి; తరువాత ఈమార్పు కనుగుణంగా అతని మనస్తత్వం మారుతుంది.

మనుష్యుని కార్యాచరణకి భౌతికవాదసిద్ధాంతం ఎంతముఖ్యమో ఇప్పుడు అర్థం చేసుకోడం సులభం. మొట్టమొదట మార్పుపొందేవి మనుష్యుని ఆర్థిక పరిస్థితులు. ఈఆర్థికపు మార్పులకి అనుగుణంగా అటుతర్వాత అతని మనస్తత్వం మార్పుచెందుతుంది. అందుచేతనే ఏదేనా ఒకభావంకి మూలం తెలుసుకోవలిస్తే ప్రజల మనస్సులూ, ఆలోచనలలో వెదకితే ప్రయోజనం వుండదు. ఆర్థిక పరిస్థితుల పరిణామంలో వెతకవలసివుంటుంది. ఆర్థికపరిస్థితుల అధ్యయనంమీద ఆధారంగా ఏర్పడ్డభావాలే తగివుంటాయి. దృఢంగావుంటాయి. ఆర్థికపరిస్థితుల పరిణామాన్ని గణనచెయ్యకుండావచ్చిన భావాలు సరిపడవు. దృఢంగా నిలబడనూ నిలబడవు.

మనుష్యుని మనస్తత్వాలు. నీతి-అవినీతులు, అలవాట్లు బాహ్యపరిస్థితుల లోంచి బయలుదేరితే, ఆర్థికపరిస్థితులలోని చిక్కులవల్ల రాజకీయరూపాలు మారి తీరవలసి వచ్చేటట్లయితే నీతి-అవినీతులలోనూ, అలవాట్లలోనూ, రాజ్యాంగ పద్ధతులలోనూ మార్పులు తెచ్చేటందుకు ఆర్థిక సంబంధాలలో హెచ్చుమార్పుల్ని చేయవలసివుంటుందనేది స్పష్టం.

తన ఆర్థిక స్వాతంత్ర్యాన్ని కోల్పోయిన ఒక బూట్లుకుట్టేవాని విషయం ఎత్తుకుని, గంభీరములయిన, ఎంతచెప్పినా తెమలని తత్వశాస్త్రసూత్రాలని యెలా బోధించగలిగేదో మనం చూసేం.

ఇదిగో మరో వుదాహరణ. ఆర్థిక భౌతికవాదం అనే సిద్ధాంతాన్ని స్టాలిన్ విమర్శిస్తున్నాడు. హాస్యాస్పదమైన ఈ భౌతికవాదాన్ని ఏందుకుతెచ్చిన వారిని చూచి స్టాలిన్ "మనుష్యుని భావాలు అతనుతినే తిండిమీద ఆధారపడివుంటాయ"ని ఎప్పుడు, ఎక్కడ, ఏలోకంలో, మార్క్సు చెప్పేడని అడిగేడు. వారి వాదాన్ని సమర్థించే ఒక్కవాక్యాన్ని మార్క్సు పుస్తకాలలో చూపించమని అడిగేడు.

మనుష్యుని మనస్తత్వం, భావాలు, ఆర్థిక పరిస్థితులవలన నిర్ణయింపబడతాయని మార్క్స్ చెప్పింది నిజమే. కాని, ఆర్థిక పరిస్థితులూ, ఆహారమూ ఒకటేనని ఎక్కడా మార్క్స్ చెప్పలేదు. శారీరక విషయాలకు, సామాజిక విషయాలకు ఎంతో భేదం వుందనే సంగతి స్పష్టమేగదా.

"జుబటోవిజం"తో స్టాలిన్ పోరాటం సాగించాడు. పోలీసులచేత నడపబడుతూన్న ట్రేడ్‌యూనియన్లని శ్రామికవర్గంలో ప్రవేశపెట్టడం జుబటోవిజం అనబడుతూంది. షెన్ద్రికోవ్ సోదరుల నాయకత్వాన ఇట్టి యూనియన్ ఒకటి బాకూలో కొంత నిలకడ సంపాదించింది.

సాయుధ తిరుగుబాటుకి తయారుచేయడానికై ఆయనచేసిన ప్రయత్నాలు అతిముఖ్యమైనవి. శ్రామికుల్ని సాయుధులనుగా చెయ్యడానికి ఆయన విశేష ప్రాముఖ్యత నిచ్చేడు. ఆయుధాల సరఫరా సక్రమంగా సాగింపడంలో కామో పెట్రోస్యాన్ అనే కకేషియన్ ధీరుడి కాయన విశేషసహాయం చేసేడు.

మూడవపార్టీ కాంగ్రెస్‌కి ట్రాన్స్‌కకేషియన్ బోల్షివిక్కుల ప్రతినిధిగా మిఖా ష్ఖాకాయా వచ్చి, కాకేషస్‌లోని విప్లవోద్యమంయొక్క రిపోర్టు నిచ్చేడు. కాకేషస్‌లోని పరిస్థితులమీద కాంగ్రెస్ ఒక ప్రత్యేక తీర్మానాన్ని చేసింది:

"కాకేషస్‌లోని విశిష్ట సామాజిక-రాజకీయ పరిస్థితులు అక్కడ మనపార్టీ సంస్థలు, మంచి సామర్థ్యంగలవి ఏర్పడడానికి అవకాశాలు కలిగించేయి.

2. "కాకేషస్‌లోని నగరవాసులలోనూ, పల్లెటిప్రజలలోనూ హెచ్చుభాగములో విప్లవోద్యమం మహోన్నతస్థితికివచ్చి నిరంకుశ ప్రభుత్వానికి విరుద్ధంగా దేశంఅంతటా తిరుగుబాట్లు లేచే పరిస్థితులు ఏర్పడ్డాయి.

3. "తిరుగుబాట్లువచ్చిన ప్రధానప్రదేశా లన్నింటినీ బహుంకారంగా అణచివేసేటందుకై నిరంకుశప్రభుత్వం సైన్యాలనీ, ఫిరంగిదళాలనీ అప్పుడే పంపుతూంది.

4. కాకేషస్‌లోని ప్రజలు రష్యనేతరజాతులకి చెందినవారు కావడంచేత ప్రజాతిరుగుబాటుని విజయవంతంగా ప్రభుత్వం అణచివెయ్యగలగవచ్చు. అదేగనక జరిగితే రష్యాలో తిరుగుబాట్లు విజయంపొందడమే కష్టం అవుతుంది.

"అందుచేత పార్టీయొక్క మూడవకాంగ్రెస్ రష్యాలోని వర్గచైతన్యంగల శ్రామికుల తరఫున వీరులయిన కాకేషస్ శ్రామికులకీ, రైతులకీ హృదయపూర్వకంగా అభినందనాలు తెలుపుతూంది. కరపత్రాలు, మీటింగులు, శ్రామికసమావేశాలు, వాదప్రతివాదాలు మొదలగువానిద్వారా కాకేసస్‌లోని పరిస్థితులకి సంబంధించిన వార్తలు బాగా వ్యాపకంచేసేటందుకు తగిన ప్రయత్నాలు చెయ్యడానికీ, తమకి వీలుచిక్కిన అన్నివిధాలా కాకేషస్‌కి సమయంలో సహాయంచెయ్యాలనీ, మూడవకాంగ్రెస్ పార్టీ కేంద్రసమితికీ, స్థానికకమిటీలకీ నిర్దేశిస్తూంది."

సాషా చులుకిడ్జే 1905 వేసవిలో చచ్చిపోయేడు. ఆయన సమాధివద్ద స్టాలినిచ్చిన ఉపన్యాసం విన్నవాళ్ళ మనస్సులమీద ముద్రితం అయిపోయింది.

ట్రాన్స్కకేషియాలో బోల్షివిక్ సంస్థలు ఏర్పడడానికీ, బోల్షివిక్ సిద్ధాంతాలు వ్యాప్తిచెందడానికీ, ప్రొలితేరియాటిస్ వ్రిట్ జోలా (శ్రామికపోరాటం) అనేపత్రిక హెచ్చుగా తోడ్పడింది. దీనిని స్థాపించినది స్టాలిన్. ఇది ఆవ్లాబార్‌లోని రహస్య ముద్రాయంత్రంలో ప్రింట్ చెయ్యబడేది. ఇందులోంచి కొన్ని వ్యాసాలని ఎత్తి లెనిన్ బోల్షివిక్కుల కేంద్రపత్రికయైన ప్రొలితేరీలో ముద్రించేవాడు.

ప్రొలితేరియాటిస్ బ్రట్ జోలా ఏడోసంచికలో (1904 సెప్టెంబరు 1 న) 'జాతీయసమస్యవిషయమై సోషల్‌డెమాక్రట్ల అభిప్రాయం' అనే చక్కని వ్యాసం ఒకటివుంది. తర్వాత ఎప్పుడోవ్రాసిన స్టాలిన్‌యొక్క సుప్రసిద్ధ పుస్తకం 'మార్క్సిజము: జాతీయసమస్య' అనేదానితో ఈవ్యాసం చాలా సన్నిహితంగా వుంది. వేరువేరు సమయాలలో జాతీయత అనేది వేరువేరు స్వార్థాల్ని అనుసరిస్తుందనీ, వేరువేరు స్వరూపాల్ని ధరిస్తుందనీ, ఇదంతా దీనికి ప్రాముఖ్యత నిచ్చిన వర్గాన్నిపట్టి వుంటుందనీ, ఈవ్యాసం నిరూపిస్తుంది.

మెన్షివిక్కులూ, బూర్జువా - జాతీయవాదులూ అవలంబించిన ఫెడరలిస్టు పద్ధతుల కాయనవ్యతిరేకుడు. శ్రామికవర్గం విజయం పొందాలంటే, జాతిభేదంతో నిమిత్తంలేకుండా శ్రామికులంతా ఏకీభావంపొందాలంటాడు. జాతివిభేదాలు నశించి, రష్యను, జార్జియను, అర్మీనియను, పోలిషు, యూదు, తదితర శ్రామికులు ఒక్కటై పోవడం జరిగితేనే రష్యాఅంతటా శ్రామికవర్గం విజయంపొందడాని కవకాశాలు ఏర్పడతాయని బోధించేడు. వేరువేరు జాతుల, శ్రామికులమధ్య అడ్డుగోడలువేసేవారిని (ఫెడరలిస్టులు) ఎదిరించి, స్టాలిన్ రష్యాలోని భిన్నజాతుల శ్రామికులమధ్య ఐక్యత, సహకారం, వుండాలని బోధించేడు. ఫెడరలిస్టుల వాదాలలోగల తప్పుల్ని ఒక్కొక్కటే నిరూపించేడు. జాతులకి స్వయంనిర్ణయాధికారం కావాలని 1905 లోనే చెప్పేడు. బూర్జువా - జాతీయవాదకార్యక్రమాల ననుసరిస్తూనే సోషలిస్టుపత్రికగా దబ్బా వాయించుకొనే సకార్త్వెలో అనే జార్జియన్ పత్రికతో వాదోపవాదాలు సాగించేడు.

ట్రాన్స్కకేషియాలోని ఫెడరలిస్టులుకూడా బండ్, పోలిష్ సోషలిస్టుపార్టీల విధానాన్నే ఇంచుమించు అవలంబించేరు; నిర్మాణంలో కేంద్రీకరణం కావాలనే సిద్ధాంతానికి వారు వ్యతిరేకులు. వేరువేరుజాతులు తమతమ పార్టీనిర్మాణాలు కలిగి వుండాలని వారిభావం. జాతివిభేదాలన్నీ పోవాలనీ, ఒకేఒక శ్రామికవర్గపు పార్టీ నిర్మించబడాలనీ స్టాలిన్ ధైర్యంగా ముందుకివచ్చేడు.

మొదటి రష్యన్ విప్లవం పొడచూపగానే పార్టీయొక్క కకేషియన్ ఫెడరల్ కమిటీ "కాకేషస్‌లోని శ్రామికులారా! ప్రతీకారానికిదే సమయం!" అనే పేరుతో నిప్పులుకురిసే ఒకప్రకటనని ఆవ్లాబార్ ప్రెస్‌లో అచ్చువేసి ప్రకటించింది. సూర్యోదయం కాబోతూందని సూచిస్తూ తుపానుబయలుదేరిందనీ, రష్యన్ విప్లవం జారుల సైతాన్ ప్రభుత్వాన్ని ఈ భూమిమీదనుంచే తుడిచిపెట్టివెయ్యగల రోజు అట్టేదూరంలో లేదనీ సూచించింది. ఆక్షణంలో ప్రజలు తయారై వుండాలని కోరబడింది.

బూర్జువా ఉదారవాదులతో ప్రొలిటేరియాటిస్ వ్రట్ జోలా విరామంలేకుండా పోరాటం సాగించింది. "గుట్టు బయటపడింది" అనేవ్యాసం ఆ పత్రిక ఏడవ సంచికలో వచ్చింది. బూర్జువా ఉదారవాదులు, సూచించిన రాజ్యాంగప్రణాళికను ఎదుర్కొని, నిగూఢమైన వారి మోసకారితనాన్ని సంపూర్ణంగా వివరించి బయట పెట్టింది.

1905 మార్చి 26 న అవ్లాబార్ ప్రెస్‌లో ముద్రించబడిన "వాస్తవం ఏమిటి?" అనే కరపత్రం ప్రకటించబడింది. రష్యాలో రాజకీయ వసంతోదయం అయిందని ఉదారవాదులుచెప్పే మాటలలోని తెలివితక్కువదనాన్ని అది బయటపెట్టింది. జారిస్టుప్రభుత్వం ఎడల అసంతృప్తిగలవారందరినీ శ్రామికవర్గం ఏకంచేసి, వారిని జార్ కోటల్ని కూల్చడానికి నడుపుతూందని చూపించింది. గతమాసాల ఘటన లన్నింటినీ సమాలోచనచేసి, విప్లవ జెండాను లేవనెత్తేది, విప్లవానికి మూలా ధారనూ శ్రామికవర్గమేనని తేల్చింది. పార్టీ దృఢపడి సాయుధతిరుగుబాటుకి ప్రయత్నాలు సాగించాలని ప్రబోధించింది. మనం సిద్ధంగా వుండాలి పార్టీపిలుపు రాగానే తిరుగుబాటు ప్రారంభించి, ఆయుధాగారాలని, బ్యాంకుల్ని, పోస్టు-టెలి గ్రాఫ్ ఆఫీసుల్ని, రైల్వేలని ఆక్రమించుకోవాలి. ఇదంతా సాధ్యమైనంతవరకు ఏకకాలంలో అన్ని ముఖ్యకేంద్రాలలోనూ జరిగేటట్లుచెయ్యాలి. ప్రభుత్వం వినాశం నుంచి తప్పించుకు బయటపడేటందుకు తగుప్రయత్నాలు చేయడానికి అవకాశం ఇవ్వకూడదు.

1905 జూలై 15 న ప్రకటించబడ్డ ప్రొలిటేరియాటిస్ వ్రట్ జోలాయొక్క రెండవసంచికలో "సాయుధవిప్లవం; మన ఎత్తుగడలు" అనే వ్యాసంలో విప్లవపు తుపాను ప్రళయాకారంలో రష్యామీద విరుచుకుపడి, జారిస్టు నిరంకుశ ప్రభుత్వం తోసహా దేశంలోని కుళ్ళునీ, కుట్రనీ తుడిచిపెట్టేకాలం అట్టేమూరంలో లేదని వ్రాయబడింది.

ఆపర్చ్యూనిస్టు మెన్షివిక్కులతోకూడా ప్రొలిటేరియాటిస్ వ్రట్ జోలా వాగ్వాదం సాగించింది. తిరుగుబాట్లనినడపడానికి కొద్దిపాటి సహాయంకూడా వారు నిరాకరించేరు. తమ యీ పనిని సమర్థించేందుకు ఈఉద్యమం తాత్కాలికావేశాలకి ఫలితంగా వచ్చిందేతప్ప వేరుకాదని వాదించసాగేరు. "మనం ఆయుధాలు ధరిం చడం ఇప్పుడు అతిముఖ్యం. అది మనస్సులోపెట్టుకుని ప్రజలకి ఆయుధాలివ్వండి" అని మార్టోవ్ ఇచ్చిన మెన్షివిక్ నినాదాన్ని ఈపత్రిక ఖండించింది. సాయుధ తిరుగుబాటు విషయమై బోల్షివిక్ దృక్పథాన్ని ఎదుటపెట్టింది:

"అనంతమైన ప్రచారం, ఆందోళనా సాగించవలసివుందనీ, శ్రామికవర్గం రాజకీయ నాయకత్వం వహించవలసిన అగత్యంవుందనీ, వేరే చెప్పనక్కర్లేదు. ఈ మాదిరి ఆషామాషీ సూచనలతో పనిపూర్తి అయిందనుకోవడం జీవితసమస్యకి ప్రత్యక్షసమాధానం చెప్పకుండా ఒడగేసుకుతిరగడం; విజృంభిస్తూన్న విప్లవ పోరాటానికవసరమైన ఎత్తుగడలు నిర్ణయించుకోలేకపోవడంతప్ప వేరుకాదు.

మన రాజకీయాందోళన రెట్టింపుపట్టుదలతో సాగించాలి; సోషల్‌డెమాక్రటిక్‌పార్టీ శ్రామికవర్గంలో హెచ్చుమందిని మాత్రమేగాక, క్రమక్రమంగా విప్లవంలో చేరుతూన్న 'ప్రజల'లో పెద్దపెద్దభాగాలను తనపలుకుబడిలోకి తెచ్చుకునేందుకు ప్రయత్నించాలి; ప్రజలలోని అన్నివర్గాలలోనూ తిరుగుబాటుయొక్క అవసరం సర్వసామాన్యం చేసేటందుకు ప్రయత్నించాలి. ఇదొక్కటేకాదు మనం చెయ్యవలసింది. రాబోతూన్న విప్లవాన్ని శ్రామికవర్గం తన వర్గపోరాటం నిమిత్తం, భవిష్యత్తులో సోషలిజంకోసం జరిపే పోరాటంలో శ్రామికవర్గానికి విజయాన్ని హామీ చెయ్యగల డెమాక్రటిక్‌విధానాన్ని సాధించేటందుకు, వినియోగించుకొనే ఆలోచన వుంటే ఎదుర్కొలు జరుపుతూన్నవారికి ముఖ్యకేంద్రంగా వున్నంతమాత్రంచేత చాలదు. తిరుగుబాటుకి నాయకత్వం, మార్గదర్శకత్వం వహించాలి. ఈనాటిఘటనలు శ్రామికులఎదట నాయకత్వం వహించవలసిన కర్తవ్యాన్నీ, అఖిలరష్యన్ విప్లవ నిర్మాణకర్తవ్యాన్నీ పెడుతూన్నాయి. మన పార్టీగనక శ్రామికవర్గానికి నిజమైన రాజకీయనాయకత్వం వహించదలచివుంటే ఈబాధ్యతని నిరాకరించలేదు....

విప్లవానికి ఆవిధంగా సర్వతోముఖంగా ప్రయత్నాలు చెయ్యగలిగితేనే, నిరంకుశప్రభుత్వంతో ప్రజలు సాగించబొయ్యే విప్లవంలో సోషల్‌డెమాక్రటిక్ పార్టీ ప్రధానపాత్ర వహించగలదు. యుద్ధానికి సర్వవిధాలా సన్నద్ధం. అయితేనే పోలీసులతోటీ, సైన్యాలతోటీ అక్కడక్కడ వచ్చే ఘర్షణలని జారిస్టు ప్రభుత్వం స్థానే తాత్కాలిక విప్లవప్రభుత్వాన్ని స్థాపించడానికై దేశవ్యాప్తమైన తిరుగుబాటుగా శ్రామికవర్గం మార్చగలుగుతుంది. ఖ్వోస్టిస్టుల మాదిరిగా కాకుండా నిర్మాణ యుక్తమైన శ్రామికవర్గం తన శక్తులన్నీ వినియోగించి, విప్లవంలో రాజకీయ నాయకత్వాన్నీ టెక్నికల్ నాయకత్వాన్నీకూడా సాధించడానికి ప్రయత్నిస్తుంది. రాబోయే విప్లవాన్ని తన వర్గపోరాటం నిమిత్తమై యుపయోగించుకునేందుకు అవసరమైన సర్వశక్తులూ వినియోగిస్తుంది." (యల్. బెరియా : 'ట్రాన్స్‌కకేషియాలోని బోల్షివిక్ నిర్మాణాల చరిత్ర')

శ్రామికవర్గాన్ని సాయుధం చేయడానికి సంపూర్ణంగా ప్రయత్నించాలని ఇస్క్రాలాగే ప్రొలిటేరియాటిస్ బ్రట్జోలాకూడా వ్రాసింది. ప్రజల కవసరమైన ఆయుధాల్ని ప్రోగుచేసి, వాని వుపయోగాన్ని నేర్పి, అవసరపడ్డప్పుడు ఒక్క క్షణంలో వీధులలోకివచ్చి, బ్లాక్ హండ్రెడ్లయొక్క * ప్రభుత్వంచేత నడపబడే ఇతర విద్రోహశక్తులయొక్క దౌర్జన్యాలని ప్రతిఘటించడంలో ప్రజాసామాన్యాన్ని నడిపేటందుకై ప్రత్యేకంగా పోరాటదళాలని తయారుచెయ్యాలని సూచించింది.

ప్రతిజిల్లాలోనూ తిరుగుబాటు కవసరమైన ప్లానులు తయారుచెయ్యబడాలి. శత్రువుల కవచంలో బలహీనాలయిన భాగాలన్నీ గుర్తుపెట్టుకోవాలి. ఏయేచోట్ల పోరాటం ప్రారంభించాలో ముందుగానే నిర్ణయించుకోవాలి. జిల్లాఅంతటా బలగం తగినట్లుగా సిద్ధపరచాలి. జిల్లాయొక్క భౌతికస్థితిని (టోపోగ్రఫీని) బహుజాగ్రత్తగా అధ్యయనంచెయ్యాలి. ఆ విధంగా పూర్తిగా, అన్ని దృక్పథాలనుంచీ,

తయారయితేనే విజయం కలుగుతుందని ప్రొలిటేరియాటిస్ ప్రవ్‌దోలా నిర్దే శించింది.

ఈ పత్రికయొక్క మొదటిసంచికలో "తాత్కాలికవిప్లవప్రభుత్వం ; మన ఎత్తుగడలు" అనేవ్యాసం వుంది. మిగిలిన అన్నివ్యాసాలమాదిరిగా యిదీ శ్రామికుల ఎత్తుగడలకి సంబంధించిన ప్రధాన సమస్యలమీద లెనిన్‌భావాలతో ఏకీభవిస్తూంది. ఆరోజుల్లో ట్రాన్స్‌కకేషియాలోని మెన్షివిక్‌లు 'సోషల్‌డెమాక్రట్' అంటూ తమ పత్రిక నొకదానిని ప్రకటిస్తున్నారు. ప్రొలిటేరియాటిస్ ప్రవ్‌దోలా మెన్షివిక్కుల సోషల్ డెమాక్రట్‌తో నిరంతర వాగ్వాదం సాగిస్తూ మెన్షివిక్కుల విప్లవ వ్యతిరేకాలైన అవకాశవాదపు ఎత్తుగడల్ని బయటపెట్టింది.

విప్లవఫలితంగా రాగల విప్లవప్రభుత్వంలో పాల్గొనేందుకు భయపడుతూన్న మెన్షివిక్కుల ధోరణిగురించి వ్రాస్తూ ప్రొలిటేరియాటిస్ ప్రవ్‌దోలా ఈ విధంగా ప్రకటించింది.

"విప్లవకార్యక్రమం అంతా పైనుంచి దిగువకి సాగించడం ప్రమాదకరం అనీ, ప్రతిదీ దిగువనుంచి పైకి నిర్మించుకొంటూ నడపించాలనీ పశ్చాత్తరబడిగా బకునిస్టులు ప్రచారం చేస్తున్నా"రని ఏంగిల్సు వ్రాసేరు. మన నూతన ఇస్క్రాయిస్టులూ, సోషల్‌డెమాక్రట్ నడుపుతూన్న పైవారిశిష్యులూ తమ యీరాజకీయ జ్ఞానాన్ని నేర్చుకున్నది అనార్కిస్టుల వద్దనేకాదూ?"

1905 ఆగస్టు 15 న వచ్చిన ఈ పత్రికయొక్క పదకొండవ సంచికలోని "జార్‌యొక్క శాసనాలూ : ప్రజావిప్లవమూ" అనేవ్యాసం బుల్గిన్‌మంత్రి తయారు చేసిన వోటుచట్టాన్ని ఆధారంచేసుకుని ఒక అసెంబ్లీని, డ్యూమా సమావేశపరచబడుతుందని ప్రకటిస్తూ జారు చేసిన ప్రకటనయొక్క నిజమైన అర్థాన్ని బయటపెట్టింది. ఈరాజప్రకటన ఒక్కొక్క అంశాన్నే తీసుకుని విమర్శించబడింది. ఈ ఎసెంబ్లీకి జరిగేఎన్నికలలో వోటుహక్కు శ్రామికుల కివ్వబడలేదనీ, రైతులకి ఎన్నికహక్కు గ్యారంటీ చెయ్యబడలేదనీ చూపించింది. దురంతమనైన విద్రోహశక్తుల్ని కూర్చుకునేందుకు జారుప్రభుత్వం పన్నిన పన్నుగడతప్ప మరొకటికాదని నిరూపించి బుల్గిన్‌డ్యూమాని బహిష్కరించాలని బోధించింది. ఈబహిష్కారాన్ని బోల్షివిక్కులు పట్టుదలతో, విజయవంతంగా సాగించేరు.

ఈ సంచికలోనే "సోషల్‌డెమాక్రట్లూ : తాత్కాలిక విప్లవప్రభుత్వమూ" అనే వ్యాసం వుంది. తాత్కాలిక విప్లవప్రభుత్వంలో కమ్యూనిస్టులు విధిగా పాల్గొనాలని ఆవ్యాసంలో నిరూపించబడింది.

1905 అక్టోబరు 15 న వచ్చిన పన్నెండవ సంచికలో "విద్రోహం వ్యాపిస్తూంది" అనే శీర్షికగల వ్యాసం ప్రకటించబడింది. ప్రజావిప్లవాన్ని అణిచేసేటందుకు జార్‌ప్రభుత్వం సర్వప్రయత్నాలూ సాగిస్తూన్నట్లు చూపెంచి, "శ్రామికులకి తుపాకిగుళ్ళు, రైతులకి బూటకపు వాగ్దానాలు, పెద్ద బూర్జువాలకి 'హక్కులు'— విద్రోహశక్తులు కూర్చుకుంటూన్న ఆయుధాలివి" అని వ్రాసేరు.

అక్టోబరులో దేశంఅంతటా సమ్మెలు వచ్చేపూర్వం ఈవ్యాసం వ్రాయబడింది. ర. సో. డె. లే. పా. యొక్క ఒకేషియస్ ఫెడరేషన్‌లోని సభ్యులు స్టాలిను, ఆరని సహకారులూ పరిస్థితు లెలావున్నవీ పూర్తిగా ఎరిగివుండడం చేత విదనుకూలంగా ప్రజల్ని నడిపించగలిగేరు. మరల దేశంలో విప్లవం అమూలనుంచి ఈమూలకి చెలరేగుతుందనీ, సెప్టెంబరునెలలో మాస్కో-పీటర్సుబర్గులో జరిగిన ఘటనలు దానికి దారితీస్తున్నాయనీ, వారు సూచించేరు. జారిజంవుండగానే సంపూర్ణాధికారాలతో కాన్‌స్టిట్యూయంట్ అసెంబ్లీ సమావేశపరచబడగల సూచనలున్నాయని నమ్ముతూన్న మెన్షివిక్కులని ఖండించేరు. సాయుధవిప్లవం విజయం పొందగలిగితేనేగాని ప్రజలకి ముక్తివుండదుగనక దేశవ్యాప్తమైన సాయుధవిప్లవం సాగించడానికై ప్రయత్నించవలసివుందని హెచ్చరించేరు.

అదేసంచికలో ప్రకటించబడ్డ మరోవ్యాసం "బూర్జువాజీ వలపన్నుతూంది." అనేది 1905 సెప్టెంబరు మధ్యలో జరిగిన "జెంస్ట్వోల, కాంగ్రెస్" గుట్టును పూర్తిగా బయటపెట్టింది. జాతీయస్వాతంత్ర్యపక్షం లేక కాన్‌స్టిట్యూషనల్-డెమాక్రటిక్ పార్టీ (కాడెట్) ఏర్పడినదీకాంగ్రెసులోనే. ఈ కాడెట్‌లు అటు సోషలిస్టులూ, ఇటు డెమాక్రట్లూకూడా కాదని ప్రొలిటేరియాటిస్ బ్రట్జోలా నిరూపించింది. అటు సోషలిస్టువుద్యమాన్నీ, ఇటు ప్రజాతంత్రధావాన్నీకూడా ఈకాడెట్లు అసహ్యించుకుంటారు. అసలు యీ కాడెట్లు జారిస్టుసింహాసనాన్ని బలపరచడానికే బయలుదేరేరు. వారికి కావలసిందల్లా జార్‌కి గల కొన్ని విశేషాధికారాల్ని రద్దు చెయ్యడం, ఆ విశేషాధికారాలు బూర్జువాజీకి వొప్పచెప్పడమూ మాత్రమే.

కకేషియన్ మెన్షివిక్కులు కాడెట్ల అడుగుజాడల్లో నడుస్తూన్నారనీ, కాడెట్ల కార్యక్రమంలోవున్న మాదిరి బోనుసే శ్రామికులకోసం తమపత్రికయైన సోషల్‌డెమాక్రట్‌లో ఒగ్గుతున్నారనీ పైవ్యాసం స్పష్టపరచింది.

మెన్షివిక్కులకి వ్యతిరేకంగా కామ్రేడ్ స్టాలిన్ ప్రొలిటేరియాటిస్ బ్రట్జోలాలోనూ, ఇతరపత్రికలలోనూ వ్రాసిన వ్యాసాల భాగాలు ఎన్నో బెరియా వ్రాసిన 'ట్రాన్స్‌కకేషియాలోని బోల్షివిక్‌సంస్థల చరిత్రమీద' అనే పుస్తకంలో ఇవ్వబడ్డాయి.

లెనిన్‌మీదా బోల్షివిక్కులమీదా మెన్షివిక్కులు తమ సోషల్‌డెమాక్రట్‌లో ఒంటయుద్ధంఆరంభించగానే స్టాలిన్ ప్రొలిటేరియాటిస్ బ్రట్జోలా పదకొండో సంచికలో "ఒక సోషల్-డెమాక్రట్‌కి సమాధానం" పేరుతో వ్యాసం వ్రాసేడు. దానిని లెనిన్ చాలా మెచ్చుకున్నాడు. లెనిన్ సలహామీద "కకేషియన్‌మెన్షివిక్కుల కోట్టువెదట మూడవకాంగ్రెసు" అనే స్టాలిన్ వ్యాసం ప్రొలిటారీలో తిరిగి ముద్రించబడింది.

1905 అక్టోబరు 17 నాటి మానిఫెస్టోతో మెన్షివిక్కులు విజయం లభించినట్లే ఎగిరి గంతువేసేరు. ఈ మెన్షివిక్కుల్ని స్టాలిన్ టిఫ్లిస్‌లోని నజాలదేపిలో

జరిగిన మీటింగులో ఎదురుకున్నాడు. ఆరోజున మీటింగులోవున్న ఒకని జ్ఞాపకాలని 1929 లో కమ్యూనిస్టు (సంఖ్య 294) ప్రకటించింది.

"ఈసమయంలో కామ్రేడ్ కోబా (స్టాలిన్) వేదిక ఎక్కి ఉపన్యాసం ఆరంభించేడు." "మీకో చెడ్డఅలవాటు వుంది. దానిని గురించి నిర్మొగమాటంగా హెచ్చరిస్తున్నా. ముందుకి వచ్చిన దెవరేనాసరే, ఆతడేం మాట్లాడినాసరే మీరు మహోత్సాహంతో చప్పట్లు గొడుతున్నారు. "స్వాతంత్ర్యం వర్ధిల్లుగాక" అన్నా చప్పట్లు కొడతారు. విప్లవం వర్ధిల్లుగాక అన్నా చప్పట్లు కొడతారు. అంతవరకు బాగానే వుంది. మరొకడు వచ్చి "ఆయుధాలు పారెయ్యండి"- అంటే దానికీ చప్పట్లు గొడతారు. ఆయుధాలులేకుండా విప్లవంలో నెగ్గడం ఏలాగ ? 'ఆయుధాలు పారెయ్యండి' అనే అత దేసాటి విప్లవకారుడు? అలాగ చెప్పేవాడు టాల్‌స్టాయి అనుచరుడు కావచ్చునేమోగాని విప్లవకారుడు మాత్రం కాడు. ఎవడు కానీండి, ఆ పెద్దమనిషి. అతడు విప్లవశత్రువు. ప్రజల స్వాతంత్ర్యానికి శత్రువు-" దానితో సభ్యులలో కలవరపాటు కలిగింది. "ఎవరతడు ?", "ఎంత కటువుగా మాట్లాడుతాడు ?" "తీవ్రమైన నాలిక", అంటూ ప్రజలు వ్యాఖ్యానం ప్రారంభించేరు. కోబా తనధోరణి ఏలపలేదు. "మనం నెగ్గాలంటే మనకి కావలసిందేమిటి ? మూడు వస్తువులు గావాలి—శ్రద్ధగా వినండి మనస్సులో పెట్టుకోండి—మొదటిది ఆయుధాలు, రెండోది ఆయుధాలు, మూడోది ఆయుధాలు, హెచ్చు ఆయుధాలు."

"వినేవారంతా మహానందంతో చప్పట్లు కొట్టేరు. ఉపన్యాసకుడు వేదిక దిగిపోయేడు.

రష్యన్‌విప్లవచరిత్రలో అతి ప్రధానమైన ఈ కాలంలోనూ, బోల్షివిక్‌పార్టీ యొక్క తదనంతరచరిత్ర పొడుగునా మాదిరిగానే విప్లవనాయకులయిన లెనిన్ స్టాలిన్‌ల భావాల్లోనూ, చర్యలలోనూ సంపూర్ణఐక్యత మనకి కనబడుతూంది.

"ట్రాన్స్‌కకేషియాలోని మెన్షివిక్కులతోడి పోరాటంలో కామ్రేడ్ స్టాలిన్ లెనిన్‌యొక్క విప్లవ సిద్ధాంతాన్నీ, బోల్షివిక్కుల వ్యూహాన్ని సూచించే నినాదం - కార్మిక కర్షకుల ప్రజాతంత్రనియంతృత్వాన్నీ, బూర్జువావిప్లవాన్ని అధిగమించి, సోషలిస్టు విప్లవరంగంలో ప్రవేశించే భావాన్నీ బోధించి, ప్రచారంచేసి, శ్రామిక వర్గంయొక్క ఎత్తుగడలనీ, కర్తవ్యాలనీ సూచించేడు." (యల్. బెరియా)

1905 నవంబరునెలలో కామ్రేడ్ స్టాలిన్‌యొక్క నాయకత్వాన ర. సో. డె. లే. పా. యొక్క కకేషియన్ ఫెడరేషనుకి సంబంధించిన నాల్గో బోల్షివిక్ సమావేశం జరిగింది. దీనికి బాకూ, ఇమెరెటినో - మింగ్రెలియన్, టిఫ్లిస్, బాటుం కమిటీలనుంచీ, గురియాదళంనుంచీ ప్రతినిధులు హాజరయ్యేరు. సాయుధ తిరుగుబాటుకి తీవ్రప్రయత్నాలు చెయ్యడానికీ, ఈపనికై కావలసిన ఎన్నో నిర్మాణ విధానాలు సాగించడానికీ తీర్మానించబడింది.

తిరుగుబాటు వచ్చేటందుకు కొద్దికాలంక్రితమే టామెర్ఫోర్సు (ఫిన్లాండులో) కాన్ఫరెన్సు జరిగింది. లెనిన్, స్టాలిన్లు హాజరైన ఈ సమావేశానికి నేనూ హాజరుకావడం; కామ్రేడ్ స్టాలిన్తో గలిసి రాజకీయతీర్మానం వ్రాయ డానికి నియమించబడ్డ ఉపసంఘంలో పని చెయ్యడం, నా అదృష్టం అని భావిస్తు న్నాను. ఈ కాన్ఫరెన్సునిగురించి ఇంతవరకూ ఒక చిన్న కరపత్రంకూడా వ్రాయ బడివుండకపోవడం విచారించతగ్గవిషయం. దానికి సంబంధించిన డాక్యుమెంట్లు ఇంచుమించన్నీ పోయాయనే చెప్పాలి. ఈ కాన్ఫరెన్సుయొక్క చిత్రాన్ని కాగితం మీది కెక్కించడం మన చరిత్రకారులు తమ కర్తవ్యంగా పెట్టుకోవాలి.

స్టాలిన్ మొట్టమొదటిమాటు లెనిన్ని కలుసుకున్న దీచోటనే. ఈ సమా వేశాన్నిగూర్చి స్టాలినే ఒక మరువరాని చిత్రాన్ని మన కిస్తున్నాడు.

"1905 డిసెంబరులో నేను మొదటిమాటు లెనిన్ని టామెర్ఫోర్సు (ఫిన్లండ్) బోల్షివిక్ కాన్ఫరెన్సులో కలుసుకున్నా. మనపార్టీ నాయకుడైన ఆమహా పురుషుణ్ణి చూడాలని చాలకాలంనుంచి ఆశపెట్టుకునివున్నా. రాజకీయాలలోనేగాక, శారీరకంగాకూడా ఒక మహోన్నతవ్యక్తిని చూడగలనని నా యాశ. ఏమంటే, లెనిన్ పెద్దఆకారంగలిగి, గంభీరంగా, అందరిదృష్టులూ ఆకర్షించేవాడై వుంటాడని నా మనస్సులో చిత్రించుకొని వున్నా. అల్లాంటిఘట్టంలో చూపులకి సామాన్యంగా కనబడే, సగటుఎత్తురంటె తక్కువఎత్తు మనిషి; ఏవిధంగానూ సాధారణమానవుల నుంచి ప్రత్యేకంగా కనబడని మనిషి; నా ఎదుట కనబడితే నేనెంత ఆశాభంగం పొందివుంటానో మీరే వూహించుకోండి....

"సమావేశంలోనివారంతా ఊపిరిబిగబట్టి ఎదురుతెన్నులు చూస్తూంటే, అందరికంటే ఆఖరున 'గొప్పవాళ్లు' మీటింగులలోకి రావడంఅనేది ఒకమామూలు అయిపోయింది; సరిగ్గా ఆ గొప్పవాడు మీటింగులో ప్రవేశించేటప్పుడు నాలుగు మూలలా "హష్!........ఊరుకోండి!.........వస్తున్నారు!" అంటూ హెచ్చరికలు వినబడతాయి. ఇది ప్రజలలో ఒక భావాన్నీ, గౌరవాన్నీ కలిగిస్తుంది. అందుచేత ఇందులో నాకేమీ తప్పు కనబడలేదు. లెనిన్ డెలిగేట్లు అందరికంటే ముందుగానే వచ్చేడనీ, ఒకమూలకూర్చుని సంభాషణలు సాగిస్తున్నాడనీ, కాన్ఫరెన్సుకివచ్చిన సాధారణులయిన ప్రతినిధులతో ఏవో సాధారణప్రసంగాలలో మునిగివున్నాడనీ, తెలుసుకొనేటంతకి నేనెంత ఆశాభంగం పొందేననుకున్నారు? ఒక రహస్యం చెప్తా వినండి. లెనిన్యొక్క ఈవ్యవహారం కొన్ని అవసరమైన నియమాల్ని అతిక్రమించడమేనని నేను తలచేనంటే నమ్మండి.

"ఈ నిరాడంబరత్వం, అణకువ, తన్ను ప్రత్యేకించి చూడకుండా ప్రయ త్నించడం, తాను ప్రత్యేకంగా దృష్టుల్ని ఆకర్షించకపోవడం, తన ఉన్నతస్థితిని అడుగడుక్కీ బయటపెట్టాలనే భావం లేకపోవడం, ఇవి నూతనప్రజకి, నిరాడం బరులయిన సాధారణప్రజకి, మానవసమాజంలోని 'సామాన్య సైనికులకి' నాయ

కత్వం వహించిన లెనిన్‌కున్న ప్రత్యేకమైన గొప్పలక్షణాలు. (లెనిన్‌గూర్చి స్టాలిన్.)

లెనిన్‌యొక్క మరోలక్షణాన్నికూడా స్టాలిన్ వర్ణిస్తూన్నాడు.

"ఈ కాన్ఫరెన్సులో లెనిన్ ఇచ్చిన రెండు ఉపన్యాసాలూ చాలా ముఖ్యమైనవి: వానిలో ఒకటి రాజకీయసమస్యలమీద, రెండోది రైతాంగసమస్యమీద ఇచ్చేడు. అవి, జాగ్రత్త పెట్టబడకపోవడం దురదృష్టం. ఉద్రేకభరితాలైన ఆ ఉపన్యాసాలు ఆ సమావేశాన్ని మహోత్సాహంలో ముంచెత్తేయి. అద్భుతమైన ఆ ఒప్పించేశక్తి. ఆ నిరాడంబరత్వం, ఆ స్పష్టమైన యుక్తిప్రయుక్తులు, చులాగ్గా, అర్థంఅయ్యే ఆ చిన్నచిన్న మాటలు. ఆర్భాటం లేకపోవడం; జిగాల్మనిపించే ధోరణులూ, ప్రజల నుద్రేకపరచడానికై నాట్యాభినయాలు లేకపోవడం.—ఇవన్నీ మామూలు పార్లమెంటరీవక్తయొక్క ఉపన్యాసంకంటె. లెనిన్ ఉపన్యాసాన్ని విన్నవాళ్ళలో సదభిప్రాయాన్ని కలిగించాయి.

"కాని, ఆసమయంలో నన్నాకర్షించినవి లెనిన్‌ఉపన్యాసంలోని ఈప్రత్యేకలక్షణాలేవీ కాదు. వాటిలోవున్న, నిరాకరించవీలులేని ఎత్తుగడలకు నేను ముగ్ధుడినై పోయేను. ఆ యుక్తులు చాలా సాధారణమైనవే అయినా శ్రోతల నందరినీ ఆకర్షించేసి, వారిలో ఆవేశం పుట్టించి, పూర్తిగా లోబరచేసుకున్నాయి. ప్రతినిధులలో చాలామంది, 'లెనిన్ ఉపన్యాసాలలోని యుక్తులు ఉక్కుతీగలమాదిరిగా చుట్టి పట్టుకుంటాయి. నాలుగువేపులనుంచీ వాటిని వదల్చుకోవడం అసంభవం: లొంగిపోవడమో, పూర్తిపరాజయానికి సిద్ధపడడమో తప్ప చెయ్యగల దుండదు.' అని వ్యాఖ్యానాలు చెయ్యడం నాకు బాగా జ్ఞాపకం."

"లెనిన్ ఉపన్యాసాలలోగల ఈ ప్రత్యేకలక్షణం ఆయన ఒకబలమైన లక్షణం." (పై పుస్తకం నుంచే.)

లెనిన్‌లోవున్న ఈవిశిష్టగుణాలు స్టాలిన్‌లోనూ వున్నాయి. ఆయన పనులన్నింటా ఇవి విస్పష్టంగా కనబడుతూంటాయి. పార్టీసభ్యుల్నీ, యువక కమ్యూనిస్టుసమితి సభ్యుల్నీ లెనిన్‌లాంటి నాయకుల్నిగా తయారుచేసేటందుకై స్టాలిన్ చేసే నిరంతరప్రయత్నాలలో ఈగుణాలు మూర్తీభవించి కనబడతాయి.

డిసెంబరు తిరుగుబాటు పరాజితం కావడంవలన బోల్షివిక్కుల పట్టుదల సడలలేదు. ఈ కఠినపరీక్షాసమయంలో స్టాలిన్ ఉత్తమమైన విప్లవదార్ఢ్యాన్నీ, మనస్థైర్యాన్నీ ప్రదర్శించేడు. 1906 జనవరిలో ఆయనవ్రాసిన "రెండుఘర్షణలు" అనేకరపత్రం ఒక అద్భుతరచన. 1905 జనవరి 9 — బ్లడీ సన్‌డే — 1905 డిసెంబరునాటి తిరుగుబాటూను ఈరెండు ఘర్షణలూ, "తిండీ, న్యాయమూ" కలగచెయ్యమని కోరడానికై జనవరి 9 న శ్రామికులు "శాంతియుతంగా" జార్ ప్రాసాదానికి "ఊరేగింపుతో వెళ్ళేరు." వారు అమాయకమైన విశ్వాసంతో దేవతావిగ్రహాలనీ, జార్‌బొమ్మలనీ, తీసుకుని బయలుదేరేరు. కాని, జార్ వారి ఆశలన్నీ మట్టిగలిపేడు. పీటర్సుబర్గ శ్రామికులు ఆయుధాలు... తీసుకున్నారు.

ఆ బ్లడీ సన్‌డే తర్వాత శ్రామికులు "జార్ మాకిది ఇచ్చేడు. ఇప్పుడు దీనినే మేము తిరిగియిస్తా" మని అనసాగేరు.

పీటర్సుబర్గు శ్రామికులు జనవరిలో చేసిన కార్యాలు దేశం మొత్తంమీది శ్రామికుల, రైతుల నిశ్చితసహాయాన్ని పొందలేకపోయినాయి. ఉద్యమం ఒక్కసారిగా, ఒకేఒక ఆదర్శంతో బయలుదేరలేదు. పార్టీ అప్పుడప్పుడే ఒక ఆకారంలోకి వస్తూంది. ఆంతరికఘర్షణల ఫలితంగా బలహీనపడివుంది.

కాని, 1905 డిశెంబరునాటి పరిస్థితులే పూర్తిగావేరు. పదకొండునెలలుగా సాగుతూన్న, ఉడికిపోతూన్న విప్లవసంఘటనలు యుద్ధానికి తయారుగావున్న శ్రామికులమీద తమప్రభావాన్ని కలిగించకుండా వుండలేదు. శ్రామికులు దేవతా విగ్రహాలనీ, జార్‌బొమ్మల్నీ నేలపారేసేరు. ఎర్రజెండాలూ, మార్క్స్ - ఏంగిల్సుల చిత్రాలూ ఎత్తుతున్నారు, మతబోధకవాక్యాలూ. భగవానుడు జార్‌ని రక్షించుగాక ' అనే మాటలతోగాదు వారు బయలుదేరడం. ఉద్రేకభరితాలైన మార్సెయిలీజ్, విప్లవగీతాల లయకనుగుణంగా నడుస్తూన్నారు. కొద్దిపాటివేగానైంది వాళ్ళవద్ద ఆయుధాలున్నాయి. జనవరినాటి వుద్యమాన్ని నడిపింది ఫాదర్ గేపన్. ఈనాడు శ్రామికవర్గపు పార్టీనడుపుతూంది. కాని విచారకరమైనవిషయం ఏమంటే పార్టీలో ఐక్యత లేకపోవడమూ, శ్రామికవర్గంలో చీలికలు వుండడమూ. శ్రామికులు చేసిన మరొక పొరపాటు మాస్కోతిరుగుబాటులో శ్రామికులు దెబ్బకొట్టే ఎత్తుగడలకి బదులు దెబ్బ కాచుకొనేవిధానాన్ని అవలంబించడమేనని స్టాలిన్ చూపించేడు.

దీనినుంచి స్టాలిన్ తేల్చిన సారాంశం భవిష్యత్తులో విప్లవం విజయం పొందాలంటే విప్లవకర శ్రామికవర్గం ఐక్యత పొందడం అవసరం అనే. "ఒక్కమాటలో చెప్పాలంటే తిరుగుబాటు విజయం పొందడానికి పార్టీఐక్యత అవసరం. పార్టీచేత నిర్మించబడ్డ తిరుగుబాటూ, ఆక్రమణ కొరక విధానమూ కావాలి." (యల్. బెరియా వుదాహరించినది.)

శ్రామికవర్గం పూర్తిగా పరాజితం అయిందనే. మెన్షివిక్కుల ఇకిలింపులకి సమాధానం యిచ్చేడు. స్టాలిన్.

"కామ్రేడ్స్ ! శ్రామికవర్గం పూర్తిగా పరాజితం కాలేదు. తాత్కాలికంగా తిరోగమించింది. మళ్ళీ విజయవంతంగా ఎదిరించేటందుకు కావలసిన సన్నాహాలు చేసుకుంటూంది. రష్యన్ శ్రామికవర్గం తమరక్తంతో రంగువేసిన జెండాని ఎప్పటికీ నేల బడెయ్యదు. అదొక్కటే మహారష్యన్‌విప్లవానికి తగిన నాయకుడుగా వ్యవహరించింది. భవిష్యత్తులో ఆస్థానాన్నినిలుపుకుంటుంది." (పై పుస్తకంలోనే)

1906 లో నాలుగో (ఐక్య) పార్టీకాంగ్రెసుకి ప్రతినిధిగా స్టాలిన్ వెళ్ళేడు. అక్కడ ఆయన యిచ్చిన అద్భుతోపన్యాసంలో మెన్షివిక్కులకీ-మనకీగల ప్రధాన విభేదాలని వివరించేడు : "పార్టీలో నేడుగల ప్రశ్నయిది - శ్రామికవర్గం ప్రాధాన్యత వహించాలా ? డెమాక్రటికల్ బూర్జువాజీ ప్రాధాన్యత వహించాలి ?—మన విభేదాలకి మూలం అక్కడేవుంది.

అసలు మూలభేదాలు వర్గాల ప్రాముఖ్యత, శ్రామికవర్గంయొక్క ప్రాముఖ్యత, అంటే పార్టీయొక్క ప్రాముఖ్యతనే కేంద్రంచేసుకుని ఏర్పడ్డాయి. పరస్పర పరిచయం లేకపూర్వమే భావైక్యతని ఆధారంచేసుకుని లెనిన్ స్టాలిన్ల మధ్య నేర్పడిన మైత్రి ఈ సమావేశంలో మరింత బలపడింది.

"ఈనాటి స్థితిగతులూ: శ్రామికవర్గపు పార్టీయొక్క ఐక్యతాకాంగ్రెసు." అనేపేరుతో స్టాలిన్ మెన్షివిక్కుల్ని ఎదిరిస్తూ, లెనిన్ విధానాన్ని సమర్థిస్తూ ఒక కరపత్రం వ్రాసి ప్రకటించేరు. ఎల్వావపత్రికలో అనేకసంచికలలో వి. జోస్సోష్విలీ అనే పేరున స్టాలిన్ ఎన్నోవ్యాసాలు నాలుగోకాంగ్రెసులో లెనిన్ అవలంబించిన విధానాన్నీ, అందులో ముఖ్యంగా రైతాంగసమస్యలని పూర్తిగా సమర్థిస్తూ వ్రాసేరు.

నాలుగో కాంగ్రెసులో కుదిరిన ఐక్యత నామమాత్రమేనని మనంఎరుగుదుం. నిజానికి బోల్షివిక్కులూ, మెన్షివిక్కులూకూడా తమతమ అభిప్రాయాలనీ, తమతమ నిర్మాణాలనీ అంటిపెట్టుకునే వుండిపోయేరు. అంతకంతకి మెన్షివిక్కుల అవకాశవాదపద్ధతులు బహిర్గతం కాసాగేయి. బోల్షివిక్కులు వారినుంచి విడిపోవడానికి ప్రయత్నించితీరవలసి వచ్చింది. మెన్షివిక్కునాయకుల్ని ఏకాకుల్నిచేసి, సోషల్‌డెమాక్రెట్లయిన పనివారిని తమవేపుకు తిప్పుకునేందుకు ప్రయత్నించవలసి వచ్చింది.

నాలుగోపార్టీకాంగ్రెస్ జరిగిన కొద్దిదినాలకే స్టాలిన్ ట్రాన్స్‌కకేషియాలో బోల్షివిక్ రెజినల్ బ్యూరోని స్థాపించగలిగేరు. ఈ బోల్షివిక్ కేంద్రంద్వారా నూతన పార్టీకాంగ్రెసుని సమావేశపరిచడానికై స్టాలిన్ తీవ్రప్రయత్నాలు సాగించేరు. విప్లవకరమార్క్సిజంయొక్క జెండానీడల పార్టీలో నిజమైనఐక్యతని స్థాపించడమే ఈనూతనకాంగ్రెస్ చెయ్యవలసిన పని.

అయిదవ (లండన్) కాంగ్రెసులో స్టాలిను మెన్షివిక్కుల మోసాలనీ, కుట్రలనీ బయటపెట్టేరు. ఈ కాంగ్రెసుఅనంతరం "రష్యన్ సోషల్‌డెమాక్రటిక్ పార్టీయొక్క లండన్ సమావేశం" అనేపేరున అక్కడి కార్యక్రమంయొక్క రిపోర్టు ప్రకటించేరు (ఒకప్రతినిధియొక్క నోట్సు) అయిదవకాంగ్రెసులో జరిగిన పనినీ, అక్కడ జరిగిన పోరాటాన్నీ ఇది అతిస్పష్టంగా చిత్రించింది.

ఈ కాంగ్రెసువలన కలిగిన ముఖ్యమైన ఫలితం ఏమంటే "అది చీలపోసికి దారితియ్యలేదు, పార్టీని అతిదగ్గరగా చేర్చింది, రష్యాలో బాగాముందుకి వచ్చిన శ్రామికులందరినీ ఒకేఒక పార్టీలో అతిసన్నిహితమైన మైత్రిలో చేర్చింది. అది అఖిలరష్యన్ ఐక్యతాకాంగ్రెసు అనేది అక్షరాలా నిజం.... అని స్టాలిన్ వ్రాసేరు.

"రష్యాఅంతటిలోనూ వున్న బాగాముందుకివచ్చిన శ్రామికుల్ని రివల్యూషనరీ సోషల్‌డెమాక్రసీయొక్క జెండానీడల ఒకేఒక అఖిలరష్యన్‌పార్టీలో ఐక్యపరచడం—ఇది లండన్ కాంగ్రెసుయొక్క ప్రాముఖ్యత. దానియొక్క సామాన్యలక్షణమూ" అన్నాడు స్టాలిన్.

రెండవ స్టేట్‌డ్యూమాని భగ్నంచెయ్యడానికై జూన్ 3 వ తేదీన జరిగిన మా దేశా*కై జారిస్టుప్రభుత్వం తయారవుతున్న కాలంలో జరిగింది లండన్ కాంగ్రెసు. అధికారులు బోల్షివిక్ సమితుల్ని నాశనం చేస్తున్నారు. విప్లవతరంగం వెనక్కి తగ్గుతూంది. విప్లవం తాత్కాలికంగా తిరోగమిస్తూంది. కొత్తపోటు లేపేటందుకు ప్రయత్నాలు చెయ్యవలసిందని లెనిన్ - స్టాలిన్‌లు ఆదేశించేరు. ఈ నూతనపరిస్థితులలో పోరాడడం ఏలాగనో, మళ్ళీ పోటుతిరగడంతోనే పార్టీ విజయం పొందగలిగేటట్లు ఇప్పుడు పోరాటం ఏలాగ సాగించాలో, వారుపదేశించేరు. మళ్ళీ విప్లవం విజృంభించక తప్పదన్నారు. విద్రోహశక్తుల ఎదురుదాడులు తీవ్రంగా సాగుతూన్నా స్టాలిన్ బాకూలో అతితీవ్రంగా పనిసాగించేరు.

1926 జూన్ 10 నాటి బాకూ వార్తాపత్రికలో ఆనాటి పరిస్థితుల్ని గురించి స్టాలిన్ వ్రాసినదానినే ఈ దిగువ ఇస్తున్నా:

"నూనెపనివారిలో చేసిన రెండేళ్ళ విప్లవకార్యక్రమమూ నన్ను కార్యవాదియైన యోధుడినిగా, కార్యవాదులయిన నాయకులలో ఒకడినిగా దిట్టపరచింది. వాస్సెర్, సారాబోవెట్సులాంటి బాకూశ్రామికులతో నాకుగల స్నేహాలూ, శ్రామికులకీ నూనెయజమానులకీ మధ్యజరిగిన తీవ్రపోరాటాలూ నాకు అసంఖ్యాకులైన ప్రజల్ని నడిపించడం అంటేఏమిటో మొట్టమొదటిమాటు అర్థమయింది. ఆవిధముగా బాకూలో రెండోమారు విప్లవాగ్నిలో సంస్కారం పొందేను."

విద్రోహశక్తులు బలంగావున్న ఆకఠినకాలంలో బాకూలో పనిచెయ్యడంలో స్టాలిన్ నిర్మాణకార్యాలలోనూ, ప్రచారకార్యాలలోనూ అదివరకెన్నడూ చూచి వుండనంత అద్భుతసామర్థ్యాన్ని ప్రదర్శించేరు. సిద్ధాంతరంగంలోకూడా ఈరోజులలో ఆయన విలువమైన రచనలు వ్రాశారు. జాతీయసమస్యల్నిగురించీ, నూతన పరిస్థితులలో సోషలిజాన్నిగురించీ, ప్రత్యేకంగా పనిచేసేరు, తనంతరాను ఆయన మార్క్సిజం-లెనినిజానికి కొన్ని రచనలు వ్రాసారు. ఈ రోజులలోకూడా ఆయన ట్రాన్స్‌కకేషియాలోని విప్లవోద్యమాన్ని నడిపించేరు. బోల్షివిక్‌సంస్థల నిర్మించడంలో స్టాలిన్ అద్భుతజ్ఞానాన్నీ, విజ్ఞానాన్నీ ప్రదర్శించేరు. ట్రాన్స్‌కకేషియాలో రహస్యమైన మార్క్సిస్టు పత్రికని స్థాపించేరు. దీని కద్భుతమైన పలుకుబడి వుండేది.

కారల్‌కాట్స్కీ రష్యన్‌విప్లవంలోని చోదకశక్తుల్ని గూర్చి ఒక పుస్తకం వ్రాసి జర్మనీలో ప్రకటించినప్పుడు లెనిన్-స్టాలిను లెవరికివారే ఒకేసమయంలో దాని అనువాదాలు ప్రకటించడం ఆశ్చర్యం కలిగిస్తుంది. ఆ పుస్తకానికి వారు వ్రాసిన పీఠికలుగినక చదివితే ఆరోజులనాటి వారి భావాలలోగల ఐక్యత మనకి స్పష్టంగా తెలుస్తుంది. ఈ ఇద్దరు విప్లవకళాధురీణులూ శ్రామికవర్గోద్యమంలో గనపడ్డ ఆపర్చ్యూనిస్టుధోరణుల్ని అతితీవ్రంగా ఎదుర్కొన్నారు. విప్లవంలో శ్రామిక వర్గ నాయకత్వంకోసం, విప్లవోద్యమంలో మార్క్సిజంయొక్క నాయకత్వంకోసం నిరంతరాయంగా పోరాడేరు.

# విద్రోహకాలం

విప్లవపుపోటు ఎగదొసుకొస్తూన్నప్పుడు పనిచెయ్యడం ఇతరసమయాలలో కంటె సులభం. ప్రతివారి హృదయాలూ ఆవేశంతో నిండివుంటాయి. అసంఖ్యాకు లయిన ప్రజ వీధుల కెగబడి, విప్లవోద్రేకంలో చెలరేగుతూంటారు; విప్లవం దిగ జారిపోతూన్నప్పుడు, విద్రోహశక్తులు చెలరేగుతూన్నప్పుడు, స్టొలిపిన్ మంత్రాంగం రోజులలో పార్టీనిర్మాణాలలో పనిచెయ్యడం మహాకష్టతరమైన పని. ఈరోజు లన్నిగురించి స్టాలిన్ 1922 మే 5 న ప్రవదాపత్రికలో "ప్రవదాయొక్క దశమ వార్షికోత్సవం" అనే వ్యాసంలో ఇల్లాగ వ్రాసేడు.

"పార్టీలోని యువకులయిన సభ్యులకి ఈ ప్రభుత్వ నిరంకుశత్వం అనుభవం లేదు. లేదా, మరిచిపోయి వుండొచ్చు. కాని వయస్సుమళ్ళిన సభ్యులకి ఆ ప్యూనిటివ్ దాడులు, శ్రామికసంస్థలమీద జరిగిన ఆ దొంగపోటుదాడులు, వందల కొద్దీగా రైతుల్ని కొరడాలతో బాదడం, 'వీటిని కప్పిపుచ్చేటందుకు బ్లాక్ హండ్రెడ్లు, కాడెట్లతోకూడిన డ్యూమా ఇవన్నీ మరపుకి వచ్చివుండవు. సంకెళ్ళతో బంధించబడిన ప్రజలు ; నలుమూలలా నిరుత్సాహం, అలసట ; శ్రామికులలో దారిద్ర్యం, నిరాశ ; నేలబెట్టి రాసేసి, అణిచివెయ్యబడ్డ రైతులు ; వీటన్నింటి నడుమ పోలీసు - - భూస్వామి - పెట్టుబడిదారీ వేటకుక్కల దురంతకపాలన - ఇవి స్టొలిపిన్ చేసిన పరిపాలనకు ప్రత్యేకలక్షణాలు........

విప్లవం మంచి వున్నతదశలో వుండగా తాముపొందిన భయానికి ప్రతీకారంగా దుర్మార్గులైన జారిస్టుగవర్నర్లు శ్రామికప్రజల్ని హడలకొట్టి 1905 కి ప్రతీకారం తీర్చుకోదలిచేరు. నగరాలలోనూ, పల్లెలలోనూ వీధులలో రక్తం ప్రవహించింది. ప్యూనిటివ్ సైన్యదళాలు విప్లవకేంద్రాలని భగ్నం చేసేయి. మొదటిరష్యన్ విప్లవకాలంలో ట్రాన్స్‌కకేషియాలోని విప్లవోద్యమానికి ప్రధానకేంద్రాలుగా తయారైన టిఫ్లిస్, కుటియాస్‌రాష్ట్రాలలోమాత్రం 1907 లో ప్రభుత్వాజ్ఞచేత 3,074 మంది దేశాంతరగతులు చెయ్యబడ్డారు. ఈ సమయంలో స్టాలిన్ బాకూలో పని చేస్తున్నాడు. అక్కడి పరిస్థితు లెంత దుర్భరంగావున్నా 1908 మార్చిదాకా పట్టుబడకుండానే తిరిగేడు. ఇంతకాలమూ నిరంతరాయంగా తన కార్యక్రమం సాగించేడు.

విప్లవకాలంలో శ్రామికులు సంపాదించిన విజయాలను రష్యాఅన్నిచోట్ల గల యజమానులమాదిరిగానే బాకూలోని యజమానులుకూడా అపహరించటానికి ప్రయత్నించేరు. బోల్షివిక్కుల రహస్యపత్రిక సోషల్ డెమొక్రట్ పదిహేండో

సంచికలో (ఫిబ్రవరి 13, 1910) 'కాకేషస్‌నుంచి బాకు' అనేవ్యాసంలో స్టాలిను విద్రోహకాలంలో బాకూశ్రామికుల స్థితిగతుల్నిగురించి ఈ విధంగా వర్ణించేరు:

"....తగ్గడానికి బదులు ఆర్థిక దుస్థితి అంతకంతకి తీవ్రం అవుతూంది. "బోనసులు", ఇంటిఅద్దెల కంటూ ఇచ్చిన అలవెన్సులూ లాగివేసుకుంటున్నారు. 8 గంటలు పనిచేయించడంస్థానే 12 గంటలు పనిచేయించడం ప్రవేశపెట్టబడు తూంది. అదమాయించి అదనపు పని చేయించుకోవడం సాధారణ కృత్యం అవు తూంది. వైద్యసహాయానికి, చదువుకుపెట్టే ఖర్చులు తగ్గించివెయ్యబడుతున్నాయి. నూనెగనుల యజమానులు ఏటా 6 లక్షల రూబుళ్ళని పోలీసుమీద ఖర్చుచేస్తూ న్నారు. ప్రజలకొరకు ఏర్పరచబడిన భోజనశాలలూ, ప్రజాభవనాలు ఇదివరకే ఎత్తివెయ్యబడ్డాయి. నూనెగనులలోనూ, ఫ్యాక్టరీలలోనూ వున్న సంఘాలనీ, ట్రేడ్‌యూనియన్లనీ గుర్తించ నిరాకరించుతున్నారు. వర్గచైతన్యంగల కామ్రేడ్స్‌ని పూర్వంలాగే డిస్మిస్‌చేసేస్తూన్నారు జుల్మానాలూ, కొరడాలో కొట్టడాలూ ప్రారంభం అయినాయి." (యల్. బెరియా తనపుస్తకంలో వుదాహరించినది.)

పైన చెప్పిన పరిస్థితులు 1909, 1910 లలో. 1907, 1908 లలో బాకూలో శ్రామికోద్యమం ఇంకా అత్యుచ్చస్థితిలో వుంది. తమ ప్రతీకారజ్వాలల్ని పూర్తిగా శ్రామికులమీదికి తిప్పడానికి అప్పటికింకా యజమానులకి ధైర్యం కలగలేదు. బాకిన్‌స్కీ ప్రొలిటారీ (బాకూ ప్రొలిటేరియన్) పత్రిక ఇంకా అప్పుడుకూడా ప్రకటించబడుతూనే వుందంటే అప్పుడు బోల్షివిక్‌నిర్మాణాలు ఎంతబలంగా వున్నాయో తెలిపోతుంది.

గుదోక్ (బాకా) లీగల్‌గా ఇంకా ప్రకటించబడుతూనే వుంది. రష్యాలో విద్రోహశక్తుల పరిపాలన తీవ్రంగా సాగుతూవుండగా, శ్మశానశాంతి సర్వత్రా వ్యాపించివుండగా బాకూనుంచి విప్లవపు "బాకా" దేశం అంతటా ప్రతిధ్వనిస్తూ మ్రోగుతూనే వుందన్నాడు, సెర్గో ఓర్జానికిడ్జే.

సెర్గో ఓర్జానికిడ్జే, క్లిమెంట్ వారోషిలోవ్, అల్యోషా జాపారిడ్జే, స్టోపానీ, సురేన్ స్పందార్యన్, స్టెపాన్ సౌమ్యాన్, వాన్యా ఫియోలెటేవ్. వి. పి. నోగిన్ (మాకర్), వాటెస్కీ, అలీలుయేవ్, గ్వాంచాలాడ్జే (అపోస్తోల్), రాడస్-జెంకోవిచ్ (ఎగోర్), మొదలగువారు ఈరోజులలో బాకూలో స్టాలిన్‌తోగలిసి పనిచేసేరు. చిబీ-ఈదాత్ జిల్లాలోని నూనెపనివారి యూనియన్‌కి వరోషిలోవ్. కార్యదర్శి. ఓలియం కంపెనీలో బాయిలర్లు చేసేవాడుగా పనిచేసేడు. ఆ వారోషి లోవే ప్రపంచంలో ఆరోభాగం వైశాల్యంగల దేశంలోని రెడార్మీకి సేనానాయకుడు కాగలడనిగాని, బాకూశ్రామికులని నిర్మాణపరుస్తూన్నవారే భవిష్యత్తులో మొట్ట మొదటి సోషలిస్టురాజ్యాంగాన్ని నిర్మించి, అభివృద్ధిచేస్తారనిగాని, బాకూలోని నూనెగనుల యజమాన్లు వూహించివుండనే లేదు.

బాకూలో నాయకత్వంవహించి కార్యక్రమాన్ని నడపడానికి బోల్షివిక్కులు పార్టీకమిటీని స్థాపించేరు. దీని కార్యనిర్వాహణసమితి అధ్యక్షుడు స్టాలిన్.

బాకూలోని ప్రతిజిల్లాకి వేరేవేరే కమిటీలున్నాయి. ముస్లిం పనివారిలో ప్రచారం సాగించడానికై గుమ్మెట్‌సంస్థ ఒకటి ఏర్పరచబడింది. స్టాలిన్ అన్నిజిల్లాల లోనూ పనిచేసేడు. కాని, మెన్షివిక్కులతో ప్రత్యేకంగా పోరాటం సాగించవలసిన జిల్లాలలో ఎక్కువగా పనిచేసేడు. మెన్షివిక్కులుకూడా బాకూలో స్థిరంగా తమ కేంద్రాన్ని స్థాపించుకునేందుకు ప్రయత్నిస్తూన్నారు. ఆరోజుల్లో. స్టాలిన్ మెన్షి విక్కులు బాగా పాతుకొనిపోయివున్న బిబీ-ఈబాట్ జిల్లాలో (షేన్‌డ్రికోవ్‌సంస్థల శేషాలింకా ఇక్కడ జీవించివున్నాయి.) చాలా విశేషంగా పనిచేసేడు. ఈబాకూ కమిటీయొక్క కార్యక్రమం తరువాతి సంవత్సరాలలో రష్యన్ శ్రామికవర్గం యొక్క విప్లవోద్యమాభివృద్ధికి విశేషంగా తోడ్పడింది. 'సమావేశమూ : శ్రామి కులూ' అనే వ్యాసంలో స్టాలిన్ బాకూనిర్మాణం శ్రామికవర్గోద్యమానికి ఏవిధంగా తోడ్పడిందో వర్ణించేడు.

"1903 వసంతంలో బాకూలోవచ్చిన మొదటి సార్వజనికసమ్మె రష్యా యొక్క దక్షిణప్రాంతపు నగరాలలో జూలైనెలలో జరిగిన సమ్మెలకి, ఊరేగిం పులకి నాందీపూజ చేసింది; 1904 నవంబరు, డిసెంబర్లలో జరిగిన రెండో సార్వ జనికసమ్మె జనవరి, ఫిబ్రవరినెలలలో రష్యాఅంతటా వచ్చిన పోరాటాలకి సంకే తంలా పనిచేసింది; ఆర్మీనియన్-తార్తార్ చిత్రవధలనుంచి శీఘ్రంగా కోల్కొని బాకూ శ్రామికవర్గం 1905 లో పోరాటంలో పురికి, 'కాకేషస్‌నంతనీ' తన వుత్సా హావేశంలో ముంచెత్తింది; 1906 తర్వాత విప్లవం తిరుగుముఖం పట్టేకకూడా బాకూలో "శాంతి ఏర్పడలేదు." రష్యాలో ఇతరచోట్లన్నింటికంటే ఉధృతంగా మేదే వుత్సవాలు సాగిస్తూనేవుంది, ప్రతియేటా, మిగిలిన నగరాలలో అనందాన్నీ, అసూయనీ, రేకొల్పుతూ." (యల్. బెరియా పుస్తకంలో వుదాహరించినది.)

ఆకాలంనాటి బోల్షివిక్ వాజ్మయం రహస్యమూ, బహిరంగమూనైన కర పత్రాలనీ, వ్యాసాలనీ, చూస్తే (స్టాలిన్‌చేత వ్రాయబడి, ట్రాన్స్‌కకేషియాలోని రహస్యప్రెస్‌లలో ముద్రించబడినవాటిని) ఆరోజులలో బోల్షివిక్కుల కెంత పలుకుబడివుండేదో తెలుసుకోవచ్చు. స్టాలిన్, వొరోషిలోవ్, ఓర్జొనికిడ్జే మొద లయినవారు మెన్షివిక్కుల్ని, సోషలిస్టు-రివల్యూషనరీలని, అరాజకవాదుల్ని బాగా పెద్దమీటింగులలో దుయ్యబట్టుకుని, వాదోపవాదాలు సాగించేవారు.

సోషల్‌డిమాక్రేటిక్ పార్టీయొక్క ఐదవకాంగ్రెస్ అనంతరం, రెండో స్టేట్‌డ్యూమా విచ్ఛిన్నం చెయ్యబడ్డాక, బాకూశ్రామికుల పోరాటసమితులని నిర్మూలించడానికై మెన్షివిక్కులు వేగిరపడసాగేరు. బోల్షివిక్కులు దీనికి అసమ్మతి చూపించి, వాటిని పునః నిర్మించేరు.

పార్టీసభ్యులచేత ఎన్నుకోబడి, జిల్లాసంఘాలతో సంబంధాలు కలిగివుండి, సభ్యుల విశ్వాసాన్ని చూరగొన్న ప్రధాన రాజకీయకేంద్రాన్ని బాకూలో స్థాపించ డానికై స్టాలిన్ విశేషప్రయత్నాలు చేసేడు.

స్టాలిన్ 1907 ఆగస్టులో ఒకకరపత్రం వ్రాసేరు. బలాఖాన్, బిబి-ఇబాట్, చెర్నీ గోరోద్, బెలీ గోరోద్, మోర్‌స్కోయ్‌జిల్లాలలో నిర్మాణకార్యానికై నియోగించబడ్డ కమీషన్‌సభ్యులూ, బాకూ సంస్థలలోని మహమ్మదీయుల గుమ్మత్ దళమూ, సంతకాలు పెట్టేరు. ప్రజలతో ఏవిధమైన సంబంధమూ వుంచుకోకుండా అపర్యాప్యనిష్టు కార్యవిధానాన్ని అనుసరిస్తూ, బాకూశ్రామికుల భావాల్నిగాని, ఉద్రేకాల్నిగాని ప్రతిబింబించని మెన్షివిక్‌కేంద్రంయొక్క నాయకత్వాన్ని శ్రామికులు నిరాకరించాలని స్టాలిన్ అందులోవ్రాసేడు. బాకూశ్రామికులకి ఈకేంద్రం యెడల అపనమ్మకం కలిగిందంటే ఆశ్చర్యంలేదు. వీరు శ్రామికవర్గోద్యమాన్ని నడపలేకపోవడం సరికదా, సంఘటనలకి వెనకాల ఈడిగలబడుతూ పైపెచ్చు ఎన్నోజిల్లాలతో వ్యతిరేకంగా వర్తించేరు. బాకూపార్టీనిర్మాణాన్ని ఎన్నోసమస్యలు ఎదుర్కొన్నాయి. స్టేట్‌డ్యూమాని రద్దుచెయ్యడంతో సమ్మెలు ఆరంభంఅయినాయి. నూనెగనుల యజమానులతో సమావేశం జరపబడింది. రైల్వేశ్రామికుల సమావేశం జరిగింది. బాకూలోని నాలుగుజిల్లాల సభ జరిగింది. వార్తావినిమయం కోసం వేరువేరుపార్టీల ప్రతినిధుల సభ జరిగింది. మూడవ స్టేట్‌డ్యూమాకై ఎన్నికల సమస్య ఒకటొచ్చింది; ఓమూల జార్‌ప్రభుత్వపు అనుచరులూ, మరోమూల దాష్నాక్‌లు, బన్‌డిస్టులు, * మెన్షివిక్కులు మొదలైనవారు రేపెట్టిన జాతీయకలహాన్ని అంతరింపచెయ్యడానికి అజర్బయిజాన్ - ఆర్మీనియనుభాషల్లో కరపత్రాలు ప్రకటించవలసివచ్చింది. వీటినన్నింటినీ మెన్షివిక్‌కేంద్రం అశ్రద్ధతో వదిలేసింది.

మాస్కోలోనూ, పీటర్సుబర్గులోనూవున్న నాయకత్వం వహించగల బోల్షివిక్ కేంద్రంలాంటిదాన్నే ఇక్కడకూడా ఏర్పరచాలనే సమస్యని శ్రామికుల ఎదట పెట్టేరు. పైనచెప్పిన జిల్లాలకిచెందిన నిర్మాణోపసంఘంవారు చేసిన నిశ్చయాన్ని మిగిలిన జిల్లాలుకూడా సమర్థించేయి. ఒక బోల్షివిక్‌కేంద్రం స్థాపించబడింది. బాకూలో శ్రామికవర్గోద్యమం విశేషంగా వ్యాప్తిపొందడానికి ఈకేంద్రం చాలా విశేషంగా తోడ్పడింది. ఈ కేంద్రనాయకత్వం ఒక్క చిన్నఘటన జరిగినా విపరీతమైన విప్లవోద్రేకంతో దానిని ఎదుర్కొనేది. ఆ కేంద్రంయొక్క కార్యాలలో స్టాలిన్ ముఖ్యపాత్ర వహించాడు.

మూడవస్టేట్‌డ్యూమా ఎన్నికలవిషయమై ఎన్నోజిల్లాలతరఫున 1907 ఆగస్టునెలలో ఒకకరపత్రం ప్రకటించేరు. శ్రామికవర్గాన్ని మోసగించడానికే జారిస్టుప్రభుత్వం ప్రకటించిందీ డ్యూమాని. నిరంకుశమైన జారిస్టు ప్రభుత్వంయొక్క అసహ్యకరమైన కుంటిఎత్తుల్ని బయటపెట్టటానికై శ్రామికులు జారిస్టు డ్యూమాలో నిజమైన ప్రజాప్రాతినిధ్యానికి అవకాశంలేకపోయినా వోటువెయ్యడానికి వెళ్ళాలని ఆ కరపత్రం నిర్దేశించింది. మళ్ళీ కొత్తపోరాటం ఆరంభించి, జార్‌ప్రభుత్వాన్ని కూలద్రోసి, డెమాక్రటిక్ రిపబ్లిక్‌ని స్థాపించుటకై శ్రామికులని తయారుచెయ్యడానికి బోల్షివిక్కులు ఎన్నికలలో పాల్గొన్నారు. 1905 అక్టోబరు,

డిసెంబరులలో - ఆ దివ్యదినాలలో తాము ఇచ్చిన విప్లవనినాదాలనే తాము అనుసరిస్తూన్నట్లు శత్రువులకి ప్రదర్శింపండని ఆకరపత్రం శ్రామికులని హెచ్చరించింది.

1907 ఆగస్టు 22 నాటి "గుదోక్" పేరువెయ్యకుండా 'సోషల్ డెమాక్రట్లమధ్య' ననే స్టాలిన్‌వ్యాసాన్ని ప్రకటించింది. స్టేట్‌డ్యూమా రద్దయి, విద్రోహశక్తుల విజృంభణసాగడం ప్రారంభంఅయినాక తమవర్గస్థితిని కోల్పోయిన వారిలోనూ, దొంగతనం - బందిపోట్లూ వృత్తిగాగల వారిలోనూ వ్యాపించడానికి అనుకూలత పొందిన అరాజకవాదుల విద్రోహభావాలని ఈవ్యాసం ఖండిస్తుంది. ఈ కరపత్రం శ్రామికులనూ, రైతులనూ శ్రామికులనిర్మాణాలలో చేరమని ప్రోత్సహించింది తమ ఆర్థికపరిస్థితులని బాగుపరచుకునేందుకు పోరాడమనీ, నిర్మాణాలలోచేరిన శ్రామికవర్గం నిర్ణయించుకున్న ఆదర్శాలని సాధించేటందుకు పోరాడమనీ హెచ్చరించింది.

నఫ్తాలాన్ కంపెనీలో పనిచేస్తూన్న ఖాన్‌లార్ అనే రాజకీయంగా ముందుకి వచ్చిన ఒక శ్రామికుడు 1907 సెప్టెంబరులో చంపబడ్డాడు. బీబీ - ఇబాట్ జిల్లా కమిటీ ఈ విషయంమీద స్టాలిన్ వ్రాసిన కరపత్రాన్ని ప్రకటించింది. ఖాన్‌లార్ లాంటి ముందుకివచ్చిన శ్రామికుల బాధ్యతలు అందులో వివరించబడ్డాయి. "ఖాన్‌లార్ వ్యవహారం మనవ్యవహారం. అతనిని కాల్చిన హంతకులు మనలని - ముందుకివచ్చిన శ్రామికులని కాల్చినట్లే. మనమీద కాల్చి ముందుకువచ్చిన శ్రామిక పంక్తుల్ని చిందరవందరచేసి, బాకూశ్రామికుల మెడకి ఉరిత్రాడు బిగించడానికి పెట్టుబడిదారుల బానిసలు ఊహిస్తున్నారు." అని ప్రబోధించబడింది. ఖాన్‌లార్‌ని చంపిన - జఫార్, అబూజర్‌బేక్‌లని డిస్మిస్‌చేసేదాకా పనిముట్లు ముట్టకండి అని కరపత్రం సలహాఇచ్చింది. రెండువారాలు సమ్మె ప్రకటించబడింది. ఈ సమ్మె యొక్క ప్రాముఖ్యత ఒక కరపత్రంలో ఈ దిగువవిధంగా వివరించబడింది: "ఖాన్‌లార్ దిక్కులేనివాడు కాదని మనం ప్రపంచానికి చూపిస్తాం. ముందుకి వచ్చిన ప్రతిశ్రామికుడికీ వెనకాల వేలకొద్ది శ్రామికులబలం వుంది. వారు తమ కామ్రేడ్స్‌నీ, నాయకుల్నీ, సంరక్షించుకోడానికి ధృఢప్రతిజ్ఞ పైకొన్నారు.

కొద్దిపాటి వాక్యాలలో ఖాన్‌లార్‌ని అద్భుతంగా చిత్రించిన ఒక పరామర్శ ప్రకటన 1907 అక్టోబరు 14 నాటి గుదోక్‌లో స్టాలిన్‌చేత ప్రకటించబడింది. "శ్రామికుని ఆత్మలోగల ఆవేశం, అగ్ని, రైతుయొక్క దుఃఖం, దుర్భరభారమూ అతదేకంచేసేడు;"

పార్టీయొక్క బాకూకమిటీ ఆత్మరక్షణదళాలని ఏర్పరచుకోవడం అవసరమా అనే సమస్యమీద 1907 ఆగస్టులో కామ్రేడ్స్‌కి (పార్టీసభ్యులకుమాత్రమే) ఒక జాబుని ప్రచారంచేసింది. శ్రామికులయొక్క పోరాటసంఘాలని, నాయకులని రద్దుచేసేసి వారినుంచి ఆయుధాలు తీసుకుని జాగ్రత్త పెట్టేందుకు ఒక కమిటీని నియమించేటందుకు మెన్షివిక్కులు ప్రయత్నించేరని మనం ఎరుగుదుం. పోరాట సంఘాలని రద్దుచేసేటందుకై లండన్‌కాంగ్రెసులో చెయ్యబడ్డ తీర్మానాన్ని మెన్షి

విక్కులు చూపించేరు. కాని, ముందుకువచ్చిన శ్రామికుల్ని బ్లాక్ - హండ్రెడ్లు హత్యచేసేటప్పుడు ఆత్మరక్షణచేసుకుందుకు ఆత్మరక్షణదళాలని నిర్మించుకో వద్దని లండన్‌కాంగ్రెసు నిషేధించలేదు. (ఖాన్లార్ ఒక్కడేగాక బోల్షివిక్కులయిన చుకిన్, విన్నెనిన్‌లూ, రైల్వేమండలంలోనూ, ఇతరమండలాలలోనూ ఎందరో పనివాడూ చంపివెయ్యబడ్డారు.) బాకూబోల్షివిక్‌కమిటీ ప్రకటించిన కరపత్రంలో చాటునబడీ, ఎదటబడీ హత్యలుసాగించే బ్లాక్ - హండ్రెడ్లనుంచి మన కామ్రేడ్స్‌ని రక్షించేటందుకై ఆత్మరక్షణ బలాన్ని వెంటనే నిర్మించేటందుకు నిర్ణయించినట్లు తెలియబరచింది. ఈ ఆత్మరక్షణబలానికి అవసరమైన నైతిక - పాదార్థిక సహా యాన్ని ఇవ్వమని బాకూకమిటీ శ్రామికులకి విజ్ఞప్తిచేసింది.

నాలుగో స్టేట్‌డ్యూమాలోని శ్రామిక ప్రతినిధులకోసం స్టాలిన్ మాన్‌డేట్ తయారుచేసేడన్నసంగతి అంతా ఎరుగుదురు. కాని, మూడో స్టేట్‌డ్యూమాలోని ప్రతినిధులకికూడా ఆయన మాన్‌డేట్ వ్రాసేడని చాలాకొద్దిమందికి మాత్రమే తెలుసు. బోల్షివిక్కులు విజయంపొందిన అయిదో (లండన్) కాంగ్రెసు (ర. సో. డె. లే. పా.) తీర్మానాలు ఈమాన్‌డేట్‌లో విస్తరించబడ్డాయి. 1907 సెప్టెంబరు 22 న బాకూ నగరంలోని శ్రామికుల క్యూరియా * ప్రతినిధుల మీటింగులో ఈమాన్‌డేట్ స్వీకరించబడింది. సోషల్ - డెమాక్రటిక్ ప్రతినిధులు స్టేట్‌డ్యూమాలో ఒక ప్రత్యేకదళంగా ఏర్పడాలనీ, వారొక ప్రత్యేకమైన పార్టీయొక్క ప్రతినిధులు కావడంచేత పార్టీతో అతి సన్నిహితసంబంధం కలిగివుండడం అవసరం అనీ, పార్టీనాయకత్వానికి అంగీకరించి సెంట్రల్‌కమిటీ సలహాల నంగీకరించాలనీ అది ప్రకటించింది.

స్టేట్‌డ్యూమాలోని ఈ దళంయొక్క ప్రధానకర్తవ్యం శ్రామికులకు వర్గ చైతన్యం కలుగజేయడానికి సహాయపడడమూ, కష్టజీవులయిన ప్రజలకు రాజకీయ నాయకత్వం వహించేటట్లు సాయపడడమూను.

కాడెట్లు, సోషలిస్టు - రివల్యూషనరీలు మొదలయిన యితరపార్టీలన్నింటికంటెనూ భిన్నమైన శ్రామికవర్గనీతివిధానాన్ని ఈదళం అచంచలంగా అనుసరించాలి. శ్రామికప్రతినిధులు స్టేట్‌డ్యూమాలోకి పోతూన్నది చట్టనిర్మాణకార్యాల కోసంకాదు. దానిని రివల్యూషనరీ ట్రిబ్యూన్‌గా వుపయోగించుకునేందుకే. మూడవ స్టేట్‌డ్యూమాలోని ప్రతినిధులకిచ్చిన మాన్‌డేట్ ఈ పద్ధతులమీదవుంది.

మూడవస్టేట్‌డ్యూమా ప్రారంభించినసందర్భంలో 1907 నవంబరులో ఒక కరపత్రం ప్రకటించబడింది. డ్యూమాలో జరుగుతూన్న ఘటనలని ప్రజాసామాన్యానికి తెలియచెప్తూ వుండేటూ, శాంతియుతంగా, రక్తంచిందించకుండా, పార్లమెంటరీ పద్ధతులలో వారి అభీప్సితాలని సాధించే ప్రయత్నాలు ఫలించలేదని పార్టీసంస్థలు ప్రజకి నిరూపించగలిగితేనూ, స్టేట్‌డ్యూమాలోని ఈ శ్రామిక ప్రతినిధులు తమపనిని విజయవంతంగా సాగించగలుగుతారని ఆ కరపత్రం చూపించింది.

నూనెపరిశ్రమలోని ఆఫీసుపుద్యోగుల, శ్రామికుల సమితి యజమానులతో సమావేశంలో పాల్గొనడానికి ప్రతినిధుల నెన్నుకునేందుకు 1908 ప్రారంభంలో మొట్టమొదటిసారి సమావేశం అయింది. బోల్షివిక్‌పార్టీకి మహాశ్రామికులలో పలుకుబడి ఎంతహెచ్చిందో ఈకాన్ఫరెన్సులో స్పష్టపడింది. నూనెయజమానులు ఈసమావేశాన్ని తమకి అనుకూలంగా నడిచేటట్లు చేసుకోవాలని వుద్దేశించేరు. కాని, తమ ఆశలు ఫలించవని తెలియగానే శ్రామికులలో పలుకుబడివున్న షాప్‌స్టీవార్డుల్ని తొలగించడం ప్రారంభించేరు సమ్మెచేసినవారిపై చర్యతీసికోనారంభించేరు. జాతియోద్రేకాలు పెంచబోయేరు. ఒక్కొక్కరినిగా విడదీసి అణిచివేసేటందుకై శ్రామికుల్ని విడివిడిపోరాటాలు ఆరంభించేటట్లు చేసేటందుకై రెచ్చగొట్టబోయేరు.

1908 మార్చి 9 న వచ్చిన బోల్షివిక్కుల గుదోక్ 22 వ సంచికలో స్టాలిన్ 'నూనెగనుల యజమానులు తమ ఎత్తుగడలని మార్చేరు' అంటూ వ్యాసం వ్రాసేడు. కాన్ఫరెన్సులో నూనెయజమానులు తమ ఎత్తుగడల్ని ఏవిధంగా మార్చేరో ఈవ్యాసం విశదపరచి, శ్రామికులంతా నూనెపనివారి యూనియన్‌ని సమర్థించాలనీ, వేరువేరుగా సమ్మెలు చేయకూడదనీ, విడివిడిసమ్మెలద్వారా తమ శక్తిని క్షయింపచేసుకోకూడదనీ, వెంటనే షాప్‌స్టీవర్డ్సు కౌన్సిలుని సమావేశపరచాలనీ హెచ్చరించింది.

సర్వవ్యాపిత సమ్మెనుగూర్చి సమాలోచించడానికై బాకూ నూనెమండలాలలోని ర. సో. డె. లే. పా. సంస్థలు 1907 ఆగస్టులో సమావేశం అయినాయి. శ్రామికులలో గందరగోళంపుట్టించి, సమ్మెరాకుండాచెయ్యడానికై నూనెగనుల యజమానులు తమ ఏజంట్-ప్రొవోకేటర్లద్వారా 'కాన్ఫరెన్సు'కి రమ్మని శ్రామికులకి కబురుపెట్టేరు. ఈ కాన్ఫరెన్సుకి హాజరుకావాలా, వద్దా అనేది ఇక్కడ చర్చించబడి, వెళ్ళకూడదని నిర్ణయించబడింది. సర్వవ్యాపితసమ్మె జరపడానికే నిర్ణయించి, పార్టీసభ్యులంతా సమ్మెనుగూర్చి ప్రచారంచెయ్యడానికి శ్రద్ధగా పని చెయ్యాలని తీర్మానించబడింది.

ఆరోజులలో నూనెధర హెచ్చుగా వుండడంచేత నూనె యజమానులు హెచ్చునూనె వుత్పత్తిచెయ్యడానికి తీవ్రపడుతున్నారు. శ్రామికులు సమ్మె చెయ్యడానికిది మహాఅనుకూలమైన సమయం. పదమ్ముగ్గురితో ఒకకమిటీని బోల్షివిక్కులు ఏర్పరచేరు. ఈసభ్యులు షాప్‌స్టీవార్డుల మీటింగ్‌లో ఎన్నుకోబడ్డవారే. యజమానులూ, వారిఏజంట్లూ శ్రామికులకి 'బోనసు' లిస్తామనిచెప్పి మభ్యపెట్టబోయేరు. ఈ ఊరడింపులకీ, పెట్టుబడిదారుల దయాధర్మభిక్షలకీ విరుద్ధంగా బోల్షివిక్కులు తీవ్రప్రచారంచేసి, శ్రామికులకి జీతాలు హెచ్చించబడాలనీ, వారి వాస్తవికపరిస్థితులలో వృద్ధికలగచెయ్యబడాలనీ కోరేరు.

పెట్టుబడిదారులు సూచించిన సమావేశానికి వెళ్ళకూడదని బాకూకమిటీ మొదట్లో నిర్ణయించింది. "సమావేశాన్ని బహిష్కరించండి" అనేపేరుతో 1907

సెప్టెంబరు 29 న "కో...." (కోదా) పేరున గుడోక్‌లో ఒకవ్యాసం వచ్చింది. అందులో స్టాలిన్ ఇల్లాగ వ్రాసేరు ; "కాన్ఫరెన్సుకి వెళ్ళడమూ, మానడమూ అనేది సమస్యకాదు. ప్రతికాన్ఫరెన్సునీ బహిష్కరించవలసిందేనని మనం ఒకేమాటు తీర్మానించుకుని కూర్చోలేము. ....అన్ని కాన్ఫరెన్సులకీ హాజరవుతామని కాడెట్‌ల పూహాల్ని అనుసరించే కొందరు కామ్రేడ్సుమాదిరిగా ఒకేపర్యాయం తీర్మానించ లేము. అసలు నిజఘటనలని – అసలు పరిస్థితులను దృష్టిలోపెట్టుకుని హాజరయ్యేదీ, బహిష్కరించేదీ తేల్చుకుంటాం."

1908 జనవరి, ఫిబ్రవరులలో బాకూలో చాలాసమ్మెలు జరిగేయి; వీనిలో చాలావరకు జయంపొంది, బోల్షివిక్కుల పలుకుబడిని హెచ్చించేయి. 1908 మార్చి 2 న ప్రకటించబడ్డ గుడోక్ 21 వ సంచికలో ఈ సమ్మెల ఫలితాల నన్నింటినీ క్లప్తీకరించి, కాటో అనేపేరుతో స్టాలిన్ 'ఈమధ్యవచ్చిన సమ్మెలు ఏం చూపుతున్నాయి?' అనేవ్యాసం వ్రాసేరు. జాగ్రత్తగా నిర్మించుకొంస్తే, నూనె పనివారి యూనియన్ పూర్తిగా బలంగచేసుకుని పనిచేస్తే, పట్టుదలగా సాగించ బడితే, మంచి అనుకూలసమయం చూసుకుని సమ్మె ప్రారంభిస్తే, ఏకాకిగా బయలుదేరిన సమ్మెలుకూడా మంచిఫలితాలని సాధించగలవనీ, ఉద్యమానికి ఉపయుక్తాలుగా వుండగలవనీ ఈ సమ్మెలు చూపించేయని వ్యాసంలో నిరూపించ బడింది.

శ్రామికుల అభీప్సితాలు వినడానికి పూనికపడని సమావేశాలని బహిష్క రిస్తూ, 1907 ఆకురాలుకాలంలో బోల్షివిక్కులు ఏకాన్ఫరెన్సుకి రావాలన్నా ముందు ఈషరతులకి అంగీకరించాలని నాలుగుకోరికలని ఎదుటపెట్టేరు :

(1) వారి అభీప్సితాలనిగురించి సమాలోచించేహక్కు ;

(2) రాబోయే షాప్‌స్టీవర్డ్సు కౌన్సిలుకి మీటింగులు పెట్టుకొనేహక్కు ;

(3) తమ యూనియనులని తమకోసం వుపయోగించుకోగల హక్కు ;

(4) సమావేశం జరగవలసిన తేదీని నిర్ణయించుకునే హక్కు ; (నెం. 5 బాకిన్‌స్కీ ప్రొలిటేరీలో ప్రచురించబడ్డ "సమావేశమూ : శ్రామికులూ" అనే స్టాలిన్ వ్యాసంలోది.)

సోషలిస్టు - రివల్యూషనరీలూ, మెన్షివిక్కులూ, దాష్నాక్‌లూ బోల్షివిక్కుల సూచనలని ఎదిర్చేరు. ఏవిధమైన హామీయూ లేకపోయినాసరే కాన్ఫరెన్సుకి హాజరు కావలసిందేనని మెన్షివిక్కులు చెప్పేరు. "ఏమైనాసరే కాన్ఫరెన్సు కావాల"ని వారి నినాదం. శ్రామికవర్గంలో అభిప్రాయాల్ని తమవేపుకి తిప్పుకోగలమనే ఆశ అంతరించగానే సోషలిస్టు - రివల్యూషనరీలూ, దాష్నాక్‌లూ కలిసి సమిష్టిగా 'ఏమైనాసరే బహిష్కరించాలిసిందే' నసే నినాదం ఇచ్చేరు. ఈ నినాదాలకి వ్యతి రేకంగా "హామీలుంటే కాన్ఫరెన్సు : లేకా అసలేలేదు." అనే నినాదాన్నిచ్చేరు. శ్రామికులలో ఈనినాదాలు ప్రచారంచెయ్యబడ్డాయి. వాటి ఫలితాలివిగో: "మొత్తం 35 వేలమంది శ్రామికులలో ప్రచారం జరిగింది. వారిలో 8 వేలమంది సోషలిస్టు-

రివల్యూషనరీల. దాష్నాక్‌ల ఎత్తుగడలకి (పూర్తి బహిష్కరణ) వోటుచేసేరు. 8 వేలమంది మెనివిక్కులం ఎత్తుగడలకి (షరతులులేనికాన్ఫరెన్సు) వోటుచేసేరు. 19 వేలమంది బోల్షివిక్కులకి (షరతులతోకూడిన కాన్ఫరెన్సుకి) వోటుచేసేరు." (యల్. బెరియా పుస్తకంలోంచి)

1907 ఆఖరురోజుల సంగతి యిది. ఆనాటికి దేశం మూలమూలలా విద్రోహశక్తులు తాండవిస్తూన్నాయి. స్టోలిపినిజం మంచి వుచ్ఛస్థితిలో వుంది. అయినా బాకూ శ్రామికులలో అధికసంఖ్యాకులు బోల్షివిక్కుల నాయకత్వాన నడుస్తున్నారు. యజమానులకి అందించవలసిన్న అభీప్సితాలని నిర్ణయించేటందుకై జరిగిన నూనె గనుల రిఫైనరీల షాపుస్వీవార్డుల మీటింగులో శ్రామిక ప్రతినిధుల విధానాలని బోల్షివిక్కులు నిర్ణయించేరు. "రష్యాఅంతటా విద్రోహశక్తులు తాండవించి పోతూన్నరోజుల్లో బాకూలోని కూలీపార్లమెంటు రెండువారాలు వరసగా కామ్రేడ్ క్రోనోవ్ అనే బోల్షివిక్కు ఆధిపత్యాన సమావేశం అయింది. ఈ పార్లమెంటులో బోల్షివిక్కుల శ్రామికుల అభీప్సితాలని నిర్ణయించి వారి కనీసపక్షకార్యక్రమం కోసం విశేషంగా ప్రచారం సాగించేరు." (పై పుస్తకమే.)

• బాకిన్‌స్కీ ప్రొలిటారీపత్రిక 1908 ఏప్రియల్ 15 న "ఈనాటి విద్రోహశక్తులూ : మన ఎత్తుగడలు" అనే వ్యాసాన్ని ప్రకటించింది. వ్రాసినవారి పేరు లేకుండా. రాజకీయవిద్రోహశక్తులనే నీలమేఘాలు బాకూని ఆవరించివున్నాయని ఆ వ్యాసం వ్రాసింది. శ్రామికవర్గం అద్భుతమైన విజయాన్ని సాధించింది. కాని వాటిని నిలబెట్టుకోలేక పోయింది. రైతాంగంశ్రామికులకి సహాయపడవలసింది. కాని, అల్లా చెయ్యలేకపోయింది. క్లాక్ - హంద్రెడ్ల ప్రభుత్వం ఈ అవకాశాన్ని తీసుకుని శ్రామికవర్గంమీద దండయాత్ర ప్రారంభించింది. ఒక్కొక్కఅడుగే ముందుకివేస్తూ శ్రామికవర్గం అక్టోబరులో సంపాదించిన విజయాలని లాగేసుకుంటూంది : పత్రికాస్వాతంత్ర్యం, సభాస్వాతంత్ర్యమూ పూర్తిగా లాగేస్తూంది.

ఈ అవస్థ ఎంతోకాలం వుండదనీ, కొత్త - పాతరక్తాలనడుమ తీవ్రసంఘర్షణ, పునర్విప్లవమూ రాక తప్పదనీ స్టాలిన్ చెప్పేడు. విప్లవం మళ్ళీరావాలంటే దానిని రప్పించడానికి తీవ్రమైన ప్రయత్నాలు చెయ్యాలి. అందుచేత రహస్య నిర్మాణాలతోనే పని చాలదు. అన్నివిధాలయిన చట్టబద్ధ కార్యక్రమాలని అంటే ట్రేడ్‌యూనియన్లలో, కో-ఆపరేటివ్‌సొసైటీలలో, మిగిలిన చట్టబద్ధములూ, తత్తుల్యాలూ అయిన శ్రామికపక్షసంస్థలలో పని చెయ్యవలసివుంటుందని స్టాలిన్ నిర్దేశించేడు.

పల్లెటూరి శ్రామికులలోనూ, శ్రామికులతో తుల్యులైన పల్లెటూరి పేదరైతులలోనూ విశేషమైన్న ఆందోళనా, నిర్మాణమూ సాగించాలని బాకిన్‌స్కీ ప్రొలిటారీ వ్రాసింది.

1908 జూలైనెలలో బాకిన్‌స్కీ ప్రొలిటారీయొక్క అయిదవసంచిక అనుబంధములో స్టాలిన్ కోబాపేరున "సమావేశమూ : శ్రామికులూ" అనేవ్యాసాన్ని

ప్రకటించేము. నూనెగనుల యజమానులు సూచించిన కాన్ఫరెన్సువిషయమై ప్రచారం నిలిపివెయ్యబడింది. అభీప్సితాలని నిర్ణయించేటందుకై నిర్మించబడిన షావ్‌స్టీవర్‌ట్స్ కౌన్సిలుయొక్క కార్యక్రమాలూ, ఈకౌన్సిలుని సమర్థించేటందుకై శ్రామికులని సమకూర్చే కార్యక్రమమూ నిలిపివెయ్యబడింది.

"టిప్లిస్‌వాసిమైన ఆమునిలి, మూర్ఖుడు జున్‌కోవస్కీ 'ఆట' ముగిసిందని ప్రకటించేదు. మలిమాలిన కారామూర్జా - పెట్టుబడివారుల భృత్యుడు లతనికి తాళం వేస్తూన్నాడు. తెరవడింది. నూనెయజమానులూ, కూలీలూ లమస్థానాలలో సమయంకోసం వేచివుండి కొత్తకుపానులకి, ఘర్షణలకీ తయారవుతూవుండే ఆ పాతదృశ్యమే మళ్ళీ కనబడుతూంది" అన్నాడు స్టాలిన్ ఆవ్యాసంలో.

కాన్ఫరెన్సు చరిత్రఅంతా ఆ వ్యాసంలో సమాలోచనచెయ్యబడింది. అది ఏయేదశలు గడిచి ముందుకి నడిచిందో విమర్శించబడింది. శ్రామికులు పోల్లి విప్కాల మాటలనేగాని, తమమాటలు నమ్మరని నూనెయజమానులకి విశ్వాసం కలగడంచేత ఇంక కాన్ఫరెన్సుని భగ్నంచెయ్యడానికే సంకల్పించేరని నిరూపించ బడింది.

సర్వవ్యాపితసమ్మెని శ్రామికులచేత ప్రకటింపచెయ్యాలని నూనె యజమానులు వాంని రెచ్చగొడుతూన్నారు. ఈఎత్తుల్ని భగ్నం చెయ్యడానికి అవలంబించ వలసిన ఎత్తులేమిటి? సర్వవ్యాపితసమ్మెకి పరిస్థితులేవీ అనుకూలంగా లేవు. అల్లాగని శ్రామికులు వేరువేరు కర్మాగారాల్లో విడివిడిసమ్మెలు సాగించడానికి అభ్యంతరం లేదు. పైగా ఈ కాన్ఫరెన్సుని సాగించడానికై ఎన్నుకోబడ్డసంస్థల పలుకుబడి నిలబెట్టుకోవలసిన అగత్యం ఒకటుంది.

ఈ సమయంలో ఏజెంట్ - ప్రొవొకేటర్లు వెనకబడివున్న శ్రామికుల్ని రెచ్చగొట్టి అరాజకాన్నీ, దొమ్మీలనీ రేపడానికి ప్రయత్నిస్తూన్నారు. అప్పుడే శ్రామికుల్ని అణిచివెయ్యడానికి వంక దొరుకుతుంది. కాని, గూడోక్‌లోని సంపాదకీయవ్యాసం ఆర్థికవిశృంఖలత్వం : శ్రామికవర్గోద్యమం" అనేది (నెం. 25, 1908.) ఈమాదిరి పోరాటాన్ని తీవ్రంగా నిరసించి, శ్రామికప్రజోద్యమపద్ధతుల నవలంబించమని శ్రామికుల్ని కోరింది.

ఈ కఠినదినాలలో బాకూలోవుండి స్టాలిను విప్లవకరమైన మార్క్సిస్టు సిద్ధాన్నిాని లెనిన్‌విధానాన్ని, అడుగురప్పకుండా అనుసరిస్తూ అపర్యాప్తనిష్ఠులైన 'అతివాదు'లతోనూ, మితవాదులతోనూకూడా అవిరామంగా పోరాడేరు.

ఆకాలంనాటి బాకూనిర్మాణాలకిగల ప్రాముఖ్యతనీ, బాకూశ్రామికుల కార్యక్రమాలకి లెనిన్ ఇచ్చిన విలువనీ ఈదిగువ వాక్యాలనుంచి మనం తెలుసుకో వచ్చును. "విశేషసంఖ్యాకులయిన సమ్మెదారుల్ని కలిగి బాకూరాష్ట్రం ఇతరరాష్ట్రాల కగ్రభాగంలో నిలచివుంది 1908లో. 47 వేలమందికూలీలు అప్పుడు సమ్మెలలో వున్నారు. ప్రజాసామాన్యంపాలుగొన్న రాజకీయసమ్మెలలో అదే ఆఖరుది. ('రష్యాలోని సమ్మెలనుగూర్చిన అంకెలు', కలక్టెడ్ వర్క్సు సం. 15)

1908 మార్చి 25 న స్టాలిన్ అరెస్టుతో ఆయనకార్యక్రమం నిలచిపోయింది. ఆయనని బైలోవ్ జైలుకి తీసుకెళ్ళేరు. అక్కడినుండి బయటనున్న కామ్రేడ్స్‌తో సంబంధాలు ఏర్పరచుకుని క్షణంకూడా వూరుకోకుండా పనిచేస్తూ శ్రామిక పత్రికలకు వ్యాసాలెన్నో వ్రాస్తూండేవాడు. జైలులోవుండే బాకిన్స్కీ ప్రొలిటారీ రెండవ సంచిక నించుమించుగా అంతనీ ఆయనే సమీకరించేడు. రాజకీయ నిర్బంధితుల చేత ఆయన గౌరవించబడేవాడని స్టాలిన్‌తోపాటు ఆరోజులలో జైలులోవున్నవారి నుంచితెలుస్తూంది. విప్లవపోరాటానికి సంబంధించిన సిద్ధాంతాలూ, కార్యక్రమాలూ మీద ఆయన మెన్షివిక్కులతోటీ. సోషలిస్టు - రివల్యూషనరీలతోటీ వాగ్వాదాలు ఏర్పాటుచేసేవాడు.

విప్లవం బాగా విజృంభించుతూ వున్నప్పుడు జైలుఅధికారులు ఖైదీలమీద సౌమ్యంగా వ్యవహరించేవారు. వారిప్పుడు అంతకంతకీ కఠినమయిన పద్ధతుల నవలంబిస్తూన్నారు. రాజకీయఖైదీలు దీనికి అసమ్మతి తెలిపేరు. జైలులోకూడా జారిస్టుప్రభుత్వంతో పోరాటం నిలపనివారిలో స్టాలిన్ ఒకడు. జైలు అధికారులు రాజకీయఖైదీలకి 'ఒకపాఠం నేర్పుదా'మని, వారిని అణిచేటందుకు సాల్యాంస్కీ రెజిమెంటునుంచి ఒకకంపెనీని తీసుకొచ్చేరు. రాజకీయఖైదీలని బయటికితెచ్చేరు. వారిని గాన్ట్‌లెట్ * ననుభవించడానికి నడిపించేరు. సైనికులు రెండుపంక్తుల్లో నిలవబెట్టబడ్డారు. వారిమధ్యనుంచి ఖైదీని నడిపిస్తూంటే, సైనికులు రైఫిళ్ళ మడమలతో బాదుతూన్నారు. ఒకమూల దెబ్బలు వర్షంలా కురుస్తూన్నా స్టాలిన్ తలవొంచలేదు. చేతిలో కారల్‌మార్క్స్ పుస్తకం ఒకటితీసుకుని. నడిచేడు. ఎన్ని కష్టాలున్నా బాధలకి భయపడకుండా. మార్క్సిజం విజయం పొందితీరుతుందనే విశ్వాసంతో దానిని సగర్వంగా, నిర్భయంగా నిజమైనబోల్షివిక్ ముందుకి తీసుకుపోతాడని చూపించేడు

ఎనిమిదినెలల నిర్బంధశిక్ష అయినాక, స్టోలిపిన్ విద్రోహశక్తులు మంచి వృద్ధిలోవున్న రోజులలో ఆయనకి సోల్వీచెగోడ్స్క్‌లో ప్రవాసశిక్షని అనుభవించ విధించేరు. కాని, 1909 జూన్ 24 న ఆయన తన కంతవరకూ 'ఆతిథ్యం' ఇచ్చిన ఆ నగరాన్ని వదిలి ఓగానెస్ టోటోమ్యాన్ట్సు అనేపేరుతో బాకూకి తిరిగివచ్చేడు.

బాకూకి తిరిగి రాగానే మళ్ళీ ఒక రహస్యముద్రాయంత్రాన్ని నెలకొల్పడానికి ప్రయత్నాలు ప్రారంభించేడు. విద్రోహశక్తులు బలంగావున్నా బాకూకమిటీలోవుండి పనిచేసి. ఒక ప్రచారకదళాన్ని తయారుచేసేడు. ఈ విషయంలో ఆయన ఎన్నో నగరాలకి వెళ్ళవలసి వుండేది. టిఫ్లిస్‌పోయి బోల్షివిక్‌పార్టీ సమావేశం జరపడానికి ఏర్పాట్లు సాగించేడు. ఆయన లిక్విడేటర్లనీ * ఓట్జోవిస్టుల్నీ * ఎదిరించి పోరాడేడు. బాకూలోని అనేకజిల్లాలలోవున్న సంస్థల (రైల్వేమండలం. చెర్నీ గోరోద్, బెలీ గోరోద్) కార్యక్రమాలని ఆయన నడిపించేడు. ఇక్కడ కూడా ఆయన విశేషమైన కుశాగ్రబుద్ధినీ. ఉద్యమంలో అప్పటికప్పుడు ఎదుర్కొనే నూతనసమస్యల నూహించగలశక్తినీ ప్రదర్శించేడు. 1910 జనవరి

నాటికి శ్రామికవర్గోద్యమం తిరిగి తల ఎత్తగల సూచనలు మొదటిసారు గనబడ్డ ప్పుడే టిఫ్లిస్కీ ప్రొలిటారీ మొదటిసంచికలో "నూతన విజృంభణలు కనబడు తూన్న సమయంలో వున్నాం...." అని వ్రాసేడు.

ప్రజలలో జీవించి, వారి మనస్తత్వాలను పూర్తిగా గ్రహించిన ఒక గొప్ప బోల్షివిక్ విప్లవకారుని కుశాగ్రబుద్ధి యిది. ఘటనలన్నింటినీ జాగ్రత్తగా కని పెడుతూ, చుట్టుప్రక్కలగల పరిస్థితులలో వస్తూన్న మార్పుల్ని గుర్తుపెట్టుకుంటూ వచ్చిన ఒక విప్లవకారుని కుశాగ్రబుద్ధి యిదే.

1910 ఫిబ్రవరి 26 న సోషల్ - డెమాక్రట్‌లో ప్రచురించబడ్డ స్టాలిన్ యొక్క 'కాకేషస్ జాబులూ' 1910 జూన్ 24 నాటి సమాలోచనాపత్రమూ కాకేషస్‌లో నడుస్తూన్న ఘటనలని సవిస్తరంగా చిత్రించేయి. అవి పరిస్థితుల నిజస్థితిని తెలియబరచి, లిక్విడేటర్లు, మెన్షివిక్కులు, బన్డిస్టులు, తదితర అప దూర్చునిస్టులతోడి పోరాటంలో దివ్యాయుధంలాగ వుపకరించేయి. శ్రామికుల ఎదుట మెన్షివిక్కులగుట్టు బట్టబయలుచేస్తూ స్టాలిన్‌వ్రాసే వ్రాతలతో లిక్విడేటర్లు మహా కుపితులయ్యేరు.

ఈరోజులలో లెనిన్ - స్టాలినులమధ్య తరుచుగా ఉత్తరప్రత్యుత్తరాలు సాగుతూనేవచ్చేయి. ఇవి వారిరువురిమధ్యాగల రాజకీయబంధాలని మరింత దృఢ పరచేయి.

ఈపర్యాయం ఎనిమిదినెలలకంటె హెచ్చుగా స్టాలిన్ బయటవుండలేక పోయేడు. 1910 మార్చి 23 న బాకూలో ఆయన అరెస్టుచెయ్యబడ్డాడు. 1910 సెప్టెంబరు 23 వరకూ జైలులోవుంచి తర్వాత మూడోపర్యాయం సోల్విచెగోస్క్‌కే తిరిగి ప్రవాసానికి పంపేరు. అక్కడ 1911 జూలై 6 వరకూ వున్నాడు.

సోల్విచెగోస్క్‌లో ఆయన నివసిస్తూండిన చిన్నయింటిభాగం రాజకీయ ప్రవాసితులకి కేంద్రంగా వినియోగించింది. ఆయింట ఉపన్యాసా లివ్వబడుతూన్నా యనీ, ఆదేశా లందచెయ్యబడుతున్నాయనీ, విప్లవప్రచారం జీర్ణించుకోబడుతూందనీ పోలీసులు తమ ప్రధానకార్యాలయానికి రిపోర్టుచేసేరు. ఇక్కడనుంచే స్టాలిన్ లెనిన్‌కి పెఖనోవ్‌పార్టీ-సహాయకులతో ఒకదళంగా కూడే ఆయన నీతికి తన అంగీకారాన్ని తెలుపుతూ జాబువ్రాసేడు. ఏమంటే ఈమైత్రికి ఒకనీతివుంది. నీతి అనేదిలేని ట్రాట్స్కీదళం యెడల స్టాలిన్ అసహ్యం వెలిబుచ్చేడు. ప్రభుత్వ నిషేధంలేని వార్తాపత్రికని స్థాపించడం చాలాప్రధానం అనికూడావ్రాసేడు. తర్వాత కొద్దిరోజుల్లో 'జ్వెజ్దా' (తార) ప్రారంభించబడింది. బోల్షివిక్‌నిర్మాణం బలపరచ బడాలనీ, రష్యాలోని సెంట్రల్‌కమిటీ బ్యూరోలాంటిదే స్థాపించబడాలనీ స్టాలిన్ కోరేడు. సెంట్రల్‌కమిటీలోని కొందరు ప్రధానవ్యక్తులు రష్యాలోనే ఒకదళంగా ఏర్పడి, దేశం అంతటిలోనూ పార్టీకార్యక్రమాన్ని నడిపించడం అవసరం అని సలహాఇచ్చేడు. ఇంక తనని గురించివ్రాసుకుంటూ, "ఇంక ఆరునెలలు గడపాలి. ఆ కాస్త కాలమూ గడిచిపోతే ఇంక పూర్తిగా నేను మీవాడినే. కాని, ప్రజల

అవసరం అంత హెచ్చుగావుంటే. నేను ఇప్పుడే లేచివస్తా"నంటూ వ్రాసేడు. స్టాలిన్ ఎప్పుడుపడితే అప్పుడే ఒక్కుదులుపుకుని, ప్రవాసంనుంచి పారిపోవడానికి తయారని మనం ఎరగనే ఎరుగుదుం.

1911 జూన్‌లో జరిగిన సెంట్రల్‌కమిటీసమావేశంలో స్టాలిన్ ర. సో. డె. లే. పా. యొక్క అఖిలరష్యానమావేశాన్ని కూర్చేటందుకు నియమించబడ్డ కమిటీలో సభ్యుడుగా నియమించబడ్డాడు. విదేశాలలో ప్రకటించబడుతూన్న బోల్షివిక్‌పత్రిక సోషల్-డెమాక్రట్‌కి లిక్విడేటర్లని వ్యతిరేకిస్తూ స్టాలిన్‌వ్రాసిన వ్యాసాలని లెనిన్ బాగామెచ్చుకున్నాడు.

ఈరోజులలోనే స్టాలిన్ ప్రవాసాన్నుంచి తప్పించుకుని ప్రేగ్ కాన్ఫరెన్సు తయారీలలో మునిగివున్నాడు. వొలోగ్దాలో వుండగా ప్రవాసశిక్షకాలం ముగిసిన చిజికోవ్ అనే ఆయన ప్యాస్‌పోర్టు సంపాదించి, దీనిమీద పీటర్సుబర్గుకి బయలు దేరేడు. త్వరలోనే మళ్ళీ అరెస్టుచేసి ఒక మూడు నెలలపాటు బందీగా వుంచి ఈమాటు వొలోగ్దారాష్ట్రానికి ప్రవాసం పంపేరు.

1912 జనవరినెలలో ప్రాగ్‌లో జరిగిన ర. సో. డె. లే. పా. యొక్క అఖిల రష్యన్ కాన్ఫరెన్సుకి స్టాలిన్ విశేషప్రాముఖ్యత నిచ్చేరు. "మన పార్టీ చరిత్రలో ఈ కాన్ఫరెన్సుకి చాలా గొప్ప ప్రాముఖ్యత వుంది. ఇందులోనే బోల్షివిక్ మెన్షివిక్ పార్టీలమధ్య సరిహద్దుగీతలు వెయ్యబడినాయి. దేశం నాలుగు మూలలావున్న బోల్షివిక్ నిర్మాణాలని ఒకేఒక సమ్మిళిత బోల్షివిక్‌పార్టీగా కూర్చబడ్డాయి. (సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ (బోల్షివిక్) పదిహేనో కాన్ఫరేన్సులో జరిగిన వాదప్రతివాదాలకి సమాధానంగా ఇచ్చిన వుపన్యాసంలోంచి)

ఎట్టకేలకి మెన్షివిక్కులు పార్టీనుంచి తరిమివెయ్యబడ్డారని లెనిన్ చాల ఆనందించేడు. గోర్కీకి ఒకజాబు వ్రాస్తూ అందులో "ఆఖరుకి మనం నెగ్గేం. లిక్విడేటరు నిర్భాగ్యు లెంత తన్నుకున్నా పార్టీని, సెంట్రల్‌కమిటీని తిరిగి నిల బెట్టేం. ఈ విషయం మీకూ సంతోషకరమేనని తలుస్తున్నా" నన్నాడు. (లెనిన్ కలక్టెడ్ వర్క్సు :| సం. 29)

ఈ కాన్ఫరెన్సులో స్టాలిన్ లేకపోయినా సెంట్రల్‌కమిటీకి ఎన్నుకోబడ్డాడు. రష్యన్‌బ్యూరో అధ్యక్షుడుగా నియమించబడ్డాడు. సెంట్రల్‌కమిటీకి ఎన్నుకోబడ్డాక ప్రవాసంలో ఏలాగవుండగలడు ? అది ఆయన స్వభావమేకాదు. అందు చేత వెంటనే వొలోగ్దానుంచి తప్పించుకున్నాడు. కొంతకాలంపాటు స్టాలిన్‌నుంచి జాబులేవీ రానందుకు లెనిన్ కంగారుపడ్డాడు. లెనిన్ స్టాలిన్‌ని బాగా పదచేస్తూన్న వారిలో అగ్రగణ్యుడుగా లెక్కించేడు. 1912 మార్చి 28 న వ్రాసినజాబులో (ఇది పోలీసుచేతిలో పడింది.) ఎంతో ఆతురతతో "ఇవానోవిచ్ సంగతి ఏమన్నా తెలిసిందా ? ఆరోగ్యంగా వున్నాడా ? ఎక్కడున్నాడు ? ఎల్లావున్నాడు ?" అని కనుక్కున్నాడు.

ప్రవాసంనుంచి తప్పించుకున్నాక ప్రాగ్‌కాన్ఫరెన్సు తీర్మానాలని దృఢపరచ డానికై ఎన్నో జిల్లాలలో తిరిగితిరిగి పీటర్సుబర్గు తిరిగివచ్చేడు. సరిగ్గా అప్పుడే లీనా బంగారుగనుల కాల్పులసంగతి ప్రపంచానికి తెలిసింది. పోలెటాయావ్ మొద లైనవారి సహాయంతో ఆయన 'ప్రవదా' ప్రారంభించేడు. 1912 లో పీటర్సుబర్గు బోల్షివిక్‌పత్రిక-జ్వెజ్డాలో లీనాఘటనలనుగూర్చి స్టాలిన్ ఒక వ్యాసం వ్రాసేడు. ఆ ఘటనల విప్లవకర ప్రాముఖ్యతను తెలియచెప్పుతూ,

"లీనాకాల్పులు దేశంలో అశాంతి రేకెత్తించాయి. ప్రజోద్యమప్రవాహం బయలుదేరింది. శాంతిఅనే మంచుకరిగి విప్లవమనే ప్రవాహం ప్రారంభమయింది" ఈనాటి ప్రభుత్వంలోవున్న దుర్మార్గమూ, క్రౌర్యమూ, చిరకాలంనుంచి బాధ పడుతూన్న రష్యాయొక్క బాధలు ఒక్కఘటనలో లీనాఘటనలలో మూర్తీభవించి వున్నాయి. అందుచేతనే లీనాకాల్పులు సమ్మెలకీ ప్రదర్శనాలకీ ఒక సిగ్నల్ మాదిరిగా పనిచేసాయి" అని వ్రాసేడు.

ప్రవదా మొదటిసంచిక వెలువడ్డరోజున 1912 ఏప్రియలు 22 న స్టాలిన్ తిరిగి అరస్టుచెయ్యబడ్డాడు. అతడు ఎక్కడ వుంటూన్నదీ, ఎక్కడికి వెడుతూ న్నదీ బాగాతెలిసిన ఏజంటు - ప్రొవోకేటర్లు ద్రోహంచేసేరు. జార్‌ప్రభుత్వం అయిదోమారు ప్రవాసానికి పంపగలిగింది ఈమారు బాగావుత్తరాన పడమటి సైబీరియాలో నారిమ్‌లో మూడేళ్ళప్రవాసశిక్ష ననుభవించేటట్లు విధించబడింది. సెంట్రల్‌కమిటీ సభ్యుడుగా తనకర్తవ్యాన్ని నిర్వహించేటందుకై ప్రవాసంనుంచి తప్పించుకుందుకు ఎన్నోప్రయత్నాలు చేసిచేసి, చివరికి 1912 ఆకురాలుకాలంలో సఫలుడయ్యేడు.

విద్రోహశక్తులు విజృంభమాణంగావున్న కాలంలో ఆయన చేసినపనులు అమూల్యాలు. విద్రోహశక్తులు ప్రబలంగావున్నప్పుడు బాకూలో పనిచేసి, శ్రామిక వర్గపంక్తులలోనిలబడి విప్లవకార్యక్రమాన్ని సాగించకుండా నిజమైనబోల్షివిక్కుని ఎటువంటి దుష్టప్రభుత్వమూకూడా ఆపలేదని నిరూపించేడు ఈకాలంలో స్టాలిన్-లెనిన్‌లమధ్యగల మైత్రీబంధాలు మరింతదృఢపడ్డాయి.

అఖిలరష్యా బోల్షివిక్‌వుద్యమంలో ప్రధాననాయకులలో స్టాలిన్‌ఒకడయ్యేడు. ప్రాగ్‌కాన్ఫరెన్సుకు ఏర్పాట్లుచేసేటందుకుపనిచేసేడు. ఈకాన్ఫరెన్సే బోల్షివిక్‌పార్టీకి నిర్మాణాత్మకంగా ఒకరూపాన్నిచ్చింది. సెంట్రల్‌కమిటీ సభ్యుడుగా ప్రజలలో విస్తారంగా ప్రచారంపొందిన మొదటి బోల్షివిక్‌పత్రిక ప్రవదాని స్థాపించేడు. ఈ పత్రికకిగల ప్రాముఖ్యత అనంతం. అప్పుడే తలఎత్తుతూన్న విప్లవవిజృంభణకి ఈపత్రిక విశేషంగా దోహదంచేసింది.

# సామ్రాజ్యవాదయుద్ధం

విప్లవోద్యమానికి విశేష ప్రోద్బలాన్ని ఇచ్చిన లీనాబంగారుగనుల కాల్పుల వార్తలు చేరిన రోజుల్లోనే స్టాలిన్ వోలోగ్దా ప్రవాసంలోంచి తప్పించుకుని, పీటర్సుబర్గు చేరేడని మనం పైన తెలుసుకున్నాం. విద్రోహశక్తు లింకా మంచి బలంగానే వున్నా, "ఎక్కడో సైబీరియాలో (బోడియాబో) శ్రామికుల్ని కాల్చివేసిన సంఘటన రష్యాఅంతటా సమ్మెతరంగం వ్యాపింపచేసింది. పీటర్సుబర్గు శ్రామికులు వీధుల్లోకి వచ్చేసి, ఒక్క విసురున "వాగా జరిగిందని" దంభాలు పలికిన పొగరుబోతుమంత్రి మాకరోవ్‌ని తుడిచిపెట్టేసేరు. రాబోయే మహాశక్తివంతమైన వుద్యమానికివి సూచనలు మాత్రమే. జ్వెజ్డా చెప్పినమాటలు "మేమింకా జీవించే వున్నాం. మా రక్తం ఆయాసం ఎరగని బలశక్తుంతో పొంగిపోతూంది....." అన్నవి అక్షరాలా నిజం. విప్లవోద్యమం విజృంభించగల దన్నది విస్పష్టం.

"ఈ ఉద్యమతరంగాలలోనే శ్రామికప్రజాసామాన్యం యొక్క పత్రిక ప్రవదా పుట్టింది." (జె. స్టాలిన్ ; ప్రవదాయొక్క పదో వార్షికోత్సవపు ఉపన్యాసంలో)

ప్రవదా ప్రచురణకి ఏర్పాట్లు చెయ్యడంలో స్టాలిన్ విశేషకృషిచేసేరు. ఈ రోజుల్ని జ్ఞాపకం చేసుకుంటూ ఆయన 1922 లో చెప్పినమాట లివి :

"1912 లో ఏప్రియల్ నడుమలో కామ్రేడ్ పోలెటయివ్ ఇంట్లో ఇద్దరు డ్యూమాప్రతినిధులు (పోక్రోవ్‌స్కీ, పొలెటయివ్,) ఇద్దరు రచయితలు (ఓల్మిన్‌స్కీ, బటూరిన్,) సెంట్రల్‌కమిటీసభ్యుడనైన నేనూ, (రహస్యంగా జీవిస్తూం డడంచేత 'సోదాకి వీలుపడని' పోలెటయివ్ ఇంట్లో నేను 'శరణున్నాను') 'ప్రవదా' అనుసరించవలసిన విధానంమీద ఒక అభిప్రాయానికివచ్చి, ఆపత్రిక మొదటిసంచికని తయారుచేసేం." (పై దానిలోనే)

ప్రవదా మొదటిసంచిక వెలువడ్డరోజునే 1912 ఏప్రియల్ 22న స్టాలిన్ అరెస్టుచేయబడి నారిమ్‌కి ప్రవాసంపంపబడ్డాడని మనం తెలుసుకున్నాం. ఆ సంవత్సరమే సెప్టెంబరు 1 వ తేదీన ఆయన నారిమ్‌నుంచి తప్పించుకుని పీటర్సుబర్గుకి తిరిగివచ్చి, బోల్షివిక్‌పార్టీ సెంట్రల్‌కమిటీ సభ్యుడుగా కేంద్రపత్రిక ప్రవదా సంపాదకుడుగా తనకార్యక్రమాన్ని నిరంతరాయంగా సాగించసాగేరు. 1917 లో బోల్షివిజం విజయంపొందడానికి ఈకాలంలోనే ప్రవదా పునాదులు వేసింది.

ఏ. బాదయీవ్ వ్రాసిన 'జారిస్టుడ్యూమాలోని బోల్షివిక్కులు' అనేపుస్తకంలో ఈకాలంలో పీటర్సుబర్గులోవుండి స్టాలిన్ సాగించిన పనులు, చాలా చిత్రమైనవి కనబడతాయి. నాలుగో స్టేట్ డ్యూమా ఎన్నికల ప్రచారం తీవ్రంగా సాగుతూంది. ఈప్రచారంలో స్టాలిన్ తీవ్రంగా పనిచేసి, పీటర్సుబర్గుశ్రామికుల పోరాటాన్ని నడిపించేడు. ఆకాలంలో లెనిన్ క్రాకోలో వుంటున్నాడు. అక్కడే బోల్షివిక్ పార్టీ సెంట్రల్ కమిటీయొక్క ప్రధానకార్యాలయంకూడా వుంది. క్రాకోలో వుండి లెనిన్ అనేకచుట్టుదార్లని పార్టీలో పనిచేస్తూన్నవారికి కార్యవిధానాలని పంపుతూండేవాడు. పార్టీలోకల్లా బలమైనసంస్థ పీటర్సుబర్గునిర్మాణాన్ని పైసూచనల ప్రకారం స్టాలిన్ సాగించేవాడు.

ప్రవదాకి వ్యాసాలు వ్రాయడమేగాక, స్టాలిన్ దానిని తానే నిర్వహించేవాడు. ప్రోస్వెష్చెనియే (విజ్ఞానజ్యోతి) అనే బోల్షివిక్ మాసపత్రిక ప్రారంభించిననాటి నుంచీ దానికై విశేషకృషిచేసేడు. 1913లో ప్రోస్వెష్చెనియే యొక్క 3, 4, 5, సంచికలలో వరసగా "జాతీయసమస్య ; సోషల్-డెమొక్రసీ" అనేపేరున వ్యాసాలు వ్రాసేడు. అవే తర్వాత "మార్క్సిజమూ : జాతీయసమస్య" అనేపేరున వేరేపుస్తకరూపంలో ప్రకటించబడింది. స్టాలిన్ వ్యాసాలనేకం ఈపత్రికలో ప్రకటించబడ్డాయి. 1913 లో ఆపత్రిక మొదటిసంచికలో "ఒకమాట (పీటర్సుబర్గు కూలీల క్యూరియాలో ఎన్నికలు)" అనేవ్యాసం వచ్చింది. ఈ ఎన్నికలని పార్టీ ఎందుకు బహిష్కరించలేదో తెలియజేస్తూ డ్యూమాఎన్నికలలో తమప్రతినిధుల హక్కుల్ని రక్షించుకోడానికై పీటర్సుబర్గు శ్రామికులు చేసిన సమ్మెలు ఎంత ముఖ్యమైనవో చూపించింది.

రహస్యంగా జీవించవలసిన పరిస్థితులలో, వేలకొద్దీకష్టం బోల్షివిక్కుల్ని అడుగడుక్కీ వెంబడిస్తూన్నకాలంలో స్టాలిన్ తనపనిసాగించగలగడం సామాన్య విషయం కాదు. శ్రామికులు ఎల్లప్పుడూ ఆయనని కాపాడుతూ వుండివుండకపోతే కొద్దినెలలపాటుకూడా బయట వుండగలిగేవాడు కాదు.

స్టేట్ డ్యూమా ఎన్నికలలో ప్రతినిధులుగా ఎన్నుకోబడవలసివున్న సభ్యులు అక్టోబరులో సమావేశంఅయ్యేరు. "పీటర్సుబర్గుశ్రామికులు తమ కార్మికప్రతినిధుల కిచ్చిన మాన్ డేట్" ఈసమావేశంలో అంగీకరించబడింది. దీనిని వ్రాసింది స్టాలిన్. లెనిన్ దానికి విశేషమైన ప్రాముఖ్యతనిచ్చి మార్జిన్ లో అప్రతిని అతి జాగ్రత్తగా కాపాడాలని కోరుతూ ఒక నోట్ వ్రాసేడు. ఈపత్రం, ఈనాడు, లెనిన్ వ్రాసిన నోట్ తోసహా మాస్కోలోని సెంట్రల్ లెనిన్ మ్యూజియంలో పెట్టబడివుంది.

స్టేట్ డ్యూమాలో, కార్మికప్రతినిధులు తమ కార్యవిధానాన్ని ఏపునాదులమీద సాగించాలో స్టాలిన్ ఈ మాన్ డేట్ లో వివరించేడు. శ్రామికులయొక్క, రైతులయొక్క పరిస్థితుల్ని వివరిస్తూ, ఈ పత్రం శ్రామికవర్గం పురోగామిదళం అనీ, విప్లవానికి నాయకమణి అనీ, రైతాంగం శ్రామికవర్గానికి మిత్రమనీ, రాబోయేపోరాటం

"రెండురంగాలలో - ఫ్యూడల్ - బ్యూరోక్రటిక్ పద్ధతితోనూ, వెనుకటి ప్రభుత్వంతో సహకారానికి ప్రయత్నిస్తూన్న లిబరల్ బూర్జువాజీలోనూ - జరుగుతుంద"నీ, వివరించింది. "ఇప్పుడున్న పరిస్థితులలో శ్రామికప్రజాసామాన్యాన్ని చైతన్యంలోకి తెచ్చి, నిర్మాణాలలో కూర్చడానికి డ్యూమా ఉత్తమసాధనం" అని బోధించింది.

"శ్రామికవర్గంయొక్క అంతిమాదర్శాలని ప్రకటిస్తూ, 1905 నాటి అభిప్రాయాలని పూర్తిగా, మినహాయింపులు లేకుండా ప్రకటిస్తూ, ప్రజోద్యమానికి రష్యన్ శ్రామికవర్గం నాయకత్వం వహిస్తుందని ప్రకటిస్తూ, రైతాంగం శ్రామికవర్గానికి నమ్మదగిన మిత్రమని ప్రకటిస్తూ, ప్రజాస్వాతంత్ర్యానికి బూర్జువా ఉదారవాదులు ద్రోహంచేసేరని ఘోషిస్తూ, సోషల్‌డెమాక్రటిక్‌దళసభ్యులు డ్యూమాట్రిబ్యూన్‌లో తమ ధ్వనులని ప్రతిధ్వనింపచెయ్యాలని మేం కోరుతున్నాం."

"నాలుగోడ్యూమాలోని సోషల్‌డెమాక్రటిక్ దళం పై నినాదాలని ఆధారం చేసుకుని పనిచేస్తూ, ఏకీభావంతో కలిసిపోవాలి.

"ప్రజాసామాన్యంతో నిరంతరసంబంధంలో వుండి వారినుంచి ప్రబల శక్తులు కూర్చుకోవాలి.

"రష్యాలోని శ్రామికవర్గంయొక్క రాజకీయ పార్టీతో చేయిచేయికలిపి నడవాలి." (బడయీవ్, 'జారిస్టుడ్యూమాలో బోల్షివిక్కులు' అనే పుస్తకంలో వుదాహరించేడు.

ఈ మాన్‌డేట్‌కిగల చారిత్రకప్రాముఖ్యతని వివరిస్తూ బడయీవు మళ్ళీ ఒక పాతిక సంవత్సరాల తర్వాత 1937 డిసెంబరు 12 న సోవియటుయూనియను యొక్క మొదటి సుప్రీంసోవియటుకి జరిగే ఎన్నికలలో ప్రజాప్రతినిధులకి స్టాలిన్ వ్రాసిన మాన్‌డేట్‌లో ప్రతిధ్వనించిందన్నాడు. "పీటర్సుబర్గు శ్రామికులు తమ కార్మిక ప్రతినిధులకిచ్చిన మాన్‌డేట్" నిస్సందేహంగా చాలా ప్రాముఖ్యతగలది. ఎలక్షన్ ఫలితాలని క్రోడీకరిస్తూ, మాన్‌డేట్ ప్రాముఖ్యతని వివరిస్తూ స్టాలిన్ "K. St." అనేసంతకంతో 1912 అక్టోబరు 19 నాటి ప్రవదాలో ఒకవ్యాసం వ్రాసేడు. "మాన్‌డేట్ ప్రతినిధులకిచ్చిన ప్రణాళిక మాన్‌డేట్ ప్రతినిధులని తయారుచేస్తుంది. ప్రతినిధుల ప్రాశస్త్యం మాన్‌డేట్‌యొక్క ప్రాశస్త్యంమీద ఆధారపడివుంటుంది."

నాలుగోడ్యూమా ప్రారంభసమయంలో డ్యూమాలోని సోషల్‌డెమాక్రట్ ప్రతినిధులు చదవవలసిన ప్రకటనని చర్చించడంలో స్టాలిన్ విశేషశ్రద్ధ తీసుకున్నాడు. ఈ ప్రకటనని చర్చించడానికి సమావేశం అయిన మీటింగులో ఆయన పార్టీ సెంట్రల్‌కమిటీతరఫున ఉపన్యసించేడు.

డ్యూమా ప్రారంభించబడిననాడు అభినందించిన లిక్విడేటర్లకి ఎదురెత్తుగా పీటర్సుబర్గు బోల్షివిక్‌కమిటీ డ్యూమా ప్రారంభమైన నాల్గోనాడు 1912 నవంబరు 15 న పెద్ద రాజకీయప్రదర్శన సాగించేరు. ఈ విషయమై లెనిన్ చేసిన వ్యాఖ్యయిది: "ప్రదర్శన ఏర్పాటుచేసిన సమయం చాల అద్భుతంగా ఎన్నుకోబడింది.

అపకీర్తిపాలైన ఈ 'పార్లమెంటు' యొక్క ప్రారంభానికి వ్యతిరేకంగా రాజధాని వీథులలో ఎర్రజెండాల ప్రదర్శనం సాగించగలగడంలో అద్భుతమైన శ్రామిక సహజజ్ఞానం చూపించబడింది." ('నవంబరు 15 నాటి ఘటనలు,' కలెక్టెడ్ వర్క్స్. సం. 16)

ఎంత స్వల్పమైన లీగల్ అవకాశాన్నయినా ఏవిధంగా వినియోగించుకోవాలో, లీగల్ కార్యక్రమాన్ని రహస్యకార్యక్రమంతో జత ఎలా చెయ్యవచ్చునో స్టాలిన్ ఇక్కడ మంచి వుదాహరణ నిచ్చేడు.

ఈకాలంలో స్టాలిన్ - లెనిన్‌లమధ్య జాబులు ఎప్పుడూ నడుస్తూనేవున్నా, లెనిన్ ఒక్కమారు ఆయనని చూడగోరేడు. బోల్షివిక్కులకోసం కళ్ళుపెగుల్చుకు చూస్తూన్న గూఢచారుల మధ్యనుంచి తప్పించుకుని ప్రయాణంచెయ్యడంలో ఎన్ని కష్టాలోవున్నా 1912 నవంబరులో స్టాలిన్ క్రాకోలోవున్న లెనిన్‌ని కలుసుకోగలిగేడు. ఆనాడు పార్టీని ఎదుర్కొంటూన్న సమస్య లన్నింటినీ చర్చించి, వారొక నిర్ణయానికి రాగలిగేరు. 1912 డిసెంబరులో స్టాలిన్ రష్యా తిరిగిపోయేడు.

నాలుగో స్టేట్‌డ్యూమాలోని ఆరుగురు బోల్షివిక్ ప్రతినిధులనీ వచ్చి తనను కలుసుకోమనివ్రాస్తూ, వారితో తప్పకుండా రమ్మని స్టాలిన్‌కి వ్రాసేడు, లెనిన్. 1912 డిసెంబరు 23 న వాసిలీవ్ (స్టాలిన్) పేరిట లెనిన్ యిల్లావ్రాసేడు. "రా....మాకేం తోచడంలేదు." తరవాత కొద్దిరోజులకే మళ్ళీ స్టాలిన్ క్రాకో వెళ్ళి, ర. సో. డె. లే. పా. సెంట్రల్‌కమిటీ పార్టీ ప్రచారకులలో జరిపిన సమావేశంలో పాల్గొన్నాడు. ఇందులో ఈయన రష్యాలోని సెంట్రల్‌కమిటీ బ్యూరోలో సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. ఈ కాన్ఫరెన్సు జరిగిన విషయాన్ని రహస్యంగా వుంచడానికై 1913 ఫిబ్రవరి కాన్ఫరెన్సు అన్నారు దీనిని. నిజానికిది జరిగింది 1912 డిసెంబరు ఆఖరున.

1913 జనవరి, ఫిబ్రవరులలో విదేశాలలో వున్నరోజుల్లో స్టాలిన్ జాతీయ సమస్యనిగురించి బహుపట్టుదలగా పనిచేసేడు. స్టాలిన్‌నిగురించీ, అతనిగ్రంథాన్ని గురించీ, లెనిన్ గోర్కీకివ్రాసిన ఒకజాబులో చాలా ప్రశంసించేడు. "ఒక అద్భుత శక్తిసంపన్నుడైన జార్జియన్ ప్రోస్వెష్చెనియే పత్రికకోసం ఒక పెద్దవ్యాసాన్ని వ్రాయడానికి కూర్చుని, ఆస్ట్రియన్ సమాచారాలనీ, ఇతరవిషయాలనీ చాలా పోగు చేసేడు."

ఈ అధ్యయనానికి ఫలితంగా స్టాలిన్ - మార్క్సిజమూ : జాతీయసమస్య' అనే పేరుతో ఒక ఉద్గ్రంథాన్ని వ్రాసేడు. అట్టో బార్, స్ప్రింగర్ మొదలయిన వారి మెన్షివిక్‌సిద్ధాంతాలతో ఏకీభవించే లిక్విడేటర్లు, బన్‌డిస్టులు, కకేషియన్ మెన్షివిక్కులమీదికీ తిప్పబడింది ఈ ఉత్తమగ్రంథంయొక్క వాయి. బోల్షివిక్కులు జాతులయొక్క స్వయంనిర్ణయాధికారాన్ని కోరుతారు. జాతీయవిజ్ఞానస్వాతంత్ర్యం అనే బూర్జువాలభిప్రాయాన్నే అవస్ట్రియనిస్టులు అనుకరించేరు. జాతిభేదాన్ని పట్టి

పార్టీలో, ట్రేడ్‌యూనియన్లలో, శ్రామికుల బీమాసంస్థలలోనూకూడా కార్మికుల్ని విభజించసాగేరు. శ్రామికుల ఐక్యతకి వారు శత్రువులు. శ్రామికుల అంతర్జాతీయ భావాన్ని వారు విధ్వంసంచేయ తలపెట్టేరు.

స్టాలిన్‌గ్రంధానికి లెనిన్ ఎంతప్రాముఖ్యత నిచ్చేదో ఆతని వ్యాసంవల్లనే అర్థం అవుతుంది. ఈ వ్యాసంపేరు "ర. సో. డె. లే. పా. యొక్క జాతీయ కార్యవిధానం"—"ఈ వ్యవహారపరిస్థితులూ, సోషల్‌డెమాక్రట్ల జాతీయకార్య విధానపుపంథాలూ, ఈమధ్యనే మార్క్సిస్టు సిద్ధాంతవాఙ్మయంలో చర్చించబడ్డాయి. "ఈ విషయంలో స్టాలిన్‌యొక్క వ్యాసం ముఖ్యంగా పేర్కొనవలసివుంది." (లెనిన్ : కలక్టెడ్‌వర్క్స్ : సం. 17.)

ఆకాలంనాడు "బోల్షివిక్కు లొక్కరికే జాతీయసమస్యమీద మార్క్సిస్టు కార్యక్రమం వుంది. ఇది స్టాలిన్‌యొక్క "మార్క్సిజమూ : జాతీయసమస్య" అనే పుస్తకంలోనూ, లెనిన్‌వ్రాసిన 'జాతుల స్వయంనిర్ణయాధికారం' (సెలక్టెడ్ వర్క్స్. సం. 4), 'జాతీయ సమస్యమీద విమర్శనాహంశాలు' అనేవ్యాసాలలో విశదీకరించబడింది."—అని సో. యూ. క. పా. (బో) చరిత్రలో వ్రాసింది పూర్తిగా నిజం.

జాతీయసమస్యని గురించిన తనపుస్తకం పూర్తికాగానే స్టాలిన్ రష్యాకి తిరిగివచ్చేడు. అటుతర్వాత కొంతకాలం ఆయన సంగతి ఏదీ తెలియకపోవడం చేత లెనిన్ "1913 మార్చి 8 న స్టాలిన్‌నిగూర్చి కనుక్కుంటూ జాబువ్రాసేడు : "వాసిలీ (స్టాలిన్-ఇ. యా) వార్త లేవీ వినబడవేం? ఏం వొచ్చింది? మాకేమీ తోచడంలేదు." మళ్ళీ రెండురోజులకి మరో జాబువ్రాసేడు : "ఆతని విషయం (స్టాలిన్) శ్రద్ధతీసుకోండి. ఏమీ ఆరోగ్యంగాలేదు.

ఆరోజులలో మాలినోవ్‌స్కీ అనే ఏంజట్ ప్రొవొకేటరు పార్టీ సెంట్రల్ కమిటీలోకీ, డ్యూమాలోని బోల్షివిక్‌దళంలోకీ రాగలిగేడు. మొట్టమొదట్లో యాకోవ్ స్వెర్‌డ్లోవ్‌ని జారిస్టుగూఢచారులకి పట్టిచ్చేడు. తర్వాత కొద్దిరోజులకే పీటర్సు బర్గులో బహుగూఢంగా నివసిస్తూన్న స్టాలిన్‌ని పట్టిచ్చేడు. స్టాలిన్ అరెస్టుని గురించి బదయావ్ 'జారిస్టుడ్యూమాలో బోల్షివిక్కులు' లో ఇల్లాగ వ్రాసేడు : "స్టాలిన్ ఎప్పుడు వీధిలోకివస్తాడా, ఎప్పుడు పట్టుకుందామాయని పోలీసులు కనిపెట్టుకూర్చున్నారు. అటువంటి అవకాశం త్వరలోనే చిక్కింది. ప్రవదా కోసమూ, ఇతర విప్లవవ్యవహారాలకోసమూ కాలాష్నికోవ్‌హాల్‌లో కాన్‌సెర్టు ఏర్పాటుచెయ్యబడింది. అటువంటివాటికి విశేషసంఖ్యలో కార్మికులూ, సానుభూతి పరులయిన మేధావులూవస్తారు. పార్టీసభ్యులు, చివరకి రహస్యంగా పనిచేస్తూన్న వారుకూడా వాటికి వస్తారు. ఆ రణగొణధ్వనిని అడ్డంపెట్టుకుని బహిరంగంగా మాటలాడడం మంచిది కాదనుకున్న వ్యక్తులతో అక్కడ కలుసుకోవడం, మాట్లాడడం జరుగుతూంటుంది. కాలాష్నికోవ్‌హాలులో జరుగుతూన్న కాన్‌సెర్టుకి స్టాలిన్ హాజరుకావడానికే నిశ్చయించేడు. ఈ సంగతినెరిగిన మాలినోవ్‌స్కీ

పోలీసుకి తెలియపరచేరు. ఆ హోల్ గదులలో మా కళ్ళముందర స్టాలిన్ అరస్టు చెయ్యబడిపోయేడు."

ఇది ఆయన ఆఖరుఅరస్టు. ఆరోమాటుగా జారిస్టుప్రభుత్వం ఆయనని ప్రవాసాని కంపింది. ఈపర్యాయం ఆర్కిటిక్‌రేఖదిగువన తురుఖాన్‌స్కు మండలంలో మొదట కోస్టినో అనే చిన్నగ్రామానికి, తర్వాత 1913 మధ్యలో కురీకా గ్రామానికి పంపేరు.

తురుఖాన్‌స్కీమండలానికే ప్రవాసం పంపబడ్డ వీరా స్విక్వెజర్ స్టాలిన్ నివసించిన కురీకాని ఈలాగ వర్ణించేడు :

"శీతాకాలంలో పోలీసులకి తెలియకుండా నేనూ, సురేస్ స్పందార్యనూ స్టాలిన్‌ని చూడడానికి కురీకా వెళ్ళేం. డ్యూమాలోని బోల్షివిక్కు దళంమీద అప్పుడు నడపబడుతూన్న కేసుకి సంబంధించిన కొన్నివిషయాలనీ, కొన్ని పార్టీవిషయాలనీ స్థిరపరచుకోవలసివుంది. మేము వెళ్ళినకాలం ధృవప్రాంతపు రాత్రికాలం. దానికి పగలులేదు. ఒకేఒక రాత్రి. దాని కంతుండదు. పొగమంచు చెడ్డబాధ పెడుతుంది. ఎక్కడా ఆగకుండా కుక్కలచేతలాగబడే స్లెడ్జిమీద యెనిసీకంటా వెళ్ళేం. మొనాస్టిర్‌స్కోయికి కురీకాకి నడుమ తోడేళ్ళతో నిండివున్న రెండువందలమైళ్ళ బంగనబయలుకి అడ్డపడి ప్రయాణంచేసి ఎల్లాగైతేం గమ్యం చేరుకున్నాం.

కురీకాకి వచ్చి, కామ్రేడ్‌స్టాలిన్ వుంటూన్న గుడిసెకోసం వెతకడం ఆరంభించేం. అపూర్వోవున్న పదిహేనుగుడిసెలలో ఇదే మరీచిదతనాన్ని వెలారుస్తోంది. ఒకచావడి, ఒక వంటిల్లు. వీటిలో, ఇంటియజమానీ అతనికుటుంబమూ నివసిస్తారు. మిగిలిన ఓగదిలో స్టాలిన్‌మకాము. అంతే.

తలవని తలంపయిన మా రాకనిచూసి కామ్రేడ్ స్టాలిన్ చాలా సంతోషపడ్డాడు. 'ధృవయాత్రికులకి' సౌకర్యాలు కూర్చడానికి చెయ్యగలదంతా చేసేడు. ఆతడు చేసిన మొదటిపని, యెనిసీనదివొడ్డుకి బయలుదేరి మంచుబొరియలలో వేసిన చేపగాలాలు వెతకడం. కొద్దినిమిషాలలో ఒకపెద్ద స్టర్జన్‌చేప భుజాన వ్రేలాడవేసుకుని తిరిగివచ్చేడు. 'అనుభవజ్ఞుడైన ఈ జాలరి' సహాయంతో చేపని కోసి కావియర్‌తీసి కొంత సూప్ తయారుచేసేం. ఈ వంట తయారవుతూండగానే మేము పార్టీవిషయాల్ని కూలంకషంగా చర్చించడం ఆరంభించేం. స్టాలిన్‌మెదడు ఎంతతీవ్రంగా పనిచేస్తూందీ గదిచెప్తూంది. అతని బల్లనిండా పుస్తకాలూ, పత్రికల కట్టలూ బొత్తులుపడివున్నాయి. ఒకమూల చేపలుపట్టడానికి, వేటకి పనికివచ్చే వివిధపరికరాలు - ఆయన చేసుకున్నవే గోడకి జేరపెట్టబడివున్నాయి."

1917 ఫిబ్రవరిలో విప్లవం వచ్చేటంతవరకూ స్టాలిన్ ఈ గ్రామంలోనే వుండిపోయేడు.

విప్లవోద్యమం పునః తల ఎత్తుతూన్న రోజుల్లో స్టాలిన్ సెంట్రల్‌కమిటీ యొక్క రష్యన్‌బ్యూరోని నడిపించేడు. పీటర్సుబర్గు నిర్మాణంయొక్క కార్య

క్రమాన్ని. నాలుగో స్టేట్‌డ్యూమాయొక్క ఎన్నికలని. ప్రవదానీ నడిపేడు: అదే సమయంలో విశేషంగా సిద్ధాంతసంబంధాలైన వ్యాసాలని ప్రోస్వేస్చేనయేకి వ్రాసేడు. 'మార్క్సిజమూ: జాతీయసమస్య' అనే ఉత్తమగ్రంథాన్ని వ్రాసేడు. ఈ గ్రంథంలోని భావాలు అక్టోబరు సోషలిస్టు విప్లవంలోనూ, ఆతరవాత సంవత్సరాలలో సోషలిస్టు రాజ్యాంగంయొక్క నిర్మాణంలోనూ చాలా ప్రముఖపాత్ర వహించాయి. పార్టీని, సోవియట్ ప్రభుత్వాన్ని, సోవియట్ ప్రజలని, ఈ భావాలే నడిపించి, పశ్చిమయూక్రెయిన్, పశ్చిమబైలోరష్యాలలోని శ్రమజీవులని పోలిషుప్రభువుల దాస్యంనుంచి స్వతంత్రులని చేసేయి.

సామ్రాజ్యవాదయుద్ధకాలంలో లెనిన్ - స్టాలిన్‌లు ఒకరికొకరు వేలకొద్ది మైళ్ళదూరాన వుండిపోయేరు. తురుఖాన్స్కులోని కురీకాకి పత్రికలు ఎప్పుడోగాని చేరవు. ఒక్కొక్కప్పుడు పోస్టు ఏ రెండుమూడునెలల పత్రికలనో ఒకేమాటు పట్టుకొస్తుంది. ఎన్నోచుట్టుదార్లూ, చిక్కుదార్లూ తిరిగి రావలసివుండడంచేత స్టాలిన్‌జాబులలో ఏ కొంచెమోమాత్రమే లెనిన్‌కి చేరేవి. వీనిలో ఒకజాబు జాగ్రత్త పెట్టబడివుంది. అందులో స్టాలిన్ తనకి శ్రామికవర్గం యెడగల విశ్వాసాన్నీ, విప్లవంయొక్క అంతిమవిజయంయెడగల విశ్వాసాన్నీ కుప్పించేడు: అంతర్జాతీయ పరిస్థితుల్ని స్టాలిన్ ఎంతచక్కగా గుర్తించేడో, ఈ మొదటి సామ్రాజ్యవాదయుద్ధకాలంలో పార్టీ కార్యవిధానం ఏలావుండాలో అద్భుతంగా చిత్రించేడు. ప్రధానపార్టీ సంస్థతో ఆయనకిగల సంబంధం లేదనేటంత స్వల్పం. ఇంచుమించు ఆయన ఏకాంతజీవితాన్నే గడుపుతున్నాడని చెప్పాలి. కాని, ఆయనకి మార్క్సిజంలోగల జ్ఞానం చాలా గంభీరం. అందుచేతనే 'సామ్రాజ్యవాదయుద్ధంయొక్క నిజస్వభావాన్నిగురించీ, తరువాత అవలంబించవలసిన కార్యవిధానాన్నిగురించీ, లెనినూ, బోల్షివిక్‌పార్టీయొక్క సెంట్రల్‌కమిటీ ఏ నిర్ణయాలకి వచ్చేరో స్టాలిన్ కూడా స్వయంగా ఆ పర్యవసానాలకే వచ్చేడు.

1914 ఆఖరురోజులలోమాత్రమే లెనిన్ యుద్ధంమీద వ్రాసిన థీసిస్ ప్రథమ పర్యాయం స్టాలిన్‌చేతులకి వచ్చింది.

"మా ప్రవాసజీవితంలో విశేషోత్సాహాన్ని కలిగించిన సమయం లెనిన్ ఆదేశాలు మాకందినప్పటిదే." అని వీరాస్విచ్వాజర్ వ్రాసేడు. "తురుఖాన్స్కుకి ప్రవాసం పంపుతూన్నప్పుడు దారిలో క్రాస్నోయార్‌స్కులో యుద్ధంమీద లెనిన్ వ్రాసిన థీసిస్‌యొక్క చిత్తుప్రతి నాకందింది. లెనిన్‌జాబుల్ని నద్జాదా కాన్‌స్టాంటినోవా (క్రుప్స్కయా-ఇ. యా.) పంపుతూండే రహస్య చిరునామాదారునుంచి నాకది తెచ్చి ఇవ్వబడింది. సురేన్ స్పందార్యన్‌తోకలిసి మొనాస్టిర్‌స్కోయీ గ్రామంలో వుంటూన్న స్టాలిన్‌కది అందించేను. ఆ చిక్కులమారి పరిస్థితుల్ని స్టాలిన్ సరిగ్గా లెనిన్‌పంథాలోనే గుర్తించేడని లెనిన్‌యొక్క థీసిస్‌లు నిరూపించేయి. తన భావాలని స్థిరపరుస్తూన్న లెనిన్ థీసిస్‌ని చదివినప్పుడు స్టాలిన్ ఎంత ఆనందపడ్డాడో, విజయానందాన్నీ, విశ్వాసాన్నీ అనుభవించేడో చెప్పడం కష్టం."

సురేన్ స్పందార్యన్, స్టాలిన్‌లు లెనిన్‌కి పంపిన ఒకజాబు జాగ్రత్తచెయ్య బడివుంది. అందులోవారు జాతీయరక్షణచేసుకోవాలనే ప్లెఖనోవ్, క్రోపాట్కిన్‌లనీ, ఫ్రెంచిప్రభుత్వంలో మంత్రిత్వం స్వీకరించిన ఫ్రెంచిసోషలిస్టు సెంబాట్‌నీ వెక్కిరించేసేరు.

తురుఖాన్‌స్క్‌లోని మొనాస్టిర్‌స్కోయిలో 1915 వేసవిలో ప్రవాసశిక్ష ననుభవిస్తూన్న బోల్షివిక్కులంతా సమావేశమయ్యేరు. దానికి స్టాలిన్‌కూడా ఏదో విధంగా హాజరుకాగలిగేడు. బోల్షివిక్ సెంట్రల్‌కమిటీయొక్క రష్యన్‌దళసభ్యులు ముగ్గురూ - స్టాలిన్, సురేన్ స్పందార్యన్, యాకోవ్ స్వెర్‌డ్లోవులు - ప్రవాసంలో వున్నవారు - ఆ సభకివచ్చేరు. ఈసభలో స్టాలిన్ బోల్షివిక్ డ్యూమాదళంయొక్క విచారణసమయంలో కామనీవు ప్రవర్తన బాగులేదని తీవ్రంగా ఖండించేడు.

మారుమూలనున్న ఈ సైబీరియన్‌గ్రామంలో వుండికూడా స్టాలిన్ పార్టీ జీవితంలో ఎంతశ్రద్ధచూపుతున్నాడో మనకి దీనివలనతెలుస్తూంది. ఎన్నోవిషయాలు తెగచదివేడు. రష్యాలో పార్టీపని ఏలాగజరుగుతూన్నదీ ఎప్పటికప్పుడు తెలుసుకుంటున్నాడు. పార్టీజీవితంలోని ప్రతిఘటనకీ అవకాశం వున్నంతలో ప్రతిక్రియలు చేసేడు. తీరుబడిసమయాలలో చేపలుపట్టుకునీ, వేటాడుకొనీ జీవితం గడుపుకునేవాడు.

1915 ఫిబ్రవరిలో వోప్రోసీ స్ట్రాఖోవానియా (భీమాసమస్యలు) అనే బోల్షివిక్‌పత్రికయొక్క సంపాదకీయవర్గం అంతా అరస్టుచెయ్యబడింది. ఇందువలన కొద్దికాలంపాటుమాత్రమే పత్రిక నిలచిపోయినా, మళ్ళీ ప్రకటించబడసాగింది. ఆ రోజుల్లో ఈ పత్రిక అద్భుతమైన పనిచేసింది. ఏమంటే ఇదొక్కటే లీగల్‌గా అనుమతించబడ్డ బోల్షివిక్‌పత్రిక. మాలినోవ్‌క్రింద పనిచేస్తూన్న పెట్రోగ్రాడ్ బోల్షివిక్కులకి ఆ పత్రికాకార్యాలయం సంకేత ప్రదేశంగా వుపయోగించింది. బోల్షివిక్కుల రహస్య కార్యక్రమాలకి ఈ పత్రిక తెరమాటు. కఠోరమైన మిలిటరీ సెన్సార్‌షిప్ చాలావ్యాసాలని నిలిపివేసినా (పత్రికలో వ్యాసాలస్థానే తెల్లకాగితాలుండేవి.) ఈ పత్రిక బోల్షివిక్కుల 'సంపూర్ణనినాదాల'నే అనుసరించింది. పునరుజ్జీవింపచెయ్యబడ్డ ఆ పత్రికయొక్క మొదటిసంచికని చూడగానే స్టాలిన్ తురుఖాన్‌స్క్ మండలంలో ప్రవాసంలోవున్న బోల్షివిక్కులనుంచి ఆ పత్రికకి విరాళాలు పోగుచెయ్యసాగేడు. తురుఖాన్‌స్క్ బోల్షివిక్కులిచ్చిన కొద్దిపాటి విరాళంతో (6 ఘూబుళ్ళు, 85 కోపెక్కులు) సంపాదకునికి పంపిన జాబుచూస్తే స్టాలిన్‌కి బోల్షివిక్‌పార్టీ అంటేనూ, వారి పత్రిక అంటేనూ ఎంతలభిమానంవుందో పత్రికయొక్క సిద్ధాంతకర్తవ్యాలని ఏ విధంగా నిర్వచించేడో మనకి తెలుస్తుంది.

ఇదిగో ఆ జాబు :

"డియర్ కామ్రేడ్స్! వోప్రోసీ స్ట్రాఖోవానియా పునరుజ్జీవితంకావడం తురుఖాన్‌స్క్ మండలంలో ప్రవాసితులమైయున్న మాకు చాలా సంతోషం కలిగించింది. ఈనాడు రష్యాలోని శ్రామికప్రజాసామాన్యంయొక్క అభిప్రాయాలు

పనిపట్టుకుని అపభ్రంశరూపంలో ప్రచారం చెయ్యబడుతూన్నాయి. ఇటువంటి సమయంలో నిజమైన కార్మికపత్రికనిచూడడం చాలా సంతోషం కలిగించింది. శ్రామిక వర్గానికి వ్యతిరేకమూ, అంతర్జాతీయతావంథాకి పూర్తిగా విరుద్ధమూ అయిన పోట్రెసోవ్, లెవిట్‌స్కీ, ప్లెఖనోవ్ మొదలగువారి దుర్బోధలకి విరుద్ధంగా మనదేశంలోని శ్రామికవర్గాన్ని సిద్ధాంతరీత్యా దృఢపరచడానికి వోప్రోసీ స్ట్రాఖో వానియా సర్వశక్తులూ వినియోగించాలి."

ఈ జాబుమీద స్టాలిన్, ఎ మాస్లెన్నికోవ్ (ఈయన తరువాత కోల్చక్ చేత కాల్పించబడ్డాడు,) ఎస్. స్పందార్యన్, వీరా స్క్వేజర్ మొదలగువారిచేత సంతకాలు పెట్టబడినాయి.

మెన్షివిక్ లిక్విడేటర్లయొక్క శ్రామికవర్గవ్యతిరేకాలూ, అంతర్జాతీయతా విరుద్ధాలూ, వినాశకరాలూ అయిన మోసగింపులనుంచి రష్యాలోని శ్రామికవర్గాన్ని ఉద్ధరించడం ఈ పత్రికయొక్క ప్రధానకర్తవ్యం అని స్టాలిన్ అభిప్రాయం.

రాజకీయనేరాలలో ప్రవాసశిక్షల ననుభవిస్తూన్న వారందరినీ జారిస్టుప్రభుత్వం 1916 డిసెంబరులో సైన్యాలలోకి తీసుకోబడ్డారు. ఈ సందర్భంలో స్టాలిన్ క్రాస్నోయార్స్కీకి తీసుకురాబడ్డాడు. అయినా స్టాలిన్‌ని సేనలోకి తీసుకోవడం వల్ల వచ్చేప్రమాదాన్ని వూహించి తీసుకోవడం మానింది. విప్లవానికిముందు శిక్షపూర్తికోసం ఆయనని ఆ చిన్‌స్కు పంపేరు. ఆయనింకా అక్కడుండగానే విప్లవం వచ్చింది.

విప్లవోద్యమం తలయెత్తుతూన్న ఈ కాలంలో యుద్ధదినాలలో ఎన్నికష్టాలు వచ్చినా, నష్టాలు వచ్చినా జంకకుండా నిరోధాలన్నింటినీ తప్పించుకుని, బోల్షివిక్ పార్టీని నిర్మించడానికీ, పార్టీపంక్తుల దృఢపరచుకునేందుకూ, విప్లవకార్యక్రమానికీ, సిద్ధాంతాలకీ సంబంధించిన అనేకసమస్యలని సాధించడానికీ, స్టాలిను లెనిన్‌తో కలిసిమెలిసి పనిచేసేడు. అపచ్యూనిస్టులు, నాలిక మడతమనుష్యులు, ట్రాట్స్కీ అనుచరులు, మెన్షివిక్కులు, లిక్విడేటర్లు ఎడలను, అతివాద, మితవాదఘోరణుల ఎడలను, ద్రోహిమైన కామినీవ్‌లాంటి వారిఎడలను రాజీఎరగని పోరాటం సాగించాడు.

లెనిన్‌కీ, ఆయనకీమధ్య ఎంతోదూరం వున్నా, స్టాలిన్ లెనిన్‌తోటివాడే. ఆయనెప్పుడూ శ్రామికవర్గం విజయం పొందక మానదనే విశ్వాసంతోటే వున్నాడు. గతకాలంలో మాదిరిగానే, ఇప్పుడుకూడా లెనిన్ - స్టాలిన్‌లు రష్యన్ శ్రామికవర్గంయొక్క ఏకైకవాంఛయొక్క స్వరూపాలు, విప్లవాలోచన, విప్లవశక్తి, బోల్షివిక్‌పార్టీ పోరాటము వారిలో మూర్తీభవించాయి.

# అక్టోబరు సోషలిస్టు విప్లవం

రష్యన్ శ్రామికవర్గోద్యమచరిత్రలోనూ, ప్రపంచ శ్రామికవర్గోద్యమచరిత్ర లోనూ, 1917 సంవత్సరం మరపునకు రానిది. ఆ ఒక్క ఏడాదిలో రెండు విప్లవాలు వచ్చేయి. ఒకటి ఫిబ్రవరివిప్లవం. ఇది బూర్జువాడెమాక్రటిక్ విప్లవం. దీనితో జార్‌ప్రభుత్వం తోసివెయ్యబడింది. రెండోది అక్టోబరు మహావిప్లవం. భూస్వాముల - పెట్టుబడిదారుల అధికారం త్రోసివెయ్యబడి శ్రామికవర్గనియంతృత్వం స్థాపించబడింది.

1905 జనవరి 9 న జార్‌ప్రభుత్వంచేత కాల్చి చంపివేయ్యబడ్డ స్త్రీ-పురుషుల స్మరణార్థమై చెయ్యబడిన అసమ్మతిసమ్మెలతో 1917 జనవరిలో వుద్యమం ప్రారంభం అయింది. క్రమంగా తీవ్రతపొంది, ఫిబ్రవరినెలనాటికి శ్రామికులేగాక, సైనికులు, నౌకాదళాలూకూడాచేరి సాగించిన బ్రహ్మాండమైన ప్రదర్శనాలలోకి మార్పుచెందింది. ఫిబ్రవరి 27 న పెట్రోగ్రాడ్‌సైనికులు కూలీలమీద కాల్చడానికి నిరాకరించి, వారితో చేరిపోయేరు. జారిజంయొక్క వినాశం నిశ్చితం అయిపోయింది. ఎన్నోమార్లు మార్క్సు - ఏంగిల్సులూ, 1890 లోనే లెనినూ వ్రాసిన మహత్తరమైన ఛారిత్రకబాధ్యతని - జారిజంయొక్క విధ్వంసాన్ని - రైతులూ, కూలీలూ, బోల్షివిక్‌పార్టీ నాయకత్వాన నిర్వహించేరు. జారిజంతో జరుపబడిన పోరాటంలో ఒకతరానికెక్కువమందే విప్లవకారులు మరణించేరు. చిట్టచివరకి 1917 ఫిబ్రవరిలో ప్రజాసామాన్యం ఆరాక్షసిని నేలకూల్చగలిగింది.

జైలుగేట్లు తెరిచివెయ్యబడ్డాయి. రాజకీయ ప్రవాసితులు తిరిగివచ్చేరు. బోల్షివిక్‌పార్టీ చట్టబద్ధం అయింది. ఇదివరకెప్పుడూ రష్యాలో కనపడివుండని స్వతంత్రవాతావరణాన్ని అనుభవించింది. బూర్జువా-డెమాక్రటిక్‌విప్లవం సాధించబడింది. కాని, శ్రామికుల్నీ, రైతుల్నీ ఎదుర్కొంటూన్న ప్రధానసమస్యలన్నీ, విప్లవోద్యమం ఇంకా ముందుకి సాగవలసిన అవసరాన్నే వెలిబుచ్చుతున్నాయి. ఆనాటికింకా లెనిన్ ప్రవాసితుడై స్విట్జర్లండ్‌లోనే వున్నాడు. రష్యాలోని బూర్జువా డెమాక్రటిక్‌ప్రభుత్వం ధనమిత్రులైన బ్రిటిష్-ఫ్రెంచి సామ్రాజ్యవాదులతోకలిసి, లెనిన్ దేశానికి తిరిగిరాకుండా చెయ్యడానికి యావత్ప్రయత్నాలూ చేసింది.

1917 మార్చి 12 న స్టాలిన్ సైబీరియానుంచి, పెట్రోగ్రాడ్‌కి తిరిగిరావడం ఒకముఖ్యవిషయం. వస్తూనే విప్లవకార్యక్రమంలోకి ఉరికేడు. పెట్రోగ్రాడ్‌కమిటీ యొక్క, మొత్తం పార్టీఅంతటియొక్క కార్యక్రమాలలో స్టాలిన్ పథప్రదర్శ

కత్వం దీసించసాగింది. అతిప్రధానాలైన సమస్యలకి సమాధానాలు కావాలి. స్టాలిన్ వాటిని యిచ్చేడు.

మొట్టమొదటిది ప్రతివిప్లవములోనూ వుండేసమస్యే 'అధికారం ఎవరిచేతుల్లో వుండాలి' అనేది. ద్రోహులైన రోమనోవ్ జట్టు తరిమివెయ్యబడింది. నూతన ప్రభుత్వం ఏవిధంగా వుండాలి? "ఏ వర్గం" అధికారాన్ని తీసుకోవాలి. సోషలిస్టు - రివల్యూషనరీలూ, మెన్షివిక్కులూ ద్రోహబుద్ధితో అధికారాన్ని బూర్జువాజీ చేతిలో కిచ్చేరు. దానితో ద్వంద్వప్రభుత్వం ఏర్పడింది. శ్రామికుల, సైనికుల ప్రతినిధుల సోవియట్లలోపాటు బూర్జువాల తాత్కాలికప్రభుత్వంకూడా ఏర్పరచబడింది. ఇందువలన పై సమస్యకి సమాధానం ఇవ్వడం కష్టతరం అయింది.

ఈ ద్వంద్వప్రభుత్వం వున్నకాలంలో, తాత్కాలికప్రభుత్వం అండగా సైనిక - శ్రామిక ప్రతినిధుల సోవియట్ల కార్యక్రమం ఏమిటి? 'శ్రామిక - సైనిక ప్రతినిధుల సోవియట్లు' అనే పేరున స్టాలిన్‌వ్రాసిన వ్యాసం 1917 మార్చి 14 న ప్రవదాలో ప్రకటించబడింది. సోవియట్ల కర్తవ్యాన్ని ఆ వ్యాసంలో ఇల్లాగ వివరించేరు: "పాతశక్తులు పూర్తిగా నాశం చెయ్యడానికీ, రాష్ట్రాలలోచేరి రష్యా విప్లవాన్ని ఇంకా ముందుకి సాగించడానికీ ఇదివరకు సంపాదించిన హక్కులు చెయ్యి జారనీయకూడదు."

విప్లవానికి బలం ఎందులోవుంది? దీనికి స్టాలిన్ ఇచ్చిన సమాధానం ఇది. "సైనికదుస్తులలోవున్న శ్రామికుల-రైతులమధ్యగల స్నేహబంధాల గట్టితనంలో రష్యావిప్లవంయొక్క బలం ఆధారపడివుంది. ఈ స్నేహబంధం రూపొందిన సంస్థలే శ్రామిక - సైనిక ప్రతినిధుల సోవియట్లు. ఈ సంస్థల్ని దృఢపరచాలి; ఇప్పటి మనకర్తవ్యం "వాటిని సర్వత్రా వ్యాప్తిచెయ్యాలి. ప్రజల విప్లవాధికారం గల సంస్థయైన శ్రామిక - సైనిక ప్రతినిధుల కేంద్రసోవియటు అధికారంలోకి వాటన్నిటినీ తీసుకురావాలి. విప్లవకారులైన సోషల్ - డెమాక్రట్లు చెయ్యవలసిన పని యిది." ('లెనినూ : స్టాలినూ ; 1917)

ప్రజలు సామ్రాజ్యవాదయుద్ధపు బురదనుంచి తప్పించుకు బయటపడడానికి స్టాలిన్ సర్వసహాయాలూ చేసేడు.

"రష్యావిప్లవం విజయం పొందడానికి కావలసినవి" అనేపేరున స్టాలిన్ 1917 మార్చి 16 నాటి ప్రవదాలో ఒకవ్యాసంవ్రాసేరు. అందులో గతఘటనలనీ, అప్పుడున్న పరిస్థితులనీ, వివేచనచేసి చివరకి ద్వంద్వప్రభుత్వం పోవలసిందేననీ, విప్లవశక్తుల నిజమైనఅధికారం స్థాపించబడాలనీ, ఆప్రభుత్వం "విప్లవవ్యతిరేకులకి ఎదురెత్తుగా ప్రజలలోని సజీవశక్తు లన్నింటినీ కూర్చుకోగలగా"లనీ తేల్చేరు. "ఒక్క శ్రామికుల, సైనికుల, రైతుల ప్రతినిధులతో ఏర్పడిన జాతీయసోవియటే ఇల్లాంటి పనిచెయ్యగల"దనికూడా తేల్చేరు. "రష్యావిప్లవం విజయంపొందడానికి కావలసినవాట్లలో మొదటిదది." అందుచేత ఈనాటి నినాదం "సర్వాధికారాలూ సోవియట్లకే" అనేదే.

యుద్ధంవిషయంలో వారి దృక్పథం ఏమిటనే సమస్య నాటి ప్రజాసామా న్యాన్ని ఎదుర్కొంటూంది. స్టాలిన్ 'యుద్ధం' అనేపేరున 1917 మార్చి 16 న ప్రవదాలోవ్రాసిన వ్యాసంలో "ప్రజాసామాన్యానికి, ఈనాటియుద్ధానికి మూలకారణా లేమిటో చూపించడానికై సామ్రాజ్యవాదుల గుట్టు బయటపెట్టడం" అవసరం అన్నాడు. "-అంటే యుద్ధంమీద నిజమైన యుద్ధాన్ని ప్రకటించడమే. ఈనాటి యుద్ధం జరగడం అసంభవమయ్యేలా చెయ్యడమే."

రష్యాలో అసంఖ్యాలుగావున్న వేరువేరు జాతీయవాదుల్ని కలవరపెడు తూన్న జాతీయ సమస్యకి సరియైన సమాధానం వెతకవలసిన అవసరం ఇప్పుడే విశేషంగావుంది. "జాతుల అసమర్ధతలని రద్దుచెయ్యాలి" అనే పేరున స్టాలిన్ 1917 మార్చి 25 నాటి ప్రావదాలో పై సమస్యకి సమాధానం ఇచ్చేడు. "పీడినా విధానంనుంచి విముక్తులు చెయ్యబడ్డ జాతులహక్కుల్ని స్థిరపరచడానికి, ఈ హక్కుల్ని చట్టబద్ధం చెయ్యడానికి అవసరమైన సమయం వచ్చింది." జాతీయ సమస్యమీద బోల్షివిక్కుల అభీప్సితాలని - అంటే, జాతులకి స్వయం-నిర్ణయాధి కారం, రాజ్యాంగం విడిగా ఏర్పరచుకొనేహక్కుతోసహా ఆయన బాగా వివరించేడు, అందులో.

వెనుకటి రైతాంగ సంబంధాలని నిలబెట్టేటందుకై మెన్షివిక్కులూ, సోష లిస్టు - రివల్యూషనరీలూ భూస్వాములకీ, పెట్టుబడిదారులకీ సహాయంచేస్తున్నారు. కాన్‌స్టిట్యుయంట్ ఎసంబ్లీ సమావేశం అయ్యేదాకా రైతాంగసమస్యకి సమాధా నాన్ని గురించి ఒత్తిడితేవద్దని రైతులకిచెప్పి ఆ అసెంబ్లీ సమావేశాన్ని కాల నిర్ణయంలేకుండా వాయిదాలు వేయసాగేరు. "రైతులకి భూమి" అనే వ్యాసాన్ని 1917 ఎప్రియల్ 14 నాటి ప్రవదాలో స్టాలిన్‌వ్రాస్తూ, సోషలిస్టు-రివల్యూషనరీలూ, మెన్షివిక్కులూ, కాడెట్లూ, రైతుల్ని ఏ విధంగా మోసగిస్తున్నారో బయటపెట్టేడు. "భూస్వాముల కడుపుచల్లగావుంటే రైతాంగం ఎల్లాపోతే వాళ్ళకేం?" అని వ్రాసేడు. "అందుకే మేము రైతులు, రష్యాలోని పేదరైతులు తమపనివి తమ చేతిలోకే తీసుకుని సాగించుకోమని హెచ్చరిస్తున్నాం.

"రైతుల విప్లవ సంఘాలని (జిల్లాలలోనూ, గ్రామాలలోనూ) నిర్మించుకో మనీ, ఈ కమిటీలద్వారా ఎస్టేట్లని స్వాధీనపరచుకోమనీ, నిర్మాణయుక్తమైన పద్ధతిలో వాటిని వ్యవసాయం సాగించుకోమనీ, ప్రభుత్వపు ఆజ్ఞలకి ఎదురుచూస్తూ కూర్చోవద్దని చెబుతున్నాం.

"ఈ పని చెయ్యడంలో ఆలస్యంవద్దు. కాన్‌స్టిట్యుయంట్ ఎసంబ్లీకోసం ఎదురుచూస్తూ కూర్చోవద్దు. విద్రోహులయిన మంత్రుల వ్యతిరేకతను లెక్కచెయ్య కండి. వాళ్ళంతా విప్లవచక్రం దొర్లకుండా చేసే అడ్డుకర్రలు."

ఈ విధంగా లెనిన్ రష్యాలో అడుగుపెట్టకపూర్వమే స్టాలిన్ ప్రధాన సమస్య లన్నింటికీ బోల్షివిక్ సమాధానాల నిచ్చేడు.

శ్రామికవర్గంయొక్క సోషలిస్టు విప్లవం విజయం పొందడానికి, బోల్షివిక్ కార్యక్రమాన్ని అచంచలంగా కొనసాగించడమే చాలా ముఖ్యం; బూర్జువాజీతో మేళనం కోరేవారినీ, సోషలిస్టు విప్లవాన్ని కాలపరిమితి లేకుండా వాయిదాలు వేసే వారినీ ఎదుర్కోవాలి.

స్టాలిన్ తమకి ప్రబలుడైన, మొగమాటం ఎరుగని విరోధియని అపర్చ్యూనిస్టులు గుర్తించేరు. మెన్షివిక్కులమీద, సోషలిస్టు - రివల్యూషనరీలమీద కాదెట్లమీదనూ మాత్రమేగాక, పరాజయశంకితుల్నీ, ద్రోహుల్నీ, కామెనీవ్‌నీ, అతని అనుచరులనీ, బహుతీవ్రంగా ఎదిరించేడు. ఈ కామెనీవ్ వగయిరాలు తమని బోల్షివిక్కులని పిలుచుకుంటూనే విప్లవానికి ప్రమాదకరమైన విధానాల నవలంభించేరు. బోల్షివిక్‌పార్టీయొక్క సెంట్రల్‌కమిటీయొక్క జెండాని స్టాలిన్ దింపలేదు. అదే సమయంలో లెనిన్‌ని శీఘ్రంగా రష్యాకి తిరిగిరమ్మని తంతిపంపేడు.

ఏప్రియల్ 3 వ తేదీన స్టాలిన్ బైలో - ఓస్ట్రోవ్‌వెళ్ళి లెనిన్‌ని కలుసుకున్నాడు. ఈ విప్లవనాయకులు, బోల్షివిక్ నాయకులు, చిరకాలానికి అనంతరం కలుసుకున్నప్పుడు అత్యుత్సాహాన్ని పొందేరు. శ్రామికవర్గ నియంతృత్వంకోసం పోరాటాన్ని ఆరంభించి, రష్యాలోని శ్రమజీవులైన ప్రజల విప్లవ పోరాటాన్ని నడిపించడానికి వారిరువురూ సిద్ధంగా వున్నారు. పెట్రోగ్రాడ్‌కి పోయేదారిలో స్టాలిన్ లెనిన్‌కి పార్టీలోని సంగతుల్నీ, విప్లవం ఎంతవరకు సాగినదీ తెలియపరిచేడు. ఏప్రియలు 4 వ తేదీన లెనిన్ ఒకసమావేశంలో సుప్రసిద్ధమైన ఏప్రియల్ థీసిస్‌ని చదివేడు. ఇంకముందు విప్లవం ఏమార్గాన సాగాలో, సోవియట్లు అధికారాన్ని ఏవిధంగా చేజిక్కించుకోవాలో అందులో వివరించేడు. విప్లవద్రోహులైన జినోవీవ్, కామెనీవ్‌లు దీనికి వ్యతిరేకించేరు. స్టాలిన్ వారిని తీవ్రంగా ఖండించి, బూర్జువా-డెమాక్రటిక్ విప్లవం సోషలిస్టువిప్లవంగా మార్పుచెందేటందుకై లెనిన్ వేసిన పథకాన్ని సమర్థించేడు.

స్టాలిన్ జీవితంలో ఒక నూతనఘట్టం, లెనిన్‌తోకలిసి పనిచేసినఘట్టం ప్రారంభం అయింది. 1917 లో తాను పొందిన విప్లవానుభవానికి ఆయన విశేష ప్రాముఖ్యత నిస్తాడు. టిప్లిస్‌లోని కకేసియన్ రైల్వేవారి ప్రధానమైన మరమ్మతు కార్ఖానాలలోని కార్మికుల్ని ఉద్దేశించి మాట్లాడుతూ, 1926 జూన్ 8 వ తేదీన ఈరోజుల్ని జ్ఞాపకంచేసుకుని ఎంతో ఆనందపడ్డాడు: "నాకు 1917 జ్ఞాపకం వస్తూంది. ఒక జైలునుంచి మరోజైలుకి, ఒక ప్రవాసప్రదేశంనుంచి మరోప్రదేశానికి మారిమారి, చివరకి పార్టీఇష్టానుసారం పెట్రోగ్రాడ్‌కి చేరుకున్నా. అక్కడ రష్యన్ కార్మికులమధ్య, ప్రపంచ శ్రామికులకి నాయకుడైన కామ్రేడ్ లెనిన్ యొక్క సాన్నిహిత్యాన శ్రామికవర్గానికి-బూర్జువాజీకి తీవ్రపోరాటాలు జరుగుతూన్న ఆక్లిష్టసమయంలో, సామ్రాజ్యవాద యుద్ధరంగాలమధ్య శ్రామికవర్గంయొక్క పార్టీకి నాయకత్వం వహించడం అంటే ఏమిటో, మొట్టమొదటిమారుగా తెలుసుకున్నా. అక్కడ, రష్యన్ శ్రామికులమధ్య పీడితప్రజకి విముక్తిని కలగచేసిన,

అన్ని దేశాలలోనూ, జాతులలోనూగల శ్రామికవర్గపు పోరాటాలకి అగ్రగామిగా వున్న రష్యన్‌శ్రామికులమధ్య మూడోమాటు విప్లవాగ్నిసంస్కారాన్ని పొందేను. అక్కడ, ఆ రష్యాలో, లెనిన్ అధ్యాపకత్వాన విప్లవకళలో చాతుర్యం సంపాదించేను."

పెట్రోగ్రాడ్ సోవియట్‌యొక్క కార్యనిర్వాహకసమితియొక్క సమావేశంలో లెనిన్-స్టాలిన్‌లు పాల్గొన్నారు. శ్రామిక-సైనిక ప్రతినిధుల సోవియట్ల యొక్క అఖిలరష్యన్ సమావేశానికివచ్చిన బోల్షివిక్‌ప్రతినిధుల సమావేశాన్ని లెనిన్‌తోసహాకలిసి సాగించేడు. లెనిన్‌తోగలిసి సెంట్రల్‌కమిటీ సభ్యుడుగా ఆయన పార్టీయొక్క కేంద్రపత్రికయైన ప్రవదాని సాగించేడు. ఒకమారు లెనినూ, ఒకమారు స్టాలినూగా ప్రవదాకి వ్యాసాలు వ్రాసేవారు. అవి పరస్పరానుబంధంగా వుంటూ, పోరాటానికి సంబంధించిన అన్ని సమస్యలమీద స్పష్టమైన సమాధానాల నిచ్చేవి.

1917 లో బోల్షివిక్కుల ఏప్రియల్ సమావేశంలో స్టాలిన్ జాతీయసమస్యమీద ఉపన్యసించేడు. పియాట్‌కోవ్‌స్, తదితరవ్యతిరేకుల్ని ఖండించి, జాతులకి స్వయంనిర్ణయాధికారం వుండాలనే సూచనను సభముందుపెట్టాడు.

తాత్కాలికప్రభుత్వాన్ని విశ్వసించమనే కోరణీని విడిచిపెట్టమనీ, తాత్కాలికప్రభుత్వపు కార్యక్రమంమీద అధికారం సోవియట్లకి వుండాలనే కామెనేవ్ తెచ్చిన సూచనను స్టాలిన్ నిరాకరించేడు. అటువంటి అధికారం నియామకుల, నియమితులమధ్య ఒకనిర్ణీతమైన ఏకీభావాన్ని సూచిస్తుందని స్టాలిన్ చెప్పేడు.

ఈ కాన్ఫరెన్సులో జాతీయసమస్యలమీద స్టాలిన్‌యిచ్చిన రిపోర్టులో ఆయన 'అలివాదు'ల్ని—ప్యాట్‌కోవ్ వగైరాలని—దులిపేసేడు. వారు జాతీయ దురహంకారుల చేతి కీలుబొమ్మలుగా పనిచేస్తున్నారని విమర్శించేడు. "అందు చేత జాతీయసమస్యమీద మనయొక్క అభిప్రాయాల్ని ఈ దిగువవిధంగా వర్గీకరించవచ్చు: (ఎ) విడిపోవడానికి కూడా జాతులకి హక్కువుండాలి; (బి) ఒక రాజ్యాంగంలోపల వున్న జాతులకి ప్రాంతీయస్వాతంత్ర్యం ఇవ్వబడాలి; (సి) అల్పసంఖ్యాకజాతుల అభివృద్ధికి స్వేచ్ఛావకాశాలనిస్తూ ప్రత్యేకశాసనాలు; (డి) ఒక రాజ్యాంగంలోని అన్నిజాతుల శ్రామికులకీ ఒకేఒక అవిభాజ్యమైన శ్రామిక సంస్థ, ఒకేఒక పార్టీ వుండాలి." (లెనినూ, స్టాలినూ; 1917)

ఏప్రియల్ కాన్ఫరెన్సు అయినాక 1917 మేనెలలో స్టాలిన్ సెంట్రల్‌కమిటీ పొలిటికల్‌బ్యూరోలో సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. అప్పటినుంచీ ఆ స్థానంలోనే వున్నాడు.

విప్లవం ఆతర్వాతపొందిన అభివృద్ధికీ, శ్రామికవర్గపు సోషలిస్టువిప్లవం విజయం పొందేటట్లుగా పార్టీ సాగించిన పోరాటంలోనూ, ఏప్రియల్ సమావేశపు తీర్మానాలకి ఎక్కువ ప్రాముఖ్యతవుందని మనం ఎరుగుదుం. బూర్జువా "డెమాక్రటిక్ విప్లవం సోషలిస్టువిప్లవంలోకి మార్పుచెందడానికై తొక్కవలసిన మార్గాల నది

సూచించింది. పెట్టుబడిదారుల, భూస్వాముల, అధికారాన్ని కూలదోసి శ్రామికవర్గ నియంతృత్వాధికారాన్ని నెలకొల్పేటందుకు అవలంబించవలసిన పద్ధతుల నది తెలిపింది. అత్యల్పకాలంలో లెనిన్ - స్టాలిన్‌లు ప్రజాసామాన్యాన్ని వారి మహత్తరకర్తవ్యనిర్వహణకై తయారుచేయడానికి అశేషకృషి చేసేరు. రోజులతరబడి స్టాలిన్ నిర్మాణ - ప్రచారకార్యాలని అతివిశేషంగా సాగించేరు. ప్రజలయెదుట బ్రహ్మాండమైన కార్యభారం వుంది. అందుచేత చిన్నచిన్న పోరాటాలలో వారు తమశక్తిని క్షయింపచేసుకోనియ్యకూడదు. నిరంతరం అభివృద్ధి పొందుతూన్న బోల్షివిజంయొక్క బలాన్ని ప్రదర్శించగల కార్యక్రమాలనే సాగించేటట్లు ప్రజలని నిర్మాణాలలోకి తేవాలి. ఏప్రియల్ ప్రదర్శనాలు; మేడే ప్రదర్శనాలు. 1917 జూన్ 18 నాటి ప్రదర్శనాలూ దీనికి ప్రత్యక్షమైన ఉదాహరణలు.

జూన్ ప్రదర్శనాలవిషయమై స్టాలిన్ "శ్రమజీవులకీ, పెట్రోగ్రాడ్‌లోవి శ్రామికులకీ, సైనికులకీ" ఒక ప్రణాళికని ప్రకటించేరు. "పునరుజ్జీవితం అవుతూన్న దౌర్జన్యాలకీ, పీడనలకీ విప్లవకారియైన పెట్రోగ్రాడ్ తీవ్రమైన అసమ్మతి చూపినదినంగా" మార్చమని ఆదేశించేరు.

"స్వాతంత్ర్యానికీ, సోషలిజానికీ శత్రువులైనవారు దిగ్భ్రమచెందేటట్లుగా రేపు విజయకేతనాల నెగరవెయ్యండి !

"విప్లవమోఘలైన మీగర్జన ప్రపంచమంతటా ప్రతిధ్వనించి, పీడితప్రజలకీ, అణచిపెట్టబడినవారికీ సంతోషం కలిగించేటట్లు ధ్వనించాలి ....!

"శ్రామికులారా ! సైనికులారా ! సోదరభావంతో చేయిచేయిగలిపి - సోషలిజంయొక్క జెండానీడల ముందుకి నడవండి !

"కామ్రేడ్స్ ; అంతా వీధులలోకి రండి ?

"మీ జెండాలచుట్టూ కట్టనికోటలా ఏర్పడండి !

"బారులుతీరి రాజధానీనగరవీధులలో నడవండి !"

జూన్ 18 న జరిగిన ప్రదర్శనంలో పెట్రోగ్రాడ్‌లోని అయిదులక్షంమంది కూలీలూ - సైనికులూ బోల్షివిక్‌పార్టీయొక్క జెండాక్రింద, లెనిన్, స్టాలిన్‌ల జెండాక్రింద పాల్గొన్నారు.

బోల్షివిక్‌పార్టీ అతివేగంగా పలుకుబడిని వృద్ధిచేసుకోవడంచూసి, తాత్కాలికప్రభుత్వం పార్టీని చిందరవందరచేసి నిషేధించాలని సంకల్పించింది ; ఇంక పార్టీమీద నిర్బంధవిధానం సాగించడానికై నెపంకోసం వెతుకుతూంది.

తాత్కాలిక ప్రభుత్వంయొక్క కుటిలమైన విప్లవ వ్యతిరేక నీతివిధానంతో శ్రామికులూ, సైనికులూ ఉద్రిక్తులై 1917 జూలై 3, 4 తేదీలలో బ్రహ్మాండ ప్రదర్శనాలుచేసేరు. దీనితో సందుదొరికింది. ప్రదర్శనాలమీద తుపాకులుకాల్చేరు. ప్రవదా కార్యాలయాన్ని నాశనంచేసేరు. లెనిన్‌మీద నీలాపనిందలు మోపేరు. తాత్కాలిక ప్రభుత్వం లెనిన్‌ని అరెస్టు చెయ్యడానికి వారంటు జారీచేసింది. లెనిన్

తలదాచుకోక తీరిందికాదు. పార్టీలోనేవున్న బోల్షివిజానికి శతృవులైనవారు విప్లవ వ్యతిరేకులైన బూర్జువాల కోర్టులో లెనిన్ విచారణకి నిలబడాలని పట్టుపట్టేరు. స్టాలిన్, సెర్గో, ఓర్జానికిడ్జే, స్వెర్డ్లోవ్, తదితర బోల్షివిక్కులూ లెనిన్‌ని బూర్జువా కెరన్‌స్కీ ప్రభుత్వపు పోలీసుల బారినుంచీ, కాపొద్రిస్తవైవున్న యూన్‌కర్ల తదితర వైట్‌గార్డుల బారినుంచీ తప్పించి దాచేసేరు.

ఇల్లాంటి కఠిన సమయంలో స్టాలిన్ పార్టీని సాయుధవిప్లవానికి శక్తులు కూడదీసుకునేటట్లుగా సాగించేడు.

రాబోచీ ఇ సోల్డాట్‌యొక్క మొదటిసంచిక 1917 జూలై 10 తేదీన వెలువడింది. ప్రభుత్వంచేత అణిచివెయ్యబడిన ప్రావదా స్థానే వెలువడిన ఈపత్రిక మొదటిసంచికలో స్టాలిన్‌వ్రాసిన వ్యాసం "విప్లవ వ్యతిరేపుల విజయం" ప్రకటించ బడింది. అందులో:

"జూలైనాటి గడ్డురోజుల్లో, విప్లవశక్తులమీద విద్రోహులు తుపాకులు కాల్చిననాడు శ్రామికవర్గంయొక్క ప్రదేశాలని విడిచిపెట్టనిది బోల్షివిక్‌పార్టీ వొక్కటేననేది శ్రామికు లెన్నడూ మరవరు.

"ఆ గడ్డురోజుల్లో పాలకపక్షాలయిన సోషలిస్టు - రివల్యూషనరీలూ, మెన్షివిక్కులూ శ్రామికుల్నీ, నావికుల్నీ ఎదిరించి, నిరాయుధుల్ని చేసినవారి పక్షానికి చేరిపోయేరన్నవిషయం శ్రామికు లెన్నడూ మరువరు.

"శ్రామికులు ఇవన్నీ జ్ఞాపకం వుంచుకుంటారు; వీటినించి అర్థవంతమైన భావాల్ని గ్రహిస్తారు." (లెనినూ, స్టాలినూ 1917.)

విప్లవవ్యతిరేకులు "విజయానందా"న్ని అనుభవిస్తూన్నరోజుల్లో 1917 జూలై 26 న ఆరవ పార్టీకాంగ్రెసు సమావేశం అయింది. అప్పుడు లెనిన్ రహస్యంగా వుండడంచేత ఈ సమావేశాన్ని స్టాలినే నడిపించేడు. ఇక్కడనే సాయుధవిప్లవం విషయంలో పార్టీ తీసుకోవలసిన విధానం నిరూపించబడింది. ప్రధానాలయిన రిపోర్టులన్నీ స్టాలినే వ్రాసేడు. బూర్జువాల అధికారాన్ని కూల ద్రోసి, శ్రామికులూ, బీదరైతులూ అధికారాన్ని స్థాపించవలసిన అవసరాన్ని ప్రజలకి బోధించడం చాలాముఖ్యమని చూపించేడు.

"ఒక్కటే విషయం మిగిలింది. తాత్కాలికప్రభుత్వాన్ని కూలద్రోసి అధికారం చేతులలోకి తీసుకోవాలి. ఈపనిని శ్రామికవర్గం రైతాంగంతోకలిసి నిర్వహించగలదు." (సో. యూ. క. పా. (బో.) చరిత్ర.)

అప్పుడే బూర్జువా-డెమాక్రటిక్‌విప్లవం సోషలిస్టువిప్లవంలోకి మార్పుచెందు తూందనీ, దేశంయొక్క ఆర్థికవిధానం మొత్తంలోవచ్చిన మార్పులు-వ్యవసాయం లోనూ, పరిశ్రమలలోనూకూడా వచ్చిన మార్పులు, విప్లవంయొక్క సోషలిస్టు స్వభావాన్ని నిరూపిస్తున్నాయి "అది శ్రామికవర్గంయొక్క సోషలిస్టు విప్లవ స్వభావాన్ని స్వీకరిస్తూంది." అన్నాడు. (ర. సో. డె. లే. పా. యొక్క ఆరవ కాంగ్రెస్‌లో సెంట్రల్‌కమిటీయొక్క రాజకీయనివేదిక, లెనినూ, స్టాలినూ 1917)

శ్రామికవర్గ విప్లవానికి శత్రువులైన బుఖారిన్, ప్రియోబ్రాజన్‌స్కీ-లను ఆయన తీవ్రంగా నిరసించేడు. ఈ అపర్చ్యూనిస్టులు కాన్ఫరెన్సులో రష్యా అన్నిటి కంటేముందు సోషలిస్టువిప్లవాన్ని సాగించి విజయం పొందలేదనే దృక్పథం తీసుకున్నారు. వీరి ఈ వాదాన్ని స్టాలిన్ ఖండించేడు: "మనకి దారిచూపగలంది యూరపేననే ముసలమ్మకబుర్లు వదిలిపెట్టాలి. మార్క్సిజంలో మూర్ఖంగా వెనుకటి వాటినే అంటిపెట్టుకుని చిలకపలుకులు పలికేపద్ధతీ, నూతనసృష్టిచేసేపద్ధతీకూడా వుంది. నేనీ కొసదానినే సమర్థిస్తా." ("రాజకీయ పరిస్థితులమీది తీర్మానంలో 9వ పాయింట్‌పై ప్రియోబ్రాజన్‌స్కీ ప్రశ్నకి సమాధానం." లెనినూ, స్టాలినూ, 1917)

ద్వంద్వప్రభుత్వం చాలవరకు ముగింపుకి వచ్చిందనీ, రాజకీయాధికారం బూర్జువాజీ చేతులలోకి వచ్చిందనీ ఆయన చూపించేడు. ఒక నూతనయుగారంభం అయింది. "శాంతంగా విప్లవంసాగేరోజులు గతించేయి. అశాంతయుగం ప్రారంభం అయింది. ఘర్షణలు, ప్రేలుడులు విజృంభించేయుగం ఇది....". (రాజకీయ పరిస్థితుల రిపోర్టు." లెనినూ, స్టాలినూ, 1917).

ఆరవకాంగ్రెసునిగురించి 'అంతర్యుద్ధచరిత్ర'లో ఇల్లాగ వ్రాయబడింది. "లెనిన్ దృఢనాయకత్వము, సుస్పష్టంఅయిన సరాసరిసలహాలు పార్టీ కాంగ్రెసును నడపడానికి ఉత్సాహమిచ్చాయి. లెనిన్‌యొక్క పనిని స్టాలిన్ కొనసాగించేడు. అత్యవసరమైన తప్పనిసరి కర్తవ్యనిర్వహణకై - బూర్జువాప్రభుత్వాన్ని కూలద్రోసి, శ్రామికులూ- రైతులూకలిసి అధికారం స్వీకరించడానికై -పార్టీని సమీకరించేడు."

ఈ సమయంలో స్టాలిన్ ప్రత్యక్షంగానూ, సెర్గో ఓర్జానికిజేద్వారానూకూడా లెనిన్‌తో సంబంధం పెట్టుకునివున్నాడు; ఎల్లప్పుడూ వారిద్దరిమధ్యా జాబులు నడుస్తూండేవి. సాయుధవిప్లవానికై లెనిన్‌వేసిన పథకాన్ని స్టాలిన్ పట్టుదలతో సాగించేడు.

రహస్యంగా నివసిస్తూన్న లెనిన్‌ని స్టాలిన్ కలుసుకుంటూవచ్చిన సంగతులను గురించి కామ్రేడ్ ఎస్. అలీలుయేవ్ యిలా వ్రాసేడు:

"జూలై రోజులలో మహావేశంగావున్న బూర్జువాజీయొక్క వేటనుంచి తప్పించుకుని లెనిన్ నాతోపాటుగా కొంతకాలం నివసించేడు. జూలై 6 మొదలు 11వరకూ నావద్దనే వున్నాడు. కామ్రేడ్ స్టాలిన్ లెనిన్‌ని చూడడానికి మా యింటికి వస్తూండేవాడు. లెనిన్ సెస్ట్రోరెట్‌స్కుకి (11 వ తేదీరాత్రి) వెళ్ళిపోయేటప్పుడు కామ్రేడ్ స్టాలినూ - నేనూ ఆయనతో సెస్ట్రోరెట్‌స్కు స్టేషనుదాకా వెళ్ళేం. ఈ స్టేషను బోల్షాయా నెవ్‌కాఒడ్డున నొవోయా దెరెవ్న్యా (కొత్తవీధి)లో వుండేది. వదోరోజ్‌దెస్త్వెన్‌స్కాయా వీధినుంచి స్టేషనుకంటా నడిచేవెళ్ళేం.

"రాజ్‌లీవ్‌లో రహస్యంగా తలదాచుకుంటూవున్నప్పుడూ, తర్వాత ఫిన్లండులో వున్నప్పుడూ కామ్రేడ్ స్టాలిన్‌కి యివ్వడానికై లెనిన్ నా ఎడ్రసుకి తరుచుగా జాబులు వ్రాస్తూండేవాడు. ఈ జాబులు నా ఇంటికి వచ్చేవి, వాటికి వెంట వెంటనే

సమాధానాలు ఇవ్వవలసి వస్తూండడంచేత రోజ్‌దెస్త్వెన్‌స్కాయాలోని 17 వ సంఖ్య యింట్లోకి ఆగస్టునెలలో వచ్చేసేడు. జూలై రోజులలో లెనిన్‌దాగిన గదుల లోనే ఆయన మకాంచేసేడు."

విప్లవకళలో నిధులయిన లెనిన్, స్టాలిన్‌లవంటివారి నాయకత్వాన పార్టీ సముచిత నీతివిధానాన్ని అవలంబించడంచేత శ్రామికవర్గమూ, విప్లవకారులయిన సైనికులూ, నావికులూ అంతకంతకీ అధికసంఖ్యాకులయిన రైతుల్నీ పార్టీస్వాధీనంలోకి తీసుకురాగలిగేరు.

1917 ఆగస్టులో కార్నిలోవ్ తిరుగుబాటు అణిచివెయ్యబడింది. ఈ విప్లవ వ్యతిరేకియైన సేనానాయకుడినీ, ఆయన సహాయకులనీ అణిచివేసేటందుకై ప్రజల్ని సమకూర్చేపనిలో విశేషభాగం బోల్షివిక్‌పార్టీ నాయకుడైన స్టాలిన్ పాల బడింది.

రాబోచీ ఇ సోల్దాట్‌లో 1917 ఆగస్టు 8 న వ్రాసిన వ్యాసంలో స్టాలిన్ ప్రభుత్వంయొక్క విప్లవవ్యతిరేకవిధానాలని బయటపెట్టేడు. ఈ విప్లవవ్యతిరేకుల కౌన్సిలు ఆగస్టునెలలో మాస్కోలో సమావేశంఅయినప్పుడు 'మాస్కోకౌన్సిలుకి వ్యతిరేకంగా' అనేపేరున స్టాలిన్ ఒకవ్యాసం వ్రాసేడు. దీనిలో రాజకీయంగా ముందుకువచ్చిన శ్రామికులకి ఆయనఇచ్చిన కర్తవ్యసూచనలు ఇవి:

(1) "ప్రజల ప్రతినిధి సంస్థయనే ముసుగుని ఈ కౌన్సిలు మొగంమీది నుంచి తొలగించి, విప్లవ వ్యతిరేకమూ, ప్రజా వ్యతిరేకమూనైన దాని స్వభావాన్ని బయటపెట్టడం;

(2) విప్లవరక్షణం' అనే జెండామాటున ఈ కౌన్సిలుని కాపాడుతూ, రష్యా ప్రజల్ని తప్పుదారులు పట్టిస్తూన్న మెన్షివిక్కుల్నీ, సోషలిస్టు - రివల్యూషనరీలను బయటపెట్టడం;

(3) "ఈ 'రక్షకుల' విప్లవవ్యతిరేక ప్రయత్నాలకి ....భూస్వాముల యొక్క, పెట్టుబడిదారులయొక్క లాభాలకోసం సాగించబడే విప్లవవ్యతిరేక ప్రయత్నాలకి వ్యతిరేకంగా అసమ్మతిసభలు విశేషంగా జరపడం.

"శ్రామికులు ఈమోసాలకి మోసపోరనీ, విప్లవ ఎర్రజెండాని తమ చేతులలోంచి జారిపోనీయరనీ విప్లవశత్రువులు గుర్తించెదరుగాక.

కెరన్‌స్కీప్రభుత్వం రాబోచ్ ఇ సోల్దాట్‌ని అణిచివేసేక 1917 ఆగస్టులో వచ్చిన ప్రొలిటారీ మొదటిసంచికలో 'మాస్కోకౌన్సిలు ఎక్కడ?' అంటూ స్టాలిన్ వ్యాసం వ్రాసేడు. విప్లవశత్రువుల మాస్కో కౌన్సిలుకి వ్యతిరేకంగా అసమ్మతిచూపుతూ మాస్కోశ్రామికులు ప్రారంభించిన సమ్మె నాతడు అభినందించేడు. విప్లవవ్యతిరేకుల ఈ కుట్రల నడుగడుక్కీ బయటపెట్టేడు, మాస్కో కౌన్సిలుయొక్క కార్యక్రమాన్ని సమాలోచనచేస్తూ 1917 ఆగస్టు 17 న ప్రొలిటారీలో వ్యాసంవ్రాస్తూ "అది విప్లవవ్యతిరేకతకి పట్టాభిషేకంచేయడం"తో అంతమయింది అన్నాడు.

కార్నిలోవ్ తిరుగుబాటువలన మరోఫలితంకూడా కలిగింది. ఒక్క బోల్షివిక్ పార్టీమాత్రమే తమరిని విజయంపొందగలిగేటట్లు నడిపించగలదని ప్రజలు తెలుసుకోగలిగేరు. విప్లవంలో సంపాదించిన లాభాల్ని నిలుపగలది సోవియట్ల అధికార మొక్కటేనని గుర్తించగలిగేరు. సోవియట్ల కొత్తఎన్నికలలో బోల్షివిక్కులు విజయంపొందేరు. తాత్కాలికంగా ఉపసంహరించుకోబడిన నినాదం "సర్వాధికారాలూ సోవియట్లకే" ననేది మళ్ళీ ఇవ్వబడింది.

తిరుగుబాటు ప్రయత్నాలు చెయ్యడానికీ, విప్లవం ప్రారంభించడానికీ లెనిన్ అంతకంతకి హెచ్చుగా ఒత్తిడిచేయసాగేరు. "బోల్షివిక్కులు అధికారాన్ని తీసుకోవాలి", (లెనిన్ : సెలక్టెడ్ వర్క్స్, సం. 6) "మార్క్సిజమూ : తిరుగుబాటూ" (పైదానిలోనే) అనేవానిలో ఆయన లొంగుబాటుదనం చూపుతూన్న కామెనీవ్, జినోవీవ్‌లనీ, విప్లవానికి ప్రతికూలురుగా వున్నవారినీ, తీవ్రంగా నిరసించేరు. సెప్టెంబరు 15 న జరిగిన సెంట్రల్‌కమిటీ మీటింగులో ద్రోహిమైన కామెనీవ్ ఏవిధమైన వీధికార్యక్రమాలనీ బోల్షివిక్కు లంగీకరించరనే మాట తీర్మానంలో చేర్చబడాలనీ, లెనిన్‌యొక్క జాబులు ఒక్కొక్క ప్రతి ఫైలులోకి అట్టేవుంచి మిగిలినవి తగులబెట్టాలనీ సూచననికూడా ప్రవేశపెట్టేరు. కామెనీవ్‌ని స్టాలిన్ తీవ్రముగా ఎదుర్కొని అతని ఆటలు సాగకుండా నిరోధించేరు. లెనిన్ జాబుల్ని వెంటనే చర్చలోకి తేవాలనీ, వానికి ప్రతులుతీసి, అతిప్రధానాలయిన పార్టీసంస్థలకి పంపబడాలనీ సూచనని ప్రవేశపెట్టేరు. సెంట్రల్‌కమిటీ ఈ సూచనని అంగీకరించింది.

ఈకాలంలో హెచ్చుభాగాన్ని స్టాలిన్ సాయుధతిరుగుబాటు లేవదియ్యడానికై ప్రయత్నాలు సాగించడానికీ, రెడ్‌గార్డులని నిర్మించడానికీ, శ్రామికులని సాయుధుల్ని చెయ్యడానికీ వినియోగించేరు.

విప్లవవిషయాలు చూడడానికి సోవియట్‌బ్యూరోలో సభ్యుడుగా స్టాలిన్ 1917 అక్టోబరు 10 వ తేదీన బోల్షివిక్‌పార్టీయొక్క సెంట్రల్‌కమిటీచేత నియమించబడ్డాడు. సాయుధవిప్లవాన్ని ఆరంభించడమూ, అధికారం స్వాధీనపరచుకోవడమూగురించి నిర్ణయాలు జరిగిన అక్టోబరు 10, 16 తేదీలనాటి సెంట్రల్ కమిటీ సమావేశాలలో లెనిన్, స్టాలిన్‌లు ఏకంఅయి జినోవీవ్, కామెనీవ్, ట్రాట్స్కీ మొదలయిన ద్రోహుల్ని, శకునపక్షుల్ని, విప్లవానికి భయపడేవారినీ, నిరసించి వారి సూచనలకి అర్థం విప్లవాన్ని కాలనియమం లేకుండా వాయిదావేయడమేననీ; విప్లవప్రతికూలురు బలపడడానికి తగు అవకాశాన్ని ఇవ్వడమేననీ చెప్పేరు.

అక్టోబరు 16 నాటి మీటింగులో స్టాలిన్ ఇల్లాఅన్నాడు : "వ్యవహారంలో కామెనీవ్, జినోవీవ్‌లు చెప్పేది విప్లవప్రతికూలురు తయారుకావడానికి అవకాశం ఇస్తుంది." ఈ రెండువిధానాలూ పరస్పరవ్యతిరేకా లన్నాడు : "ఒకటి విప్లవంచేపు దారితీస్తూంది; వేరొకటి విప్లవంలో నమ్మకంలేక వ్యతిరేకతమాత్రంలో తృప్తిపడుతూంది." (లెనినూ, స్టాలినూ, 1917)

అక్టోబరు 16 న జరిగిన బోల్షివిక్ సెంట్రల్‌కమిటీయొక్క విస్తృత సమావేశంలో తిరుగుబాటును నడిపించే పార్టీ కేంద్రానికి స్టాలిన్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. అక్టోబరురోజులలో పోరాన్ని నడిపించినది ఈ కేంద్రమే. తిరుగుబాటుని అణిచేసేటందుకై విప్లవ వ్యతిరేకసైన్యాలని పెట్రోగ్రాడ్‌కి తీసుకురావడానికై తాత్కాలికప్రభుత్వంచేసిన కుచ్చితాలోచనలని సెంట్రల్‌కమిటీ సాగనియ్యలేదు. రాబోచీ పథ్ అనే బోల్షివిక్‌పత్రికని (శ్రామికుల మార్గం) అణచివెయ్యడానికై కెరెన్‌స్కీ ఆజ్ఞాపించేడు. కాని ఫలితం లేకపోయింది. "ఇంక అతని మాటేమీ సాగదు." స్టాలిన్ రెడ్‌గార్డులనీ, సైనికులనీ రక్షణదళాలుగా నియమించి పత్రికని ప్రచురించేడు.

అక్టోబరు 24 న (నవంబరు 6) ప్రొద్దుట 11 గంటలకి రాబోచీ పథ్ తాత్కాలిక ప్రభుత్వాన్ని తిరగతొయ్యమని పిలుపు నిచ్చింది. అదే సమయంలో తిరుగుబాటును నడపడానికై నియమించబడిన పార్టీకేంద్రంయొక్క ఆజ్ఞలప్రకారం విప్లవకరసైన్యాలూ, రెడ్‌గార్డులూ అతివేగంగా స్మోల్నీలో కేంద్రీకరించసాగేరు.

తిరుగుబాటు ఆరంభమయింది.

ఆ రోజుననే లెనిన్ "సెంట్రల్‌కమిటీ సభ్యులకి" వ్రాసిన లేఖలో :

"ఏమైనాసరే మనం ఈవేళ సాయంకాలమే, ఈరాత్రే ప్రభుత్వాన్ని అరెస్టుచెయ్యాలి, యూకర్లనీ, పోళ్ళనీ, నిరాయుధుల్ని చెయ్యాలి.

"ఇంక ఆగడానికి వీలులేదు. మనం సర్వస్వం కోల్పోతాం........!

"ఈవేళ సాయంకాలమో, తప్పకుండా ఈ రాత్రేనో ఈ విషయం తేల్చుకోవాలి.

"బద్ధకించే విప్లవకారుల్ని చరిత్ర క్షమించదు: ఈవేళ విజయం పొందగలగవచ్చు. (తప్పకుండా ఈవేళ జయిస్తాంకూడా) రేపయితే ఎంతో నష్టపడవచ్చు. నష్టమేమిటి? సర్వస్వమూ కోల్పోవచ్చు........

"ప్రభుత్వం సందిగ్ధస్థితిలో వుంది. ఏం జరగనీ దానిని నాశనం చేసితీరాలి.

"పని ఆలస్యం ప్రమాదకరం అవుతుంది." (లెనినూ, స్టాలినూ 1917)

ఆరోజుననే రాబోచీ పథ్‌లో "మనకి కావలసిందేమిటి?" అంటూ స్టాలిన్ ఒక వ్యాసంవ్రాసేడు.

"సమయం దాటిపోతే విప్లవంయొక్క భవిష్యత్తుకే ప్రమాదంవచ్చే రోజు వచ్చింది.

"ఇప్పుడున్న భూస్వాముల, పెట్టుబడిదారుల ప్రభుత్వాన్ని నిర్మూలించి, దానిస్థానే శ్రామికుల, రైతుల ప్రభుత్వాన్ని స్థాపించాలి." (లెనినూ, స్టాలినూ 1917.)

ఆ రాత్రే లెనిన్ స్మోల్నీకి వచ్చి స్టాలిన్‌తో కలిసి సాయుధవిప్లవశక్తుల్ని నడిపించేడు.

అక్టోబరు 25 న (నవంబరు 7) ఉదయం వేళకి ప్రభుత్వం శ్రామికుల, బీదరైతుల అధీనంలోకి వచ్చేసింది.

అక్టోబరు 27 న (నవంబరు 9) మొట్టమొదటి కార్మిక - కర్షక ప్రభుత్వం స్థాపితం అయింది. లెనిన్, స్టాలిన్‌లు దానికి ప్రధానులు.

పీపుల్సు కమిస్సార్ల కౌన్సిలుని ఏర్పరచడానికై సోవియట్ల సమావేశం తీర్మానించింది. దానిమీద కౌన్సిలు అధ్యక్షుడు ; వ్లాడిమిర్ ఉల్యానోవ్ (లెనిన్): జాతుల వ్యవహారాల శాఖ అధ్యక్షుడు : టి. వి. జుగాష్విలీ (స్టాలిన్).

అక్టోబరునాటి శ్రామికవర్గ సోషలిస్టు మహావిప్లవం విజయం పొందింది. మానవజాతిచరిత్రలో ఒక నూతనయుగం, సోషలిజంయొక్క కాలం ప్రారంభమయింది. శ్రామికవర్గోద్యమంమీద రెండవ ఇంటర్నేషనలుకి - సోషల్ డెమాక్రసీకి వున్న అధికారం అంతరించింది; లెనినిజంయొక్క మూడవ ఇంటర్నేషనలుయొక్క ఆధిపత్యం ప్రారంభం అయింది.

చారిత్రక మహాసమయం వచ్చింది. శ్రామికవర్గోద్యమ మహానాయకులు ఏ గమ్యస్థానాన్ని సాధించడానికి ప్రయత్నించారో అది సఫలం అయింది. మానవజాతిలోని ఉత్తమజీవులు గన్న కలలు నిజం అయినాయి. కమ్యూనిజంయొక్క జెండా ప్రపంచంలోని ఆరోభాగంలో ఎగరసాగింది.

1917 అక్టోబరు విప్లవంనాటికి బోల్షివిక్‌పార్టీ సభ్యులసంఖ్య రెండున్నర లక్షలుకూడా లేకపోయినా శతాబ్దాలకొలదిగా సంచితం అవుతూన్న విప్లవ ఆవేశాన్ని సోషలిస్టు వుద్యమం నిమిత్తం ధారపోసిన లక్షలకొలది ప్రజలు దానికి అండగా వున్నారు. వారు ఆత్మవిశ్వాసంతో విజయంవేపుసాగి, దాన్ని సాధించేరు. శ్రామికవర్గ సోషలిస్టు విప్లవంయొక్క ఎర్రజెండాను విప్లవ కళాకుశలురైన లెనిన్, స్టాలిన్‌లు, యుద్ధాలలో ఆరితేరిన యోధులు లెనిన్, స్టాలిన్‌లు ఎత్తిపట్టుకోవడమే దీనికి కారణం.

# సోవియట్ ప్రభుత్వపు ప్రారంభదినాలు

మొదటి విప్లవకాలంలోనూ, విద్రోహశక్తుల ప్రాబల్యంవున్న కాలంలోనూ, మొదటివిప్లవం తర్వాత విప్లవోద్యమం తలెత్తసాగిన రోజులలోనూ, శ్రామికవర్గం ప్రభుత్వాధికారాన్ని స్వాధీనపరచుకున్నప్పుడూ, స్టాలిన్ కార్యవిధానాలు ఎంత ముఖ్యమూ, అసాధారణమూ, సర్వతోముఖమూనో మనంతెలుసుకున్నాం. శ్రామిక వర్గనియంతృత్వకాలంలో ఇవి వెనకటికంటేనూ అతిముఖ్యాలు. ఏమంటే సంపాదించిన అధికారాన్ని రక్షించుకోవలసివుంది. సోషలిస్టు ఆర్థికవిధానాన్ని నిర్మించుకోవాలి. పెట్టుబడిదారీ చక్రరాజ్యాలమధ్య సోషలిస్టు సమాజాన్ని నిర్మించుకురావాలి.

"అక్టోబరు విప్లవమూ : జాతీయసమస్య అంటూ స్టాలిన్ అక్టోబరు విప్లవంయొక్క విశేషప్రాముఖ్యతని వివరిస్తూ స్టాలిన్ వ్రాసింది యిది. (ప్రవదా : 1918 నవంబరు 6, 18 లు.)

"అక్టోబరు విప్లవానికి అంతర్జాతీయంగాగల మహత్తర ప్రాముఖ్యతకి కారణాలు యివి :

(1) జాతీయసమస్యయొక్క వ్యవహారరంగాన్ని అది విస్తృతంచేసింది. జాతీయపీడనని నిరోధించడం అనే ఒక ప్రత్యేక సమస్యని ఒక సర్వవ్యాపిత సమస్యగా - సామ్రాజ్యవాదంయొక్క అధికారంనుంచి పీడితదేశాలనీ, వలసలనీ, తత్తుల్యదేశాలనీ విముక్తి పొందించడం అనే సమస్యగా మార్చింది :

(2) స్వాతంత్ర్యం పొందడానికి ఎన్నో అవకాశాలనీ, సరియైన మార్గాల్నీ అది చూపించింది. ఆ విధంగా ప్రాక్పశ్చిమాలలోని పీడితదేశాలని సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా విజయవంతం అయిన పోరాటం సాగించడానికి అవసరమైన మార్గాలలోకి ఆకర్షించి, వారి స్వాతంత్ర్యపోరాటాలకి దోహదం యిచ్చింది.

(3) ఆవిధంగా అది బానిసగాచేయబడ్డ ప్రాచ్యదేశాలకీ సోషలిస్టుపశ్చిమ దేశాలకీ మధ్య సంబంధం కలుపుతూ వంతెనని నిర్మించింది. ప్రపంచసామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా నూతన విప్లవాలని సృష్టించింది. పాశ్చాత్యదేశాలలోని శ్రామికులు మొదలుకొని రష్యన్‌విప్లవంద్వారా తూర్పుభాగంలోని పీడితదేశాల వరకూ కట్టు కలపబడింది.

ప్రాచ్య - పాశ్చాత్యదేశాలలోని పీడితులయిన కష్టజీవులు రష్యన్ శ్రామిక వర్గంయెడ చూపుతూన్న విపరీతమైన ఉత్సాహానికిదే కారణం.

"ప్రపంచంలోని సామ్రాజ్యవాదచోరులు సోవియట్ రష్యామీద కౄరా వేశంతో విరుచుకుపడడాని కిదే కారణం.

అక్టోబరులోని శ్రామికవర్గపు సోషలిస్టు మహావిప్లవం కారణంచేతనే పెట్టు బడిదారీ ప్రపంచం సోవియట్ యూనియన్‌ని అంత తీవ్రంగా నిరోధించి, దండ యాత్రలు సాగించింది.

విప్లవ వ్యతిరేకులయిన బూర్జువాజీ ఆయుధాలు తీసుకొని, మిగిలిన అన్ని మార్గాలా తాము పోగొట్టుకున్న అధికారాన్ని తిరిగి సంపాదించుకునేందుకై సర్వ ప్రయత్నాలూ చేస్తుందని లెనిన్, స్టాలిన్‌లూ, బోల్షివిక్‌పార్టీ స్పష్టంగా గుర్తించేరు. బాల్యదశలోవున్న సోవియట్ రాజ్యాంగాన్ని రక్షించుకోడానికీ, విప్లవ వ్యతిరేకు లయిన రష్యనులనీ, విదేశీయులనీ తరమడానికీ, బూర్జువాజీయొక్క ప్రాతికూల్య తని అణిచివెయ్యడానికీ ఈ నూతన రాజ్యాంగం బలమైన సాయుధసైన్యాన్ని - రెడ్‌ఆర్మీని నిర్మించుకోవలసివుందనికూడా స్పష్టంగా గుర్తించేరు.

అక్టోబరులో జరిగిన సోషలిస్టు విప్లవంయొక్క ఆరంభంనాటినుంచీకూడా లెనిన్-స్టాలిన్‌ల స్కంధాలమీద బ్రహ్మాండమైన భారంపడింది. పెట్రోగ్రాడ్‌లోని స్మోల్నీ ఇన్‌స్టిట్యూట్ పోరాటం సాగిస్తున్న విప్లవశక్తులకి జనరల్ హెడ్ క్వార్టర్సు అయింది. లెనిన్, స్టాలిన్, జెర్‌ఝిన్‌స్కీ, స్వెర్‌డ్‌లోవులు రాత్రిం బగల్లు విశ్రాంతి నెరక్కుండా పనిచేసేరు.

తరవాత కొంతకాలానికి "మూడేళ్ళపాటుగా సాగుతూన్న శ్రామికవర్గ నియంతృత్వం" అనే వ్యాసంలో ఈ రోజుల్ని గురించి స్టాలినే ఇల్లాగ వ్రాసేడు.

"అక్టోబరు 24 న.... లెనిన్ నాయకత్వానవున్న బోల్షివిక్కులం మేము కొద్ది మంది మాత్రమే వున్నాం. మా అధీనంలో పెట్రోగ్రాడ్ సోవియట్ వుంది. (అది అప్పటికే బోల్షివిక్‌లది.) చాలా కొద్దిపాటి రెడ్‌గార్డుదళం వుంది. ధృఢపడి వుండని చిన్న కమ్యూనిస్టుపార్టీ.... మేము బూర్జువా ప్రతినిధుల్ని గెంటేసి, ప్రభు త్వాధికారాన్ని కార్మిక - కర్షక - సైనిక ప్రతినిధుల రెండవ కాంగ్రెసుకి అధీన పరచేం."

ప్రపంచంలోకల్లా మొదటి సోషలిస్టు రాజ్యాంగాన్ని లెనిన్, స్టాలిన్‌లు ఎలాగ నిర్మించారో స్టాలిన్ 1924 వరకూ లెనిన్‌తోకలసీ, లెనిన్ చనిపోయిన తర్వాత బోల్షివిక్‌పార్టీయొక్క సెంట్రల్‌కమిటీకి నాయకుడుగా పార్టీఅంతతోనూ కలిసి సోషలిస్టురాజ్యాంగాన్ని ఎల్లాగ వృద్ధిలోకితెచ్చేరో, దానినెల్లాకాపాడేరో: తనశక్తిని, సామర్థ్యాన్ని, విప్లవమేధస్సుయొక్క అపరాజితశక్తినీ వుపయోగించి ఏవిధంగా సోవియట్‌రాజ్యాన్ని, సోషలిస్టుభూమిని బలపరచి దుర్భేద్యంచేసేరో వ్రాయడం ప్రారంభిస్తే ఎన్నిసంపుటాలేనా వ్రాయొచ్చు.

అటువంటి రాజ్యాంగాన్ని నిర్మించడంలో ఆధారపడడానికి గతానుభవాలు ఏమీలేవు. పారిస్‌కమ్యూన్‌ని ఆదర్శంగా తీసుకోడానికికూడా అవి జీవించినరోజులే

స్వల్పం. ప్రతీదీ మొదటినుంచీ ప్రారంభించాలి; పురాతనమైన బూర్జువా రాజ్యాంగ యంత్రాన్ని నాశంచేసి. నూతనశ్రామికరాజ్యాంగం నిర్మించుకురావాలి.

1917 అక్టోబరులో బోల్షివిక్కులు ఆయుధాలు తీసుకున్నప్పుడే తాము ఎత్తుకుంటూన్న బాధ్యత ఎంతకష్టతరమో బాగా ఎరుగుదురు.

ఒక నూతన ప్రపంచాన్నే నిర్మించుకురావలసిన అనంతకార్యభారంలో మార్క్సిస్టు విజ్ఞానం విశేషంగా వారికి తోడ్పడింది. నూతన క్లిష్టసమస్యలలో వారి స్థానం ఏదో ఆమార్క్సిజం బోల్షివిక్కులకి తెలుసుకునేందుకు అవకాశంఇచ్చింది. సామాజిక పరిణామసూత్రాలని వారికి నేర్పింది. నిర్మాణకార్యక్రమానికి అపరిస్ఫుటం అయితేనేం మొదటిరేఖాచిత్రాన్ని తయారుచేసి ఇచ్చింది. విప్లవ వ్యతిరేకులయిన బూర్జువాజీయొక్క ఎదురుదాడులను ఓడించాలి. సైనికబలంతోనూ, విధ్వంసకచర్యలతోనూ భూస్వాముల-పెట్టుబడిదారుల అధికారాన్ని నిలపడానికి వారుచేసే ప్రయత్నాలని ధ్వంసంచెయ్యాలి.

ఈ నూతన సోషలిస్టు రాజ్యాంగనిర్మాణంలో స్టాలిన్ చాలాహెచ్చుగా పాటుపడ్డాడు.

ఇదివరకెప్పుడూ ప్రపంచంలో ఎరికలేని ఎన్నో కొత్తసంస్థలు సోవియట్ రాజ్యాంగంలో బయలుదేరినాయి. భిన్నజాతుల వ్యవహారనిర్వహణకై పీపిల్సు కమిస్సారియట్ ఇదివరకు ప్రపంచంలో ఎన్నడూ వుండివుండలేదు. తర్వాత కొంతకాలానికి నిర్మించబడిన పీపుల్సు కమిస్సారియట్ ఆఫ్ వర్కర్స్ అండ్ పెజంట్సు ఇన్స్పెక్టరేట్ అనేదికూడా పైమాదిరిదే. ఈ రెండు కమిస్సారియట్లూ కూడా స్టాలిన్ ఆధీనంలో వుంచబడ్డాయి.

అల్పకాలజీవియైన పారిస్ కమ్యూన్ని మినహాయిస్తే శ్రామికవర్గ రాజ్యాంగానికీ, శ్రామికవర్గ నియంతృత్వానికీ పోలిన రాజ్యాంగం మానవజాతి చరిత్రకే అపరిచితం. మిలిటరీ కార్యక్రమంలోనూ, ఆర్థికనిర్మాణంలోనూ, వెనుకటిసమాజంలోని విద్రోహశక్తుల్ని పూర్తిగా అణచి, తుడిచివెయ్యడంలోనూ, ఈ నియంతృత్వం తనశక్తిని ప్రదర్శించిందని లెనిన్ చెప్పేడు. ఒక నూతనసోషలిస్టు విజ్ఞానాన్ని నిర్మించిందన్నాడు. విప్లవం మొదటిరోజునుంచీకూడా అనేక రంగాలలో అత్యంతావసరాలయిన బాధ్యతలను బోల్షివిక్కులు ఎదుర్కోవలసివచ్చింది. పరిపాలనకు సంబంధించినవి, నిర్మాణానికి, సైన్యాలకి, ఆర్థికవిధానానికి, విద్యాశాఖకి ప్రచారం. ఆందోళనకి. విజ్ఞానానికి సంబంధించిన అనేకబాధ్యతలని వారు ఎదుర్కోవలసివచ్చింది. సిద్ధాంతాన్ని అనుసరించి పధకం నిర్మించుకోవాలి; రాబోచీ పథ్లో స్టాలిన్వ్రాసిన వ్యాసాలు అమూల్యమార్గదర్శకాలు. సోవియట్ ప్రభుత్వపు ప్రధాన శాసనాలమాదిరిగానే లెనిన్, స్టాలిన్ల సంతకాలతో 1917 నవంబరు 21న (15) ప్రకటించబడిన రష్యాలోని ప్రజలహక్కులని గూర్చిన ప్రకటన, 1918 జనవరిలో మూడవ అఖిల రష్యన్ కాంగ్రెసులో అంగీకరించబడిన పీడితులలయిన కష్టజీవుల హక్కులని గూర్చిన ప్రకటన, ఇవి స్టాలిన్తోగలిసి లెనిన్ వ్రాసేడు. ప్యాటిలోవ్

మొదలయిన కర్మాగారాల్ని స్వాధీనపరచుకునేందుకు జారీచెయ్యబడ్డ శాసనంమీద పీపుల్సు కమీస్సార్ల కౌన్సిలులో లెనిన్ నియామకాన స్టాలిన్ సంతకం పెట్టేరు.

అక్టోబరు విప్లవంలో ఆటంకాలుపెట్టిన జినొవీవ్, కామెనేవ్, రైకోవ్‌లనూ, ఇటువంటి పరీక్షసమయంలో పారిపోయిన తదితరులనీ ఎదిరించి తీవ్రపోరాటం సాగించవలసివుంది. ఈ పిరికిపందలు అల్లంత దూరంలో వుండడం క్షేమం అనుకుని, బూర్జువాజీకీ, మెన్షివిక్కులకీ, సోషలిస్టు-రివల్యూషనరీలకీ తోడ్పడ్డారు. ఈ విప్లవశత్రువులతోడి పోరాటంలో లెనిన్‌కి స్టాలిన్ పూర్తిగా సహాయపడ్డాడు.

ఇది "రెండురంగాలలో" పోరాటం. ట్రాట్‌స్కీవాదులతోటీ, సోషలిస్టు-రివల్యూషనరీ వామపక్షీయులతోటీ చేరి సోవియట్ ప్రభుత్వానికీ, కమ్యూనిస్టు పార్టీకి అనంతమైన అపకారం చేస్తూన్న 'కమ్యూనిస్టు వామపక్షీయులతో' పోరాటం సాగించి వారిని బయటపెట్టడం చాలాముఖ్యం.

సాధ్యమైనంత త్వరగా సంధిచేసుకోవడం ఆనాడు ఒక ముఖ్యసమస్య. ప్రభుత్వాధికారాన్ని ఆక్రమించుకొనేటందుకై త్వరలో శాంతిరుచిర్చే అభీప్సితంమీద బోల్షివిక్‌పార్టీ ప్రజాసామాన్యాన్ని, శ్రామికులని, రైతుల్ని, సైనికుల్ని నావికుల్ని ఏకీభవింపచేసింది. నాలుగేళ్ళయుద్ధంలో దేశంఅంతా చితికిపోయింది. ఏవిధంగానైనాసరే సామ్రాజ్యవాదయుద్ధాన్ని ఆఖరుచెయ్యాలి. ప్రజల కష్టాలని మరవడానికి వీలులేదు. ప్రపంచవిప్లవానికి అండఅయిన సోవియట్‌రిపబ్లిక్‌ని రక్షించి, దృఢపరచుకోవాలనే పట్టుదలతో ఎంత విలువ యిచ్చైనా సరే, ఎంత కొద్దికాలంపాటయినా సరే యుద్ధంలోంచి విశ్రాంతి తీసుకోవాలని లెనిన్, స్టాలిన్‌లు గుర్తించేరు. అందుచేత శీఘ్రంగా సంధి కుదుర్చుకోవాలని వారు పట్టుపట్టేరు.

యుద్ధాన్ని అంతమొందించి, ప్రజాశాంతిని కూర్చవలసిందని సోవియటు ప్రభుత్వం ప్రపంచదేశాలన్నిటికీ విజ్ఞప్తిచేసింది. కాని, బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికన్, జపాన్ సామ్రాజ్యవాదులు దానిని నిరాకరించేరు. అందువల్ల జర్మనీతో ప్రత్యేక సంధిచేసుకుని యుద్ధంలోంచి బయటపడవలసిందేతప్ప సోవియట్‌రష్యాకి మరో మార్గంలేదు. సామ్రాజ్యవాదయుద్ధపు పిడికిలినుంచితప్పించుకుని బయటపడేటందుకు జర్మనీ ఎటువంటి షరతుల్ని పెట్టినా సంధికి ఒప్పుకుతీరాలి. 'ఈసంధికార్యాన్ని భంగపరచడానికి ట్రాట్‌స్కీవాదులూ, 'కమ్యూనిస్టు వామపక్షీయులూ' తలపెట్టేరు. వారికి నాయకులు ట్రాట్‌స్కీ, బుఖారిన్, ప్యాట్‌కోవు, రాడెక్‌లు ఎంతవరకూ వెళ్ళేరంటే, సోవియట్‌ప్రభుత్వాన్ని కూలదోయడానికీ, ట్రాట్స్కీ నాయకత్వాన నూతనప్రభుత్వం స్థాపించడానికీ, లెనిన్, స్టాలిన్‌లనీ, కమ్యూనిజంమీద భక్తివిశ్వాసాలు కలిగివుండే బోల్షివిక్‌పార్టీలోని ఇతరనాయకుల్ని అరెస్టుచేసి, చంపించడానికీ బోల్షివిక్‌పార్టీకి శత్రువులయినవారితో కుట్రలుచేసేరు. శాంతివాదులయిన లెనిన్, స్టాలిన్, స్వెర్‌డ్‌లోవ్‌వగైరాలతో కామెనేవ్, జినొవీవ్, ట్రాట్స్కీయులూ తదితర 'కమ్యూనిస్టు వామపక్షీయులూ' తీవ్రపోరాటం ప్రారంభించేరు. సోవియట్ అధికారం కూలిపోవడానికికూడా 'కమ్యూనిస్టు వామపక్షీయులు' అంగీకరించేరు.

'వ్యతిరేకత మీద' స్టాలిన్ వ్రాస్తూ "పార్టీలోనే పోరాటం, బోల్షివిక్కుల మధ్య పేచీలు ఈకాలంలో బ్రెస్ట్-లిటోవ్స్కు సంధికాలంలో పెరిగినంతతీవ్రంగా ఎన్నడూ పెరగలేదు." అన్నాడు

1918 ఫిబ్రవరి 23 న బోల్షివిక్ పార్టీయొక్క సెంట్రల్‌కమిటీ మీటింగులో ట్రాట్స్కీవాదుల్నీ, "కమ్యూనిస్టు వామపక్షీయుల్నీ" ఎదుర్కోవడంలో లెనిన్‌కి స్టాలిన్ తోడయ్యేడు. "కొద్దిపాటి ఊపిరిపీల్చుకొనేందుకు అవకాశం లేదా విప్లవ క్షయం" తప్ప మరొకటి లేదన్నాడు. "ఇప్పుడున్న ప్రశ్న ఇది - మన విప్లవం ఓడిపోయి, యూరపులో విప్లవాభివృద్ధికి భంగం ఏర్పడడమా, లేక మన వునికిని బలపరచుకునేందుకు కొద్దిపాటి కాలాన్ని సంపాదించడమా ?"

లెనిన్, స్టాలిన్, స్వెర్డ్‌లోవ్‌లయొక్కా, లెనిన్ అనుచరులయిన తదితర బోల్షివిక్కుల యొక్కా పట్టుదలకి ఫలితంగా "కమ్యూనిస్టు వామపక్షీయులు" పరాజయం పొందేరు. సెంట్రల్‌కమిటీలో అధికసంఖ్యాకులు లెనిన్ స్టాలిన్‌లని సమర్థించేరు. ఆవిధంగా జరిగింది అప్పుడు. బ్రెస్ట్‌లిటోవ్స్కు సంధిషరతులు ఎంత కఠోరంగావున్నా పార్టీ సరియైన మార్గాన్నే అవలంబించింది. ఈ సంధి పత్రంమీద సంతకం పెట్టాలనే తీర్మానంజరిగిన మరునాడు 'నిరుత్సాహకరమైన ఒకసంధి" అంటూ లెనిన్ ఒక వ్యాసం వ్రాసేడు. దానిలో "సంధిషరతులు దుర్భరంగా; కఠోరంగా వున్నాయి. అయితేనేం. చరిత్ర అల్లా విధించింది. నిర్మాణం కోసం, నిర్మాణంకోసమే మనం ప్రయత్నం సాగిద్దాం. ఎన్నికష్టాలు వచ్చినా భవిష్యత్తు మనదే" నన్నాడు.

ఈ విషయంలో సోవియట్ ప్రభుత్వం చాలా ముఖ్యకార్యాలను నిర్వహించింది. జాతీయ ప్రభుత్వాల నిర్మాణానికి సంబంధించిన ఎన్నో క్లిష్టసమస్యలని పరిష్కరించింది. ఆ జాతీయ ప్రభుత్వాలమధ్యనే బయలుదేరిన అనేక సమస్యలనీ ఘర్షణలనుతీర్చింది పార్టీకీ, ప్రపంచానికీ మార్క్సిస్టు దృక్పథంద్వారా జాతీయ సమస్యాపరిష్కార పాఠాలను బోధించింది. అన్ని కాంగ్రెసులలో, కాన్ఫరెన్సులలో మీటింగులలో జాతీయ సమస్యమీద రిపోర్టుల నిచ్చేది స్టాలినే. జాతీయ సమస్యమీద అనేక ప్రధాననిర్ణయాలని ఇచ్చిందికూడా స్టాలినే. రష్యన్ సోవియట్ ఫెడరేటివ్ సోవియట్ రిపబ్లిక్ మొదటిరాజాంగచట్టాన్ని తయారుచేసింది స్టాలినే.

యూక్రేనియన్‌రాదాతో రాయబారాలు సాగించడానికై ర. సో. ఫె. సో. రి. తరఫున రాయబారిగా స్టాలిను లెనిన్ సూచనమీద 1918 ఏప్రియలు 27 న నియమింపబడ్డాడు. యూక్రేనియన్‌రాదా బూర్జువాప్రభుత్వం, ఇది విదేశీరాజ్యాల యొక్క మెన్షివిక్కుల, సోషలిస్టు-రివల్యూషనరీల సహాయంమీద అధికారంలోకి వచ్చింది. ఈయూక్రేనియన్‌రాదాకీ - సోవియట్ ప్రభుత్వానికీ పేచీవచ్చేటప్పటికి స్టాలిన్‌ని యూక్రెయిన్ పంపేరు; ద్రోహరుగానూ, దగాకోరుగానూ వ్యవహరిస్తూన్న రాడాయొక్క రాజకీయస్వభావాన్ని ఆయన అక్కడ స్థిరపరుచుకున్నాడు; ఒకమూల బూర్జువాలకీ, ఒకమూల శ్రామిక - కర్షకులకీ అధికారం విభజింపబడాలనే ధోరణి

లోవుంది. బోల్షివిక్ పార్టీ బూర్జువాజీతో అధికారాన్ని పంచుకోదు. బూర్జువాజీని అధికారంనుంచి కూలదోస్తుంది. స్టాలిన్ పార్టీఆదేశాన్ని అద్భుతంగా నిర్వహించి, రాడాతోటి పోరాటంలో యూక్రేనియన్ ప్రజలని నడిపించేడు. బైలోరష్యాని సోవియట్‌గా మార్చడంలో ఆయనచెయ్యి బాగావుంది.

తాతార్ - బష్కీర్ రిపబ్లిక్‌యొక్క రాజ్యాంగచట్ట నిర్మాణం గావించిన కాంగ్రెసుకి స్టాలిన్ ఏర్పాట్లుచేసి, దానికి అధ్యక్షతకూడా వహించేడు. ఈయనే యీకాంగ్రెసులో యిచ్చినవుపన్యాసం 1918 మే 10న ప్రవదాలో ప్రకటించబడింది. ఆ ఉపన్యాసాన్ని బష్కీర్, తాతార్‌ప్రజలకీ, పూర్వుదేశపునవున్న ముస్లిమ్ జాతులకి చేసిన విజ్ఞప్తితో ముగించేడు.

"ప్రాగ్భాగంలోని ముస్లిమ్‌దేశాలకి దాస పీడనావిధానాన్నుంచి బయటపడే మార్గంలో దీపంమాదిరిగా ఈ ఆటానమస్ రిపబ్లిక్ వ్యవహరించాలి.

ట్రాన్స్ కకేషియాలోని ప్రజల్ని మెన్షివిక్కుల, దాష్నాక్‌ల, ముసావాటిస్టుల * పాలననుంచి విడిపించడానికి స్టాలిన్ విశేషకృషిచేసేడు. బోల్షివిక్ పార్టీసభ్యులుగా తయారయిన జాతీయ దురహంకారులనుకూడా ఆయన ఎదుర్కోవలసి వచ్చింది.

సోవియట్ రిపబ్లిక్ అఖండవిజయాల్ని సాధించిన ఈ కాలాన్ని లెనిన్ "సోవియట్‌ప్రభుత్వపు విజయయాత్రా" కాలం అన్నాడు. ఇప్పుడే సోషలిస్టు ఆర్థికవిధానానికి పునాదులు వేయడం ప్రారంభంచెయ్యాలి. ఈ విషయంలో సోవియట్‌ప్రభుత్వం ఎన్నో కష్టాలను ఎదుర్కోవలసివచ్చింది. అన్నిటికంటేనూ దుర్ఘటం ఆహారవ్యవస్థ 1917 అక్టోబరులో బోల్షివిక్కులు అధికారంలోకి వచ్చినరోజున లెనిన్‌గ్రాడ్‌లో రెండురోజులకి చాలిన గ్రాసం మాత్రమే నిల్వవుంది. స్టాలిన్ ప్రతికొట్టూ, గొదామూ వెతికివెతికి పదిరోజులతిండి ప్రోగుచేసేడు. విప్లవాన్ని కరువుచేతులతో పీక నులిమి చంపేస్తామన్న ర్యాబుషిన్‌స్కీ వగైరాల మాటలు వట్టిమాటలు కావు.

అందుచేత ఆహారపదార్థాల సరఫరా సరిచేసేపని స్టాలిన్‌కి ఇవ్వబడింది. 1918 మే 29 న పీపుల్సు కమిస్సార్ల కౌన్సిలు యొక్కతీర్మానం లెనిన్ సంతకంతో వచ్చింది. "పీపుల్సు కమిస్సార్ల కౌన్సిలులో సభ్యుడూ, పీపుల్సు కమిస్సారూఆయిన జోసెఫ్ విస్సారియా నోవిచ్ స్టాలిన్ పీపులు కమిస్సార్ల కౌన్సిలు చేత దక్షిణరష్యాలో ఆహారవ్యవహారాల డైరెక్టర్ జనరల్‌గా నియమించబడ్డాడు."

దీని అర్థం "తిండికోరకై యుద్ధం" బాగా సారవంతాలయిన ప్రదేశాలన్నీ వైట్‌గార్డులచేత ఆక్రమించివేయబడి వున్నాయి. ఆహారపదార్థాల సరఫరాకోసం పనిప్రారంభించగానే స్టాలిను ఆయుధబలంతోగాని ఆహారం సంపాదించలేమని నిశ్చయించుకున్నాడు. పైనచెప్పిన పీపుల్సు కమిస్సార్ల కౌన్సిలు యొక్క తీర్మా

నానికి పూర్వమే దక్షిణానికి వెళ్ళిన స్టాలిన్ 1918 మే 23 న టెలిఫోన్‌లో లెనిన్‌తో మాట్లాడుతూ ఇల్లాచెప్పేడు.

"ఉత్తరకాకేషస్‌లో వలసినంత ధాన్యం వుంది. కాని, రైల్వే సంబంధాలు తెగిపోవడంచేత పంపడం సాధ్యంకాదు. లైన్ మనచేతిలోకి వచ్చేదాకా ధాన్యం పంపడంఅనేది లేనేలేదు. సమారా, సారటోవ్ రాష్ట్రాలకి కొన్నిదళాలని పంపేం. అయినా కొద్దిరోజులదాకా మీకు ధాన్యం పంపడం సాధ్యపడదు. పదిరోజులలో లైన్ మనచేతుల్లోకి రాగలదని మాఅభిప్రాయం. వీలయినంతవరకు గడపండి. మాంసం, చేపలూ ఇవ్వండి. అది కావలసినంత పంపుతాం ఒకవారంలో పరిస్థితులు బాగుపడతాయి."

తర్వాత కొద్దిరోజులకే స్టాలిన్ లెనిన్‌కి తంతి పంపేరు

"ఈ మార్గంలో మీకు 160 బళ్ళ ధాన్యమూ, 46 బళ్ళ చేపలూ పంపుతూన్నా. మిగిలింది సారటోవ్‌మీదుగా పంపుతా.

ఇల్లాంటి పరిస్థితుల్లో ఆహారపదార్థాల సరఫరాని నిర్మించుకురావలసి వచ్చింది. డాన్‌మండలంలోనూ, జారిజిన్ (ఇప్పుడు స్టాలిన్‌గ్రాడ్) లోనూ, విప్లవ వ్యతిరేకోద్యమం వ్యాప్తిచెంది, మహాప్రమాదకరపరిస్థితులు ఏర్పడ్డాయి. కులక్‌లు శ్రామిక ప్రజాసామాన్యానికి పరమశత్రువులు అయిన కులక్‌లు సోవియట్ ప్రభుత్వాన్ని కరువుచేతులతో గొంతునులమాలని అన్నిచోట్లా అల్లర్లు లేపుతున్నారు కులక్‌లపక్షం 'వామపక్ష, సోషలిస్టు రివల్యూషనరీలు 1918 జూలై ప్రారంభంలో మాస్కోలో చేసిన తిరుగుబాటుతో పరిస్థితులు మరింత విషమించేయి.

జారిజిన్‌లో 'వామపక్ష' సోషలిస్టు - రివల్యూషనరీలు అల్లర్లు చెయ్యగలరేమో నంటూ లెనిన్‌వ్రాసిన జాబుకి స్టాలిన్ ఇచ్చిన సమాధానం యిది:

"ఏమీ కంగారుపడద్దు. ఒక్క శివా లెక్కితే మనచెయ్యి వెనకాడుతుందనుకోకు, మన శత్రువుల్ని శత్రువులగానే చూస్తాం.

ఆహారపదార్థాల సరఫరా నిర్మించుకురావడంలో స్టాలిన్ చేసినంతపని చెయ్యగలవానిని మరొకర్ని వెతకడం కష్టం. స్టాలిన్ జారిజిన్‌కి పోవడానికి లెనిన్ ఎంతో ప్రాముఖ్యత నిచ్చేరు. "కష్టజీవు లందరికీ" పీపుల్సు కమిస్సార్ల కౌన్సిలు చేసిన ప్రకటనలో యిల్లావుంది:

"సైబీరియన్ రైల్వేలోని కొన్ని ముఖ్యజంక్షన్‌లని విప్లవ వ్యతిరేకులు స్వాధీనపరచుకోవడం వలన మాడిపోతూన్న మనదేశానికి ఆహారపదార్థాలు కొంతకాలం సరఫరా కాకపోవచ్చు. కాని, రష్యన్, ఫ్రెంచి, బ్రిటిష్, జెకోస్లోవాకియన్ సామ్రాజ్యవాదులు విప్లవాన్ని మాడ్చి లొంగదియ్యగలగడం అసంభవం. మాడిపోతూన్న ఉత్తరప్రాంతాలకి ఆగ్నేయప్రాంతాలు (S. E.) సాయం వస్తున్నాయి. పీపుల్సు కమిస్సార్ స్టాలిన్ యిప్పుడు జారిజిన్‌లో వుండి డాన్‌ప్రాంతంనుంచీ, క్యూబాన్‌నుంచీ ఆహారం సంపాదించేటందుకై ప్రయత్నాలు సాగిస్తూన్నారు.

ఒక వారంలోపున పెద్దపెద్దమొత్తాల ధాన్యాన్ని ఉత్తరానికిపంపగలనని వూహిస్తూ మనకి తెలియబరిచేను."

సైన్యాలలో ట్రాట్స్కీ అవలంబిస్తూన్న విధానం ప్రమాదకరమూ, కుచ్చితమూనని స్టాలిన్ తెలుసుకున్నాడు. యుద్ధరంగంలోని ప్రమాదకరఘట్టాలను లెనిన్‌కి వెంటనే తెలియపరచి, వైట్‌గార్డులకీ, విదేశీ ఆక్రమణకారులకీ అనుకూలం అయిన కుటిలవిధానాన్ని ట్రాట్‌స్కీ అవలంబిస్తున్నాడని ప్రకటించేను. సైన్యాలని నడిపించే పూచీ ట్రాట్‌స్కీ చేతులనుంచి తీసుకోవాలని తెలియపరచేను. లెనిన్ స్టాలిన్‌నందు విశేషమైన నమ్మకం వుంచి, "క్రమస్థితిని స్థాపించి, దళాలని దృఢపరచి రెగ్యులర్ యూనిట్లని నిర్మించి, సరియైన నాయకత్వాన్ని స్థాపించి, చెప్పినమాట విననివారిని తొలగించడానికి" అధికారం యిచ్చేను. (స్టాలినూ : రెడార్మీ"లో వారోషిలోవ్ ఉదాహరించేను.)

దక్షిణరంగంలోని విప్లవసమితియొక్క నిర్వహణం స్టాలిన్ తన చేతుల్లోకి తీసుకున్నాడు. కొద్దికాలంలోనే రెడార్మీని పునస్సంఘటన పరచేను. బలీయమైన డివిజన్లు, బ్రిగేడ్సు - రెజిమెంట్లు, ఏర్పరచేడు. మిలిటరీసరఫరాలని బాగుపరచేడు. సైన్యంలోనూ, వెనకాలనూ విప్లవవ్యతిరేకులు లేకుండా తుడిచిపెట్టేసేడు. ఈ మహత్కార్యాన్ని నిర్వహించడంలో ఆయనకి వారోషిలోవ్, కిరోవ్, ఓర్జొనికిడ్జే, బుడెన్నీ, ష్చాడెన్‌కో, మెఖ్లిస్‌వంటి విశ్వాసపాత్రులయిన సహచరులు విశేషంగా తోడ్పడ్డారు.

స్టాలిన్‌యొక్క ప్రయత్నాలకి వ్యతిరేకంగా ట్రాట్స్కీ పంపిన వ్రాతమూలకమైన ఆదేశంమీద స్టాలిన్ "లెక్కచెయ్యవద్దు" అని వ్రాసేసేడు. స్టాలిన్ తీసుకున్న సరియైన ఖరాఖండీ పద్ధతులఫలితంగా జారిజిన్‌రంగం దృఢపడింది. శత్రువు ఓడించబడి డాన్‌నది కావలికంటా తరిమివెయ్యబడ్డాడు.

ఆయుధాలు చేతిలో పట్టుకుని సోవియట్ రిపబ్లిక్‌ని రక్షిస్తూన్నప్పుడుకూడా స్టాలిన్ రెండోఆయుధాన్ని వదలలేదు. ఎప్పుడూ వ్రాతని మానలేదు. ఈ రోజులలో ఆయన ప్రవదాకి వ్రాసిన వ్యాసాలలో విప్లవంయొక్క కొన్ని సమస్యలు బోల్షివిక్ దృక్పథంతో చర్చించబడి, బోల్షివిక్ సమాధానాలు యివ్వబడ్డాయి. మార్క్సిజానికి శత్రువులయినవారి నోళ్ళ నవి మూయిస్తాయి

"అక్టోబరువిప్లవమూ : జాతీయసమస్యా" అనేది వీటిలో ఒకటి. (ప్రవదా నవంబరు 6–9–1918) తర్వాత నిది "మార్క్సిజమూ : జాతీయ, వలసదేశ సమస్య" అనేదాంట్లో కలపబడింది.) ప్రవదాకి వ్రాసిన వ్యాసాలేగాక జారిజిన్ లోని పత్రికలకికూడా ఎన్నో వ్యాసాలు వ్రాసేడు.

సోవియటు రిపబ్లికుయొక్క ఆరంభదినాలలో స్టాలిన్ నిర్మాణంలోనూ, పరిపాలనకి, ఆర్థికవిధానానికి, సైనికవ్యవహారాలకీ సంబంధించిన విషయాలలోనూ, అద్భుత నైపుణ్యం ప్రదర్శించేడని తెలుసుకున్నాం. పార్టీలో విశేషమైన ప్రతిష్ఠ సంపాదించేడు. ఆయనయందు అందరికీ విశ్వాసం హెచ్చింది. విప్లవకార్యాంగ

ఆయన మనస్ఫూర్తిగా పనిచేస్తున్నాడనీ. ఆయన మానసికశక్తులన్నీ వానిని రక్షించేటందుకూ. సంపాదించిన లాభాల్ని దృఢపరచుకునేందుకూ కేంద్రీకరిస్తున్నాడనీ అందరికీ తెలుసు. ఆయాసం ఎరగకుండా పనిచేసి. సోషలిస్టువిప్లవం నిమిత్తం ఆత్మసమర్పణచేసి పైకి వచ్చేడు.

విప్లవం ఆయనకి గురువు. విశేషసంఖ్యాకులయిన ప్రజలని నడుపుతూ, వారినుంచీ, విప్లవంనుంచీ, స్టాలిన్ జ్ఞానాన్ని ఆర్జించేడు.

# అంతర్యుద్ధం

అంతర్యుద్ధం లేకుండా శ్రామికవర్గనియంతృత్వం స్థాపించబడుతుందనికాని, నిలబడుతుందనికాని, సోవియట్‌రాజ్యాంగం నిర్మించబడుతుందనికాని—అక్టోబరులో జరిగిన శ్రామికవర్గంయొక్క సోషలిస్టు మహావిప్లవంవలన త్రోసివెయ్యబడిన దోపిడిచేసే వర్గాలు భయంకరంగా పోరాడకుండా వట్టినే తొలగిపోతారనికాని, బోల్షివిక్కు లెన్నడూ విశ్వసించియుండలేదు.

విప్లవకరవిధానంలో రష్యా యుద్ధంలోంచి బయటపడడమే సామ్రాజ్యవాద యుద్ధం అంతర్యుద్ధంగా మార్పుపొందడం. వెంటనే సోవియటు ప్రభుత్వంతో యుద్ధం చెయ్యడానికి రష్యాదేశపు బూర్జువాజీ, విదేశీయబూర్జువాజీకూడా తమ శక్తుల్ని కూర్చుకున్నారు. బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదులూ, రష్యన్‌విప్లవ వ్యతిరేకులూ, కాడెట్లూ, మెన్షివిక్కులూ, సోషలిస్టు - రివల్యూషనరీలూ అతి జాగ్రత్తగా నడిపించి జెకోస్లోవాక్ పటాలాలచేత తిరుగబడేటట్లు చేయడమే సోవియట్ ప్రభుత్వానికి విరుద్ధంగా సామ్రాజ్యవాదులు రేపెట్టిన అంతర్యుద్ధం ఆరంభం కావడం మొదలు.

" 1918 మొదటి ఆరునెలలలోనే రెండు స్పష్టమైన శక్తులు రూపొందేయి. సోవియట్ అధికారాన్ని కూలద్రోసేటందుకై అవి సిద్ధంఅయ్యేయి. మిత్రరాజ్యాల విదేశీ సామ్రాజ్యవాదులూ, స్వదేశంలోని విప్లవ వ్యతిరేకులూ.... " (సో. యూ. క. పా. (బో) చరిత్ర)

" సోవియటు ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరపవలసిన పోరాటంయొక్క పరిస్థితులు విదేశీయులూ, స్వదేశీయులూ అయిన రెండు సోవియట్ వ్యతిరేక శక్తులూ ఏకం అయ్యేటట్లు చేసేయి. ఈ ఐక్యత 1918 మొదటి అర్థభాగంలోనే సమకూడింది.

" సోవియట్‌ప్రభుత్వానికి వ్యతిరేకంగా విదేశీయు లారంభించిన సైనికాక్రమణకి స్వదేశంలోని విప్లవ వ్యతిరేకుల తిరుగుబాట్లు సాయపడడానికిగల మూలం యిది.

" దీనితో రష్యాలో విశ్రాంతికాలం ఆఖరయింది. అంతర్యుద్ధం ఆరంభం అయింది. యిది రష్యాలోని భిన్నజాతులకి సంబంధించిన కూలీలూ - రైతులూ సోవియటుప్రభుత్వానికి శత్రువులయిన విదేశీయులతోటీ, స్వదేశీయులతోటీ సాగించిన పోరాటం " (సో. యూ. క. పా. (బో) చరిత్ర పుట. 226)

రష్యాలోని వేరువేరుభాగాలలో ఏర్పడిన అయిదు ప్రధానరంగాలూ విశేష సామర్థ్యాన్ని చూపవలసిన అవసరాన్ని సృష్టించేయి. విప్లవ ప్రతికూలుర ప్రధాన సైన్యాలు కోల్చక్ నాయకత్వాన తూర్పురంగంలోనూ, డెనికిన్ నాయకత్వాన దక్షిణ రంగంలోనూ, రోజ్యాంకో, యుడేనిచ్‌ల నాయకత్వాన వాయువ్యరంగంలోనూ, పోలిష్‌రంగంలోనూ, రాంగెల్ రంగంలోనూ, కేంద్రీకరించి వున్నాయి. అంతర్యుద్ధ దినాలలో పార్టీయొక్కా, ప్రభుత్వంయొక్కా శక్తులలో పదింట తొమ్మిదిభాగాలు సోవియట్‌ప్రభుత్వ శత్రువుల నెదిరించడానికే వినియోగించబడినాయి. కమ్యూనిస్టు పార్టీయొక్కా, యువకమ్యూనిస్టు సమితి యొక్కా సభ్యులలో నూటికి ఏభయి మంది-యుద్ధప్రదేశాలలో నూటికి నూరుగురూ కూడా వైట్‌గార్డులన్నీ, విదేశీ ఆక్ర మణకారులన్నీ, నిరోధించడానికై సైన్యాలలోకి కూర్చబడ్డారు.

పోరాటం సాగించడంలో స్టాలిన్ చేసిన కృషి అత్యద్భుతం. దానినిగూర్చి వరోషిలోవ్ ఏమిచెప్పేడో వినండి :

"1918–20 ల మధ్య ఒకరంగంనుంచి మరొకరంగానికి, బాగా దుర్బ లంగా వున్న ప్రదేశాలుచూసి, ఎక్కడైతే విప్లవానికి విశేషప్రమాదం కలుగుతుం దనే శంక వుందో అక్కడికల్లా సెంట్రల్‌కమిటీ మార్చినది ఒక్క స్టాలిన్‌నే అనుకుంటా." (కె. వొరోషిలోవ్, 'స్టాలినూ : రెడార్మీ :)

అత్యంతావసరమైన ఆహారపదార్థాల సరఫరా నిర్మించడానికై పార్టీ ఆదేశం ప్రకారం పూనుకుని వుండడంచేత స్టాలిన్ విప్లవ ప్రతికూలురని వోడించి, వారు స్వాధీనపరచుకున్న ప్రదేశాలని విడిపించడంకోసం సైనిక వ్యవహారాలనికూడా తీసుకోవలసివచ్చింది.

ఒక్కొక్కబుషెల్ ధాన్యంకూడా ఎంతో అమూల్యంగా వుండి, అసాధారణ శ్రమపడి సంపాదించవలసివచ్చిన ఈరోజుల్లో, దేశం విదేశీయాక్రమణకారులచేత చుట్టివెయ్యబడి, దిగ్బంధపు బంధనాలలో చిక్కి, సామ్రాజ్యవాదయుద్ధ ఫలితంగా దారిద్ర్యంలో మునిగి, కరువుతో మాడిపోతూన్న ఈ కష్టసమయంలో లెనిన్, స్టాలిన్‌లు శత్రువుల్ని వెనక్కి తరిమి వోడించడానికై తమసర్వశక్తులూ వినియో గించి చేసిన పనుల్ని అడుగడుక్కీ చూపగల అనేకరచనలూ, ఫిలింలూ, నాట కాలూ మనకి దొరుకుతున్నాయి. విప్లవవ్యతిరేకుల ఈ వోటమిలో స్టాలిన్‌ది ప్రముఖపాత్ర. 1918 ఆగస్టు 4 న జారిజిన్‌నుంచి లెనిన్‌కి జాబువ్రాస్తూ అందులో "మొదటినుంచీ మళ్ళీ అంతా ప్రారంభించవలసివచ్చింది: సరఫరావిషయం ఏర్పాటుచేసేం : సైనికసంచాలకశాఖని స్థాపించేం, రంగంలోని అన్నిభాగాలతోటీ సంబంధం ఏర్పరిచేం, వెనకటి ఆజ్ఞల్ని - దుర్బుద్ధితో చేసిన ఆజ్ఞలని చెప్పక తప్పదు, వాటిని - రద్దుచేసి పారవేసేం, యివన్నీ జరిగినాకనే కలాక్ మీదనూ, యిల్లాదక్షిణంగా టిఖోరెట్‌స్కీమీదనూ దండయాత్ర ప్రారంభించేం" అన్నాడు.

వెనకటి జారిస్టుసైన్యం కూలిపోయింది. నూతనసైన్యం, రెడార్మీ తయా రవుతూంది అప్పుడే. ఈసైన్యనిర్మాణంలో స్టాలిన్ విశేషకృషిచేసేడు. అంత

ర్యుద్ధప్రారంభంలో దానిలో అన్నితరహాల జనం ప్రోగుపడి, అది విస్తారంగా పెరిగింది. గోరిల్లాపద్ధతులు - వట్టి అసహ్యకరమైన పద్ధతులు ఒకే ఒక నాయకత్వం, సైనికక్రమశిక్షణగల రెగ్యులర్ సైన్యోత్పత్తికి అభ్యంతరంగా తయారయినాయి. ఎన్ని చిక్కులున్నా సరే, రెగ్యులర్ రెడార్మీని నిర్మించితీరాలి. పార్టీ యొక్క ఎనిమిదవకాంగ్రెసులో మిలిటరీ వ్యతిరేకత కొంతవరకూ బాగా బలంగానే వుందని చెప్పాలి. రెడార్మీలో క్రమశిక్షణారాహిత్యాన్నీ గోరిల్లాపద్ధతులనీ ప్రోత్సహించేవారూ, విశ్వాసపాత్రులైన బోల్షివిక్కులేమైనా, ట్రాట్స్కీ కార్యనిర్వహణకి అసంతృప్తులైనవారూ, ఆతడు కమ్యూనిస్టులవిషయంలో వ్యవహరిస్తూన్న ద్రోహపద్ధతులకిఅయిష్టంపొందినవారూ ఈ 'వ్యతిరేకపక్షం'లోవున్నారు. ఎనిమిదవకాంగ్రెసు గెరిల్లాపద్ధతులని తొక్కేసింది. అదే సమయంలో ట్రాట్స్కీ అవలంబిస్తూన్న ప్రమాదకరపద్ధతులకి వ్యతిరేకంగా ఎన్నో నిర్ణయాలుచేసింది. క్రమశిక్షణగల రెడార్మీని తయారుచెయ్యడానికై చేసిన పోరాటంలో ఈ ఎనిమిదో కాంగ్రెసులో స్టాలిన్ లెనిన్‌తో చేరి పనిచేసేడు. "మనం నిజమైన శ్రామిక - కర్షక సైన్యాన్ని-ప్రధానంగా కర్షకసైన్యాన్ని, మంచి క్రమశిక్షణగలదాన్ని తయారుచేసుకుని, రిపబ్లిక్‌ని రక్షించుకోవడమో లేక చావడమో తప్ప మారులేదు."— అన్నాడు, ఆయన. (సో. యూ. క. పా. (బో) చరిత్రలో వుదాహరించబడింది.)

ఎన్నతగిన సేనానాయకుడుగానూ, మంచి అనుభవంవున్న వ్యూహనిర్మాతగానూ, స్టాలిన్ అంతర్యుద్ధకాలంలోనే తెలిసిపోయేడు. 1918 ఆఖరురోజుల్లో తూర్పురంగంలో మరీ క్లిష్టస్థితి ఏర్పడింది. కోల్చక్ పెర్మ్ పట్టుకున్నాడు. ఉత్తర భాగం ఆక్రమించుకుని అక్కడవున్న విదేశసైన్యాలతో కలిసే ప్రమాదం ఏర్పడింది. అసమర్థులయిన సేనాధిపతుల చేతులలోవున్న మూడవసైన్యం విపరీత నష్టాలకి గురి అవుతూ, చెల్లాచెదరుగా తిరోగమిస్తూంది. పార్టీ సెంట్రల్‌కమిటీ "సెంట్రల్‌కమిటీలోని ఇద్దరుసభ్యులు జెర్జిన్‌స్కీ, స్టాలిన్‌లతోకూడిన పార్టీ యొక్క ఒక విచారణసంఘాన్ని నియమించి పెరమ్ ఏల స్వాధీనపరచబడవలసి వచ్చిందో, ఉరల్‌రంగంలోని అపజయాలకి కారణాలను, ఇప్పుడున్న పరిస్థితులను పూర్తిగా విచారణచేయడానికి" నిశ్చయించింది. (కె. వరోషిలోవ్ "స్టాలినూ : రెడార్మీ")

వట్టి విచారణసాగించి వూరుకోవడం స్టాలిన్ స్వభావంకాదు. సైన్యం దృఢపడడానికి అవసరమైన నిర్మాణపద్ధతుల నెన్నింటినో ప్రవేశపెట్టేడు. ఆయుధాలు సమకూర్చేడు. అసమర్థులయిన నాయకుల్ని తొలగించేడు. ఆ జిల్లాలోని పార్టీ పనినీ, సోవియటుసంస్థల పనినీ వృద్ధిపొందించేడు. అక్కడ శ్రామికవర్గ నియంతృత్వానికి చెందిన సంస్థల్ని దృఢపరిచేడు. "ఈ పను లన్నింటికీ ఫలితంగా శత్రువుయొక్క పురోగమనం నిలచిపోయింది. అంతేకాదు. 1919 జనవరినెలలో తూర్పురంగం దండయాత్ర ప్రారంభించింది. కుడిభాగంలో ఉరాల్‌స్కు స్వాధీనపరచుకోబడింది. "ప్రమాదకారణాలని విచారించడం" అనేపనిని కామ్రేడ్ స్టాలిన్

ఏవిధంగా గుర్తించి, పూర్తిచేసేదో దీనివలన తెలుసుకోవచ్చు. ఈ కారణాలని విచారణచేసి, అక్కడికక్కడే సరిచేసి, తన ప్రయత్నాలతో వానిని తొలగించి, అవసరమైన అభివృద్ధులు చేసేడు." (మైదానిలోనే)

ఫ్రుంజే, క్యుబిషేవ్‌లు తూర్పురంగాన్ని రద్దుచేసి పార్టీకి విశేషసహాయం చేసేరు.

ఇప్పటికే కోల్చక్ తీవ్రపరాజయాలు పొందినా, ఆయన పురోగమనం నిలిచిపోయినా, ఇంకా పూర్తిగా ధ్వంసం కాలేదు. తూర్పునుంచి రెడార్మీలని మరల్చడానికీ, ఆవిధంగా కోల్చక్‌కి సాయంచెయ్యడానికీ వుద్దేశించి విదేశీయ ప్రభుత్వాలు వైట్‌గార్డుల సహాయంతో పెట్రోగ్రాడ్‌ని పట్టుకోవడానికి ఒకపథకం వేసేరు. దీనికొరకై శత్రువులు ఇస్తోనియాదేశంలో జనరల్ యుడేనిచ్ నాయకత్వాన సైన్యాలు కూర్చేరు. ఇవి అతివేగంగా పెట్రోగ్రాడ్‌పైకి సాగి, విప్లవానికి పుట్టినిల్లయిన ఆ నగరాన్ని ప్రమాదంలోకి తెచ్చేయి. పెట్రోగ్రాడ్‌లో, క్రాన్‌స్టాట్ లోవున్న బాల్టిక్ నౌకాదళంలో, శత్రువుల ఏజంట్లూ, ఆఫీసర్లలోనే ద్రోహులూ వున్నారు. దీనివలన శత్రువు బాగా సంరక్షితాలయివున్న బలమైన ప్రదేశాలనీ, క్రాస్నాయా గోర్కా, సెరాయా లోషాడ్‌వంటి దుర్భేద్యాలనుకున్న కోటలనీ పట్టుకోగలిగేడు. జనరల్ బులాక్-బలాఖోవిచ్ ఆధీనంలో వైట్‌గార్డుసేనలు ప్స్కొవ్‌నుంచి బయలుదేరేయి.

పరిస్థితి చాలా ప్రమాదకరంగా వుంది. ఈ ప్రమాదపరిస్థితుల్ని ఎదుర్కోడానికి స్టాలిన్‌ని నియోగించేరు. బహుకఠోరహస్తంతో ఈ రంగంలో ఆయన క్రమశిక్షణ నెలకొల్పేడు. సైన్యంలో రాజకీయప్రచారం సాగించేడు. తప్పకుండా సరఫరాలు అందేటట్లు ఏర్పాటు చేసేడు. రెడార్మీభటులలో ఆత్మవిశ్వాసం కలిగించేడు. అవసరమైన బలాలని సహాయంతెచ్చేడు. శత్రువులనీ, ద్రోహులనీ నిర్దాక్షిణ్యంగా నాశనంచేసేశాడు. "పేరుపడ్డనిపుణులు" క్రాస్నాయా గోర్కా, సెరాయా లోషాడ్‌లవంటి కోటల్ని సముద్రంమీదినుంచి పట్టుకోవడం అసంభవం అని చెప్పేరు. కాని స్టాలిన్ ఆజ్ఞలమీద ఈకార్యం నిర్వహించబడిపోయింది. వెంటనే ఈ విషయం లెనిన్‌కి తంతిచేసేడు :

"క్రాస్నాయా గోర్కా కోట పట్టుబడ్డాక సెరాయా లోషాడ్‌ను పట్టుకున్నాం. అక్కడ ఫిరంగులు లిప్పుడు మంచి స్థితిలోనే వున్నాయి.....క్రాస్నాయా గోర్కాని సముద్రంమీదినుంచి పట్టుకోవడం నౌకావిజ్ఞానానికి వ్యతిరేకం అని నిపుణులు చెప్తున్నారు, "నిపుణులు" అనబడే వారిగతికి నేను చాలా విచారిస్తున్నా. సైన్యవ్యవహారాలలో నేనూ, సివిలియన్లూ కలగచేసుకుని, నేలమీదా, సముద్రం మీదాకూడా ఆజ్ఞలని రద్దుచేసి, నాయాజ్ఞలను ప్రవేశపెట్టడందాకా వెళ్ళడానికి ఫలితం ఈ గోర్కాని ఇంతత్వరగా పట్టుకోగలగడం. "నిపుణులు" అంటే నాకెంతో భక్తివున్నా భవిష్యత్తులో నేను ఈ విధంగానే వ్యవహరిస్తానని ప్రకటిం

పడం నా కర్తవ్యం అని భావిస్తున్నా." (వొరోషిలోవ్ "స్టాలిన్ : రెడార్మీ" లో వుదాహరించేడు.)

ఒక్క ఆరురోజుల తర్వాత పరిస్థితులు బాగుపడ్డాయనీ, శత్రువు తిరోగమిస్తున్నాడనీ లెనిన్‌కి రిపోర్టు చెయ్యగలిగేడు. శత్రువు ఇస్తోనియాలోకి తరిమివెయ్యబడ్డాడు. దీనివలన కోల్చక్‌నికూడా వోడించడం సులభం అయింది. చావగా మిగిలిన తనసైన్యాలతో ఇర్‌కుట్‌స్క్‌కి పారిపోయేడు. కాని, ఇర్‌కుట్‌స్క్‌లోని సోవియట్ అధికారులు అయనని అరెస్టుచేసి కాల్చివేసేరు. కోల్చక్‌యొక్క పూర్తిపరాజయం ట్రాట్‌స్కీకి సమ్మతంకాదు. అందుచేత అతనిని వెంటబడి తరుముతూన్న సైన్యాలు ఆపబడాలని చెప్పేడు. కాని స్టాలిన్ ఒప్పుకోలేదు. కోల్చక్‌పరాజయానికి పథకంవేసి, సాగించినది స్టాలినే. కాని, దీనితోవిదేశీయుల ఆక్రమణా, విప్లవ - వ్యతిరేకతా ఆఖరయ్యేయని అనుకోడానికి వీలులేదు. విదేశీయ ప్రభుత్వాలు తమ ఆశలన్నీ జనరల్ డెనికిన్‌మీద పెట్టుకుని వున్నారు. డ్యాన్ ప్రాంతం అంతా అప్పటికి వాడిచేతిలోవుంది. ఆఫీసర్లు, కాడెట్లు, మొదలయిన వైట్‌గార్డులనీచుల్ని చేర్చి డెనికిన్ 'విద్రోహ' సైన్యాన్ని తయారుచేస్తూన్నాడు. విదేశీయప్రభుత్వాలనుంచి ఆయుధాలనీ, పరికరాలనీ, ధనాన్నీ, సామగ్రినీ సంపాదించి డెనికిన్ 1919 వేసవిలో దండయాత్రఆరంభించేడు. సాధ్యమైనంతవరకూ డెనికిన్ యొక్క పురోగతికి అవకాశా లిచ్చేపద్ధతిగా ట్రాట్‌స్కీ పథకాలు వేసేడు. తత్ఫలితంగా సెప్టెంబరు ఆఖరునాటికి డెనికిన్ సేనలు ఓరెల్‌ని ఆక్రమించుకొని, మాస్కోకి నాలుగుగంటల ప్రయాణంలో వున్న గొప్ప ఆయుధకర్మాగారంవున్న తులాని సమీపించగలిగేడు.

ఈ సమయంలో "డెనికిన్‌తో పోరాటానికి అంతా రాండి" అనే పిలుపు నిచ్చింది బోల్షివిక్‌పార్టీ. శ్రామికులూ, రైతులూ అతిఆతురతతో సోవియట్ ప్రభుత్వానికి దాసటగా వచ్చేరు. జనరల్ డెనికిన్ నెగ్గితే మళ్ళీ పెట్టుబడిదారీ విధానం స్థాపించబడుతుందనీ, జారూ, భూస్వాములూ తిరిగివస్తారనీ, వారికి తెలుసు. డెనికిన్‌ని వోడించడానికై బోల్షివిక్‌పార్టీ వరోషిలోవ్‌నీ, ఓర్జానికిడ్జే, కిరోవ్, బుదెన్నీ షాడెన్‌కో, మిర్జిస్‌లను దక్షిణరంగానికి పంపింది. రెడార్మీని నడిపించేపనిని సెంట్రల్‌కమిటీ ట్రాట్‌స్కీచేతులలోనుంచి తీసుకుని, సైన్యాన్ని నాశనంచేసివుండే అతని కుచ్చితపద్ధతిని నిరాకరించింది. ఎక్కడా రోడ్లులేని దేశంగుండా రెడార్మీని పురోగమింపచెయ్యాలని అతని ఎత్తు, ఈ ప్రదేశాలన్నింటా విప్లవ వ్యతిరేకుల యెడల సానుభూతివున్న కోసక్కులు హెచ్చుగావున్నారు. స్టాలిన్ దీనికి కేవలమూ వ్యతిరేకమైన విధానాన్ని సూచించేడు. కార్ఖోవ్, డాన్‌బేసిన్, రోస్టావ్‌ల మీదుగా రెడార్మీయొక్క ముఖ్యమైనగతి సాగాలని ఆయన సూచన. స్టాలిన్ సూచనే అంగీకరించబడి, కార్యరూపంలో పెట్టబడింది. ఫీల్డు హెడ్‌క్వార్టర్సుకి లెనిన్ స్వయంగా స్టాలిన్‌యొక్క విధానాన్ని అమలుపరచాలని వ్రాసేడు. డెనికిన్ తరిమివెయ్యబడ్డాడు. 1920 ప్రారంభంలో యావత్తు యూక్రెయినునుంచీ, ఉత్తర

కాకేషస్‌నుంచీ. వైట్‌గార్డుసేనలు తరిమివెయ్యబడ్డాయి. ఈ పోరాటంలో స్టాలిన్ నిర్దేశాలమీద మొదటి అశ్వికసైన్యం చాలా ప్రముఖకార్యాలని నిర్వహించింది.

కోల్చక్, యుదేనిక్, డెనికిన్‌ల పరాజయాలు చాలా ప్రధానాలు. దీనివలన ఇంగ్లండు, ఫ్రాన్సు, ఇటలీలు సోవియటు యూనియనుపై దిగ్బంధవిధానాన్ని వదులుకోవలసివచ్చింది. కాని, కలుగజేసికోవడ మిప్పుడుకూడా ఆఖరు కాలేదు. 1920 అగస్టులో దక్షిణాన మళ్ళీ తీవ్రశత్రువులు బయలుదేరేరు. ఈ మారు బేరన్ రాంగెలు విప్లవవ్యతిరేకుల 'నాయకుడు'. అగస్టు 2, 1920 నాడు పార్టీసెంట్రల్ కమిటీ ఈవిధంగా తీర్మానించింది.

"రాంగెల్ పొందుతూన్న విజయాలు, కూబాన్‌లోని కలవరపాటూ చూస్తే, రాంగెల్‌రంగం విశేషప్రాముఖ్యతగల ప్రత్యేకరంగంగా గుర్తించాలి. దానికి ప్రత్యేకశ్రద్ధతీసుకుని వ్యవహరించాలి. ఒక రివల్యూషనరీ మిలిటరీ కౌన్సిలుని ఏర్పాటుచేసి, కామ్రేడ్ స్టాలిన్ తనసర్వశక్తులూ రాంగెల్‌రంగానికి కేంద్రీకరించాలని నిర్దేశిస్తూంది." (వొరోషిలోవ్, స్టాలినూ, రెడార్మీనుంచి)

సోవియటుప్రభుత్వాన్ని కూలద్రోయగల శక్తులు లభిస్తాయనే ఆశతోనే వున్నాయి, విదేశీప్రభుత్వాలు. 1920 ఏప్రియలులో దక్షిణాన రాంగెల్ సైన్యసంచాలనం ప్రారంభించినప్పుడు సామ్రాజ్యవాదుల ప్రోత్సాహాన పోలిష్‌ప్రభుత్వం సోవియట్లపై దండయాత్ర ప్రారంభించింది. 1920 ఏప్రియలులో పోలిషుసైన్యం యూక్రెయినుపై దాడిచేసి, కీవ్‌ని పట్టుకుంది.

నైరృతిరంగం (S. W.)లో రివల్యూషనరీ మిలిటరీ కౌన్సిలులో స్టాలిన్ సభ్యుడుగా నియమించబడ్డాడు. ఈ రంగంలో విజయం కలగడానికి స్టాలిన్ ప్రయత్నాలే విశేషంగా తోడ్పడ్డాయి. పోలిష్ వైట్‌సేనలని తరమడంలో మొదటి అశ్వికసైన్యమే పనిచేసింది. ఏమయితేనేం ట్రాట్స్కీ, అతని అనుచరులూ, రెడార్మీ పూర్తివిజయం పొందకుండా చెయ్యగలిగేరు. ట్రాట్‌స్కీ, తుకాచేవస్కీల పొరపాటుమూలంగా రెడార్మీలో కొంతభాగం చాలాలోతుకి ముందుకిసాగింది. ప్రధాన, మూలబలాలతో సంబంధం కోల్పోయింది. చివరకి తూటాలుకూడా లేకుండా అయింది. దీనివలన బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదుల సహాయంతో పోలండు యూక్రెయిన్, బైలోరష్యాల పడమటిసీమల్ని ఆక్రమించుకోగలిగింది. ఇవి 1939 వరకూ పోలిషుప్రభువుల బూటకపుక్రిందనే వుండిపోయినై.

స్టాలిన్‌తోకలిసి, అతని నాయకత్వంక్రింద పోరాడిన వరోషిలోవ్ అంతర్యుద్ధదినాలలో స్టాలిన్‌చూపిన వ్యూహరచనానిపుణతను గురించి ఇల్లాగ చెప్పేడు.

"పరిస్థితుల్ని అతివేగంగా గ్రహించి, తదనుకూలంగా వ్యవహరించడంలో స్టాలిన్‌కి గల నేర్పు అసాధారణం. బద్ధకం, అవిధేయత, గందరగోళపు పనులు అంటే ఆయనకు సరిపడదు. విప్లవంనిమిత్తం గావలసిన పనుల విషయంలో ఆయన ఎప్పుడూ వెనకాడడు తీవ్రమైనచర్యలు తీసుకోడానికి. విప్లవపరిస్థితులకి

అవసరం అనితోస్తే ఏ నియమాన్నయినా ఉల్లంఘిస్తాడు. పైనుంచి వచ్చిన ఏ ఆజ్ఞనైనా నిరాకరిస్తాడు." (కె. వ్రోషిలోవ్, 'స్టాలినూ ; రెడార్మీ')

ఈసమయంలోకూడా - ఇతరసమయా లన్నింటిలోలాగే స్టాలిన్ పార్టీ యొక్క ఇచ్ఛ, విప్లవంయొక్క స్వార్థాలు, వీటినే ప్రధానసూత్రాలుగా తీసుకొని వ్యవహరించేడు.

1919 నవంబరు 27 న లెనిన్ సూచనమీద అఖిలరష్యన్ సెంట్రల్ ఎగ్జిక్యూటివ్‌కమిటీ స్టాలిన్ అంతర్యుద్ధంలో చేసినసేవలకి 'ఆర్డర్ ఆఫ్ ది రెడ్‌బానర్' గౌరవాన్ని ఇచ్చింది.

విప్లవకార్యాచరణలోని అనేకరంగాలలో తనకిగల అనుభవానికి స్టాలిన్ ఈ కాలంలో మరో అనుభవాన్ని - సైన్యాధిపతి అనుభవాలని, చేర్చేడు. రెడార్మీ నిర్మాతగా, నాయకుడుగా, యుద్ధరంగాలలో సోవియట్‌ప్రభుత్వవిజయాలని నిర్మించినవాడుగా అనుభవాన్ని సంపాదించేడు.

# శాంతి: ఆర్థిక పునర్నిర్మాణమూ

మొదట సామ్రాజ్యవాదయుద్ధంలో, తర్వాత అంతర్యుద్ధంలో 1914 మొదలుగా 1920 ఆఖరువరకూ మన విశాలదేశం ఎడతెగకుండా యుద్ధంలో చిక్కుకుని వుంది. యిందువలన దేశం ఆర్థికంగా విశేషమైన దుస్థితికి, దరిద్రానికి పాలయి నాశనం అయిపోయింది. ఇటువంటిఘట్టంలో 50 లక్షలమంది వరకూ పెరిగిన రెడార్మీని విడగొట్టివెయ్యవలసి వచ్చింది. అంతర్యుద్ధ కాలంలో శ్రామికుల రైతులమధ్యగల రాజకీయ - సైనికమైత్రి ఇప్పుడు రైతాంగంలో అసంతృప్తిని కలిగించసాగింది. శాంతియుతంగా పునర్నిర్మాణం ప్రారంభించేముందు ప్రజలని నడిపే నూతన సాధనాన్ని చూసుకోవలసివచ్చింది. వార్ కమ్యూనిజంరోజులలో అమలుపరచిన నిర్బంధపద్ధతులు వదిలి స్వానిస్థానే సమ్మతింపచేసే పద్ధతుల్ని ప్రారంభించవలసివచ్చింది. కొత్తపునాదులమీద శ్రామికవర్గానికీ కర్షకులకీ మధ్య గల స్నేహాన్ని నిర్మించుకురావలసివచ్చింది. ఆర్థికవిధానంలోనే మార్పులు తీసుకురావలసివచ్చింది.

అంతర్యుద్ధంరోజుల్లోనూ, అధికారం కమ్యూనిస్టుపార్టీచేతుల్లోకి వచ్చిన రోజుల్లోనూ, మెన్షివిక్కులనుంచీ, సోషలిస్టు - రివల్యూషనరీలు, బన్డిస్టులు, అనార్కిస్టులనుంచి ఎందరో పెట్టీబూర్జువాలు బోల్షివిక్‌పార్టీలో వచ్చి చేరేరు. పార్టీలో చేరేరేగాని, వారిలో చాలమంది తమ వెనకటి బోల్షివిక్ వ్యతిరేకసిద్ధాంతాలని వదలలేకపోయేరు. వదలలేరు కూడా. వీరు పార్టీతీసుకున్న విధానం సరిఐన దాయనే స దేహం కలిగించి స్థిరత్వం కుదరని సభ్యులలో సందిగ్ధత వ్యాపింప చేసేరు. దీనివలన పార్టీపని మరింత కష్టం అయింది. పార్టీ వ్యతిరేకులయిన ట్రాట్‌స్కీవాదులూ, 'వామపక్ష' కమ్యూనిస్టులూ, అనార్కో-సిండికలిస్టులూ, డీసెంట్రలిస్టులూ మొదలయినవారు పైనచెప్పిన సందిగ్ధమనస్కుల్ని తమవేపుకి తిప్పుకోసాగేరు. పార్టీ శాంతియుతములయిన నిర్మాణపద్ధతుల్ని నవలంబించడానికి తయారయ్యేటంతకి (N. E P.) నవీనార్థికవిధానాన్ని ప్రవేశపెట్టబోయేటంతకి, దేశంలోని ఆర్థికజీవితాన్ని పునర్నిర్మించబోయేటంతకి ఈ వ్యక్తులు విశేషంగా సందిగ్ధతని చూపేరు. వీరితో నిరంతరం తీవ్రంగా పోరాడవలసివచ్చింది.

రష్యాని ఎలక్ట్రిఫికేషన్ చేయడానికై లెనిన్ సలహామీద 1920 లో స్టేట్‌కమిషన్ (గోయెల్‌రో) ఏర్పాటు నియమించబడింది. ఈ కమిషన్ పదేళ్ళలో పూర్తిచేసే ప్లానుకి ఒక ప్లాను వేసింది. దేశాన్ని పారిశ్రామికం చేయడానికై వెయ్యబడిన మొదటికార్యప్రణాళిక ఇది. దీనిని లెనిన్ ప్రారంభించేడు.

ఇది పార్టీయొక్క రెండోకార్యం. ఈ అద్భుత ప్రణాళికని ట్రాట్‌స్కీ, రైకోవ్‌లు వ్యతిరేకించేరు. కాని, స్టాలిన్ సమర్థించేరు. గోయెల్‌రో ప్రణాళికయొక్క ప్రతితో సహా వచ్చిన లెనిన్‌జాబుకి స్టాలిన్ లవి ప్రశస్తంగా వుండని. అదే సరియైన ఏక మాత్రపు రాజ్యాంగార్థిక ప్రణాళికయనీ, "ఆర్థికంగా వెనకబడియున్న రష్యాలో సోవియటు భవనాన్ని నిజంగా ఆచరణీయమైన పునాదుంమీదనూ, ఉత్పత్తిపునాదులమీదనూ నిర్మించడానికి చేయబడ్డ మార్క్సిస్టు ప్రయత్న "మనీ సమాధానం వ్రాసేరు.

ఈ కార్య విధానం విషయమై వ్యర్థవాగ్వాదాలతో కాలవ్యయంచేయక వెంటనే కార్యరూపంలో పెట్టాలనీ, మనంచేసే పనిలో అధమం మూడోవంతయినా దీనికోసం వ్యయపరచాలనీ సూచించేరు.

ట్రేడ్‌యూనియన్ సమస్యమీద 1920 లో పార్టీలో విరుద్ధాభిప్రాయాలు వచ్చేయి. వార్ కమ్యూనిజం కాలంలోని విధానాన్నే ఆర్థిక రంగంలోనూ, పార్టీ పనిలోనూకూడా కొనసాగిస్తూ "గట్టిగా సీల బిగించాలని" ట్రాట్‌స్కీ తన అనుచరులతోసహా పట్టుదలపట్టేరు. దీనిలో వారి ముఖ్యోద్దేశం ప్రజాసామాన్యంలో బోల్షివిక్ పార్టీకిగల పలుకుబడిని నాశనం చెయ్యడం. పార్టీకి-ప్రజలకీ మధ్య అఘాతాన్ని త్రవ్వడం. ఆ విధంగా శ్రామికవర్గ నియంతృత్వానికి కాలిక్రింద గోతులు తవ్వడమే. ఈ దళాలలో ప్రతిదానికీ తన కార్యవిధానం వున్నా, వారందరూ కలిసి లెనిన్ స్టాలిన్‌లమీదా, కమ్యూనిజంలో నమ్మకంగల బోల్షివిక్కులమీదా ధ్వజం ఎత్తేరు.

పార్టీ ఐక్యతకీ, అచంచలమైన మార్క్సిస్టువిధానానికీ పరమ శత్రువులయిన ఈ విధ్వంసకుల్ని ఎదిరించడంకోసం లెనిన్ - స్టాలిన్‌లు కలిసి పనిచేసేరు. లెనిన్‌యొక్క పార్టీవిధానాన్ని సమర్థిస్తూ స్టాలిన్ ప్రవదాకి ఈరోజుల్లో ఎన్నో వ్యాసాలు వ్రాసేరు. వ్లాడియాకావ్‌కాజ్‌లో జరిగిన ప్రాంతీయ కమ్యూనిస్టు కాన్ఫరెన్సులో మాటలాడుతూ స్టాలిను సోషలిజం విజయవంతంగా వృద్ధిపొందడానికీ, అంతిమవిజయం సాధించడానికీ అవసరమైన పరిస్థితుల్ని అక్టోబరునాటి సోషలిస్టు విప్లవవిజయం సృష్టించిందని నిరూపించేరు

1921 వసంతఋతువులో జరిగిన పదవ పార్టీకాంగ్రెసులో స్టాలిన్ విశేష ప్రాముఖ్యతగల జాతీయసమస్యమీద నివేదికవ్రాసేరు. జార్‌ప్రభుత్వంక్రింద అణచి. పీడించబడిన జాతులకి ఆర్థికంగానూ, వైజ్ఞానికంగానూ సహాయం యివ్వవలసిన అవసరాన్నీ, జాతీయసమస్యమీద వస్తూన్న పెడదారుల్నీ-అందులోనూ ముఖ్యంగా ఈ సమయంలో అతి ప్రమాదకరం అయిన-ప్రాధాన్యత పొందిన జాతి యనే గ్రేట్-రష్యన్ జాతీయ దురహంకారాన్ని ఎదిరించవలసిన ఆవశ్యకతను పార్టీ దృష్టిలోకి తెచ్చేరు.

1921 వేసవిలో స్టాలిన్ జబ్బుపడ్డారు. అతని ఆరోగ్యం విషయమై లెనిన్ విశేషంగా ఆతురత చూపించేరు ఆయన జబ్బుపడ్డట్లు తెలియగానే సెర్గో ఆర్జానికి

కి లేకి ఈవిధంగా తంతిపంపేరు. "స్టాలిన్ ఆరోగ్యస్థితి ఎలావున్నదీ, డాక్టర్ల అభిప్రాయం ఏమయినదీ వెంటనే తెలియపరుచు." దానికి సమాధానం రాగానే మళ్ళీ తంతిపంపేరు. "స్టాలిన్‌కి మందిస్తూన్న డాక్టరుయొక్క పేరూ చిరునామా తెలుపు. ఎంతకాలంగా స్టాలిన్ అనారోగ్యంగావున్నాడు? 1921 ఆకురాలుకాలంలో లెనిన్ క్రెమ్లిన్ కమాండెంటుకి ఒకజాబు వ్రాసేడు. స్టాలిన్‌గదికి ప్రక్కనున్న వంటశాలలోని ధ్వనులు తెల్లవారగట్ల ఆతనికి నిద్రాభంగం కలిగిస్తాయి గనక సౌకర్యంవున్న మరోగదికి మార్చమని అందులో కోరేడు: ఇది వెంటనే జరగాలి. కమాండెంటు ఈ పని చెయ్యగలదీ, ఎప్పుడు చెయ్యగలదీ తెలియపరచమన్నాడు.

1921 డిసెంబరులో తన కార్యదర్శి కిచ్చిన చీటిలో తాను మరునాడు వుదయం స్టాలిన్‌ని చూడవలసివుందనీ, ఆ విషయం తనకి జ్ఞాపకం చెయ్యమనీ, వెళ్ళేముందు స్టాలిన్‌కి మందునిస్తూన్న డాక్టర్ ఓబూఖ్‌తో టెలిఫోన్‌లో మాటలాడవలసివుందనీ వ్రాసేడు.

వీటిని చూస్తే స్టాలిన్ అంటే లెనిన్‌కి ఎంత అభిమానం వుందో, అతని ఆరోగ్యం విషయంలో ఎంత తపనపడ్డాడో తెలుస్తుంది. ఒక కమ్యూనిస్టు వేరొక కమ్యూనిస్టుయెడ చూపవలసిన ద్రుక్పథాని కిది ఆదర్శం. ఈ యిద్దరు బోల్షివిక్ నాయకుల మధ్యనూగల స్నేహానికిది నిదర్శనం.

జార్జియా, ట్రాన్స్ కకేషియాలలోని కమ్యూనిస్టుల కర్తవ్యాలను గురించి, టిఫ్లిస్ పార్టీసంస్థల సమావేశంలో 1921 జూలై 5న స్టాలిన్ ఉపన్యసించేడు. ట్రాన్స్‌కకేషియన్ రిపబ్లిక్కులు ఒక ఫెడరేషన్‌గా ఏర్పడాలని స్టాలిన్ సూచించిన సూచనకి కాకేషస్‌లోని జాతీయవాదుల సంఘాలు వ్యతిరేకించాయి. తత్ఫలితముగా కకేషియాలో జాతీయ దురహంకారులు వటి విప్లవ వ్యతిరేకులుగా తయారయ్యేరు. ప్రారంభదశలోవున్న ఈ విప్లవ వ్యతిరేకభావాలు ఏ విధంగా పరిణమించగలవో తన దూరదృష్టితో గమనించి స్టాలిన్ 1921 లో వారిని తీవ్రంగా ఎదిరించేడు.

పదో పార్టీకాంగ్రెసు నవీనార్థికవిధానాన్ని ప్రవేశపెట్టడానికై తీర్మానించింది. స్టాలిన్ దానిని విశేషంగా సమర్థించి, తోడ్పడినవారిలో ఒకడు. తరువాత ఈ విధానానికి ఒక నిర్వచనాన్ని ఇచ్చేడుకూడా.

పెట్టుబడిదారీ విధానంయెడల సహనం చూపుతూనే, కీలకస్థానాలను శ్రామిక రాజ్యాంగం చేతులలో పెట్టుకునేందుకై ఉద్దేశించబడిన శ్రామికరాజ్యాంగంయొక్క ఒక ప్రత్యేక నీతి నవీనార్థికనీతి; అది పెట్టుబడిదారీశక్తుల సోషలిస్టుశక్తులమధ్య పోరాటంకోసం, పెట్టుబడిదారీ శక్తుల్ని అణచివేసి సోషలిస్టుశక్తులు ప్రాధాన్యతకి రావడంకోసం, పెట్టుబడిదారీ శక్తుల్ని ఓడించి సోషలిస్టు శక్తులు విజయం పొందడానికీ, వర్గాలని రద్దుచేసి, సోషలిస్టు ఆర్థిక విధానానికి పునాదులు వెయ్యడంకోసం ఇది ఉద్దేశించబడింది.

పదకొండో పార్టీ కాంగ్రెసులో ఎన్నుకోబడ్డ సెంట్రల్‌కమిటీ స్టాలిన్‌ని సో. యూ. క. పా. (బో) యొక్క సెంట్రల్‌కమిటీకి జనరల్ సెక్రెటరీగా నియమించింది. పార్టీలో ఈ స్థానం నూతనంగా ఏర్పరచబడింది. స్టాలిన్‌ని ఈ స్థానానికి ఎన్నుకోవడంవలన కమ్యూనిస్టుపార్టీయొక్క జనరల్ స్టాఫ్ అయిన లెనిన్‌కీ, పార్టీ మొత్తానికీ అతనియందుగల గంభీరమైన విశ్వాసాన్నీ, పార్టీలో ఆయన నిర్వహించే అతిప్రాముఖ్యపాత్రకి వారిచ్చేవిలువనీ, మనం తెలుసుకోగలం. పార్టీలోనూ, రాజ్యాంగంలోనూ ఆయనకిగల ప్రాముఖ్యత రోజురోజుకీ హెచ్చింది. బోల్షివిక్‌పార్టీయొక్క సెంట్రల్‌కమిటీకి జనరల్ సెక్రటరీగా ఆయన చేయవలసిన పనులు ఆయనశక్తులలోనూ, కాలంలోనూ హెచ్చుభాగాన్ని పుచ్చుకునేవి. అయినా దీనితోపాటుగా ఆయన జాతీయవ్యవహారాల పీపుల్సు కమిస్సార్‌గానూ, వర్కర్స్ అండ్ పెజంట్సు ఇన్‌స్పెక్టరేట్‌కి పీపుల్సు కమిస్సార్‌గానూ చేయవలసివున్న విశేషమైన పనికూడా చేస్తూనేవున్నాడు ఇది శత్రువులకి కొంత అవకాశాన్ని ఇచ్చింది. కాని, పదకొండో పార్టీకాంగ్రెసులో లెనిన్‌వారిని తీవ్రంగా నిరసించేడు.

ట్రాట్‌స్కీ అనుచరుడైన ప్రియోబ్రాజన్‌స్కీకి - ఈయన తర్వాత ప్రజా శత్రువని దృఢపడింది - సమాధానం ఇస్తూ లెనిన్ ఇల్లాగ చెప్పేడు :

"స్టాలిన్ రెండు కమిస్సారియెట్లపై అధికారం కలిగివున్నాడని ప్రియోబ్రాజన్‌స్కీ ఫిర్యాదు........ జాతీయవ్యవహారాల కమిస్సారియట్‌లో ప్రస్తుత పరిస్థితుల్నే నిలబెట్టుకొనడానికీ, తుర్కిస్థాన్, కకేషియన్, సమస్యల్నీ తదితర సమస్యల్నీ సమగ్రంగా తెలుసుకోడానికీ మరింకో దారి ఏముంది? ఏమైనా అవి రాజకీయసమస్యలే. ఆ సమస్యల చిక్కు విప్పితీరాలి. వందలకొలది ఏళ్ళుగా యూరపియన్‌రాజ్యాంగాలలో రగులుతూ, డెమాక్రటిక్ రిపబ్లిక్కులో కొద్దిపరిమాణమాత్రమే సాధించబడ్డవీ సమస్యలు. మనం ఈ సమస్యల్ని చిక్కువిప్పుతున్నాం. ఏ దేశానికి చెందిన ప్రతినిధైనావస్తే వ్యవహారాల్ని లోతుగా చర్చించగల మనిషి మనకు కావాలి. అల్లాంటి మనిషి ఎక్కడున్నాడు? ప్రియోబ్రాజన్‌స్కీకూడా కామ్రేడ్ స్టాలిన్‌పేరుతప్ప ఇంకొకరి పేరు చెప్పజాలడనే అనుకుంటాను

"వర్కర్సు అండ్ పెజంట్స్ ఇన్‌స్పెక్టరేట్ విషయంలోనూ ఇంతే. బోలెడంత పని చెయ్యాలి అక్కడ. విచారణకార్యాన్ని సరిగ్గా నిర్వహించడానికై అందులో ఆరితేరిన వెయ్యి వుండాలి. లేదా, అనుక్షణం చిన్నచిన్న కీచులాటలతో మనపని అయిపోతుంది."

1922 వేసవిలో లెనిన్ చాలా జబ్బుపడ్డాడు. దానితో వెనకటికన్న భారం స్టాలిన్ నెత్తిన పడింది. ఆయన తరుచుగా లెనిన్‌ని పోయిచూస్తూ, డాక్టర్లు అంగీకరించినప్పుడు రాజ్యాంగవ్యవహారాలు తెలియపరచి ఆయనసలహా తీసుకుంటూండేవాడు. లెనిన్‌కూడా తన ఆరోగ్యం కాస్త బాగుపడిందనేటప్పటికి స్టాలిన్‌కి కబురుపెట్టేవాడు, రమ్మని.

తాను లెనిన్‌ని కలుసుకున్నప్పటి సంగతులు చెప్తూ లెనిన్‌కి రాజకీయ సమస్యలమీద ఎంతఆసక్తో తెలుపుతూన్నాడు. లెనిన్ వెక్కిరింతగా "డాక్టర్లు నన్ను వార్తాపత్రికలు చదువవద్దనీ రాజకీయాలు మాట్లాడవద్దనీ నిషేధించేరు. బల్లమీదనున్న కాగితం ఏదైనా వార్తాపత్రిక అయిపోతుందని, క్రమశిక్షణకి భంగం కలుగుతుందేమోనని అతిజాగ్రత్తగా తిరుగుతున్నాను." అన్నాడు.

నేను—"కష్టపుణ్యా నవ్వి, కామ్రేడ్ లెనిన్‌ని, ఆయనయొక్క క్రమశిక్షణకి మెచ్చుకున్నాను." (స్టాలిన్: లెనిన్)

1922 డిసెంబరులో సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియన్ (యూ. సో. సో. రి.) ఏర్పడింది. ఈ యూనియన్ ఏర్పడడానికి విశేషశ్రమ పడ్డాడు, స్టాలిన్. యూనియన్‌కి సంధిపత్రాన్ని తయారుచేసింది ఆయన. యూ. సో. సో. రి. లోని సోవియట్ల మొదటికాంగ్రెసులో (1922 డిసెంబరు 30) ఆయన నివేదికమీదనే అపత్రం స్వీకరించబడింది. యూ. సో. సో. రి. లోని సోవియట్ల రెండవకాంగ్రెసులో అంగీకరించబడ్డ యూ. సో. సో. రి. రాజ్యాంగ చట్టం వ్రాసినదీ ఆయనే. యూ. సో. సో. రి, నిర్మాణమూ, రాజ్యాంగప్రణాళిక యొక్క స్వీకారమూ, పార్టీఅవలంబించిన లెనినిస్టు - స్టాలినిస్టు జాతీయాంగ విధానంయొక్క అద్భుతవిజయంఅని చెప్పాలి. పన్నెండో పార్టీకాంగ్రెసులో సెంట్రల్‌కమిటీయొక్క జనరల్ సెక్రటరీగా అనేక నిర్మాణసమస్యలమీద నివేదిక నిచ్చేరు. "పార్టీలోనూ రాజ్యాంగవ్యవహారాలలోనూ జాతీయసమస్యలు" అనే దానిమీదకూడా రిపోర్టువ్రాసేరు. జాతీయసమస్యలలో ప్రధానజాతిఅనే గ్రేట్ రష్యన్ జాతీయ దురహంకారాన్ని నిరసించి, స్థానికమైన దురభిమానాన్ని అన్ని రకాల బూర్జువాజాతీయవాదుల్నీ ఎదిరించి, వీటివలనగల ప్రమాదాన్ని పదో కాంగ్రెసులో మాదిరిగానే ఇక్కడా స్పష్టపరిచేరు.

తరవాత కొంతకాలానికి లెనిన్ రష్యన్ కమ్యూనిస్టుపార్టీయొక్క సెంట్రల్ కమిటీనీ, జాతీయప్రాంతాలనుంచీ, రిపబ్లిక్కులనుంచీ బాధ్యతగల వర్కర్సునీ ఒకసమావేశానికి ఆహ్వానించేరు. దానిలో స్టాలిన్ సుల్తాన్-గాలీవ్‌చేత నడపబడు తూన్న తాతార్-బష్కీర్ బూర్జువా జాతీయవాదుల పకంని బయటపెడుతూ మాట్లాడేరు. పన్నెండో పార్టీకాంగ్రెసు జాతీయసమస్యమీద తీసుకున్న తీర్మానాలమాదిరి గానే ఈ సమావేశంకూడా జాతీయవాదులతోడి పోరాటంలో విశేషసహాయంచేసి, జాతీయరిపబ్లిక్కులు దృఢపడడానికి బాగా సహాయకారిఅయింది.

1922 అక్టోబరులో లెనిన్ ఆరోగ్యం బాగుపడింది. డాక్టర్లు ఆయనని పని లోకి పోవచ్చునని అంగీకరించేరు. స్టాలిన్‌యొక్క సహాయంతో లెనిన్ విశేష శ్రమపడి పనిచెయ్యసాగేరు; పీపుల్సు కమిస్సార్ల కౌన్సిలుమీటింగుకి వెళ్ళేరు. సో. యూ. క. పా. (బో) సెంట్రల్‌కమిటీయొక్క ప్లీనరీసమావేశానికి వెళ్ళేరు, అక్టోబరులో సోవియట్ల అఖిలరష్యన్ కేంద్రకార్యనిర్వాహణ సమితియొక్క

నాలుగో కాంగ్రెసులో మాట్లాడేడు. కామిన్టరన్ యొక్క నాలుగో కాంగ్రెసులో నవీనార్థికనీతిమీదా, ప్రపంచవిప్లవ భవిష్యత్తుమీదా రిపోర్టు యిచ్చేడు.

1922 నవంబరులో 20 వ తేదీన మాస్కో సోవియట్ యొక్క ప్లీనరీ మీటింగులో దేశీయ, విదేశీయ వ్యవహారాలమీద మాట్లాడుతూ లెనిన్ నవీనార్థిక నీతిని అనుసరించుతూన్న రష్యా ఒకనాడు సోషలిస్టు రష్యాగా మారుతుందనే దృఢవిశ్వాసాన్ని వెలిబుచ్చేడు. అఖిలరష్యన్ సోవియట్ కాంగ్రెస్‌లో కూడా మాట్లాడడానికి తయారవుతున్నాడు. ఉపన్యాసంలో ఇవ్వవలసిన సంగతుల్ని కూడా వ్రాసుకున్నాడు. కాని, యింతలో ఆయన ఆరోగ్యం క్రమంగా శిథిలం కాజొచ్చింది. విదేశీవ్యాపారంయొక్క మొనాపలీనిగూర్చి ఆయన చాలా ఆలోచనలో పడ్డాడు. చివరకి పార్టీ సెంట్రల్ కమిటీయొక్క ప్లీనరీమీటింగులో చదవడంకోసం, ఒక జాబు వ్రాసి స్టాలిన్‌కి పంపేడు. స్టేట్ మొనాపలీకి వ్యతిరేకత చూపుతూన్న బుఖారిన్‌నీ, తదితరుల్నీ కులక్ లపద్ధతి నవలంబిస్తున్నారని ఆ లేఖలో ఆయన నిరసించేడు.

1923 వ సంవత్సరం లెనిన్‌కి, బోల్షివిక్ పార్టీకి, యావత్తు సోవియటు దేశానికి పరీక్షసంవత్సరం. పార్టీవ్యవహారాలనీ, ప్రభుత్వవ్యవహారాలనీ, నడిపించే బాధ్యత స్టాలిన్‌మీద పడింది. లెనిన్ జబ్బుగా వుండడం అవకాశంగా తీసుకుని, ట్రాట్స్కీవాదులు బోల్షివిజాన్ని ఎదిరించేరు. పార్టీ సెంట్రల్ కమిటీ కార్యదర్శియైన స్టాలిన్‌మీద వారు తమ కత్తులు దూసేరు. వారు పార్టీలో ఒక వాగ్వాదాన్ని లేవదీసేరు. దీనివలన పార్టీ పూర్వంకంటె ఏకీభూతం అయింది. బోల్షివిజానికి శత్రువులయిన ట్రాట్స్కీయిష్టులూ, తదితరులూ రెండోపార్టీని నిర్మించేటందుకు ప్రయత్నిస్తూన్నవాళ్ళుగా ప్రజలదృష్టిలోనూ, పార్టీదృష్టిలోనూ బయటపడిపోయేరు. లెనిన్ వేసిన బాటవెంబడినే స్టాలిన్ దృఢహస్తంతో పార్టీని నడిపించేడు. పార్టీలో ఆయనకిగల గొప్ప పలుకుబడీ, శ్రామికప్రజలకి ఆయనయందుగల విశ్వాసమూ, దీనికి బాగా తోడ్పడ్డాయి. ఆయన తన జీవితం పొడుగునా కమ్యూనిజానికి విశ్వాసపాత్రుడూ, పట్టుదలగల - లొంగుబాటు నెరగని యోధుడూనని వారందరికీ ఆయనయెడ విశ్వాసం వుంది.

1923 డిసెంబరు 2 న జరిగిన క్రాస్నాయా ప్రెస్న్యా జిల్లా పార్టీకమిటీ యొక్క ప్లీనరీ మీటింగులో మాటలాడుతూ పార్టీని దృఢపరచడానికీ, విధ్వంసకులయిన ట్రాట్స్కీ అనుచరులూ మొదలగు బోల్షివిజానికి శత్రువులయినవారిని అణచడానికీ, ఎటువంటి చర్యలు తీసుకోబడినాయో వివరించేడు.

1923 డిసెంబరు 15 న స్టాలిన్ సంతకంపెట్టిన సెంట్రల్ కమిటీ అన్నిపార్టీ సంస్థలనీ ఉద్దేశించి చేసిన ప్రకటన ప్రావదాలో ప్రకటించబడింది. అపర్చ్యూనిస్టులలో ఏకముఖంగా పోరాటం సాగించాలని వారికి హెచ్చరిక ఇవ్వబడింది దానిలో. 1924 జనవరిలో జరిగిన పార్టీ మీటింగు స్టాలిన్ రిపోర్టువిని ట్రాట్స్కీయిష్టులు పెటీబూర్జువాదృక్పథం అవలంబించుతున్నారని నిరసించింది. ఈ కాన్ఫరెన్సులోపార్టీకి స్టాలిన్ "ట్రాట్స్కీ వాదాన్ని పాతిపెట్టండి" అని హెచ్చరించేడు.

1924 జనవరి 21 న లెనిన్ చచ్చిపోయేడు. ప్రపంచ శ్రామికవర్గోద్యమానికీ, సోవియట్ యూనియన్‌కీ, బోల్షివిక్‌పార్టీకి ఇది గొప్పనష్టం. అయినా లెనిన్ జెండా నమ్మదగిన ఒక బోల్షివిక్‌చేతిలో వుందని పార్టీ ఎరుగును. గత శతాబ్దంలో 1890 ల నుంచీ, లెనిన్‌తోకలిసి పార్టీని అనేకకష్టాలలోనుంచి, సోషలిజంయొక్క విజయంవేపు నడిపించిన యోధు డాయన.

యూ. సో. సో. రి. లోని రెండవ సోవియటు కాంగ్రెసుయొక్క లెనిన్ స్మారకసభలో 1924 జనవరి 26 న పార్టీసభ్యుడననే మహాబిరుదానికి కళంకం తగలనియ్యము; దాని స్వచ్ఛతని కాపాడుతాము; కంటిలో పాపమాదిరిగా పార్టీ ఐక్యతని కాపాడుతాము. శ్రామికవర్గ నియంతృత్వాన్ని రక్షించి, బలపరుస్తాము. కార్మిక - కర్షకులమధ్య ఐక్యతని మనశక్తులన్నీ వినియోగించి బలపరుస్తాము; రిపబ్లిక్కుల యూనియనుని దృఢపరచి, విస్తరింపచేస్తాము; మన రెడార్మీనీ, రెడ్ నౌకాదళాన్నీ బలపరుస్తాము. కమ్యూనిస్టు ఇంటర్నేషనలుయొక్క సిద్ధాంతాలకి కట్టుబడివుంటాము. అంటూ గంభీరమైన ప్రమాణం చేసేరు.

పార్టీతరఫున స్టాలిన్ ఈ ప్రతిజ్ఞ తీసుకున్నాడు. సోషలిజానికీ, కమ్యూనిస్టు ఇంటర్నేషనలుకీ భక్తి కలిగివుండేటట్లుగా లెనిన్, స్టాలిన్‌లచేత తయారుచెయ్యబడిన పార్టీ ఆప్రతిజ్ఞని నిర్వహించింది. లెనిన్ మరణానంతరం స్టాలిన్ నాయకత్వంయొక్క లాభాన్ని పార్టీ పూర్తిగా పొందింది. బాగా పరీక్షించి నిర్ణయించబడిన మార్గంనుంచి, బోల్షివిక్‌పార్టీని తప్పించడానికీ, వారిపంక్తుల్ని చిందరవందరచేసి, తత్స్థానే ట్రాట్స్కీయైట్, మెన్షివిక్, రొంగుబాటుదారులపార్టీని పెట్టుబడిదారీవిధానాన్ని స్థాపించే పార్టీని - నిర్మించడానికి సోషలిజంయొక్క శత్రువులు లెనిన్ మరణాన్ని అవకాశంగా తీసుకుని ప్రయత్నాలు చేసేరు. కాని, అవేమీ సాగలేదు. స్టాలిన్ నాయకత్వాన పార్టీ ఈశత్రువులని బయటపెట్టి, తరిమివేసింది.

వీనికి ఎన్నో సిద్ధాంతసమస్యలకి సమాధానం ఇవ్వాలసివుంటుంది. మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతాన్ని చూపించి, లెనిన్ మరణానంతరం స్టాలిన్ ఈపనిని అత్యద్భుతంగా నిర్వహించేడు. ట్రాట్స్కీయిజాన్ని బట్టబయలుచేస్తూ, ప్రవదాలో ఎన్నో వ్యాసాలు వ్రాసేడు. "అక్టోబరు విప్లవమూ ; రష్యన్ కమ్యూనిస్టుల ఎత్తుగడలు" అనే వ్యాసంలో ట్రాట్‌స్కీవ్రాసిన అక్టోబరుపాఠాలు' అనే వ్యాసంలోని మెన్షివిక్కుధోరణులను విమర్శించేడు ; 1925 జనవరినెలలో సెంట్రల్ కంట్రోల్ కమీషన్‌ముందూ, సెంట్రల్ కమిటీ ప్లీనరీమీటింగ్‌లోనూ, 1925 మేనెలలో మాస్కోపార్టీ మీటింగులోనూ, పదునాలుగవ పార్టీ కాంగ్రెసులోనూ ఇచ్చిన వుపన్యాసాలు – ఇవన్నీ, స్టాలిన్‌వ్రాసినవీ, మాట్లాడినవీ, అన్నీ ట్రాట్స్కీయైట్లనీ, కాస్త ధైర్యం సంపాదించిన జినోవీవైట్లనీ, ధ్వంసం చెయ్యడంలో పార్టీకి బాగాసాయపడ్డాయి. స్టాలిన్ ఇంతవిశేషంగా కృషిచేసివుండకపోతే బోల్షివిజానికి శత్రువులయినవారి పరాజయం సాధ్యం అయివుండేదేకాదు.

1924 ఏప్రియలులో స్వెర్ద్‌లోవ్ యూనివర్సిటీలో "లెనినిజంయొక్క పునాదులు"మీద వరసన కొన్ని ఉపన్యాసాలు ఇచ్చేరు. పార్టీసభ్యుల్నీ, యువ కమ్యూనిస్టు సమితిసభ్యుల్నీ సిద్ధాంతవిషయంలో తయారుచెయ్యడానికివి అమూల్య సహకారంఇస్తాయి. ఈ ఉపన్యాసాలతో ఆయనవ్రాసిన ఇతరవ్యాసాలూ, ఇచ్చిన ఉపన్యాసాలూ చేర్చి "లెనినిజం" అనేపేరున లక్షలకొలది ప్రతులు దేశదేశాలలో ముద్రించబడి వ్యాప్తిచెందేయి. ఇది ప్రతి కమ్యూనిస్టుకీ నిత్యసలహాదారుగా (హాండ్‌బుక్‌గా) వినియోగిస్తూంది. "లెనినిజంయొక్క సమస్యల"లో ఆయన లెనినిజం అంటే ఏమిటో అద్భుతంగా నిర్వచించేరు: "సామ్రాజ్యవాద కాలం నాటి, శ్రామికవర్గ విప్లవంనాటి మార్క్సిజమే లెనినిజం. ఇంకా సరిగ్గాచెప్పాలంటే మొత్తంమీద శ్రామికవర్గ విప్లవంయొక్క సిద్ధాంతమూ, ఎత్తుగడలూ ప్రత్యేకంగా శ్రామికవర్గ నియంతృత్వపు సిద్ధాంతమూ, ఎత్తుగడలూనే లెనినిజం అంటే." (లెనినిజం.)

లెనినిజంయొక్క చారిత్రకమూలాన్నీ, దాని పద్ధతులనీ, మార్క్సిజం - లెనినిజం సిద్ధాంతాన్నీ, దాని ప్రాముఖ్యతనీ, ఈ సిద్ధాంతంయొక్క మూలసమస్యలని - అంటే, శ్రామికవర్గ నియంతృత్వం, రైతాంగసమస్య, జాతీయ, వలస దేశాల సమస్య, వ్యూహాలూ - ఎత్తుగడలూ, పార్టీ, పనిలో లెనినిస్టువిధానమూ వీనినే ఈ పుస్తకంలో చర్చించేరు.

సోవియటు యూనియనులోవున్న ప్రజలు మాట్లాడే డజన్లకొలదీ భాషల్లోకీ, ఇతరదేశాల భాషలలోకీ ఈ పుస్తకం అనువదించబడింది. కమ్యూనిస్టుపార్టీలోని లక్షలకొలది సభ్యులను విద్యావంతుల్నిచేసి, తయారుచెయ్యడానికి అది పనికి వస్తూంది. మార్క్సిస్టు - లెనినిస్టు గతితర్కంలో వారికి పాఠాలు చెప్తూంది. దేశీయ - విదేశీయ రాజనీతిలోని చిక్కుసమస్యలని అర్థంచేసుకోవడంలో తోడ్పడుతూంది. సామాజిక విషయాలలోని చిక్కుల అర్థాన్ని తెలుసుకుందుకూ, సమాజాభివృద్ధి సూత్రాలను అధ్యయనం చేసేటందుకూ అది తోడ్పడుతూంది;

శాంతిస్థాపనకాలంలో బయలుదేరిన ఎన్నో కఠినసమస్యల్ని పార్టీ స్టాలిన్ నాయకత్వాన సాధించగలిగింది. నూతనార్థికవిధానంవేపుగా సోషలిస్టు పురోగతిలో వేసే మొదటి అగుడులు ఎంతకష్టంగావున్నా, అవి విజయంపొంది, కార్మికుల - కర్షకుల స్థితిని బాగుపరిచేయి. కర్తవ్యాలని సరియైన దృక్పథంలో గమనించలేక పోతే నిర్మాణకార్యక్రమం సాగదు. వర్గరహితమైన సోషలిస్టు సమాజంవేపు వెళ్లే మార్గాన్ని కాగితంమీద మేప్ (Map) గీసుకోవాలి. నిజానికి సోషలిజానికే విరోధులయినవారు, బోల్షివిజానికి శత్రువులయినవారు ఇతర దేశాలలోకూడా సోషలిజం విజయం పొందితేతప్ప సోవియట్ యూనియన్‌లో వర్గరహితమైన సోషలిస్టు సమాజాన్ని నిర్మించడం సాధ్యంకాదని నిరూపించబోయేరు. ఒక దేశంలో సోషలిజం విజయం పొందడానికి సంబంధించిన లెనిన్ సిద్ధాంతాన్ని వారు వ్యతిరేకించారు.

అక్టోబరులో జరిగిన సోషలిస్టు విప్లవంతో శ్రామికవర్గం రాజకీయ విజయాన్ని పొందింది. ఆర్థికంగా కూడా పెట్టుబడిదారీ విధానపు మూలశక్తుల్ని సోషలిజం తొలగించి, రద్దుచేసి, నాశనం చెయ్యగలదని వారిప్పుడు నిరూపించాలి. ఒకదేశంలో సోషలిజం నిర్మించబడగలదా అనేది సమస్య. ఇక్కడ, ప్రపంచం మొత్తంమీద స్టాలిన్ ఈ ప్రశ్నకి ప్రత్యక్షసమాధానం ఇచ్చి, శ్రామికవర్గోద్యమానికే గొప్పసేవ చేసేడు. సోవియట్ యూనియన్‌లో పెట్టుబడిదారీ విధానాన్ని పునస్థాపన చెయ్యడానికై ప్రయత్నాలూ, కలుగజేసుకోవడం జరగకుండా హామీ నివ్వగల సోషలిజపు అంతిమవిజయం ఇతరదేశాలలోకూడా పెట్టుబడిదారీవిధానాన్ని కూలద్రొయ్యడంవలననే - అంటే, పెట్టుబడిదారుల ముట్టడిని నిర్మూలించగలిగినప్పుడే సాధ్యం అవుతుంది. కాని, దేశీయవ్యవహారాలకి సంబంధించినంతవరకు సోషలిజంయొక్క విజయాన్ని కూర్చగల పరిస్థితులూ, వర్గరహిత సోషలిస్టు సమాజంయొక్క నిర్మాణాని కవసరమైన పరిస్థితులూ యూ. సో. సో. రి. లో వున్నాయి.

పదునాలుగో పార్టీ కాన్ఫరెన్సులోనూ, కాంగ్రెసులోనూ ఈ విషయం చర్చించబడింది. బోల్షివిక్‌పార్టీ సభ్యులలో అత్యధికసంఖ్యాకులు స్టాలిన్ అభిప్రాయాన్ని సమర్థించేరు. కమ్యూనిస్టు ఇంటర్నేషనలుకూడా దానినే స్వీకరించింది. కమ్యూనిస్టు ఇంటర్నేషనలుయొక్క ఆయిదో కాంగ్రెసులోనూ, 'ఎకి' యొక్క (ఎగ్జిక్యూటివ్ కమిటీ ఆఫ్ ది కమ్యూనిస్టు ఇంటర్నేషనలు, E. C C. I.) ఏడవ విస్తృత సమావేశంలోనూ, స్టాలిన్ ప్రముఖ నాయకపాత్రని నిర్వహించేడు. లెనిన్ సిద్ధాంతాల మాదిరిగానే సోదరకమ్యూనిస్టుపార్టీలకి ఆయనరచనల సహాయం చాలా ముఖ్యం.

పెట్టుబడిదారీ విధానపు మూలశక్తుల్ని తొలగించి, నాశనంచేయడానికి, వర్గరహిత సోషలిస్టు సమాజాన్ని నిర్మించేటందుకూ పార్టీ అవలంబించిన నీతిని ట్రాట్‌స్కీయిట్లు ఎదిరించేరు. లొంగుబాటుదారులయిన జినోవీవ్, కామెనీవ్‌లతోనూ, వారి అనుచరులయిన కొద్దిపాటిమందితోనూ ఏర్పడ్డ 'నూతనవిరోధపక్షం' 1924 ఆఖరున వీరితో చేరినట్లు తెలుస్తూంది.

సమ్మిళితమైన ట్రాట్స్కీయిట్ - జినోవీవైటు వ్యతిరేకత పదునాలుగో పార్టీకాంగ్రెసులోనే స్పష్టంగా కనబడింది. ఈ నూతనవిరోధపక్షంయొక్క పుట్టుకతోనే స్టాలిన్ దాని బోల్షివిక్‌వ్యతిరేకలక్షణాలని బయటపెట్టడంచేత దానిని ధ్వంసం చెయ్యడం సులభం అయింది. తన 'లెనినిజం' అనే పుస్తకంలో పదునాలుగో పార్టీకాంగ్రెసుయొక్క ప్రాముఖ్యతనిగురించి వ్రాస్తూ స్టాలిన్ ఇల్లా చెప్పేడు: 'నూతన విరోధపక్షం' వారి తప్పుల మూలాల్ని బయటపెట్టి; వారి సంశయాలనీ, మూలుగుల్నీ విచ్ఛిన్నంచేసి; సోషలిజంయొక్క భవిష్యత్‌పోరాటమార్గాన్ని స్పష్టంగా చూపించి, విజయవంతమైన భావిని పార్టీ ఎదుటపెట్టి, సోషలిస్టుసర్మాణవిజయంలో అచంచలవిశ్వాసాన్ని శ్రామికులలో కలిగించడంలోనే సో. యూ. క. పార్టీ

యొక్క పదునాలుగోకాంగ్రెసుకు చారిత్రిక ప్రాముఖ్యత వుంది." స్టాలిన్ పోరాటంలోకల్లా అతికష్టతరమైన ఈ సమయంలో పార్టీని శత్రువులపై విజయం పొందగలిగేటట్లు నడిపేరు. సిద్ధాంతరంగంలో అద్భుతమైన కృషిచేసేరు. "లెనినిజం" అనే రచనద్వారా పార్టీకి అద్భుతమైన మార్గాన్ని చూపించేరు. సోషలిజంయొక్క అంతిమవిజయసాధనకై పార్టీ సాగించవలసిన పోరాటానికి సంబంధించిన ప్రధాన సిద్ధాంతవిషయిక ప్రశ్నలని ఆయన సమాలోచనచేసేరు. దేశంలో సోషలిస్టు పరిశ్రమలని నిర్మించడానికీ, వ్యవసాయంలో సమిష్టిపద్ధతి ప్రవేశపెట్టడానికీ అవసరమైన మొట్టమొదటి కార్యవిధానాలని స్టాలిన్ అప్పటికే నిర్ణయంచేసేసేరు. ఆ కాలంలో జాతీయవాదులకి విరుద్ధంగా తీసుకోబడిన ఎన్నో చర్యలకీ, వ్రాయబడిన ప్రధానపత్రాలకీ ఆయనే బాధ్యుడు. విభిన్నజాతుల మహాసమ్మేళనం అయిన యూ. సో. సో. రి యొక్క పుట్టుకకి ఆయనే బాధ్యుడు. ఈ కాలంలో అతి ప్రధానపత్రాలలో యూ. సో. సో. రి. యొక్క మొదటి రాజ్యాంగచట్టం ఒకటి. ఎనిమిదవ అసాధారణ సోవియటుకాంగ్రెసులో ఆమోదించబడ్డ సోవియటు యూనియనుయొక్క నూతన (స్టాలిన్) రాజ్యాంగచట్టంతో సమానమైన ప్రాముఖ్యత దీనికి వుంది;

# సోషలిస్టు పరిశ్రమల నిర్మాణం

శ్రామికవర్గం, అధికారాన్ని స్వాధీనపరచుకున్నాక పెట్టుబడిదారీ సమాజంలో వచ్చే మార్పుల్నిగురించి మార్క్సు, ఏంగిల్సులు సూచనలుమాత్రమే యిచ్చేరు. సోషలిస్టు శ్రామికవర్గం విజయంపొందేక సాగించగల కొన్ని చర్యల్ని వారు కమ్యూనిస్టు మానిఫెస్టోలో ఉదాహరించేరు. వారు యిచ్చిన ఈ కమ్యూనిస్టు కార్యవిధానం 1917 లో రష్యాలోని శ్రామికవర్గం అధికారాన్ని చేతిలోకి తెచ్చుకునేదాకా ప్రపంచంలో ఎక్కడాకూడా కార్యరూపంలోకి తేబడలేదు. సామాజిక విధానములో పూర్తి మార్పు తెచ్చేటందుకు పారిస్ కమ్యూన్ ,ఎన్నో చర్యల్ని తీసుకున్నా అది అత్యల్ప కాలంమాత్రమే జీవించివుండడంచేత ఫ్రెంచి శ్రామిక వర్గం ఈ కార్యక్రమాన్ని సాగించడానికి తగు సావకాశమే చిక్కలేదు.

దోపిడిచేసే వర్గంవారి కాలిక్రింద ఆధారంలేకుండా చేయగల ఎన్నో ముఖ్యములయిన చర్యల్ని సోవియట్ప్రభుత్వం ప్రారంభంనుంచీ తీసుకుంది. భూమిఅంతా జాతీయంచెయ్యబడి. రైతులు వుపయోగించుకునేందుకు యివ్వబడింది. మిల్లులు, ఫ్యాక్టరీలు, రహదారిసాధనాలు, గనులు జాతిపరం చేసివెయ్యబడ్డాయి. బ్యాంకులు జాతీయం చెయ్యబడ్డాయి.

అయినా సోవియట్ప్రభుత్వపు ప్రారంభకాలంలోనే సోషలిస్టు ఆర్థికవిధానానికి పునాదులు వేసే ప్రయత్నాలు అంతర్యుద్ధం మూలంగా ఆపి వాయిదా వెయ్యవలసివచ్చింది. ఎనిమిదో పార్టీకాంగ్రెసులో అంగీకరించబడ్డ బోల్షివిక్ పార్టీ కార్యక్రమంలోనూ, లెనిన్ చనిపోయేటందుకు కొద్దికాలంక్రితం 1923 జనవరి, మార్చిలలో తీవ్రమైన జబ్బులోవుండగా చెప్పి వ్రాయించిన వ్యాసాలలోనూ ఈ విధానంయొక్క స్థూలరూపం యివ్వబడింది. లెనిన్ వ్రాసిన వ్యాసాలు యివి: "ఒక డైరీలోని కొన్నిపుటలు" "సహకారంమీద" "మన విప్లవం" "శ్రామికుల - రైతుల యిన్ స్పెక్టరేట్ని పునర్నిర్మాణం ఎల్లాగ చేద్దాం?" (సెలక్టెడ్ వర్క్సు, సం. 9) "కొద్దిమాత్రమే అయితేనేం శ్రేష్ఠంగా వుండాలి." (పైదానిలోనే) జాతీయార్థికవిధానాన్ని సోషలిస్టుపద్ధతులపై పునర్నిర్మాణం చేసేటందుకూ, దేశాన్ని పారిశ్రామిక దేశంగా మార్చేటందుకూ, వ్యవసాయంలో సమిష్టివిధానం తెచ్చేటందుకూ సాగించవలసిన పోరాటపద్ధతిని అద్భుతంగా సూచిస్తూ, సహకార పద్ధతిని విపులీకరించిన లెనిన్ యొక్క కార్యక్రమపుస్వభావం ఈ వ్యాసాలన్నింటా దొరుకుతుంది. అధికోత్పత్తి సాధనాలు సోవియట్రాజ్యాంగం చేతులలోవుంది. రైతాంగం శ్రామికుల మార్గదర్శకత్వాన సాగుతూన్నప్పుడు శ్రామికవర్గ నియం

తృత్వం సంపూర్ణంగా సోషలిస్టు సమాజాన్ని నిర్మించేటందుకై కావలసిన అవస రాలన్నీ సహకారంవల్లనే లభిస్తాయి.

సోవియట్లకిగల లోటు ఏమిటి? నాగరికత. అవసరమైనంత విజ్ఞానమూ తక్కువ అన్నాడు. లెనిన్ "మనం నిర్మించబోయే రాజ్యాంగంలో శ్రామికులు రైతాంగంమీద నాయకత్వాన్నీ, వారివిశ్వాసాన్నీ నిలబెట్టుకోగలగాలి ఎంతో ఒద్దిగా వుంటూ, మన సాంఘిక సంబంధాలలోవున్న అనవసరాలైనవాని చిహ్నంకూడా లేకుండా చెయ్యాలి. మనకి సహాయం ఎక్కడా దొరకదు" అన్నాడాయన. మన దేశాన్ని పారిశ్రామిక దేశంగా చేయడానికీ, విద్యున్మయంచెయ్యడానికీ, అవసరమైన సాధనాలన్నింటినీ మనదేశంలోనే సంపాదించుకోవాలి. చాలా కఠోరమైన మిత వ్యయాన్ని అలవరచుకోవాలి ఖర్చులు తగ్గించుకోవాలి. "మనం కూడబెట్టే ప్రతి పైసా మన విశేషోత్పత్తికరమైన యంత్రాలని తయారుచేసే పరిశ్రమలోకి, విద్యుత్పరిశ్రమలోకి, హైడ్రో - పేట్, హైడ్రో - ఎలక్ట్రిక్ (వోల్ఖోవ్‌లోని) స్టేషన్ పూర్తి చెయ్యడానికి వినియోగించబడేటట్లు చూడాలి. ఇందులోనే, కేవలం ఇందులోనే మన ఆశలు ఫలించడానికి అవకాశాలున్నాయి. ఆపని చెయ్యగలిగినప్పుడే రైతులున్న దేశంలోని, గుర్రాలమీద ఆధారపడివున్న ఆర్థికవిధానాన్ని మార్చివేసి, శ్రామికవర్గం వెతుకుతూన్న గుర్రాన్ని విశేషోత్పత్తికర యంత్రపరిశ్రమ, విద్యుత్పరిశ్రమని, వోల్ఖోవ్‌స్ట్రాయ్ మొదలయినవాటిని తెచ్చుకోగలం." (లెనిన్ : సెలక్టెడ్ వర్క్సు, సం : 9 పుట. 400—401.)

పార్టీ తప్పకుండా ఈ ఒప్పుమార్గాన్నే అనుసరిస్తుందనీ, నవీనార్థికవిధానం అనుసరిస్తూన్న రష్యాని సోషలిస్టురష్యాగా మార్చగలదనీ లెనిన్ పూర్తిగా విశ్వసించేడు.

లెనిన్‌యొక్క ఈ సలహాలని కార్యరూపంలోకి తెచ్చి, దేశాన్ని సోషలిస్టు పారిశ్రామిక దేశంగా చెయ్యడానికై పార్టీ ఎటువంటి కష్టపరిస్థితులలో ప్రారంభం చేసిందో తెలుసుకోవడం అవసరం. స్టాలిన్ నాయకత్వంక్రింద పార్టీ అప్పుడప్పుడే యథాస్థితికి వస్తూంది కష్టాలుగడిచి. ఈ కష్టాలలో చాలభాగం దేశీయవ్యవహారాలలో వచ్చినవే: సామ్రాజ్యవాదయుద్ధంవలన వచ్చిన వినాశమూ, దారిద్ర్యమూ, ట్రాట్స్కీయిట్లు మొదలయిన బోల్షివిజానికి శత్రువులయినవారి ఎదుర్పాట్లు. విదేశ వ్యవహారాలలో తక్కువకష్టాలు కలగలేదు. చుట్టుప్రక్కలనున్న సామ్రాజ్యవాద దేశాల ఆక్రమణలూ సామ్రాజ్యవాదుల కుట్రలూ. వీరు సోవియట్‌ప్రభుత్వం చిక్కులలోవుండడం అవకాశంగా తీసుకుని దానిని విధ్వంసం చెయ్య తలపెట్టేరు; కాని, తరిమివెయ్యబడ్డారు.

1927 మే నెలలో బ్రిటిష్ డై-హార్డులు గ్రేట్‌బ్రిటన్‌కీ, యూ. సో. సో. రి.కి గల రాజకీయ సంబంధాలలో ఘర్షణలుపుట్టించేరు. 1927 జూన్ నెలలో పోలండ్‌లో సోవియట్ రాయబారిగావున్న కామ్రేడ్ వ్యాకోవ్‌ని వార్సాలోని వైట్‌గార్డులు హత్య చేసేరు. సోవియట్ ప్రభుత్వాన్ని రెచ్చగొడితే, వాళ్ళు ఒక్క తప్పటడుగు వేస్తే

సామ్రాజ్యవాద ప్రభుత్వాలు యుద్ధం ప్రకటించడానికి సాకు దొరుకుతుందని వారి యాశ. ట్రాట్స్కీయిష్టులు తమకి సాయం చెయ్యగలరని ఈ జగడాలకోరుల ఆశ. ట్రాట్స్కీయిష్టుల నాయకులు ట్రాట్స్కీ, రాకోవ్‌స్కీ, జినోవీవ్, కామెనీవ్ వగైరాలతో వారదివరకునుంచీ రహస్యంగా కుట్రలు సాగిస్తూన్నారు.

దేశాన్ని పారిశ్రామికం చెయ్యడానికి అవసరమైన ధనం కూర్చుకోవడం మరో కష్టం. గొప్పగొప్ప పారిశ్రామిక కర్మాగారాలనీ, బలమైన యంత్రనిర్మాణ పరిశ్రమనీ, అయుధపరిశ్రమనీ, ట్రాక్టర్లూ మొదలయిన వ్యవసాయానికి పనికివచ్చే పెద్దయంత్రాల నుత్పత్తిచేసే కర్మాగారాలనీ, నిర్మించుకురావడానికి ఎంతో సొమ్ము కావాలి. ఇవి నిర్మించబడకపోతే పెట్టుబడిదారీ ముట్టడినుంచి సోవియట్ల దేశాన్ని రక్షించడం అసంభవం అవుతుంది. వ్యవసాయంలో అధికంగా సమిష్టివిధానాన్ని ప్రారంభించితీరాలి. లేకపోతే కులక్కుని తొలగించడం అసాధ్యం.

1925 ఆఖరులో ద్రోహులైన కామెనీవ్ - జినోవీవ్ గుంపు తమపనులు మళ్ళీ సాగించబోయేరు. పదునాలుగో కాంగ్రెసులో పార్టీకి వ్యతిరేకంగా ఈద్రోహులు సాగించిన పోరాటాన్ని మనం చూడనే చూసేం. వీరిని ఎదుర్కోడానికై సుప్రసిద్ధులైన బోల్షివిక్కులు కొందరు సెర్జీ కిరోవ్ నాయకత్వాన లెనిన్‌గ్రాడ్‌కి పంపబడ్డారు. కిరోవ్ బోల్షివిక్, మంచినేర్పుగల విశ్వాసపాత్రుడైన అగ్గనైజరు.

1926 ఫిబ్రవరిలో జరిగిన కామిన్‌టరన్‌యొక్క ఆరో విస్తృత సమావేశంలో స్టాలిన్ కుడిపక్షం (రైట్స్) వార్నీ 'అత్యంత వామపక్షవాదుల్నీ' విమర్శిస్తూ మాట్లాడేడు. పార్టీ శత్రువులయిన ట్రాట్స్కీయిష్టులు మొదలగువారిని విమర్శిస్తూ ఈ కాలంలో స్టాలిన్ ఇచ్చిన వుపన్యాసాలు చాలా ప్రాముఖ్యతగలవి 1926 జూలై 15 న సెంట్రల్‌కమిటీ, సెంట్రల్ కంట్రోల్ కమిషన్ల సమ్మిళిత సమావేశంలో ఆయన ఇచ్చిన ఉపన్యాసమూ, సో. యూ. క. పా. (బో) యొక్క పదిహేనో కాంగ్రెసులో వ్యతిరేకపక్షంవారిని ఖండిస్తూ ఆయన వ్రాసిన థీసిసూ, 1926 నవంబరులో జరిగన ఈ కాన్ఫరెన్సులో "మనపార్టీలోని సోషల్‌డెమాక్రటిక్ పెడదారి" అనే విషయంమీద జరిగిన వాగ్వాదంలో ఆయన ఇచ్చిన సమాధానమూ, రిపోర్టూ, చాలా ముఖ్యమైనవి. వీటిలోనూ, ఇంకా ఇతర ఉపన్యాసాలలోనూ స్టాలిన్ కామిన్‌టరన్‌కీ, బోల్షివిజానికి వ్యతిరేకులయిన అంతర్జాతీయ ప్రతిపక్షాల మీద తీవ్రంగా విమర్శించేడు. ట్రాట్‌స్కీయిజంయొక్క ద్రోహపద్ధతులని బయట పెట్టడంలో ఎంతో దూరదృష్టిచూపి ఈప్రతిహులుదు తప్పనిసరిగా శుద్ధ విప్లవ వ్యతిరేకశక్తులుగా మారిపోతారని నిరూపించేడు. ట్రాట్స్కీయిష్టులకీ, అనేకవిదేశప్రభుత్వాల గూఢచారిదళాలకీ గల ప్రత్యక్ష సంబంధాలని నిరూపించగల పత్రాలు అప్పటికింకా దొరకలేదు. అయినా వేరువేరు బోల్షివిక్ వ్యతిరేకదళాల సిద్ధాంతాలనీ, కార్యాచరణలనీ మార్క్సిస్టు దృక్పథంనుంచి విమర్శించి, ట్రాట్‌స్కీయిజంయొక్క విప్లవవ్యతిరేక స్వభావాన్ని నిరూపించేడు.

చీనాసమస్యలమీద స్టాలిన్ ఇచ్చిన వుపన్యాసాలు కామిన్టరన్ సభ్యులకి బోల్షివిక్ విద్యాభ్యాసం ఇవ్వడంలో అమూల్యసేవ చేసేయి. ప్రాచ్యదేశాలలో విప్లవాభివృద్ధిమార్గాన్ని సక్రమంగా అర్థంచేసుకుందుకు సహాయపడ్డాయి. "చీనాలో విప్లవానికిగల అవకాశాలు": 1926 నవంబరు 30 వ 'ఎకి' యొక్క చీనాకమీషన్‌లో ఇచ్చిన వుపన్యాసం; ప్రచారకులకోసం ఉద్దేశింపబడిన థీసిస్—"చీనావిప్లవ సమస్యలు"; 1927 మే 13 న సన్-యట్-సేన్ యూనివర్సిటీ విద్యార్థులకు ఇచ్చిన ఉపన్యాసం; చీనావిప్లవం విషయంలో కామిన్టరన్‌యొక్క కర్తవ్యాలని గురించి 1927 మే 24 న 'ఎకి' యొక్క ఎనిమిదవసమావేశంలో ఇచ్చిన ఉపన్యాసమూ, ఇంకా ఎన్నోవున్నాయి. ఆయన చీనామీద వ్రాసినవి. కామిన్టరన్ యొక్క ఆరవకాంగ్రెసులో అంగీకరించబడిన కమ్యూనిస్టు ఇంటర్‌నేషనలు యొక్క కార్యక్రమం ఆయనే వ్రాసేడు. ఇది విశేషమైన చారిత్రక ప్రాముఖ్యతగల పత్రం. కమ్యూనిజంకొరకు అంతర్జాతీయంగా సాగించవలసినపోరాటానికి స్టాలిన్ సిద్ధాంతపు పునాదులు వేసేడు.

1926 జూన్‌లో టిఫ్లిస్‌లోని ట్రాన్స్-కకేషియన్ సెంట్రల్ రైల్వే వర్క్‌షాపుల కార్మికులకి ఉపన్యసిస్తూ ఆయన ఇంగ్లండులోని సర్వవ్యాపితసమ్మెని గురించీ, పోలండులో జరిగిన ఘటనలనిగురించీ మాట్లాడేడు. 1926 నవంబరులో సో. యూ. క. పా. (బో) పదిహేనోకాన్ఫరెన్సులో "మన పార్టీలోని సోషల్ డెమాక్రటిక్ పెడదారి" మీద రిపోర్టునిచ్చేడు. 1926 డిసెంబరులో 'ఎకి'యొక్క ఏడవ విస్తృతసమావేశంలో "మనపార్టీలోని సోషల్‌డెమాక్రటిక్ పెడదారిని గురించి మళ్ళీ ఓమాటు" హెచ్చరించేడు. ఈ రెండో వుపన్యాసంలో పెట్టుబడిదారీ ముట్టడి వున్నప్పటికీ ఒక్కదేశంలో సోవియటుయూనియనులో సోషలిజం విజయం పొందడానికి అవకాశాలున్నాయని తానూ, లెనినూ చెప్పిన మాటల్ని మళ్ళీ ఘంటాపథంగా హెచ్చరించేడు.

యుద్ధానంతరం దేశీయార్థికవిధానాన్ని యథాస్థితికి తెచ్చి పార్టీ సోషలిస్టు నిర్మాణానికి పూనుకుంది. యీ సమయములో సోషలిస్టు నిర్మాణం అంటే ఏమిటో ప్రజలు తెలుసుకోవడం అవసరం.

సో. యూ. క. పా. (బో) యొక్క పదిహేనోకాన్ఫరెన్సులో స్టాలిన్ ఉపన్యసిస్తూ ఇల్లాగ చెప్పేడు. "మనం ఎటువేపు నడుస్తున్నామో, ఉద్యమం యొక్క గమ్యం ఏమిటో తెలుసుకోకుండా మనం ముందుకి అడుగుపెట్టలేము. భవిష్యత్తుని వూహించుకోకుండా సోషలిస్టు ఆర్థికవిధానాన్ని నిర్మించడం ప్రారంభించేక పూర్తిచెయ్యగలమనే నమ్మకం లేకపోతే నిర్మాణమే ప్రారంభించలేము. స్పష్టమైన త్రోవ, స్పష్టమైన గమ్యస్థానమూ లేనిదే పార్టీ నిర్మాణకార్యాల్ని సాగించలేదు. "ఉద్యమమే సర్వస్వమూ; గమ్యస్థానం ప్రాధాన్యతలేద"ని బెర్న్‌స్టీన్ మాటప్రకారం మనం చరించలేము. పైగా విప్లవకారులమైన మనం మన పురోగతినీ, మన కార్యవిధానాన్నీ, శ్రామికనిర్మాణంయొక్క ప్రధాన వర్గా

దర్శంతో నిర్వహించాలి. లేకపోతే నిస్సందేహంగా మనం అపర్చ్యూనిజపు బురదనేలలో సందేహంలేకుండా చిక్కుపడిపోతాం."

దేశంలోని ఆర్థికవిధానంలో ప్రాముఖ్యతగల స్థానాన్ని ఆక్రమించిన అధికోత్పత్తికరమైన సోషలిస్టు పరిశ్రమల స్థితిని దృఢపరిచేటందుకై తగిన చర్యలు తీసుకోవాలని సో. యూ. క. పా. (బో) పదిహేనో కాన్ఫరెన్సులో తీర్మానించబడింది. ఈ ప్రధానకర్తవ్యాన్ని నిర్వహించేటందుకై స్టాలిన్ తన యావత్తుశక్తినీ, సామర్థ్యాన్నీ, అచంచలమైన పట్టుదలనీ వినియోగించేడు. ప్రతి కొత్త పరిశ్రమనీ నిర్మించుకురావడంలో ఆయన చేసిన అద్భుతకార్యాన్ని వూహించడంకూడా కష్టం. ప్రతి ఫ్యాక్టరీయొక్క పనినీ అతిజాగ్రత్తగా పరీక్షించేవాడు. తోటకాపరిమాదిరిగా నూతన సోషలిస్టు విధానంయొక్క ప్రతిమొలకనీ ఆయన పోషించేడు. కొత్తవారికి ప్రోత్సాహం యిచ్చేడు. శ్రామికుల జీవితాలలో, పరిశ్రమలలో, వ్యవసాయంలో, వైజ్ఞానిక జీవితంలో కనబడే ప్రతి కొత్తమార్పునీ శ్రద్ధగా పరిశీలించేడు. విజయపథాన్ని మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతకాంతితో చూశాడు. ఈమార్గాన్ని దూరం తగ్గించేటందుకై సాధనాలకోసం వెదికి, కనుగొన్నాడు. అది అనుసరిస్తూన్న మార్గాన్నుంచి పార్టీని తప్పించడానికి చేసే ప్రతి ప్రయత్నాన్నీ ఎదుర్కొన్నాడు: కమ్యూనిజంయొక్క పురోగతికి అడ్డుపడ్డవారివిషయంలో నిర్దయగా వ్యవహరించేడు.

రాజ్యాంగ సంబంధమైన పనులు ఇంత విశేషంగా చేస్తూన్నా స్టాలిను తన వ్రాతపని మానలేదు. ఎన్నో రాయదారాల నందుకునేవాడు. 1927 ఏప్రియలులో ఆయన "చీనా విప్లవ సమస్యల"మీద వ్రాసిన థీసిసు ప్రకటించబడింది; 1927 జూలై 28 న "ఈనాటి విషయాలపై వ్యాఖ్యలు" అనే వ్యాసమూ, 1927 సెప్టెంబరులో మొదటి అమెరికన్ కార్మిక ప్రతినిధివర్గాని కిచ్చిన ఇంటర్వ్యూ; 1927 నవంబరులో విదేశీయ కార్మిక ప్రతినిధ్యాల కిచ్చిన ఇంటర్వ్యూ; "అక్టోబరు విప్లవం యొక్క అంతర్జాతీయ లక్షణం" అనే వ్యాసమూ ప్రకటించబడ్డాయి.

పత్రికలలో వచ్చేవి ఆయన దినకృత్యంలో వ్రాసే హంశాలలో ఎన్నోవంతో. పార్టీ సంస్థలకీ, మన ఆర్థిక-సామాజిక జీవితాల వేరువేరు శాఖలలో పనిచేస్తూన్న వారికీ, ఇచ్చే అనేక సలహాలు, ఒకదానికొకటి సంబంధంలేని అనేక విషయాల మీద వ్రాసే అసంఖ్యాకములయిన జాబులూ, ఎన్ని వుంటాయి!

సోవియటు యూనియనులోని సోషలిస్టు పరిణామగతిలోనూ, ప్రపంచ విప్లవోద్యమంలోనూ తాను పొందిన విశేషానుభవాన్ని స్టాలిన్ తన గ్రంథాలలో క్లుప్తీకరిస్తూ, మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతానికి నూతన విషయాలు చేరుస్తూ నిత్యం దానిని అభివృద్ధిపరుస్తూనేవున్నాడు. శ్రామికవర్గపు అంతర్జాతీయ సిద్ధాంతం ఆయన పుస్తకాలన్నింటా ప్రత్యక్షం అవుతుంది. ప్రపంచ శ్రామికవర్గానికి ముఖ్యాధారమూ, ప్రపంచంలోని కష్టజీవులందరికీ మాతృదేశమూ, కమ్యూనిజానికి పుట్టినిల్లూ అయిన సోవియట్ యూనియన్‌ని బలపరచి, దృఢపరచడం ఏలాగనో ఆయన చూపించి చెప్పున్నాడు.

వ్యవసాయాన్ని సోషలిస్టు పద్ధతులమీద పునః నిర్మించుకు వచ్చేటప్పుడు పల్లెటి ప్రజలకి సహాయం చేయడానికి సంబంధించిన సమస్యలకి స్టాలిన్ విశేష శ్రద్ధ చూపేరు. దేశాన్ని పరిశ్రమలమయం చేసేటందుకై స్టాలిన్ నాయకత్వాన పార్టీ ఈ కాలంలో చేసినపని, తరువాత కాలంలో పల్లెటిప్రాంతాల సమిష్టివ్యవసాయంవేపు ప్రజోద్యమం బయలుదేరడానికి తోడ్పడింది.

పార్టీయొక్క నిర్ణయాలు; సెంట్రల్ కమిటీయొక్క, సెంట్రల్ కంట్రోల్ కమిషన్‌యొక్క తీర్మానాలు; పదిహేనో పార్టీకాంగ్రెసు, కాన్ఫరెన్సుల నిర్ణయాలు, జాగ్రత్తగా పరిశీలిస్తే పార్టీయొక్క బలమూ, సామర్థ్యమూ విశేషభాగం బోల్షివిజానికి శత్రువులయిన "ప్రతికూలుర కలయిక" అనబడేవారితో పోరాటం సాగించడానికే వినియోగించబడిందని తేలుతుంది. ఈ ప్రతికూలపక్షం అంతకంతకి ఒక్కొక్కమెట్టే కృంగి కృంగి చివరకి విప్లవ వ్యతిరేకపద్ధతులకీ, పార్టీ ద్రోహానికీ దిగింది. పార్టీద్రోహులంతా తమవ్యతిరేకతను స్టాలిన్‌మీదికే తిప్పేరు. స్టాలిన్‌నీ, తదితరులయిన బోల్షివిక్‌పార్టీ నాయకులను చంపడానికి ప్రయత్నించేరు. వీరిపై పోరాటానికి పార్టీని స్టాలినే నడిపించేరు.

1927 ఆకురాలుకాలంలో ట్రాట్‌స్కీయైట్ల దాడులు తీవ్రం అయినాయి. వారు బహిరంగంగానే విప్లవ వ్యతిరేకవిధానాలకి దిగేరు. భవిష్యత్తులో పెట్టుబడిదారీవిధానాన్ని నిర్మించగల పార్టీ నిర్మాణంకోసం తలపెట్టి ప్రయత్నాలు సాగించసాగేరు. అపనిందలు వ్యాపింపచేయడం, రెచ్చగొట్టడం, పెట్టుబడిదారీ రాజ్యాంగాల గూఢచారులతో కలిసి కుట్రలు చెయ్యడం, ప్రారంభించి సామ్రాజ్యవాదుల దాడికి దారి సరిచెయ్యసాగేరు.

స్టాలిన్ యిచ్చిన నివేదిక విన్నమీదట పదిహేనోపార్టీకాంగ్రెసు ట్రాట్‌స్కీయైట్ల ప్రతికూలపక్షం "లెనినిజంతో సంబంధం పోగొట్టుకుంది" అనీ, చివరకి మెన్షివిక్కుదళం మాదిరిగా తయారయిందనీ, అంతర్జాతీయ దేశీయ బూర్జువాలకి లొంగుబాటుచూపే విధానాన్ని అనుసరిస్తూందనీ, నిజానికి శ్రామికవర్గనియంతృత్వాధికారానికి శత్రువైన మరొకరిచేతిలో కీలుబొమ్మగాఅయిందనీ ప్రకటించింది.

స్టాలిన్ యిచ్చిన నివేదికమీద పదిహేనో కాంగ్రెసు ఈ పార్టీశత్రువుల్ని తన సభ్యులనుంచి ఎక్స్పెల్ చేసేసింది. అటుతర్వాత దేశాన్ని మరింత హెచ్చుగా పరిశ్రమలతో నింపడానికీ, వ్యవసాయాన్ని సమిష్టిపద్ధతిలోకితేవడానికీ, కులక్‌లపై తీవ్రమైన దండయాత్ర సాగించడానికీ, పెట్టుబడిదారీవిధానపు మూలశక్తుల నన్నింటినీ వినాశం చేయడానికీ, తగు విధానాన్ని ఎత్తుకుంది. పదిహేనో పార్టీకాంగ్రెసుయొక్క తీర్మానాలని పునాదిగా చేసుకుని, మొదటి పంచవర్ష దేశీయార్థిక ప్రణాళిక తయారుచెయ్యబడింది. సోషలిస్టునిర్మాణంలో అదే మొట్టమొదటిస్టాలినిస్టు పంచవర్షప్రణాళిక.

పార్టీనుంచి ట్రాట్‌స్కీయైట్లు ఎక్స్పెల్ చేయబడినకాలంలో పెట్టుబడిదారీవిధానపు పునస్థాపనకే తోడ్పడగల కుడిపక్షం రంగంమీదికి వచ్చింది. రైకోవ్,

బుఖారిన్, టామ్‌స్కీ మొదలగువా రీదళంలోవారే. వీరింతవరకూ తమకు పార్టీతో విరుద్ధాభిప్రాయమే లేనట్లూ, ట్రాట్‌స్కీయిస్టులతో పోరాటం సాగిస్తున్నట్లే నటిస్తూ వచ్చేరు. కుడిపక్షంవారి ప్రమాదం అంతకంతకి హెచ్చసాగింది. దానిని ఆపడానికి విశేషప్రయత్నాలు చేయవలసివచ్చింది. పెట్టుబడిదారీవిధానపు పునస్స్థాపనకే తోడ్పడగల ఈ కుడిపక్షంవారితో పోరాటంలోకూడా స్టాలినే నాయకత్వం వహించేడు. 1928 మేనెలలో ఆయన కుడిపక్షంవారిపై కత్తిదూసేడు. రెడ్ ప్రొఫెసర్ల ఇన్స్టిట్యూట్, కమ్యూనిస్టు ఎకాడమీ, స్వెర్‌డ్లోవ్ యూనివర్శిటీ విద్యార్థుల కిచ్చిన వుపన్యాసంతో ఈ పోరాటం ప్రారంభించేడు. ప్రధానపరిశ్రమల అభివృద్ధి నాటంకపరచడం ఆత్మహత్య చేసుకోవడమే నన్నాడక్కడ. "మనదేశాన్ని పారిశ్రామికం చేస్తామన్న నినాదాన్ని వదిలిపెట్టేసి, మనదేశాన్ని పెట్టుబడిదారీ ఆర్థికవిధానానికి అనుబంధంగా తయారుచెయ్యడమే" నన్నాడు. (లెనినిజం.)

మాస్కోకమిటీ, మాస్కో కంట్రోల్‌కమీషన్‌ల ప్లీనరీమీటింగులో 1928 అక్టోబరు 19న సో. యూ. క. పా. (బో)లోని కుడిపక్షంవారి ప్రమాదాన్ని గురించి మాట్లాడేడు. కుడిపక్షంవారు కులక్కులతో మైత్రినలుపుతున్నారని హెచ్చరించి, వారియొక్క ప్రమాదాచరణకి విరుద్ధంగా నిస్సంశయంగా పోరాటం సాగించాలన్నాడు :

"కష్టాల నతిక్రమించాలంటే ముందు కుడిపక్షంవారి ప్రమాదాన్ని వదల్చుకోవాలి. కష్టాల నెదుర్కోడానికి అభ్యంతరాలు కలిగిస్తున్న మితవాదపోకడ (Right Deviation) బయటపడాలి. ఈ తప్పుడుపోకడలను ఎదుర్కోడానికి పార్టీకిగల పట్టుదలని సడలుస్తూంది."

పార్టీకి విరుద్ధంగా ట్రాట్‌స్కీయిస్టులు సాగించినపోరాటం తీవ్రరూపం ధరించినప్పటిలాగే పెట్టుబడిదారీవిధానంయొక్క స్థాపనకి తోడ్పడగల కుడిపక్షంవారి చర్యలుకూడా సోవియటుప్రభుత్వానికి, బోల్షివిక్‌పార్టీకి శత్రువులయినవారికి ప్రోత్సాహాన్ని కలిగించేయి. ఈ కాలంలోనే షాక్టీజిల్లాలో పేరుపడ్డ విధ్వంసకుల విచారణ జరిగింది. అంతర్జాతీయఫైనాన్సియర్లయొక్క, దేశంలోంచి పారిపోయిన రష్యన్ పెట్టుబడిదారులయొక్క ప్రోత్సాహం పొంది, సోవియట్ యూనియన్‌లో పనిచేస్తూ వుండిపోయిన వెనుకటి ప్రత్యేక కళానిపుణులు విధ్వంసకకార్యాలు సాగించడానికి, విప్లవ వ్యతిరేకతని సాగించడానికీ ఒకసంస్థగా ఏర్పడ్డారు.

మాస్కోపార్టీ సంస్థముందు సెంట్రల్‌కమిటీ ప్లీనంయొక్క సెంట్రల్ కంట్రోల్ కమిషన్‌యొక్క పనినిగూర్చి నివేదికనిస్తూ స్టాలిన్ అంతర్జాతీయ పెట్టుబడిదారులూ, మనదేశంలో వున్నవారి ఏజంట్లూ, ప్రారంభించిన నూతనమైన తీవ్రవాదులకి షాక్టీవిచారణ నిదర్శనాలు చూపుతూందన్నాడు. మన అంతరంగిక వ్యవహారాలలో ఆర్థికవిషయాలలోనూ జోక్యంకలుగచేసికోడానికి ప్రపంచ పెట్టుబడిదారుల ప్రయత్నమిది అన్నాడు.

వెనకటి ప్రభుత్వకాలంనాటి శిల్పకళాభిజ్ఞులు చాలమంది దేశంలోనే వుండి పోయేరు. వారికి ప్రభుత్వం అంటే కిట్టదు. ఈ విషయాన్ని షాక్టీవిచారణ నిరూపిస్తూంది. శ్రామికవర్గంలోంచి నూతనశిల్పాభిజ్ఞులనీ, అన్నిరకాల మానసికశ్రమ చేయగలవారినీ, విప్లవంయెడ అచంచల భక్తివిశ్వాసాలుగలవారిలోంచి తయారు చెయ్యాలని స్టాలిన్ వెంటనే గుర్తించేడు. కష్టాలు వచ్చినప్పుడు వానినుంచి పాఠాలు గుర్తించి, వానిని ఏవిధంగా తప్పించుకోవాలో పార్టీకి స్టాలిన్ ప్రత్యక్షంగా చూపించేడు.

1929 ఏప్రియలులో పార్టీ సెంట్రల్‌కమిటీ ప్లీనంలో సో. యూ. క. పా. (బో) లోని తప్పుడు పోకడలగురించి మాట్లాడుతూ ఆత్మవిమర్శన అనే పార్టీ నినాదం ఎంత ప్రాముఖ్యతగలదో చెప్పేడు.

"మనం విమర్శననీ, ఆత్మవిమర్శననీ, పూర్తిగా అభివృద్ధికి తెస్తేనూ మనపార్టీసంస్థల పనిని ప్రజల అధీనంలో పెడితేనూ తప్ప మన వ్యాపారాన్నీ ట్రేడ్ యూనియన్‌లని, పార్టీ సంస్థలనీ వృద్ధిలోకి తేలేము. సోషలిజం స్థాపించే పనిని సాగించలేము. బూర్జువాజీయొక్క విధ్వంసకచర్యల్ని నిలపలేము." (పైపుస్తకంలోనే)

పార్టీచేత విధించబడిన చాలా ప్రధానములయిన విషయాలని పూర్తి చెయ్యడంలో ఆత్మవిమర్శన నినాదానికి ఎటువంటి ప్రత్యక్షప్రాముఖ్యతవుందో స్టాలిన్ చూపించేడు : సమిష్టి వ్యవసాయాన్నీ, ప్రభుత్వవ్యవసాయాన్నీ పూర్తిగా వృద్ధి పరచడం ; కులక్కులపై పోరాటంసాగించడం ; ధాన్యపు సమీకరణాన్ని నిర్మించుకురావడం; పార్టీపనిని వృద్ధిపరచడం; వ్యాపారసంస్థల్ని వృద్ధిచేయడం; ట్రేడ్ యూనియన్లలోనూ, సోవియటు సంస్థలలోనూ అధికారవర్గం చేరకుండా పోరాటం సాగించడం ; పార్టీసభ్యులలో బోల్షివిక్ శత్రువులు లేకుండా తొలగించడం మొదలయిన వాట్లలో ఆత్మవిమర్శన ఎంతబాగా తోడ్పడిందో చూపించేడు. సోషలిజం పునాదులమీద దేశీయార్థిక విధానాన్ని పునర్నిర్మించడం అంటే—"జాతీయార్థిక విధానంలో అన్ని మూలలావున్న పెట్టుబడిదారీవిధానపు మూలశక్తులపై సోషలిజం పోరాటం సాగించడమే. సోషలిజంయొక్క నిర్మాణంచేపు మన దేశపు శ్రామిక వర్గం ప్రధానమైన పురోగతిని సాగించింది అన్నమాట." (అందులోనే)

పార్టీ స్టాలిన్‌యొక్కనాయకత్వాన ట్రాట్స్కీయిజాన్నీ, అపర్చ్యూనిస్టు కుడిపక్షంవారినీ నిర్మూలించి లెనిన్, స్టాలిన్‌లు వేసిన మార్గంవెంట వెనకముందు లేకుండా సాగడంచేతనే ప్రపంచంలో ఎక్కడా సాటిలేని విధంగా హెచ్చుగా సోషలిస్టు నిర్మాణాన్ని సాగించగలిగిందని మనం తెలుసుకోగలుగుతున్నాం.

"అంత విశేషంగా పరిశ్రమల్ని నిర్మించడం చరిత్రలో ఎరగం. నూతనాభివృద్ధి కంత వుత్సాహం, మిలియన్లకొద్ది శ్రామికులలో అటువంటి కార్యశూరత్వం చరిత్ర కందనివిషయం." (సో. యూ. క. పా. (బో) చరిత్ర, పు. 297)

దేశాన్ని పారిశ్రామికం చేయడంలో పొందిన ఈ విజయమూ, వ్యవసాయాన్ని సమిష్టిపద్ధతులపై నడిపేటందుకు చేసిన మొదటిప్రయత్నాలూ, సమిష్టి విధానంవేపూ, సోషలిజంవేపూ రైతులలో ప్రజోద్యమం బయళుదేరడానికి తోడ్పడింది.

ఇటువంటి ప్రజోద్యమంకోసం పోరాటం ఏలాగ సాగించాలో ప్రత్యక్షంగా చూపించేటందుకై ఈ పోరాటం బాగాలేని, ఎన్నెన్నో కష్టాలతో కూడుకున్న జిల్లాలని స్వయంగా వెళ్ళి చూసేడు. 1928 శీతాకాలంలో సైబీరియావెళ్ళి-అల్టాయ్ మండలంలోని బార్నాల్ మొదలయిన ప్రదేశాలని చూసి, అక్కడ పనిచేస్తున్న వర్కర్లని మీటింగులకి పిలిచి, సోషలిస్టు అభియానానికై కార్యవిధానాలని వారితో ఆలోచించేడు.

సోవియటు ప్రభుత్వపు పన్నెండో సంవత్సరోత్సవం సందర్భంలో స్టాలిన్ "గొప్ప మార్పుతెచ్చిన సంవత్సరం" అనే పేరుతో ఒక వ్యాసాన్ని వ్రాసి ప్రకటించేడు. "పల్లెలలోనూ, పట్టణాలలోనూకూడా పెట్టుబడిదారీ విధానపు మూల శక్తులపై సోషలిజం సాగించిన పోరాటంలో ఈమార్పు వ్యక్తీకృతం అవుతూంది. అని వ్రాసేడు. (లెనినిజం) శ్రమయొక్క ఉత్పత్తిశక్తి హెచ్చుకావడంలో ఈ మార్పు ముందుకి సాగింది. ఉత్పత్తిశక్తి హెచ్చడమే లేకపోతే పెట్టుబడిదారీ విధానంమీద సోషలిజం అంతిమవిజయం పొందగలగడమే అసంభవం. ఈమార్పు పారిశ్రామికసంస్థల నిర్మాణంలోకూడా ముందుకి సాగుతూంది. దీనినిగురించి స్టాలినే యిల్లాగ ప్రకటించేడు: "ప్రధాన పరిశ్రమల నిర్మాణసమస్య కాదర్ల సమస్య తేలనిదే పూర్తిగా సాధించబడిందనడానికి వీలులేదు." (అందులోనే)

వ్యవసాయంలో వచ్చిన మార్పుకూడా అల్పంకాదు. మధ్యరకపు రైతులు సమిష్టిక్షేత్రాలకి ఎగబడుతున్నారు. "వ్యవసాయంలో వచ్చిన విశేషమైన మార్పులకి యిదే పునాది. సోవియట్ ప్రభుత్వం గతసంవత్సరంలో సంపాదించిన ప్రధానసాధనలలో వ్యవసాయాభివృద్ధి మరీముఖ్యం." (అందులోనే)

ఈ మహాఫలితాలని క్రోడీకరిస్తూ స్టాలిన్ తేల్చిన పర్యవసానాలు పార్టీకి, శ్రామికప్రజలకి అంతిమవిజయంయెడల విశ్వాసంకలిగించి, వారిని అద్భుతవీరత్వం ప్రదర్శించడానికి ప్రోత్సహించేయి.

"పారిశ్రామికీకరణమార్గాన సోషలిజంవేపు మనం పూర్తివేగంతో సాగుతున్నాం. యుగాలుగా అంటిపెట్టుకునివున్న 'రష్యన్'ల వెనకబడివుండడాన్ని వెనకనే వదిలేసేం. మనదేశం లోహాలదేశం, మోటార్లదేశం, ట్రాక్టర్లదేశంగా మారిపోతూంది. మనం మన సోవియట్‌యూనియనుని మోటారుమీదా, మన రైతుని ట్రాక్టరుమీదా కూర్చోబెట్టేక తమ నాగరికతనుగురించి బడాయిలుచెప్పిన పెట్టుబడిదారులు మనని అందుకోమనండి, చూద్దాం! అప్పుడు వెనకబడివున్న దేశాల, అభివృద్ధిపొందిన దేశాల తరగతులలో ఏయే దేశాన్ని చెప్పాలిసి వుంటుందో చూద్దాం." (అందులోనే.)

# వ్యవసాయాన్ని సమిష్టి చెయ్యడం

సమిష్టిపద్ధతికై వచ్చిన ప్రజోద్యమం వ్యవసాయంలో తెచ్చిన తీవ్రమైన మార్పుల్ని ఏ చరిత్రకారుడూ గుర్తించకుండా వుండలేడు. ఈ విషయంలో విశేషమార్పులు జరిగిన సంవత్సరం 1929. సమిష్టి విధానంలో విజయం కలగడానికి ప్రధానంగా శ్రామికవర్గం రైతాంగంయెడ అవలంబించిన సరియైన పద్ధతే కారణం. స్టాలిన్ నాయకత్వాన పార్టీ ఈ కార్యవిధానాన్ని సక్రమంగా అనుష్ఠించింది. సమిష్టివిధానానికి వ్యతిరేకులూ, పెట్టుబడిదారీవిధానాన్ని సంస్థాపించగల కుడిపక్షంవారితోనూ, పార్టీవిధానాన్ని తికమకపరిచే వామపక్షీయుల తోనూ ఆయన పోరాటంసాగించేరు. ఎంతోకాలం ప్రచారం, బోధనా సాగిస్తేనూ, నమ్మించగల వాదనలని తేగలిగితేనూ, మాత్రమే సాధ్యపడేపనిని పరిపాలనలో నిర్బంధపద్ధతు లుపయోగించి సాధించాలంటూ చెప్పి రైతుల్ని విముఖుల్నిచేసి, శత్రువుచేతికి ఒక ఆయుధం యివ్వబోయేరు. దేశం పరిశ్రమలమయం చెయ్యడం వలన సోవియట్ రాజ్యాంగంచేతుల్లో అనంతమైన శిల్పావకాశాలు చిక్కేయి. దీని వలన ఉద్యమానికి తోడ్పాటూ, సౌకర్యమూ చిక్కి సమిష్టివిధానం విజయం పొందింది.

శాస్త్రీయ సోషలిజాన్ని కనిపెట్టిన మార్క్సు—ఏంగిల్సులకి వ్యవసాయంలో సమిష్టిపద్ధతి ఏలావస్తుందో స్పష్టంగా వూహించడానికి తగు అవకాశం లేదు. 1881 మార్చినెలలో వీరా జెసూలిచ్‌కి మార్క్సు వ్రాసిన జాబుయొక్క చిత్తుప్రతి కనబడింది. రష్యాలోగనక సోషలిస్టువిప్లవం వస్తే, అక్కడభూమిని సోషలిస్టు పద్ధతులలో యంత్రాలతో దున్నడానికి కావలసిన ప్రాకృతిక పరిస్థితులున్నాయనే భావాన్ని ప్రకటించేడు. సమిష్టి యంత్రవ్యవసాయానికి కావలసిన శిల్ప పరికరాలన్నీ రష్యాలో పెట్టుబడిదారీపద్ధతిలో తయారై సిద్ధంగావున్నవి దొరకుతాయని ఆయన వుద్దేశ్యం.

వ్యవసాయానికోసం లక్ష ట్రాక్టర్లూ, ట్రాక్టరు డ్రైవర్లనీ గురించి లెనిన్ ఏలాగ కలలు కనేవాడో, సమిష్టి వ్యవసాయానికి ఆయన ఎంత ప్రాముఖ్యతని యిచ్చేడో మనకి తెలుసు.

స్టాలిన్ నాయకత్వాన లెనిన్ కలలు నిజం అయినాయి. పెద్దపెద్ద ట్రాక్టరు కర్మాగారాలనీ, యితర వ్యవసాయ యంత్ర కర్మాగారాలనీ నిర్మించేటందుకు స్టాలిన్ అత్యధికమైన శ్రద్ధని చూపించేరు. ఈ ప్రధానవిషయానికి సంబంధించిన విషయాలన్నీ స్వయంగా పరిశీలించేరు. కొత్తయంత్రాల పరీక్షలకి స్వయంగా హాజ

రయ్యేడు. డిజైన్లు గీసేవారికీ, ఫ్యాక్టరీమానేజర్లకీ, నూతన నిర్మాతలకీ, యంత్రాలలో ఏమాదిరి అభివృద్ధి రావలసివుందో, ఏ మాదిరి కొత్త యంత్రాల్ని నిర్మించాలో, ఏలాగ నిర్మించాలో సలహాల నిచ్చేవాడు. దీనికి ఫలితంగా సోవియట్ ప్రభుత్వపు వ్యవసాయంలో శ్రమని తగ్గించే అన్నిరకాల యంత్రాలూ, ట్రాక్టర్లు, హార్వెస్టర్ కంబైన్లు, బంగాళాదుంపలు పాతే యంత్రాలు, నార, సుగర్‌బీట్, పత్తి పైపచేసే యంత్రాలూ విస్తారంగా వాడకంలోకి వచ్చినాయి.

స్టాలిన్ ఎప్పుడూ మనదేశంలోని ముందుకువచ్చిన ప్రజలద్వారానూ, ప్రజాసమూహాలద్వారానూ పనిచేస్తూండడమే వ్యవసాయంలో సమిష్టిపద్ధతి విజయం పొందడానికి సావకాశాన్ని యిచ్చింది. విజయం తనంత తానై మనచేతుల్లోకి రావనీ. దానికోసం పోరాడి సంపాదించవలసివుంటుందనీ, సరిగ్గా పట్టుదలతో శ్రామికుల్ని సరియైన నాయకత్వంలో నిర్మించుకురావలసివుంటుందనీ చెప్పేడు.

సమిష్టి వ్యవసాయం ఏవిధమైన అల్లర్లూ, అభ్యంతరాలూ లేకుండా సుఖంగా సాగిపోయిం దనుకోవద్దు. వ్యవసాయంలో సమిష్ట విధానాన్ని ప్రవేశపెట్టడమూ, మొదటి పంచవర్షప్రణాళికయొక్క పూర్తి చేసిన కాలంలోనే సరిగ్గా పెట్టుబడిదారీవిధానం భయంకరమైన ప్రపంచ పరివ్యాప్తవిక్షోభంలో చిక్కుకుని వుంది. యుద్ధభయం తీవ్రం అయిన సమయాలలో అక్కడా అక్కడా పెట్టుబడిదారులు సోవియటుయూనియన్ని అణగదొక్కి తాము బయటపడాలనే ప్రయత్నాలుకూడా చేసేరు. 1931 లో జపానీస్ సామ్రాజ్యవాదులు మంచూరియాని ఆక్రమించుకుని, మంచూకోపేరిట నామమాత్రంగా ఒక ప్రభుత్వాన్ని స్థాపించేరు. కాని నిజానికి సోవియట్‌యూనియనుపై సాగించదలచిన దండయాత్రకి దానిని స్కంధావారంగా వుపయోగించుకో దలిచేరు.

ఇంక దేశంలో పెట్టుబడిదారీవిధానాన్ని స్థాపించగల కుడిపక్షంవారూ, ట్రాట్‌స్కీయిట్లూ, సామ్రాజ్యవాదులతోటీ, వారి గూఢచారిదళాలతోటీ కుట్రలు సాగించేరు. ఆచోకీలు సంపాదించి, రహస్యాలు సంగ్రహించి, విదేశప్రభుత్వాలకిచ్చేరు. పార్టీ సభ్యులలో ప్రధానులయినవారిని చంపడానికి పథకాలు వేసేరు. చివరకి సెర్జీ కిరోవ్‌ని చంపగలిగేరు కూడా. పార్టీ నాయకులనీ, ప్రభుత్వాధికారులనీ చంపడానికై ఏర్పాట్లుచేసేరు. వారికోపం అంతా కామ్రేడ్ స్టాలిన్‌మీదనే వుంది. ప్రజలయొక్క అచంచలమైన పట్టుదలకీ, చైతన్యానికీ, వ్యూహాలకీ, అలుపెరుగని సామర్థ్యాలకీ స్టాలిన్ ఆదర్శప్రాయుడు కావడమే దీనికి కారణం.

ఇటువంటి పరిస్థితులమధ్య బోల్షివిక్‌పార్టీయొక్క సెంట్రల్‌కమిటీయొక్క కార్యక్రమాన్నీ, సోవియట్ ప్రభుత్వ సంస్థల వ్యవహారాలనీ నడుపుతూ స్టాలిన్ కులక్‌వర్గాన్ని నశింపచేసి, దృఢమైన సమిష్టి వ్యవసాయపు పద్ధతిని ప్రవేశపెట్టే నీతివిధానాన్ని కార్యరూపంలో పెట్టేరు. ఇది చాలా ముఖ్యమైన విషయం. దీనివలన సమిష్టిక్షేత్రవిధానం పూర్తిగా విజయం పొందింది. వ్యవసాయంలో ఈ మార్పు మెట్టు తర్వాత మెట్టుగా తీసుకురావడానికై స్టాలిన్ మార్గం సరిచేసేరు.

శ్రామికవర్గ నియంతృత్వం స్థాపించబడ్డది మొదలు రష్యాలో ఎంతెంత మార్పులువచ్చేయో స్టాలిన్ 1929 డిసెంబరు 27 న మార్క్సిస్టులయిన వ్యావసాయిక విద్యార్థుల సభలో చూపించేడు. ఇక్కడ రెండే గతులున్నాయి అన్నాడు. "వెనక్కి పెట్టుబడిదారీ విధానంలోకి పోనైనా పోవాలి. లేదా ముందుకి సోషలిజంవేపు సాగాలి ఇంక మూడో మార్గంలేదు. వుండదుకూడా." వ్యవసాయం—పరిశ్రమలమధ్య 'సమతుల్యత' వుండాలనీ, సోషలిస్టుపద్ధతిలో స్వేచ్ఛాపూర్వకత్వం వుండాలనీ ఈ మొదలైన బుఖారిసైట్ల అపర్చ్యూనిస్టు సిద్ధాంతాలు చాలా ప్రమాదం కలిగిస్తాయని చెప్పేడు.

పార్టీ ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క పారిశ్రామికశాఖకి విశేషధాన్యం వుంచి దాని గుణాన్ని, పరిమాణాన్నీకూడా అభివృద్ధిపరచవలసిన అవసరంవుంది. వ్యవసాయంలో సమిష్టిపద్ధతి దానంతటదే వస్తుందని బోల్షివిక్‌పార్టీ అనుకోనవుండలేదు. "చిన్న రైతాంగం బలంగావుండే పల్లెటిపట్టుల్ని సోషలిస్టు నగరాలు ముందుకి నడిపి, గ్రామసీమలలో సమిష్టిక్షేత్రాలూ, ప్రభుత్వక్షేత్రాలూ స్థాపించి, గ్రామసీమల్ని నూతన సోషలిస్టు పునాదులమీద నిర్మించుకురావాలి." అన్నాడు స్టాలిన్. (లెనినిజం)

చిన్నరైతుల వ్యవసాయంయొక్క "స్థిరత్వాన్నిగూర్చిన పెట్టీబూర్జువా సిద్ధాంతాన్ని ఆయన ఖండించేడు. సమిష్టివ్యవసాయంలోవచ్చిన లభివృద్ధికి ఫలితముగా దేశంలోని ఆర్థిక జీవితంలో గొప్ప మార్పులువచ్చి, వర్గశక్తులలో నూతన సంఘటనలు వచ్చేయని ఆయన చూపించేడు. వెనకటిమ్మాదిరిగా ఈనాడు ధాన్యం-పశువుల ఉత్పత్తి కులకుల చేతిలోలేదు. మనచేతిలో "కులక్ వుత్పత్తిస్థానే సమిష్టిక్షేత్రాల, ప్రభుత్వక్షేత్రాల వుత్పత్తిని నిలిపేటందుకు అవసరమైన భౌతిక పరిస్థితులన్నీ సమకూడివున్నాయి.....అందుచేతనే మనం కులక్కుల దోపిడీఅవకాశాల్ని నిరోధించే నీతివిధానాన్ని వదిలి, కులక్కువర్గాన్నే అంతరింపచేసే విధానాన్ని ఎత్తుకున్నాం" అన్నాడు, స్టాలిన్. (పైదానిలోనే)

ఇక్కడ ఒక సంగతి చెప్పాలి. కులక్కులకి వ్యతిరేకంగా తీవ్రమైన పోరాటం సాగించాలనీ, చాలా జిల్లాలలో సమిష్టివ్యవసాయ పద్ధతిని దృఢంగా ఏర్పరచాలనీ సెంట్రల్‌కమిటీ నినాదం ఇచ్చినప్పుడు చాలమంది 'ఎడమ' పెడదారి తొక్కి బోధనాపద్ధతులు అనవసరం అని నిశ్చయంచేసేసి, పరిస్థితులు ఎంతమాత్రమూ పరిపక్వంకాని జిల్లాలలో సమిష్టివిధానాన్ని ప్రవేశపెట్టసాగేరు. ప్రజలవి - కులకులు కానివారివికూడా ఆస్తులు లాక్కోసాగారు. ఇది చాలా ప్రమాదకరం. సోవియటు విధానానికీ, బోల్షివిక్‌పార్టీకి వ్యతిరేకులయినవారు పార్టీనీతిలో తీసుకువచ్చే ఈ పెడదారులని ఆధారపరచుకుని సోవియట్ ప్రభుత్వంమీద రైతులకి అసహ్యాన్ని కలిగించి సమిష్టి పద్ధతిమీద తిరుగుబాటు చెయ్యడానికి ప్రోత్సహించడానికి సిద్ధంగావున్నారు.

"విజయంవలన కన్నుమూసుకుపోయినాయి." అనే వ్యాసంలో (లెనినిజంలో చేర్చబడింది.) స్టాలిన్ ప్రమాదం గలిగించే ఈ పెడదారుల్ని నిరసించేడు. ఈ

వ్యాసంవలన విశేషంగా ఫలితాలు కలిగేయి. అంతవరకు చేసిన తప్పుల్ని దిద్దుకో డానికది బాగా తోడ్పడి, పల్లెటి ప్రాంతాలుకూడా సోషలిజంవేపు దృష్టిత్రిప్పడానికి తోడ్పడింది. సమిష్టిక్షేత్రాలు అభివృద్ధిపొందుతూన్న మొదటిదశలో వ్యావసాయిక కమ్యూన్‌లని స్థాపించబోవడంగాక, వ్యావసాయిక ఆర్టెల్సుని స్థాపించడానికే ప్రయత్నించాలని చెప్పేడు. కమ్యూన్‌లు స్థాపించడానికి తగు పరిస్థితులు సమ కూడలేదని చెప్పేడు.

తన వ్యాసంలో నాయకత్వాన్ని గురించి స్టాలిన్ అద్భుతమైన పాఠం నేర్పేడు. "నాయకత్వపు చాతుర్యం చాలా ప్రధానమైన విషయం. మనం వుద్యమానికి వెనక్కాల ఈడిగిల బడకూడదు. అల్లాగ చేసేమా ప్రజలకి దూరం అయిపోతాం. అల్లాగని ముందుకి పరుగెత్తిపోకూడదు. అల్లాగచేసేమా ప్రజలతో సంబంధం తెగిపోతుంది. ప్రజోద్యమానికి నాయకత్వం వహించదలచి, ప్రజలతో సంబంధం నిలుపుకోదలచినవారు రెండురంగాలలో పోరాటం సాగించవలసి వుంటుంది. — వెనక్కాల ఈడిగిలబడేవారిలోటీ, ముందుకి పరుగెత్తే వారితోటీకూడా పోరాటం సాగించాలి."

"ఉద్యమానికి నాయకత్వం వహిస్తూనే, కార్మిక - కర్షకప్రజాసామాన్యంతో సంబంధాలు ఎల్లా నిలుపుకోవాలో, పెంచుకోవాలో తెలిసివుండడంచేతనే మనపార్టీ యింత బలీయమై దుర్జేయం అయింది." (పైదానిలోనే.)

స్టాలిన్‌యొక్క ఈ వ్యాసం వచ్చేక పార్టీ సెంట్రల్‌కమిటీ 1930 మార్చి 15 న స్టాలిన్‌యొక్క ప్రోత్సాహాన "సమిష్టి క్షేత్రోద్యమంలో పార్టీవిధానంలో లొక్కిన పెడదారుల్ని ఎదిరించాలి." అనే విషయంమీద తీర్మానం ప్రకటించింది. స్టాలిన్ వ్రాసిన "విజయంవలన కళ్ళు మూసుకుపోయినాయి." అనే వ్యాసంలాగే ఈ తీర్మానంకూడా గ్రామసీమలలో పార్టీవిధానంలో వచ్చిన తప్పుల్నీ, లొక్కిన పెడదారుల్నీ దిద్దడంలో బాగా వుపయోగించింది.

దీనితర్వాత రైతులూ, సమిష్టిక్షేత్రాలలోనివారూ సమిష్టి విధానానికి సంబంధించిన సమస్యల్నిగూర్చి దేశం నాలుగుమూలల నుంచీ వ్రాస్తూవచ్చిన జాబులకి సమాధానరూపంలో "సమిష్టిక్షేత్రాలలోని కామ్రేడ్సుకి సమాధానం" (లెనినిజంలో చేర్చబడింది.) అనే పేరున వ్యాసంవ్రాసి 1930 ఏప్రియల్ 3 న ప్రకటించేడు. సమిష్టిక్షేత్రోద్యమంలో పార్టీపనివారూ, సోవియట్‌వుద్యోగులూ చేసిన ప్రధానమైన పొరపాట్లని ఈవ్యాసంలో సూచించేరు. మధ్యమతరగతి రైతుకిగల ప్రాధాన్యతని మరచిపోయి, అతనియెడ పొరపాటు దృక్పథం అవలంబించి, సమిష్టిక్షేత్రాలలో చేరడానికై రైతుల్ని తొందరపెట్టకూడదన్న లెనిన్ ఆదేశాన్ని మరచిపోవడం వలననే ఈ తప్పులు వచ్చేయని సూచించేడు. సమిష్టిక్షేత్రాలు ఐచ్ఛికసిద్ధాంతం మీద ఏర్పడాలి; సోవియటుయూనియనులోని వేరువేరుజిల్లాల పరిస్థితుల్ని గమనికలోకి తీసుకోవాలి; సమిష్టిక్షేత్రాల నిర్మాణంలో ఆర్టెల్‌విధానాన్ని దాటేసి, కమ్యూన్‌పద్ధతిని ఒకేమారు ప్రవేశపెట్టకూడదు. కమ్యూన్‌అన్నది సమిష్టివిధానం

యొక్క పర్యవసానం; కమ్యూన్‌లోని సభ్యులందరియొక్క అవసరా లన్నింటినీ తీర్చగలిగినన్ని వస్తువులు అనంతంగా వున్నప్పుడే కమ్యూన్ ఏర్పడుతుంది.

బాగా ఆలోచించి, వేసిన పార్టీవిధానం, స్టాలిన్‌సలహాతోనూ, ఆదేశాలతోనూ కలిసి దృఢమైన సమిష్టివిధానం విజయం పొందడానికి వీలునిచ్చింది. కులక్‌వర్గాన్ని నిర్మూలించడానికి తగుపరిస్థితుల్ని సృష్టించింది.

సమిష్టివిధానంవేపు వచ్చిన ఈ విసురుని నిర్వచిస్తూ స్టాలిన్ సో. యూ. క. పా. (బో) చరిత్రలో ఇల్లాగవ్రాసేడు: "ఇది ఒకగొప్ప విప్లవం. ప్రాచీన సమాజంలోనుంచి నవీన సమాజంలోనికి వేసిన ఒక్కగంతు ఇది. 1917 అక్టోబరు విప్లవం మాదిరిగానే ఇదికూడా విశేషఫలితాలను కలిగించింది."

"ఈ విప్లవంలో వున్న ప్రత్యేకత ఏమంటే అది పైనుంచి, రాజ్యాంగం యొక్క ప్రోత్సాహంమీద, కులక్‌బంధాలని నిర్మూలించి, సమిష్టిక్షేత్రాలలో స్వతంత్రంగా జీవించడానికై పోరాడుతూన్న లక్షలకొలది రైతులనుంచి - దిగువనుంచి ప్రత్యక్షసహాయాన్ని పొంది సాధించబడింది." (సో. యూ. క. పా. (బో) చరిత్ర)

శ్రామికులూ, కర్షకులూ, రెడార్మీసైనికులూ అనేకమీటింగులలో వెలిబుచ్చిన కోరికప్రకారం సోవియట్ యూనియన్‌యొక్క కేంద్రకార్యనిర్వాహకసమితి స్టాలిన్‌కి ఆయన సోషలిస్టు నిర్మాణరంగంలో చేసిన అమూల్యసేవకి పురస్కారంగా ఆర్డర్ ఆఫ్ ది రెడ్‌బానర్‌ని రెండోమాటు బహూకరించింది.

1930 జూన్ 26 న పదహారో పార్టీకాంగ్రెసు సమావేశం అయింది. దీన్ని స్టాలిన్ "యుద్ధరంగం అంతటా సోషలిజం తీసుకున్న ఎదురులేని దండయాత్ర కులక్‌వర్గ వినాశం, దృఢమైన సమిష్టివిధానసాధనలకి చెందిన కాంగ్రెస్" అని పిలిచేడు.

ఈ కాంగ్రెసులో స్టాలిన్ చాలా దీర్ఘమైన రిపోర్టు చదివేడు. దేశంఅంతటా సాగించబడిన సోషలిస్టు నిర్మాణకార్యక్రమాన్ని ఇందులో వివరించేడు. ఇదివరకెన్నడూ పార్టీలో లేనంత ఐక్యత ఈకాంగ్రెసులో కనబడింది. ట్రాట్‌స్కీయిస్టులూ, కుడిపక్షంవారూ పూర్తిగా పరాజితులయిపోయేరు.

మొదటి పంచవర్షప్రణాళికని నాలుగేళ్ళలోనే పూర్తిచెయ్యాలనే నినాదాన్ని ఈ కాంగ్రెసులోనే పార్టీ ఇచ్చింది. అసలు ఈనినాదం ప్రజాసామాన్యంలోంచే వచ్చింది. నాలుగేళ్ళలో పంచవర్షప్రణాళికని పూర్తిచెయ్యడమూ, రెండో పంచవర్ష ప్రణాళికని పూర్తిచెయ్యడమూ, స్టాలిన్‌యొక్క నాయకత్వపు తెలివితేటలకి ఫలితమే.

పార్టీ, సోవియట్, ట్రేడ్‌యూనియన్, కోఆపరేటివ్, తదితరసంస్థల కార్యవిధానాల వేరువేరు దశలను స్టాలిన్ బహుశ్రద్ధగా పరిశీలిస్తూంటాడు. ఆర్థిక, పరిపాలన, సైనిక, వైజ్ఞానిక కార్యక్రమాల అభివృద్ధిని జాగ్రత్తగా పరిశీలిస్తూ

ఎక్కడికక్కడ పార్టీసభ్యులూ, కష్టజీవులూ తమ దృష్టిని కేంద్రీకరించవలసిన ప్రధానసమస్యలని తక్కున చూపిస్తూంటాడు. ఏక్షణంలోనైనా గొలుసుకట్టులోని ప్రధానమైన గొళ్ళేన్ని, ఆ సమస్యయొక్క కీలకాన్ని తెలిపే గొళ్ళేన్ని ఇట్టే కనిపెట్టగల శక్తి స్టాలిన్‌లోవుంది.

ఉదాహరణ చూడండి: సోషలిస్టు పరిశ్రమల మేనేజర్ల మొదటి అఖిల యూనియన్ కాన్ఫరెన్సులో 1931 ఫిబ్రవరి 4న "వ్యాపారనిర్వాహకుల బాధ్యతల"మీద మాట్లాడుతూ శిల్పనిపుణత సంపాదించవలసిన అవసరాన్ని తెలియ పరచేడు.

"అభివృద్ధిపొందిన దేశాలకంటె మనం ఏభయ్యో, వందో సంవత్సరాలు వెనుకబడివున్నాం. మనం ఈతేడాని పదేళ్ళలో కూడతీసుకోవాలి. మనం అది చెయ్యలేకపోతే వాళ్లు మనని నులిపేస్తారు." (లెనినిజం.)

అన్నింటికంటే హెచ్చుగా వెనకబడివున్నదీ శిల్పరంగంలోనే. దీనిని కూడదీసుకోడానికి, అంతర్జాతీయంగా మనకిగల బాధ్యతలకీ, కర్తవ్యాలకీ మధ్య ఏకీభావాన్ని కుదర్చడం స్టాలిన్‌యొక్క ప్రత్యేకత. మనకి అతిప్రధానాలయిన అంతర్జాతీయ బాధ్యతలు వున్నాయన్నాడు. ఏమిటవి?

"యూ. సో. సో. రి. లోని శ్రామికవర్గం ప్రపంచ శ్రామికవర్గంలో ఒక భాగం. మనం పొందిన విజయాలు ఒక్క యూ. సో. సో. రి. లోని శ్రామిక వర్గంయొక్క పరిశ్రమకి ఫలితాలుకావు. ప్రపంచ శ్రామికవర్గంయొక్క సహాయం కూడా వాటికి విశేషంగా తోడ్పడింది. ఈ సహాయమేలేకపోతే మన నెప్పుడో చీరిపారవేసి వుండేవారు. అన్ని దేశాలలోని శ్రామికవర్గానికి మనదేశం షాక్-బ్రిగేడన్నారు. ఈమాట చాలా సరిగ్గా వుంది. కాని, ఇది మనమీద చాలా గొప్ప బాధ్యతలని ఆరోపిస్తూంది. అంతర్జాతీయ శ్రామికవర్గం మనకి ఎందుకు సాయ పడుతూంది. ఈ సహాయానికి మనం ఏలాగ అర్హులం? పెట్టుబడిదారీ విధానానికి విరుద్ధంగా యుద్ధంలోకి మనమే ముందుదూకేం. శ్రామికవర్గపు రాజ్యాంగాన్ని మొదట నిర్మించింది మనమే. సోషలిజాన్ని నిర్మించుకురావడానికి ప్రారంభించిందీ మనమే. మనం చేస్తూన్న ఈపని విజయవంతంగనక అయితే ప్రపంచం అంతా మారిపోతుంది. శ్రామికవర్గం అంతా విముక్తి పొందుతుంది. విజయం పొందడానికి కావలసింది ఏమిటి? మనం వెనకబడి వుండడాన్ని వొదులుకోవాలి. నిర్మాణంలో విశేషమైన బోల్షివిక్ ఉత్సాహాన్ని వృద్ధిచేసుకోవాలి. మనం ముందుకి సాగుతూన్న విధానం చూసి ప్రపంచ శ్రామికవర్గం మనవేపుచూసి: యిది నా పురోగామిదళం; ఇది నా షాక్-బ్రిగేడ్, యిది నా శ్రామికవర్గరాజ్యాంగం, యిది నా తల్లిదేశం; వీరు తమ కార్యాన్ని - మనకార్యంకూడా నిర్వహిస్తున్నారు. ఆనిర్వహించడంలో బాగా నిర్వహిస్తున్నారు; పెట్టుబడిదారులకి వ్యతిరేకంగా వారికి మనం సహాయం చేసి, ప్రపంచ విప్లవకార్యాన్ని వ్యాపింపచేద్దాం "—అనాలి." (అందులోనే)

సోవియట్ ప్రజ శిల్పాన్ని వశపరచుకోవడమేగాక దానిని పెట్టుబడిదారీ విధానపు శిల్పంకంటె శ్రేష్ఠంగా తయారుచేస్తున్నారు. ఆవిధంగా సోవియటు ఆర్థిక విధానం యొక్క ఉత్కృష్టతని నిరూపిస్తూన్నారు. ఇది అంతర్జాతీయంగా మనకి గల బాధ్యతల దృష్ట్యా చూస్తే చాలా ప్రాముఖ్యతగలది.

ఈ పనిలో కష్టాలున్నాయి. అన్నవారికి సమాధానంగా స్టాలిన్ యిల్లా చెప్పేడు: "బోల్షివిక్కులు పట్టుకోలేని కోటలు లేవు. యింతకంటేనూ కష్టమైన సమస్య లెన్నింటినో మనం సాధించేం. పెట్టుబడిదారీవిధాన్ని కూలద్రోసేం. అధికారాన్ని చేతిలోకి తీసుకున్నాం. బ్రహ్మాండమైన సోషలిస్టు పరిశ్రమని నిర్మించేం. మధ్యతరగతి రైతుల్ని సోషలిజంవేపు ఆకర్షించేం. నిర్మాణదృష్ట్యా అతిప్రధానమైన వాటిని ఇదివరకేసాధించేం. మిగిలింది ఎంతో ఘనకార్యం కాదు: శిల్పాన్ని అభ్యసించడం, శాస్త్రజ్ఞానాన్ని సంపాదించడమూ మిగిలింది. ఈ పని పూర్తి చేసేమా యిప్పుడూ ఊహకి అందనంత తీవ్రమైన ప్రోత్సాహాన్ని సంపాదిస్తాం. యిప్పుడు యిది చెయ్యదలచుకున్నామా చేసితీరుతాం." (అందుగోసే)

వ్యాపారనిర్వాహకుల సభలో 1931 జూన్‌లో ప్రసంగిస్తూ, నూతన పరిస్థితులూ - నూతనములయిన ఆర్థిక బాధ్యతలు" గురించి (లెనినిజంలో ఇది చేర్చబడింది) మాట్లాడేడు. మన పరిశ్రమల అభివృద్ధి వేగంగా జరగడానికీ, ప్రాశస్త్యం కలగడానికీ ఆరు పరిస్థితులు అవసరం అని ఆయన అందులో చెప్పేడు: (1) సమిష్టి క్షేత్రాలతో ఒప్పందాలు చేసుకుని శ్రమశక్తిని నిర్మాణయుక్తంగా సంపాదిస్తూండడమూ, ఈ కొత్తపనివారికి విశేషశ్రమ కలగకుండా యంత్రాలు విశేషంగా ప్రవేశపెట్టడమూ; (2) శ్రమశక్తి ఉత్పత్తిచేయవలసిన విశేషధారాన్ని తగ్గించడం, సమానమైన కూలి అనే దానిని వదలివెయ్యడం, జీతాలని నిర్మాణయుక్తంగా ఏర్పాటుచేసి, శ్రామికుల జీవితవిధానాన్ని దాగుపరచడము; (3) వ్యక్తిబాధ్యత లేకపోవడాన్ని అంతమొందించి.. శ్రమనిర్మాణాన్ని వృద్ధిపొందించడమూ, శ్రమశక్తుల్ని మన పరిశ్రమ అన్నింటా తగువిధంగా పంచబడేటట్లు చూడడమూ; (4) రష్యాలోని శ్రామికవర్గం తన శిల్పాభిజ్ఞులనూ - పారిశ్రామిక మేధావుల్నీ సంపాదించగలిగేటట్లు చూడడం; (5) పాతరోజులనాటి ఇంజనీర్లయెడలా, శిల్పకళాభిజ్ఞులయెడల చూపుతూన్న దృక్పథం మార్చుకుని, వారియెడ శ్రద్ధా, గౌరవం చూపి, వారితోడ్పాటు తీసుకోవడంలో అధికమైన ధైర్యం చూపడం; (6) వ్యాపారపు ఎక్కౌంటింగ్‌ని ప్రవేశపెట్టి, పోషించి, పరిశ్రమలోనే పెట్టుబడియొక్క సమీకరణాన్ని హెచ్చుచెయ్యడం. ఈనూతన పరిస్థితులూ, బాధ్యతలూ పనిలో నూతనపద్ధతులు అవలంబించవలసిన ఆవశ్యకతని తెచ్చిపెట్టేయి. నిర్వహణలో నూతన పద్ధతులు కావాలి. 'మొత్తంమీద' గాక, ఒక్కొక్కదానిలోనే పరిశ్రమయొక్క అభివృద్ధికిగల పరిస్థితుల్ని అధ్యయనం చెయ్యాలి. మానేజర్లు ఖరాఖండిగా వ్యవహరించాలి. తమ పనిలో నైపుణ్యం సంపాదించాలి. ప్రతి చిన్నవిషయాన్ని పరిశీలించాలి. "ఏమంటే చిన్నచిన్న' వాటిలోంచే నేడు గొప్పవి నిర్మించబడుతున్నాయి." రెడ్‌టేప్ పద్ధతులు రద్దు

గావాలి. ఫ్యాక్టరీలలోనూ, సంస్థలలోనూ పనిచేస్తూన్న ప్రజలని అధ్యయనం చెయ్యాలి. అధ్యయనం చెయ్యడమేగాదు. మనం ప్రజాసామాన్యంనుంచి నేర్చుకోవాలి. వారితో ఎప్పుడూ సంబంధం వుంచుకోవాలి. అన్నిటికంటెనూ ముఖ్యమైనది జీవంగల ప్రజ అన్నాడు కామ్రేడ్ స్టాలిన్. "మన విధానాలని కార్యరూపంలోకి తేగలది జీవంగలప్రజ. నీవూ, నేనూను, పనిచెయ్యడానికై మనకిగల వుత్సాహం, నూతనపద్ధతులలో పనిచెయ్యడానికి మనలోవున్న సంసిద్ధత, ఆ ప్లానుని సాగించడానికై మనం చూపే పట్టుదల. మనకాపట్టుదలవుందా? వుంది! సరే అలాగనైతే మన వుత్పత్తి విధానం జయించుతుంది. జయించి తీరుతుంది." (అందులోనే)

సోవియట్‌యూనియన్ యిప్పుడు సోషలిజంయుగంలో ప్రవేశించిందని చెప్పవచ్చు. పెద్దతరహా పరిశ్రమలలోనూ, వ్యవసాయంలో సమిష్టివిధానాన్ని ప్రవేశపెట్టడంలోనూ సంపాదించిన విజయాలు దానికి దృఢమైన పునాదిగా ఏర్పడ్డాయి. పదహారో పార్టీకాంగ్రెసులో స్టాలిన్ యిల్లాగ చెప్పేడు. "మనం సంధియుగాన్ని—(ఆమాటకి వెనకటినుంచీ గల అర్ధంలో) మనం అతిక్రమించేసి రంగమంతటా సోషలిస్టు నిర్మాణం విశేషంగా సాగుతూన్న కాలంలోకి అడుగు పెట్టేం. మన దేశీయార్థికవిధానంలో ఆర్థికసూత్రాలన్నీ సోషలిస్టుపద్ధతిలో వుండడం చేత మనం సోషలిజపు యుగాన్ని ప్రవేశించేమనేది స్పష్టం." (పైదానిలోనే)

"దాని యుద్ధపూర్వంనాటి దుస్థితిలో జర్మన్ సోషల్ - డెమాక్రటిక్-పార్టీని గురించి బోల్షివిక్కుల అభిప్రాయం" అనే పేరుతో ప్రోలెటార్‌స్కాయా రివల్యూషియా పత్రికలో పార్టీకి విరుద్ధమూ, ట్రాట్స్కీయిస్టు వాదంతో సరిపోలేదీ అయిన ఒకవ్యాసం వాగ్వాదంకోసమై ప్రకటించబడింది. ఎందరో పార్టీ చరిత్రకారులలోవున్న వినాశోన్ముఖ ఉదారవాదమే ఈ మాదిరి వ్యాసం బయటపడడానికి కారణం. "బోల్షివిజంయొక్క చరిత్రకి సంబంధించిన కొన్ని సమస్యలు" అనే పేరుతో (లెనినిజంలో చేర్చబడింది) పై వ్యాసానికి సమాధానం వ్రాసేడు స్టాలిను. పార్టీ చరిత్రని పెడదారులలో వ్రాసి, దానిలోకి ట్రాట్‌స్కీయిస్టు, తత్తుల్యభావాలని దాటించడానికై చేసే ప్రయత్నాలని తీవ్రంగా నిందించేడు. ఇందులో ఆయన చరిత్రరచయితలని ఉద్దేశించి, "పార్టీచరిత్రకి సంబంధించిన సమస్యల్ని ఉచితమైన మట్టానికి లేవదియ్యమనీ, మన పార్టీచరిత్రని శాస్త్రీయమైన బోల్షివిక్ పద్ధతులలో అధ్యయనం చెయ్యమనీ, మన చరిత్రని అబద్ధాలతో గుచ్చిఎత్తే ట్రాట్స్కీయిట్లూ మొదలయినవారిపై దృష్టి నిలిపి ఎప్పటికప్పుడు వారిగుట్టు బయటపెట్టమనీ —బోధించేడు.

చరిత్రకారులకి హెచ్చరిక నివ్వడంతో వూరుకోక స్టాలిన్ స్వయంగా సో. యూ. క. పా. (బో) చరిత్రను వ్రాయడానికి సామగ్రి ప్రోగుచెయ్యడం ప్రారంభించేడు. ఇది బోల్షివిక్‌పోటీకి ప్రత్యక్షోదాహరణ. పార్టీచరిత్రని బోల్షివిక్ పద్ధతులలో వ్రాయడం ఏలాగో ఇది ఒక ఉదాహరణ. చరిత్రకారుల పనిని

బాగుపరచడానికేగాక, మార్క్సిస్టు సిద్ధాంతంయొక్క అన్నిశాఖల్లోనూ పని బాగు పడడానికి ఈ జాబు బాగా తోడ్పడింది.

ఈ జాబు వ్రాయబడ్డాక పాఠ్యగ్రంథా లుండవలసిన పద్ధతులనిగూర్చి, స్టాలిన్, కిరోవ్, జ్డానోవ్‌లు వ్రాసిన ఎన్నో వ్యాఖ్యలు వెలువడ్డాయి. సో. యూ. క. పా. (బో) చరిత్రని పాఠ్యగ్రంథంగా వ్రాస్తూన్నవారికి స్టాలిన్ ఒకజాబు వ్రాసేడు. ఇంకా ఎన్నో పత్రాలు వ్రాసేడు. 'అంతర్యుద్ధచరిత్ర'ని కూర్చి, ప్రచురించడంలో తోడ్పడ్డాడు. ఇవన్నీ చూస్తే ఆయన సిద్ధాంతరంగంలో చేసిన పని ఎంత అమూల్యమో తెలుసుకోవచ్చును.

విజ్ఞానంలో నూతనపద్ధతులు ప్రవేశపెట్టగలవారిని సమర్థించే రాజనీతి వేత్తలకి వుదాహరణగా స్టాలిన్‌ని చూపించవచ్చును. "ప్రజలకీ తనకీ మధ్య కోటకట్టుకొని, దూరంగా వుండిపోయే విజ్ఞానాన్నిగాక ప్రజాసేవకి తయారై, వారికి విజ్ఞానలాభాల నన్నింటినీ అందుబాటులోకి తెచ్చి, ఒత్తిడివలనగాక స్వేచ్ఛా పూర్వకంగా ప్రజలకి సేవచెయ్యగల విజ్ఞానాన్ని" స్టాలిన్ పోషించుతాడు.

విజ్ఞానశాస్త్రిలలో నూతనవిషయాలని ప్రవేశపెట్టిన మిచూరిన్, వియాల్‌కోవ్‌స్కీ, పావ్‌లోవ్, ట్సిట్సిన్, లెస్సెన్‌కో మొదలయిన సుప్రసిద్ధ శాస్త్రవేత్తలకి ఆయన ఎంతో ప్రోత్సాహంఇచ్చేడు. ఎకాడమి ఆఫ్ సైన్సెస్‌ని సోషలిస్టు నిర్మాణసమస్య లతో సన్నిహితసంబంధాలు కలిగివుండేటట్లు చేయడానికై ఆయన సలహామీద దానితో కమ్యూనిస్టు ఎకాడమీ ఏకంచేసివేయబడింది. ఆయన వాఙ్మయంలోనూ, లలితకళలలోనూకూడా విశేషమైన అభిరుచి చూపుతాడు. సోవియట్ యూనియన్ లోని అన్ని రిపబ్లిక్కులలోనూ, మండలాలలోనూకూడా విజ్ఞానవేత్తలకీ, కళాభిజ్ఞు లకీ సోవియటుప్రభుత్వమూ, పార్టీచూపిన ప్రోత్సాహం వలననే నేడు సోషలిస్టు అంతస్సారమూ, జాతీయరూపమూగల విజ్ఞానం మనదేశంలో యింత అభివృద్ధి దశలో కనబడుతూంది.

స్టాలిన్ నిర్దేశాల ప్రకారం సోవియట్‌యూనియనుయొక్క రెండో పంచ వర్ష జాతీయార్థికవిధానాన్ని సమకూర్చడానికి పద్ధతులు 1932 ప్రారంభంలో జరి గిన పదిహేడో పార్టీకాంగ్రెసులో వ్రాయబడ్డాయి.

"ఒకప్పుడు, చిన్న అల్పప్రమాణపు వ్యవసాయంలో కూడిన సోవియట్ యూనియన్ సమిష్టిపద్ధతులతో, ప్రభుత్వ వ్యవసాయాభివృద్ధితో, విశేషమైన యంత్రసాధనోపయోగంతో పెద్ద తరహాగా సాగించబడుతూన్న వ్యవసాయంగల దేశంగా మార్పుచెందింది." అని కాన్ఫరెన్సు గుర్తించింది. "తన జాతీయార్థిక విధానాన్నంతనీ పునర్నిర్మాణం చేయడానికై అవసరం అయిన పునాదుల్ని" సోవియట్‌యూనియన్ స్వయంగానే నిర్మించుకుంది. రెండో పంచవర్షప్రణాళికని సమకూర్చడానికై కాన్ఫరెన్సు ఆదేశాల నిచ్చింది. ఈ ప్రణాళిక పెట్టుబడిదారీ మూలశక్తుల్ని పూర్తిగా నిర్మూలించడానికీ, జాతీయార్థిక విధానాన్నంతనీ పునర్ని

ర్మించడానికీ, జాతీయార్థిక విధానంలోని అన్ని శాఖలకీ ఆధునిక పద్ధతులు అవలంబించడానికి వుద్దేశించబడింది.

మొదటిదానికి మల్లేనే రెండో పంచవర్షప్రణాళికకూడా స్టాలిన్ యొక్క నిర్దేశాలప్రకారం తయారుచెయ్యబడింది. సోవియటుయూనియనులో నూతనమైన నిర్మాణాత్మకాభివృద్ధి బ్రహ్మాండంగా సాగించడానికై కార్యక్రమం యివ్వబడింది.

సో. యూ. క. పా. (బో) యొక్క సెంట్రల్‌కమిటీ, సెంట్రల్ కంట్రోల్ కమిటీల జాయంట్‌ప్లీనంలో 1933 జనవరిలో స్టాలిన్ ప్రథమ పంచవర్షప్రణాళిక యొక్క పర్యవసానాలని గురించిన రిపోర్టు నిచ్చేడు. మొదటి పంచవర్షప్రణాళిక నుంచి తేలుతూన్న ముఖ్యఫలితం ఒకదేశంలో సోషలిస్టుసమాజాన్ని స్థాపించడం సాధ్యం అవుతుందనేదే నన్నాడు. అటువంటి సమాజానికి అవసరమైన పునాదులు యూ. సో. సో. రి. లో అప్పుడే వేయబడ్డాయన్నాడు. దేశంలోని మొత్తం ఆర్థిక విధానంలో నూటికి తొంభైవంతులు సోషలిస్టు పరిశ్రమలదే. పరిశ్రమలలో కేవలం సోషలిస్టు ఆర్థికవిధానమే అవలంభించబడుతూంది. వ్యవసాయంలో సమిష్టిపద్ధతి బాగా పాతుకుంది. జాతీయార్థికవిధానంలోని అన్ని శాఖల్లోనూ సోషలిజం పొందిన విజయంతో మనుష్యునిచేత మనుష్యుడు దోపిడీ చెయ్యబడడం అంతరించింది. మొదటి పంచవర్షప్రణాళికకు గొప్ప అంతర్జాతీయప్రాముఖ్యత వుందన్నాడు స్టాలిన్. "పంచవర్షప్రణాళిక పొందిన విజయాలు అన్నిదేశాలలోని శ్రామికవర్గం యొక్క విప్లవశక్తుల్ని పెట్టుబడిదారీవిధానానికి వ్యతిరేకంగా సమీకరించు తున్నాయి." (పైదానిలోనే)

సో. యూ. క. పా. (బో) యొక్క సెంట్రల్‌కమిటీ, సెంట్రల్ కంట్రోల్ కమీషన్ల జాయంట్‌ప్లీనంలో 1933 జనవరి 11 న గ్రామసీమలలో పనినిగురించి స్టాలిన్ మాట్లాడేడు. "రాజకీయసంస్థల సోషలిస్టురూపం సోవియటు. ఆ మాదిరిగానే సమిష్టిక్షేత్రం ఆర్థికసంస్థల సోషలిస్టురూపం." (పైదానిలోనే) కాని ప్రధాన విషయం అందుచేత అన్ని సమిష్టిక్షేత్రాల్నీ బోల్షివిక్కు-క్షేత్రాల్ని చేయడం పార్టీ కర్తవ్యం.

సమిష్టిక్షేత్రాలలోని శ్రేష్ఠులయిన పనివారల మొదటి అఖిలయూనియన్ కాంగ్రెసు 1933 ఫిబ్రవరిలో జరపబడింది. సమిష్టిక్షేత్రోద్యమంలో వచ్చిన ప్రథమ ఫలితాలని క్రోడీకరిస్తూ ఈ కాంగ్రెసు సమిష్టిక్షేత్రాల రైతులు తొక్కినమార్గం - సమిష్టి వ్యవసాయమార్గం సరియైనదేనా అన్న ప్రశ్నకి సమాధానం యిచ్చింది.

స్టాలిన్ తన గంభీరమైన ఉపన్యాసంలో (ప్రజలకి చిక్కుసమస్యల్ని అతి సున్నితంగా బోధించే ప్రచారపునేర్పుకి స్టాలిన్ వుపన్యాసాలు ఆదర్శాలు.) సమిష్టి వ్యవసాయమార్గమే సరయిన దనీ, మిగిలిన రెండోమార్గం పెట్టుబడిదారీవిధానపు పునస్థాపనకే దారితీస్తుందనీ, అది ప్రాచీనపు ఎలక్, పెట్టుబడిదారీపద్ధతికి దిగువకి ఈడ్చే అపసవ్యపు పద్ధతియనీ చూపించేడు.

స్టాలిన్ ఇక్కడ వరో ప్రశ్ననికూడా తీసుకన్నాడు. — నూతనమైన సమిష్టివ్యవసాయ విధానంవల్ల మనం సాధించింది ఏమిటి? రాబోయే రెండు-మూడేళ్ళలో మనం సాధించగలమని ఆశిస్తున్న దేమిటి?— "మనం సాధించింది ఏమంటే-లక్షలకొలది మధ్యతరగతి రైతుల్ని సమిష్టిక్షేత్రాలలోకి చేరేటందుకు తోడ్పడ్డాం. వారి కిక్కడ సారవంతమైన భూమీ, మంచి వుత్పత్తిసాధనాలూ స్వాధీనంలో వున్నాయి. ఇంక లక్షలకొద్దీ బీదరైతులు మధ్యతరగతి రైతుల స్థితికి తీసుకురాబడ్డారు. లక్షలకొలదీ బీదరైతులు - ఒకప్పుడు దరిద్రంలో జీవించినవారు - నేడు సమిష్టిక్షేత్రాలలో మధ్యతరగతి రైతులుగామారి, జీవిత సౌకర్యాలు పొందగలగడం నిజంగా గొప్పసాధనయే." (అందులోనే) కాని, అది మొదటి అడుగుమాత్రమే. "ఇప్పుడు మనం ఇంకో అడుగు ముందుకి వెయ్యాలి. సమిష్టిరైతాంగాని కంతకీ - ఒకప్పుడు బీద-మధ్యతరగతి రైతులుగా వున్నవారందరికీ సాయపడి వారిని సంపన్నరైతుల స్థితికి తీసుకురావాలి." (ప్రైదానిలోనే).

సమిష్టిక్షేత్రాలని బోల్షివిక్‌క్షేత్రాల్ని చేసే బాధ్యతకి సమిష్టిరైతాంగాన్ని సంపన్నులచేసే బాధ్యతకూడా జతచేసేడు, స్టాలిన్.

ఈ కాంగ్రెసులో స్టాలిన్ ఇచ్చిన ఉపన్యాసం చాలా ప్రాముఖ్యతగలది. రైతుస్త్రీలలో కొంతమందికి సమిష్టిక్షేత్రాలయెడలగల అనుమానాల నది పారద్రోలింది. కులక్కులుచేస్తూన్న ఆందోళనకి ఆధారం లేకుండాచేసి, దానిని విధ్వంసం చేసింది. సమిష్టి వ్యవసాయోద్యమంలోగల లోటుపాట్లనీ, చేస్తూన్న తప్పుల్నీ దిద్దుకునేందుకు తోడ్పడింది. దేశంలో సమిష్టిక్షేత్రపద్ధతి ఇంకాబాగా దృఢపడడానికి తోడ్పడింది.

1934 జనవరిలో పదిహేడో పార్టీకాంగ్రెసు సమావేశం అయింది. ఇది "విజేతల సమావేశం"గా చరిత్రలో ప్రసిద్ధిపొందింది. ఈకాంగ్రెసులో స్టాలినిచ్చిన రిపోర్టు కమ్యూనిజంయొక్క విజయగీతం. ఈ కాంగ్రెసులో సెర్గీ కిరోవ్ విజయం యెడ విశ్వాసాన్నీ, ఆవేశాన్నీ కురిపిస్తూ మాట్లాడేడు. పార్టీకాంగ్రెసులలో ఇది ఆయన ఆఖరు ఉపన్యాసం.

సోవియటు యూనియనులో వచ్చిన విశేషములయిన మార్పుల్ని స్టాలిన్ తన వుపన్యాసంలో విశదపరచేడు. దేశ స్వరూపమే మారిపోయిందనీ, వ్యావసాయిక దేశంగావున్నది పారిశ్రామిక దేశంగా మారిపోయిందనీ, చిన్నచిన్న స్వంతవ్యవసాయాలుగల దేశంనుంచి సమిష్టి యంత్రీకృత వ్యవసాయంగల దేశంగా మారిపోయిందనీ, అజ్ఞానమూ, చదువులేని దేశంలోంచి విద్యావంతమూ, విజ్ఞానవంతమూనై, ప్రాథమిక - మాధ్యమిక - ఉన్నతవిద్యా సంస్థలమయమైన దేశంగా (వీనిలో సోవియటుయూనియనులోని జాతుల వివిధభాషలలో చదువు నేర్పబడుతూంది.) మారిపోయిందనీ చెప్పేడు. దేశంలోని పరిశ్రమలలో 99% సోషలిస్టు పరిశ్రమలు, అప్పటికి. వ్యవసాయంలోవున్న భూమిలో 90 పాళ్లు సోషలిస్టువ్యవసాయం — అంటే, సమిష్టిక్షేత్రాలూ, ప్రభుత్వక్షేత్రాలూ — క్రింద వుంది.

జాతీయార్థికవిధాన పునర్నిర్మాణానికై రెండో పంచవర్షప్రణాళిక అప్పుడే సాగుతూంది. నూతనమైన మహత్తర సోషలిస్టుపురోగతిలో దేశం సాగుతూంది. ఆత్మవిశ్వాసంతో, గతంలో నిర్మాణకార్యాలలో సంపాదించిన అనుభవాలవలన కలిగిన ఆత్మవిశ్వాసంతో అది ముందుకి సాగుతూంది. ప్రజాప్రేమకి పాత్రుడూ, తెలివిగల పార్టీనాయకుడూ అయిన స్టాలిను దానిని నడుపుతున్నాడు. పార్టీకి అతిప్రధానాలయిన నిర్మాణబాధ్యతలని సూచిస్తూన్నది ఆయనే. పార్టీసభ్యులకి అధికమైన సిద్ధాంతజ్ఞానం కావాలన్నాడు ఆయన. అన్నిభాగాలలోనూ విశేషంగా పని చెయ్యాలన్నాడు. లెనినిజాన్ని నిరంతరం ప్రచారంచెయ్యాలన్నాడు. లెనినిస్టు అంతర్జాతీయదృష్టితో పార్టీసభ్యులకి తరిఫీదు నివ్వాలన్నాడు. విప్లవకరమైన జాగ్రత్త హెచ్చుకావలసిన అవసరం వుందన్నాడు.

మార్క్సిజం - లెనినిజంనుంచి పెడదారిగా వున్నవాటి నన్నింటినీ ధైర్యంగానూ, నిర్భయంగానూ విమర్శించాలన్నాడు. లెనినిజానికి విరుద్ధమైన ధోరణులన్నింటినీ యధావిధిగా బయలుపెట్టాలన్నాడు. ఆయన పార్టీముందు ఈ దిగువనున్న ముఖ్యనిర్మాణ బాధ్యతలని పెట్టేడు :

1. "మనపార్టీయొక్క రాజకీయవిధానానికి సరిపడేటట్లుగా మన నిర్మాణ పద్ధతుల్ని సరిపుచ్చుకుంటూండాలి;

2. "నిర్మాతలైన నాయకుల్ని రాజకీయనాయకుల స్థాయికి తీసుకురావాలి.

3. "పార్టీయొక్క నిర్ణయాలనీ, రాజకీయ నినాదాలనీ, అమలుపరిచే కార్యానికి నిర్మాతలైన నాయకులు సరిపోగుతున్నదీ లేనిదీ చూడాలి." (అందులోనే)

మెషీన్, ట్రాక్టరు స్టేషన్లలోనూ, ప్రభుత్వక్షేత్రాలలోనూ రాజకీయవిభాగం వుండవలసిన ఆవశ్యకతనీ, వాటిపనిలో వృద్ధికలిగించవలసిన ఆవశ్యకతనీ, పార్టీనీ సోవియటు నాయకులనీ, గ్రామసీమలకి సన్నిహితంలోకి తేవలసిన ఆవశ్యకతనీ, స్టాలిన్ చూపించేడు. నిర్మాణాలవిషయంలోకూడా తీసుకోవలసిన చర్య లెన్నింటినో ఆయన సూచించేడు. పీపుల్సు కమిస్సారియేట్లనీ, పరిపాలనా మండలాలనీ, జిల్లాలనీ, యిండస్ట్రియల్‌బోర్డులనీ, ట్రస్టులనీ చిన్నచిన్న యూనిట్లుగా విభజించాలని సూచించేడు.

ఈ చర్యలు తీసుకోడానికి కారణం నాయకులని ఎక్కువ బాధ్యతగలవారినిగా చెయ్యడానికీ, వారిని ప్రజలకి సమీపంలోకి తీసుకురావడానికీ, పార్టీకి - ప్రభుత్వానికీ - ఆర్థికవిధానానికీ సంబంధించిన సంస్థలయొక్క పనిని వృద్ధిపరచడానికీ వుద్దేశించే.

స్టాలిన్‌యొక్క ప్రతిమాటా సోవియటుయూనియనులో మాత్రమేగాక, ప్రపంచం అంతటా విశేషంగా విలువ యివ్వబడుతుండేది మనం యిక్కడ మరచిపోకూడదు. అన్నిదేశాలలోని పత్రికలూ ఆయన వ్రాతలనీ, మాటలనీ ముద్రిస్తున్నాయి. ఆయన మాటలని ప్రపంచం అంతా శ్రద్ధతో వింటూంది. ఆయన తరుచుగా మాట్లాడడు ; ప్రజలకీ, సోవియట్ రాజ్యాంగంకీ, పార్టీకి అవసరాలు వచ్చినప్పుడే ఆయన బయటికి వస్తాడు. తరుచుగా విదేశీయవారులు అనేకసమస్యలతో

ఆయనవద్దకి వస్తూంటారు. 1934 జనవరి 4 న అమెరికన్ పత్రికారచయిత వాల్టర్‌డ్యురాంటీకి యింటర్వ్యూ యిచ్చేడు. 1934 జూలై 23 న హెచ్. జి. వెల్సుకి. 1936 మార్చి 1 న స్క్రిప్సు - హోవార్డు వార్తాపత్రికల ప్రతినిధి రాయ్ హోవార్డుకి యింటర్వ్యూ లిచ్చేడు. అంతర్జాతీయ వ్యవహారాలకి సంబంధించిన అనేక సమస్యలమీద బోల్షివిక్‌పార్టీయొక్క అభిప్రాయాలనీ, యూ. సో. సో. రి.కి యితరదేశాలలోగల సంబంధాలనీ కష్టజీవులయిన ప్రజాసమూహాలకి తెలియ పరుస్తూ ఈ యింటర్వ్యూలు అమూల్యాలుగా వున్నాయి.

1934 డిసెంబరు 1 న. ట్రాట్‌స్కీయైట్ ద్రోహి ఒకడు దొంగపోటుగా సెర్జీ కిరోవ్‌ని కాల్చిచంపేడు. ఈయన స్టాలినుకి వరమమిత్రుడు. మంచి బోల్షివిక్కు. విప్లవయోధుడు. ప్రజలకి విశ్వాసపాత్రుడు. కమ్యూనిజానికి, పార్టీకి శత్రువులయినవాళ్ళు సహాయాధారాల నన్నింటినీ కోల్పోయినారనీ, అసహ్యకరాలయిన పను లన్నింటికీ తయారయ్యారనీ, దురంతాలకి తయారయినారనీ, వర్తి హంతకులుగా, గూఢచారులుగా, పైదార్లుపట్టించేవారుగా, విధ్వంసకులుగా తయారయ్యారనీ ఈ కాల్పు స్పష్టపరచింది.

పోరాటం తీవ్రం అయి, శత్రువు అన్నిటికీ తెగించేస్థితికి వస్తాడని స్టాలిన్ తరుచుగా పార్టీని హెచ్చరిస్తూనే వచ్చేడు.

పార్టీ ఎప్పుడూ జాగ్రత్తగా వుండాలనీ, శత్రువుయొక్క గుట్టుమట్లన్నీ బయట పెట్టుతూనేవుండాలనీ, ఒక్కొక్కప్పుడు శత్రువులు పరిశ్రమలలో పార్టీలో యువకమ్యూనిస్టు సమితియొక్క సంస్థలలో ప్రధానపదవులకి చేరగలుగుతూంటాడు. గనక జాగ్రత్తగా కనిపెట్టి వుండాలనీ, ఆయన బోధించేడు. బోధిస్తూన్నాడు. ట్రాట్స్కీయైట్లు యితర శత్రుసంస్థల దుంపనాశనం చెయ్యడంలో నిర్దయగా వుండమని బోధిస్తున్నాడు

అన్నిరకాల రెనినిస్టు వ్యతిరేకదశాల శేషభాగాలకి విరుద్ధంగా పట్టుదలగా పోరాటం సాగించడం ఎంత అవసరమో ట్రాట్‌స్కీయైట్ గూండాల చేతుల్లో జరిగిన కిరోవ్‌హత్య చూపింది. నిర్దయగా పోరాడి, శత్రువుల మూలాలని నిర్మూలించి వుండకపోతే కమ్యూనిజంకోసమై జరిపిన పోరాటంలో సోవియటు భూమి ఇప్పుడు పొందిన విజయాలని పొందలేకపోయేది.

స్టాలిన్‌నాయకత్వాన బోల్షివిక్‌పార్టీ అధికారాక్రమణతర్వాత అంత కఠినమూలయిన ఒక చారిత్రకకర్తవ్యాన్ని ఈకాలంలో నిర్వహించింది. సోషలిజంయొక్క మార్గం అయిన సమష్టి వ్యవసాయమార్గాన్ని లక్షలకొలది చిన్నరైతులు, యజమానులు అనుసరించేరు. దోపిడిచేసే వర్గాలలో పెద్దదయిన కులకువర్గం నిర్మూలించబడింది. పెట్టుబడీదారీ విధానంయొక్క చివరివేళ్ళుకూడా తెంపివెయ్యబడ్డాయి. సోషలిస్టువిజయం లభ్యం. మనుష్యుడిని మనుష్యుడు దోచుకోవడం అంతరించింది. మన దేశంలోని కష్టజీవుల అర్థిక వైజ్ఞానిక ప్రమాణాలు నిరంతరం వృద్ధిపొందడానికి కావలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి. విశ్వాసపాత్రుడైన నాయకుడు స్టాలిన్ చేత నడపబడిన బోల్షివిక్‌పార్టీ సాధించింది, ఈ విజయాన్ని.

# ఏడవ పార్టీకాంగ్రెసు తర్వాత :
# ( 1935–1939 )

స్టాలిన్ యొక్క సిఫారసులకి బోల్షివిక్ పార్టీ అధికమైన విలువ నిస్తుంది. పదిహేడో పార్టీకాంగ్రెసులో ఆయన రిపోర్టుమీద తీర్మానం చేయడంగా, ఆ రిపోర్టే పూర్తిగా పార్టీయొక్క భవిష్యత్ కార్యక్రమానికి పునాదిగా స్వీకరించబడింది. ఇంతవరకు నడిచిన మార్గాన్నీ సోషలిస్టు నిర్మాణకార్యంలో పొందిన విజయాలనీ, సమాలోచనచేస్తూ, ఆయన మూడు ప్రధానతీర్మానాలకి వచ్చేడు :

1. "మనం పొందిన విజయాలకి ఒళ్ళు మరచిపోయి, తల తిరిగిపోనీ కూడదు."

2. "మనం పూర్తిగా మార్క్సు, ఏంగిల్సు, లెనిన్ల ఉపదేశాలకి అంటి పెట్టుకుని వుండాలి."

3. "మనం పూర్తిగా శ్రామికవర్గ అంతర్జాతీయతకి, అన్నిదేశాలలోని శ్రామికుల భ్రాతృస్నేహానికి అంటిపెట్టుకునివుండాలి." (లెనినిజం)

యూ. సో. సో. రి. లో సోషలిజం పొందుతూన్న అభివృద్ధిక్రమంలోని ఈ దశయొక్క ప్రత్యేకలక్షణా లేమిటి ? రెండో పంచవర్షప్రణాళిక అనుకున్న కాలానికి ముందుగానే పరిపూర్తిఅయిపోయి, మూడవ పంచవర్షప్రణాళిక ఆరంభం అయింది. సోషలిస్టు సమాజనిర్మాణం మొత్తంమీద పూర్తిఅయింది. కాడర్లకి తరిఫీదునివ్వడంలోనూ, వారికి శిల్పజ్ఞానమూ, సిద్ధాంతజ్ఞానమూకలిగించడంలోనూ అద్భుతఫలితాలు సాధించబడ్డాయి. ఈ కాలంలో స్టాఖనోవ్ వుద్యమంయొక్క అభివృద్ధి చాలా ప్రధానమైనది. పెట్టుబడివారీవిధానాన్ని స్థాపించివుండగల కుడిపక్షాలు, ట్రాట్‌స్కీ-యిట్లు, విదేశీయ గూఢచారిదళాలకి ఏజంట్లయిన జాతీయవాదులూ పూర్తిగా విధ్వంసం చేసివేయబడ్డారు. పార్టీవ్యవహారాలలో క్రమస్థితి ఏర్పరచబడింది. స్టాలిన్ రాజ్యాంగచట్టం వ్రాయబడి, కార్యరూపంలోకి తేబడింది. సోషలిజంయొక్క నిర్మాణాన్ని పూర్తిచేయడం అయిపోయి, సోషలిజంయొక్క మొదటిదశనుంచి ఎగువదశలోకి - కమ్యూనిజంలోకి క్రమంగా మార్పువస్తూంది.

ఈ బ్రహ్మాండమైన పనుల్ని నిర్వహించడంలో స్టాలిన్ యొక్క మార్గదర్శకత్వం అమూల్యసహాయాన్ని ఇచ్చింది. కమ్యూనిజంవైపు సాగే ఉద్యమం యొక్క అభివృద్ధికై వేసినప్రతిఅడుగూ ఆయనయొక్క ప్రోత్సాహంవలన, ఆయనయొక్క సిద్ధాంత సహకారాలూ వ్యాఖ్యానాలూ సూచనలూ వలననే వెయ్యబడింది.

ఉదాహరణకి కాడర్ల సమస్య తీసుకోండి. 1935 మే నాలుగున రెడార్మీ ఎకాడమీల విద్యార్థులకి క్రెమ్లిన్‌లో వుపన్యసిస్తూ స్టాలిను పార్టీనాయకత్వాన సోవియటుయూనియను పెట్టుబడిదారీమూలశక్తులపై పోరాటం సాగించి ఏవిధంగా అద్భుతవిజయాన్ని సాధించిందో చూపించేరు. ఈ విజయం ఏలాగవచ్చింది? సోషలిస్టు నిర్మాణం విషయంలో పార్టీఅవలంబించిన వేగాన్ని తగ్గించాలన్నవారినీ, పార్టీవిధానంనుంచి పెడదార్లు పట్టినవారిని-మార్గంలోంచి తుడిచిపెట్టెయ్యడంచేతనే ఈ పని సాధ్యం అయింది.

" అభివృద్ధికి మార్గాన్ని నిర్ణయం చేసుకుని, లెనినిస్టుభోధ్దు వెంబడే తమ ఎదురుకుండా ఏంవుందో చూస్తూకూడా, దేశపు సమీప భవిష్యత్తునీ, మన దేశంలో సోషలిజంయొక్క భవిష్యత్తునీ చూడకుండా కళ్ళుమూసుకున్న జనాన్ని దారిలోంచి గెంటేసి ముందుకి నడిచిపోయేం." (లెనినిజం.)

బోల్షివిజానికి శత్రువులు అయినవారు పార్టీవిధానాన్ని విమర్శించడంతో వూరుకోలేదు. "సెంట్రల్‌కమిటీకి విరుద్ధంగా పార్టీలో తిరుగుబాటు లేవదీస్తామని బెదిరించేరు. మనలో కొందర్ని తుపాకిగుళ్ళతో బెదిరించేరు. బహుశా అదిరించీ, బెదిరించీ మనని లెనినిస్టుమార్గం విడిచిపెట్టేటట్లు చేయాలని వారి సంకల్పం అయివుంటుంది. కాని బోల్షివిక్కుల్ని బెదిరింపులూ, కష్టాలూ-భయపెట్టలేవన్నమాట వాళ్ళు మరిచిపోయేరు. పోరాటంలో భయం అనేది ఎరగని, మన నాయకుడు, గురువు, లెనిన్‌వద్ద తరిఫీదుపొంది ఉక్కులా బలపడ్డామని వారు మరిచేరు. శత్రువులు మరింత చెలరేగినకొద్దీ, పార్టీలో శత్రువులు మరింత ఆవేశపడినకొద్దీ, బోల్షివిక్కులు మరింత పట్టుదలతో కొత్తపోరాటాలకి తయారయి ముందుకి తోసుకుపోతా రనేది వాళ్ళు మరిచిపోయేరు.

" లెనినిస్టు రోడ్డునుంచి యింతవర కెప్పుడూ తప్పిపోలేదు. పైగా మనం ఈ దారికి వచ్చేక మన మార్గంలోవున్న ప్రతి అడ్డంకునీ తోసివేస్తూ ముందుకి పట్టుదలగా సాగిపోతూనే వున్నాం." (పైదానిలోనే)

ఈ ఉపన్యాసంలో కామ్రేడ్ స్టాలిన్ కాడర్లసమస్య ఎంత ముఖ్యావసరమో చెప్పేడు. అంతక్రితం-నూతన శిల్పనిర్మాణం ముఖ్య కర్తవ్యంగా వున్నప్పుడు "అన్నింటినీ నిర్ణయించేది శిల్పం" అన్న నినాదం యివ్వబడింది. ఈ శిల్పం సృష్టించబడ్డాక "ఆశిల్పంలో నిపుణత సంపాదించిన మనుష్యులు కావాలి మనకి. ఆ కళలో చాతుర్యాన్ని వినియోగించి, శిల్పాన్ని స్వాధీనంలో వుంచుకొని ఉపయోగంలో పెట్టగల కాడర్లు మనకి కావాలి. మనుష్యులు లేనిదే శిల్పాన్ని స్వాధీనపరచుకుంటే ఆ శిల్పం మృతశిల్పం శిల్పనిపుణత సంపాదించిన వ్యక్తుల స్వాధీనంలో శిల్పం అత్యద్భుత కార్యాల్ని నిర్వహించగలదు. అందుచేతనే ఒకరోజున అప్పటి పరిస్థితులకి అనుకూలంగావున్న "అన్నింటినీ నిర్ణయించేది శిల్పం" అనే నినాదం (అప్పుడు మనకి శిల్పం బాగా లోపంగా వుంది) యిప్పుడు పనికిరాదు. దానిస్థానే కొత్త నినాదం యివ్వబడాలి, "అన్నింటినీ నిర్ణయించేది కాడర్లు." యిదీ యిప్పుడున్న ప్రధానవిషయం." (పైదానిలోనే)

స్టాలిన్ సిఫార్సుమీద పార్టీ, ప్రభుత్వమూకూడా సోవియట్ సోషలిస్టు మేధావులనుంచి అన్ని విజ్ఞానశాఖలలోనూ అత్యధికసంఖ్యలో కాడర్లకి తరఫీదునిచ్చేరు. ఆ పనిలో సఫలత పొందేరు.

స్టాలిన్ మాటలు పార్టీశాసనాలు అయినాయి. ఆయనకి పార్టీలోనూ, యావత్తు దేశంలోనూ, అంత హెచ్చు ప్రతిష్ఠవుంది. దీనికి కారణం ఆయన ప్రతి అడుగునీ ఎంతో తూచితూచి వేస్తాడు. పరిస్థితుల నన్నిటినీ ఆలోచిస్తాడు. గతి తార్కిక భౌతికవాద బోధల్ని నేర్పుగా ఉపయోగిస్తాడు. అందుచేతనే ఆయన కంత దూర దృష్టి అలవడింది. కాని. పార్టీ నినాదాలని కార్యరూపంలో పెట్టడానికై ముందు ఆయన ప్రజాసామాన్యంవేపే తిరుగుతాడు. వారికి బోధించి, వారిని నిర్మాణాల లోకి తెమ్మంటాడు. వారి సహాయాన్ని కోరుతాడు. ఆయన సలహామీదనే సమిష్టి రైతాంగపు కాంగ్రెసులు జరపబడ్డాయి. ఆర్థిక ప్రయత్నాల వేరువేరు శాఖలలో బాగా పనిచేస్తూన్నవారి కాంగ్రెసులు పిలవబడ్డాయి. ఈ సమావేశాలకి ఆయన స్వయంగా హాజరయ్యేడు. వాటికి మార్గాలు చూపేరు. సమిష్టిరైతుల స్టాఖనోవైట్ల వుక్కు కరిగించేవారియొక్క, భవన నిర్మాతలయొక్క, పత్తిపండించేవారియొక్క ఉపన్యాసాలని శ్రద్ధతో వినేవాడు. ఎల్లప్పుడూ ప్రజలకి నూతన భావాలని సూచిస్తూ నేవుంటాడు.

1935 జూలై 30న క్రెమ్లిన్‌లో రైల్వేపనివారికి స్వాగతం ఇవ్వబడింది. అక్కడసభలో రైల్వేల బాధ్యతలనిగురించి స్టాలిన్ మాట్లాడేడు. సుగర్‌బీట్ పైరుచేసే సమిష్టిక్షేత్రాంలోని షాక్‌వర్కరు ఆడవాళ్ళకి క్రెమ్లిన్‌లో పార్టీ నాయకులూ, ప్రభుత్వనాయకులూ సమ్మానం ఇచ్చేరు. 1935 నవంబరులో రహదారుల లోనూ, పరిశ్రమలలోనూ పనిచేస్తూన్న స్టాఖానోవైట్ల అఖిలయూనియన్ సమావేశం మొదటిపర్యాయం క్రెమ్లిన్‌లో జరిగింది. కంబైన్లని నడపడంలో చాతుర్యం చూపినవారితో ప్రభుత్వంయొక్క, పార్టీయొక్క సెంట్రల్‌కమిటీసభ్యులు సో. యూ. క. పా. (బో) సెంట్రల్‌కమిటీవారి సమావేశమందిరంలో మీటింగ్ జరిపేరు. ఆ డిసెంబరులోనే ఒకటో తేదీన, తాజక్‌స్తాన్, తుర్కిమన్‌స్తాన్‌లలోని ప్రధానులయిన సమిష్టివ్యవసాయదారులతో పార్టీనాయకులూ, ప్రభుత్వనాయకులూ డిసెంబరు 4 న క్రెమ్లిన్‌లో సమావేశం అయ్యేరు. అదేసమయంలో ఉజ్బెకిస్తాన్ కాజాక్‌స్తాన్, కారాకల్పాకియాల సమిష్టివ్యవసాయదారులలో అగ్రేసరుల సమావేశాలుకూడా జరిగేయి. ధాన్యపుపంటని పండించడంలో రికార్డు స్థాపించిన వారితోటీ, నిపుణులైన ట్రాక్టరు డ్రైవర్లతోటీ, నూర్పిడియంత్రాల్ని నడిపేవారితోటీ ప్రభుత్వనాయకులూ, పార్టీనాయకులూ, డిసెంబరుఆఖరున సమావేశం జరిపేరు. 1936 జనవరిలో మెషిన్‌స్టేషన్లలోనూ, ట్రాక్టర్‌స్టేషన్లలోనూ, భూమిడిపార్టు మెంట్లలోనూ సుప్రసిద్ధులయిన పనివారితో పార్టీ - ప్రభుత్వనాయకులు సమావేశం జరిపేరు. బంగారమూ, ఇనుముతో సంబంధంలేని లోహాలు, తేలికలోహాలు, అరుదుగా దొరికే లోహాల పరిశ్రమలలో పనిచేస్తూన్నవారికి క్రెమ్లిన్‌లో పార్టీ - ప్రభుత్వనాయకుల 1936 జనవరి 4 న సన్మానం ఇవ్వబడింది. బర్యాట్-మంగోలి

యన్ అ. సో. సో. రి. (అటానమస్ సోషలిస్టు సోవియట్ రిపబ్లిక్కు) శ్రామిక ప్రజా ప్రతినిధులతో పార్టీ - ప్రభుత్వనాయకులు 1936 జనవరి 27 న కలుసుకున్నారు. కిత్తనార - ఫ్లాక్సుమండలాలలోని సమిష్టివ్యవసాయదారులలో ముఖ్యులతో పార్టీ-ప్రభుత్వనాయకులు 1936 మార్చి 14 న సమావేశం జరిపేరు. జార్జియన్ సోవియటు రిపబ్లికుస్థాపనయొక్క పదిహేనో వార్షికోత్సవ సందర్భంలో ఆ రిపబ్లిక్కుప్రతినిధులకి 1936 మార్చి 19 న సమ్మానం ఇవ్వబడింది. గురుపరిశ్రమలలోని మానేజర్ల - ఇంజనీర్ల భార్యల అఖిలయూనియన్ సమావేశం క్రెమ్లిన్‌లో 1936 మే 10 న ప్రారంభమయింది.

పరిశ్రమల విజ్ఞానాల శాఖలలో పనిచేసేవారితో జరిగిన సమావేశాలలో ఇవి కొద్దిపాటిమాత్రమే. ఈ సమావేశాలలో స్టాలిన్ మాట్లాడేడు. ఆయన మాటలు దేశంయొక్క ఆర్థికాభివృద్ధికి చాలా ఉపయోగపడ్డాయి. పార్టీయొక్క; ప్రభుత్వంయొక్క తీర్మానాలని అమలుజరపడానికీ, యూ. సో. సో. రి. లోని జాతులమధ్య మైత్రి దృఢపడడానికీ అవి అమూల్యసహకారం చేసేయి.

వ్యవసాయంలో సమిష్టివిధానాన్ని ప్రవేశపెట్టడానికై తీవ్రపోరాటం సాగుతూన్నప్పుడు కులక్కులూ, మతబోధకులూ, రైతుల్ని రెచ్చగొట్టి, సమిష్టిక్షేత్రాలలోని జీవితాలని గురించి అసహ్యకరమైన కథలుచెప్పి భయపెట్టి, తమచేతిలోకి తెచ్చుకుందుకై చెయ్యగలంతపనీ చేసేరు. కులక్కులయొక్క ఈ ప్రచారాన్ని సమిష్టివ్యవసాయదారుల కాంగ్రెసులో ఇచ్చిన ఉపన్యాసంతో తుత్తునియలుచేసేడు.

1935 నవంబరులో బీట్‌ని పైరుచేస్తూన్న సమిష్టిక్షేత్రాలలో షాక్‌వర్కరు స్త్రీల సన్మానసభలో మాట్లాడుతూ సమిష్టిక్షేత్రాల మూలగానే పల్లెటిప్రాంతాలలోని స్త్రీలు శ్రమలో మగవారితో సమానం అయ్యేరన్నాడు.

"గ్రామసీమలలోని స్త్రీలు శ్రమజీవులలోకల్లా హీనదశలో వున్నారు. అటువంటిదశలో వారిలో శ్రామికవీరాంగనలు బయలుదేరడం జరగదు. ఆరోజుల్లో ఆడవాళ్లు పనిచెయ్యడం అవమానకరం. అందుచేత సాధ్యమైనంతవరకూ పని నుంచి తప్పించుకుందుకే ప్రయత్నించేది.

"సమిష్టిక్షేత్రాల జీవితమే శ్రమ గౌరవనీయమనే భావనని కలిగించగలదు. అదే గ్రామసీమలో వీరాంగనలను తయారుచేసింది. అసమానత్వాన్ని తొలగించి స్త్రీలను వారి కాళ్ళపై నిలబడగలిగేటట్లు చేయగలది సమిష్టిక్షేత్రజీవితమే. ఆసంగతి మీకే బాగా తెలుసు. సమిష్టిక్షేత్రమే పనిదినపు కొలతను ప్రవేశపెట్టింది. దినపు పనికొలత అంటే ఏమిటి? పనిదినపు యూనిటుముందు స్త్రీపురుషుల మధ్య భేదంలేదు. ఎవరు దినంలో ఎక్కువపనియూనిట్లు పనిచేస్తారో వారెక్కువ సంపాదిస్తారు, తాను పోషిస్తున్నానని భర్తగాని, తండ్రిగాని, ఆమెని నిందించలేడు. స్త్రీ పనిచేస్తూ, పనిదినపు యూనిట్లు తనకాతాలో కలిగివుంటే ఆమెకి ఆమె స్వతంత్రురాలు."

మొదటి అఖిలయూనియన్ స్టాఖానొవైట్ కాన్ఫరెన్సులో 1935 నవంబరు 17 న స్టాఖనోవైట్ 'ఉద్యమంయొక్క ప్రాముఖ్యతని చూపించేడు. "సోషలిస్టు

పోటీలో ఒక నూతన తరంగాన్ని, ఒక నూతన, వున్నతదశని సూచిస్తూంది-" (లెనినిజం) ఈ ఉద్యమం అన్నాడు.

"ఈనాడున్న శిల్పపు మట్టాల్ని ఉద్దేశించబడిన శక్తుల్ని వేసుకున్న ఉత్పత్తి పథకాలనీ, అంచనాలనీ అతిక్రమించేటందుకై తమంతతామే ముందు కొచ్చిన శ్రామిక స్త్రీ - పురుషుల ఉద్యమం స్టాఖనోవ్ వుద్యమం....శిల్పం ఎడగల ప్రాచీనాభిప్రాయాల్ని ఈ వుద్యమం కూలదోస్తూంది. నూతనమూ వున్నతమూ నైన శిల్పస్థితిని, శక్తినిర్ణయాన్ని, వుత్పత్తిపథకాలనీ, యిది కోరుతూంది. అది మన పరిశ్రమలో విప్లవం తేవడానికై ఉద్దేశించబడింది. అందుచేతనే స్టాఖనోవైట్ వుద్యమం నిజానికి విప్లవోద్యమమే....

"కాని, స్టాఖనోవ్ వుద్యమంయొక్క ప్రాముఖ్యత యింతేకాదు. అది సోషలిజంలోంచి కమ్యూనిజంలోకి మార్పు వచ్చేటందుకు అవసరమైన పరిస్థితుల్ని నిర్మిస్తూంది." (పైదానిలోనే)

కమ్యూనిజం అంటే సోషలిజంయొక్క పరిణామంలోని ఒక వున్నతదశ. దానికి విశేషోత్పత్తికరమైన శ్రమగావాలి. ఉన్నతదశలో విజ్ఞానం, శిల్పంవుండాలి. మానసిక - శారీరక శ్రమలమధ్య భేదం అంతరించాలి. దానిలో శ్రమ అత్యధికంగా వస్తువుల్ని తయారుచేస్తుంది. అప్పుడే కమ్యూనిస్టు సమాజంలోని సభ్యుల అవసరాలకి సరిపడేటంతగా వాటిని పంచడానికి సాధ్యపడుతుంది. ఉన్నతమైన పాదార్థిక - వైజ్ఞానిక సమస్థితినుంచి స్టాఖనోవ్ వుద్యమం బయలుదేరింది. ఈ వుద్యమం శ్రమయొక్క ఉత్పాదకశక్తి వృద్ధిపొందడానికై తోడ్పడుతుంది. శ్రామికుల శిల్పస్థితి, వైజ్ఞానికస్థితీ వృద్ధిపొందడానికి సాయపడుతూంది. శ్రామిక ప్రజల పాదార్థికాభివృద్ధి స్థితిని పెంపుచెయ్యడానికి తోడ్పడుతూంది. జీతాలసమానత్వాన్నీ, అనిర్దిష్టమైన బాధ్యతలనీ, పూర్తిగా తొలగించి, వారుపడేశ్రమకి అధికమైన ప్రతిఫలం వచ్చేటందుకు తోడ్పడే పద్ధతిని స్టాఖనోవైట్లయెడ పార్టీ అవలంబిస్తూంది.

శ్రామికుల పాదార్థికస్థితి బాగుపడడంచేతనే స్టాఖనోవ్ వుద్యమం వచ్చిందన్నాడు, స్టాలిన్, "కామ్రేడ్స్ ! జీవితం అభివృద్ధి పొందింది. జీవితం ఆనందదాయకం అయింది; జీవితం సుఖకరంగా వుంటే పని బాగా నడుస్తుంది. అందుచేతనే వుత్పత్తిలో హెచ్చుదల వచ్చింది. అందుచేతనే శ్రామికులలో వీరులూ, వీరాంగనలూ బయలుదేరేరు. స్టాఖనోవ్ వుద్యమానికి కీలకంఅది. (అందులోనే)

స్టాఖనోవ్ వుద్యమం రావడానికి మరో కారణం దోపిడీ లేకపోవడం. మనకి ఆధునికశిల్పం వుండడం మూడోకారణం. మేలురకపు శిల్పాన్ని అదుపులో వుంచుకోడానికి సమర్థతగల మంచి కాడర్లు వుండడం నాలుగోకారణం. కొత్త ప్రజలు ముందుకొచ్చేరు. వెనకటి అంచనాలని త్రోసివేసి వుత్పత్తిలో నూతన స్థితుల్ని సృష్టించుతూన్న ప్రజలు వచ్చేరు. "నూతనప్రజ, నూతనకాలం-నూతన శిల్పస్థితి" (పైదానిలోనే)

నూర్పిడియంత్రాల్ని నడపడంలో విశేషచాతుర్యాన్ని గడించిన స్త్రీల-పురుషులా సమావేశంలో స్టాలిన్ వుపన్యసిస్తూ, మనకున్న ఆధునిక శిల్పాన్ని పట్టి చూస్తే నూతన ప్రజలనీ, నూతన శ్రమవిధానాలనీ సమీపభవిష్యత్తులో సాధించడానికి సమర్థతగల గొప్ప బాధ్యతనిగురించి చెప్పేడు. రాబోయే సంవత్సరాలలో ఏటా ఏడెనిమిది వందలకోట్ల బుషెలుల ధాన్యం పండించవలసిన బాధ్యతని నిర్వహించాలన్నాడు.

సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు సమాజనిర్మాణాన్ని పూర్తిచెయ్యడానికై ప్రయత్నాలు జరుగుతూన్న దినాలలో అంతర్జాతీయ పరిస్థితులు చాలా అననుకూలంగానూ, క్లిష్టంగానూ వున్నాయి. పెట్టుబడిదారీప్రపంచం మళ్ళీ ఓకొత్త దుస్థితి నెదుర్కొంటూంది. ప్రపంచాన్ని తిరిగి పంపకానికి తెచ్చి ఈ దుస్థితినుంచి తప్పుకోవాలని మార్గాలు వెతుకుతున్నాయి కొన్ని సామ్రాజ్యవాదప్రభుత్వాలు. విశాల భూభాగాలపై చెలరేగగల యుద్ధజ్వాలల కౌగిట్లోకి పెట్టుబడిదారీ ప్రపంచం వురుకులు పెడుతూంది.

అటువంటి పరిస్థితులలో మనంకూడా యుద్ధంలోకి ఈడవబడకుండా తప్పించుకుందుకు ఎంతో ఓర్పూ, తెలివీ, విదేశవ్యవహారాలలో చాకచక్యం అవసరం. ఆత్మరక్షణశక్తీ, సోవియటుప్రభుత్వపు సైనికశక్తీ బాగా ఉన్నతదశకి తేబడాలి.

యూ. సో. సో. రి. ప్రపంచశాంతికి పెట్టనికోటయని ప్రపంచశ్రామిక ప్రజలలో గొప్ప ప్రతిష్ఠ ఏర్పడింది. స్పానిషు రిపబ్లికనులయెడ గాఢమైన సానుభూతిచూపి, సహాయం బహిరంగంగా చేసినదేశం ఒక్క సోవియట్‌యూనియనే; స్పానిష్‌కమ్యూనిస్టుపార్టీయొక్క సెంట్రల్‌కమిటీ పంపిన అభివందనాలకి సమాధానం ఇస్తూ స్టాలిను స్పానిషుప్రజల రక్షణ అభివృద్ధికరులయిన మానవులందరి రక్షణ అని చెప్పేడు. జపానీస్ సామ్రాజ్యవాదంతో చేస్తూన్నపోరాటంలో చీనా ప్రజలకి సోవియట్‌ప్రజలు బహిరంగంగా సానుభూతీ - సహాయమూ ఇచ్చేరు.

స్టాలిన్ నిర్దేశాలప్రకారం సోవియట్‌దేశం తనరక్షణలని బలపరుచుకుంది. యుద్ధంగనకవస్తే అన్నిరకాల ఆయుధపరికరాలనీ సలభరాచెయ్యగల ఆయుధకర్మాగారాల్ని నిర్మించుకుంది. నౌకానిర్మాణకార్యక్రమం విస్తరింపచెయ్యబడింది. తెల్లసముద్రపు కాలవ తవ్వబడింది. ఈ కాలవ రక్షణప్రాముఖ్యతా, ఆర్థికప్రాముఖ్యతాకూడా కలది. ఈ కాలంలో నౌకాబలం, సబ్మెరీన్‌బలం, విమానబలం, మిగిలిన శాఖలూ అత్యద్భుతంగావిస్తరించేయి. దీనివలన సోవియటుయూనియను తన సోషలిస్టు నిర్మాణాన్ని శాంతంగా సాగించుకుందుకు వీలుచిక్కింది.

గతంలో మాదిరిగానే ఇప్పుడుకూడా ప్రత్యేకంగా సాయుధసైన్యాలలోకి అవసరమైన శిల్పచాతుర్యంగల కాడర్లని తయారుచేయడానికి విశేషప్రాముఖ్యతనిచ్చేడు.

స్టాలిన్ కాడర్లకి శిల్పపరికరాలు కూర్చడంకోసంమాత్రమే శ్రద్ధతీసుకుని వూరుకోలేదు. కాడర్లకి సిద్ధాంతంలో తరిఫీదునిచ్చేపనికి ఆయన ఎప్పుడూ విశేష

ప్రాముఖ్యత నిస్తూనేవున్నాడు. దీనికోసమై ఆయన సో. యూ. క. పా. (బో) చరిత్రని కూర్చడానికై విశేషంగా తోడ్పాటునిచ్చేడు. ఇది సో. యూ క. పా. (బో) సెంట్రల్‌కమిటీ నియోగించిన కమీషన్‌చేత ప్రకటించబడింది. ఇందులో హెచ్చుభాగం స్టాలిన్‌చేత వ్రాయబడిందే. ఇది విశేషమైన రాజకీయప్రాముఖ్యత గలవిషయం. సోవియటుప్రజలకీ, ఇతరదేశాల శ్రామికప్రజలకీ, బోల్షివిక్‌విజ్ఞాన సర్వస్వంలా వుపయోగపడుతూంది. బోల్షివిజంయొక్క మూలసూత్రాలు వివరంగా ఆకర్షకంగా, సరిగ్గా వివరించబడ్డాయి అందులో. కమ్యూనిజంకోసం సాగించే పోరాటంలో నూతన-బలీయసాధనం అనదగిన గతితార్కిక - చారిత్రక భౌతిక వాదంయొక్క మూలసూత్రాలూ స్పష్టం చెయ్యబడ్డాయి.

మనకి కావలసింది ఏదో ఒకరకపు కాదర్లుకాదనీ, శిల్పంలో నిపుణత సంపాదించడంతోపాటు విజ్ఞానశాస్త్రాలకి విజ్ఞానశాస్త్రం అనదగిన మార్క్సిజం - లెనినిజంయొక్క ఉపదేశాలలో నిష్ణాతులయిన కాదర్లు కావలసివున్నారని పద్దెని మిదోపార్టీ కాంగ్రెసులో స్టాలిన్ వుపన్యసించేడు.

ఈ విషయమై ఈ కాలంలో స్టాలిన్ విశేషంగా కృషిచేసేడు.

పార్టీసభ్యులకీ, యువకమ్యూనిస్టుసమితి సభ్యులకీ, మొత్తంమీద శ్రామిక ప్రజలకీ సిద్ధాంతవిషయాలలో తరిఫీదు నివ్వడానికి స్టాలిన్ బాగా కృషిచేసేడు. సోవియట్‌యూనియనులోని శ్రామికప్రజలకి బోల్షివిక్‌విద్య నేర్పడానికై సిద్ధాంత ప్రచారానికీ, స్కూళ్ళకీ, పత్రికలకీ, ప్రచారానికీ విశేషశ్రద్ధ చూపించేడు. ఈ విష యంలో స్టాలిన్‌వ్రాసిన "లెనినిజంయొక్క సమస్యల"తో మన కిదివరకే పరిచ యంవు ది. ప్రతికమ్యూనిస్టుకీ, పార్టీలో చేరిన్వుండని ప్రతిబోల్షివిక్కుకీ ఇది పాఠ్య గ్రంథంగా వుంది; సోవియటుయూనియనులోనూ, ఇతరదేశాలలోనూకూడా ఇది ఎన్నోభాషలలోకి పరివర్తించబడింది.

1938 లో స్టాలిన్ సూచనమీద పార్టీ సెంట్రల్‌కమిటీ ప్రచారకులసమా వేశాన్ని ఆహ్వానించింది. అక్కడ ప్రచారపద్ధతులలో అభివృద్ధి తీసుకురావడానికి అమూల్యములయిన సలహాల నిచ్చేడు. ఈసలహాలని సెంట్రల్‌కమిటీ తీర్మాన రూపంలోకి తెచ్చి, ప్రచారంలోనూ, సో. యూ. క. పా (బో) చరిత్రబోధనలోనూ నూతనపద్ధతులని తెచ్చిపెట్టింది.

పార్టీకాంగ్రెసులలోగాని, సెంట్రల్‌కమిటీ ప్లీనరీమీటింగులలోగాని, ఇతర కాన్ఫరెన్సులలోగాని స్టాలిన్ ఏది మాట్లాడినా సిద్ధాంతవిషయాల ననుసరించి వుంటాయి. ఎప్పుడూ నూతనసమస్యల్ని లేవదీస్తూంటాయి. సిద్ధాంతరంగానికి నూతన చైతన్యాన్ని కలిగిస్తాయి. బోల్షివిక్‌భావాల అభివృద్ధికి నూతనావకాశాలు కలిగిస్తాయి. కమ్యూనిజంవేపు సాగడానికి నూతనమార్గాలు తెరుస్తాయి.

సోవియటుయూనియనులోని శ్రామికప్రజలు కమ్యూనిజంయొక్క పూర్ణ విజయం పొందేమార్గంలో ముందుకి సాగకుండా చెయ్యడానికై బోల్షివిజానికి శత్రువులయినవారు సర్వప్రయత్నాలు చేస్తూన్నారు. పెదదార్లు తొక్కించే ప్రయ

త్నాలు, గూఢచారిపద్ధతులు, భయదీభత్సాలు కలిగించడం మొదలయిన పనులద్వారా ప్రజలయొక్క ఈ అభివృద్ధిని అడ్డగించాలని వారి సంకల్పం. సామ్రాజ్యవాదుల దురంతక హస్తాక్షేపక పద్ధతులద్వారా ఇంకా పెట్టుబడిదారీవిధానాన్ని పునస్థాపన చెయ్యగలమనే వారి భావం. ఈ ప్రమాదాన్నిగురించి స్టాలిన్ కాంగ్రెసులలో, సెంట్రల్‌కమిటీ ప్లీనరీమీటింగులలో, పత్రికలలో తరుచుగా హెచ్చరిస్తూనే వున్నాడు. ఆత్మసంతృప్తిపడి వూరుకోవద్దని హెచ్చరిస్తాడు. బుర్ర తిరిగిపోనీ వద్దన్నాడు. ఎల్లప్పుడూ జాగ్రత్తలో వుండమన్నాడు. శత్రువు మారువేషాలు బయటపెట్టి, వారిని ధ్వంసంచేయడం ఎల్లాగో నేర్పేడు.

స్టాలిన్‌యొక్క మార్గదర్శకత్వంక్రింద కమ్యూనిజంయొక్క మొదటిదశ—సోషలిజం—ప్రధానరంగాలలో సాధించబడింది. స్టాలిన్‌చేత వ్రాయబడి ఎనిమిదో సోవియట్ అసాధారణసమావేశంలో స్వీకరించబడిన రాజ్యాంగ ప్రణాళికవలన ఈ విషయం ద్యోతక మవుతూంది.

"ఆనాటికి....పెట్టుబడిదారీవిధానపు మూలశక్తులు పూర్తిగా నిర్మూలించి వేయబడినాయి. ఆర్థికజీవితంలోని అన్నిరంగాలలోనూ సోషలిస్టువిధానం విజయం పొందింది." (సో. యూ. క. పా. (బో) చరిత్ర) జాతీయార్థికవిధానం అంతటా నూతన సోషలిస్టువిధానానికి ఉత్పత్తిసాధనాలపై సామాజికస్వత్వం అచంచలమైన పునాదిగా ఏర్పడింది.

"సోవియట్ యూనియనుయొక్క జాతీయార్థికరంగాలలోవచ్చిన ఈమార్పులకి ఫలితంగా మనకు సోషలిస్టు ఆర్థికవిధానం లభించింది. దీనికి దుస్థితులూ, నిరుద్యోగమూ అంటవు. దారిద్ర్యమూ - వినాశమూ కనబడవు. మన పౌరులు, సుఖయుతమూ, విజ్ఞానవంతమూనైన జీవితాన్ని గడపడానికి సావకాశాలు కలిగిస్తుంది" అన్నాడు, స్టాలిన్ ఎనిమిదో సోవియట్ అసాధారణ సమావేశంలో చదివిన రిపోర్టులో.

సోవియటు సమాజంయొక్క వర్గస్వరూపమే మారిపోయింది; దోపిడిచేసే వర్గాలన్నీ విధ్వంసం చేసివెయ్యబడ్డాయి. "యూ. సో. సో. రి. లోని శ్రామికవర్గం పూర్తిగా ఒక నూతనవర్గంగా మారిపోయింది. యూ. సో. సో. రి. లోని పని చేసేవారి వర్గంగా మార్పుపొందింది. ఇది పెట్టుబడిదారీ ఆర్థిక విధానాన్ని నిర్మూలించి; ఉత్పత్తి సాధనాలూ, పరికరాలామీద సోషలిస్టు స్వత్వాన్ని స్థాపించి, సోవియటు సమాజాన్ని కమ్యూనిజంవైపువెళ్ళే బాటను నడిపిస్తూంది." ప్రపంచంలోని మరి ఏ ఇతర దేశంలోనూ ఆ మాదిరి శ్రామికవర్గం లేనేలేదు.

కర్షకులుకూడా ఈ మాదిరిగానే విశేషమైన మార్పుని పొందేరు. వారు దోపిడీవిధానపు జారినుంచి తప్పించబడ్డారు. వారిలో చాలభాగం సమిష్టిక్షేత్ర రైతాంగంగా మార్పుచెందేరు. అధునాతనమైన, యంత్రసామగ్రీ, సమిష్టిశ్రమ మీద వారు సుఖంగా జీవిస్తున్నారు. "ఇదొక నూతన రైతాంగం. ఇంతకిపూర్వం ఈ మాదిరి రైతాంగం మానవచరిత్రలోనే లేదు" అన్నాడు, స్టాలిన్.

సోవియట్ పాలనలో మేధావివర్గంకూడా మార్పుపొందింది: అసలు దాని నిర్మాణమే నూతనం; అది సాగిస్తున్న పనుల స్వభావమూ నూతనమే. కార్మికులు, కర్షకులూ, ఇతర శ్రమజీవి ప్రజలలో వారికి సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి. వారు ప్రజలకోసం, ప్రజలమధ్య వారితో కలిసిమెలసి పనిచేస్తున్నారు. "కార్మిక - కర్షకులతో కలిసిమెలసి, వారితో సమానంగావస్తూ, ఈ వర్గం నూతనమైన వర్గరహిత సోషలిస్టు సమాజాన్ని నిర్మించడానికై బాగా కృషిచేస్తున్నారు." ప్రపంచంలో మరే దేశంలోనూ అటువంటి మేధావివర్గం లేనేలేదు.

యూ. సో. సో. రి. లోని జాతులన్నింటిలోని శ్రామికప్రజ నిర్మాణాత్మకంగా, ఆర్థికంగా, వైజ్ఞానికంగా, రాజకీయంగా సాగించిన అద్భుతకృషికి ఫలితముగా సోవియట్ యూనియన్‌లోని జాతులమధ్యగల సంబంధాలలోనే గొప్ప మార్పు వచ్చింది. ఈ పనిలో బోల్షివిక్కులు అందులో ముఖ్యంగా స్టాలిన్ నాయకత్వం వహించేడు. "దీనికి ఫలితంగా మనది పూర్తిగా స్థిరరూపంపొందిన, భిన్న జాతీయ సోషలిస్టు రాజ్యాంగం అయింది. ఇది అన్ని పరీక్షలకీ నిలబడింది. దీనికిగల స్థిరత్వాన్ని ప్రపంచలోని ఏ జాతీయ రాజ్యాంగమూచూచి అసూయపడకుండా వుండదు" అన్నాడు.

ఎనిమిదో సోవియట్ అసాధారణ సమావేశం యూ. సో. సో. రి. యొక్క నూతన రాజ్యాంగ ప్రణాళికని స్వీకరించింది. కార్మిక - కర్షకుల సోషలిస్టు రాజ్యాంగానికి ప్రధాన ధర్మచట్టంగా అంగీకరించింది. భూస్వాముల్నీ, పెట్టుబడిదారుల్నీ కూలద్రోసి, శ్రామికవర్గ నియంతృత్వం స్థాపించబడడంవలన పెరిగి బలపడిన శ్రామికప్రజాప్రతినిధుల సోవియట్లు దీనికి రాజకీయ పునాది." ఈ రాజ్యాంగంలో అధికారం అంతా పల్లెలలోనీ, పట్టణాలలోనీ, శ్రమజీవులది. శ్రామిక ప్రజా ప్రతినిధుల సోవియట్లు వారి ప్రతినిధులు. ఈరాజ్యాంగానికి ఆర్థికపు పునాది సోషలిస్టు ఆర్థికవిధానమూ, ఉత్పత్తి సాధనాలమీద సోషలిస్టు స్వత్వాధికారమూను. పెట్టుబడిదారీ ఆర్థిక విధానాన్ని నిర్మూలించి, ఉత్పత్తి సాధనాలూ, పరికరాలమీద వ్యక్తి స్వత్వాన్ని తొలగించి, మనిషిని మనిషి దోచుకునే పద్ధతిని నిర్మూలించడం వలన ఈ సోషలిస్టు స్వత్వాధికారం దృఢపడింది. ఈ రాజ్యాంగంలో సోషలిస్టు సిద్ధాంతమైన—"ప్రతివానినుంచీ, వాని శక్తి ననుసరించి పనితీసుకోవడమూ, ప్రతివానికీ అతని పని ననుసరించి ఇవ్వడమూ" అనేది, అమలు పరచబడింది.

యూ. సో. సో. రి. లోని ప్రజలకి సోవియటు రాజ్యాంగ చట్టం పనిచేసే హక్కుకి హామీ పడుతూంది. విశ్రాంతి తీసుకొనే హక్కుని; ముసలితనంలోనూ, జబ్బుపడ్డప్పుడు, పనిచెయ్యగల శక్తిని కోల్పోయినప్పుడూ పోషించేహక్కుని; చదువుకునే హక్కుని; హామీపడుతూంది. ఆర్థిక, రాజ్యాంగ, వైజ్ఞానిక, సామాజిక, రాజకీయ జీవితరంగాలలో స్త్రీ - పురుషులకి సమానహక్కులని హామీపడుతూంది. యూ. సో. సో. రి. లోని పౌరులందరికీ సమానహక్కుల నిస్తూంది. వారేజాతి వారైనా సరే, ఏతెగవారైనాసరే అందరికీ ఆర్థిక, రాజ్యాంగ, వైజ్ఞానిక, సామాజిక, రాజకీయ జీవితరంగాలలో సమానహక్కు లున్నాయి. భావస్వేచ్ఛ; వాక్స్వాతంత్ర్యం

త్ర్యం; పత్రికా స్వాతంత్ర్యం; సభా స్వాతంత్ర్యం; ప్రజలు మీటింగులు పెట్టుకుం దుకు, వీధులలో వూరేగింపులూ, ప్రదర్శనాలూ సాగించేటందుకూ స్వాతంత్ర్యం ఇవ్వబడింది. ప్రజాసంస్థలలో చేరే హక్కు ఇవ్వబడింది. మనుష్యుని గౌరవం కాపాడబడుతుంది. పౌరుల ఇళ్ళు గౌరవంగా చూడబడతాయి, వారిజాబులు ముట్టుకో బడవు. శ్రామికప్రజల స్వార్థాలని సమర్థించినందుకై, శాస్త్రీయ పరిశోధనలకై, జాతీయ స్వాతంత్ర్య పోరాటాలు సాగించినందుకై బాధించబడిన విదేశీయులకి ఆశ్రయం ఇవ్వబడుతుంది.

నూతన సోవియట్ రాజ్యాంగచట్టం ముఖ్యాంశాలివి. దీనినే ప్రజలు స్టాలిన్ రాజ్యాంగచట్టం అంటారు. దీనికి రెండుకారణాలున్నాయి. ఈ రాజ్యాంగచట్టం యొక్క మూలసిద్ధాంతాన్ని తయారుచేసినది స్టాలిను. రెండోకారణం: స్టాలిన్ నాయకత్వంక్రింద యూ. సో. సో. రి. లోని శ్రామికప్రజ సంపాదించిన అఖండ విజయాలని ఇది గట్టిపరుస్తూంది. ఈ నూతన రాజ్యాంగచట్టం ప్రకారం జరప బడిన ఎన్నికలు యూ. సో. సో. రి. లోని ప్రజలమధ్య, నైతికంగానూ, రాజ కీయంగానూ గల ఐక్యతని చూపుతున్నాయి. అటువంటి ఐక్యత ప్రపంచంలో ఎక్కడా చూడము. పెట్టుబడిదారీదేశాలలో అసాధ్యం. 1937 డిసెంబరు నెలలో యూ. సో. సో. రి. సుప్రీంసోవియటుకి జరిగిన ఎన్నికలలో యించుమించు 9 కోట్ల వోట్లు - అంటే, మొత్తం వోట్లలో 98 6% కమ్యూనిస్టు - నాన్ పార్టీబ్లాకుకి యివ్వబడ్డాయి. 1938 జూన్‌లో జరిగిన యూనియన్ రిపబ్లిక్కుల సుప్రీంసోవి యట్లకి జరిగిన ఎన్నికలలో 920 లక్షలవోట్లు అంటే 99.4% కమ్యూనిస్టు-నాన్ పార్టీ బ్లాక్‌కి యివ్వబడ్డాయి. ఈ విషయాన్ని నిర్దేశిస్తూ స్టాలిన్ పద్దెనిమిదోపార్టీ కాంగ్రెసులో ఇల్లాగ చెప్పేడు: "మనం ఇప్పుడు సమాలోచిస్తూన్న కాలంలో మన దేశంయొక్క సామాజిక - రాజకీయాభివృద్ధి రంగాలలో మనం సాధించిన మహత్తర సాధన దోచుకునేవర్గాలు పూర్తిగా నిశ్శేషంగా పెల్లగించివేయబడడం; శ్రామికులు, రైతులు, మేధావులూ ఒకేఒక శ్రామికప్రజగా ఐక్యమైపోవడం: సోవియట్‌సమాజంలోని నైతిక - రాజకీయైక్యత బలపడడం, మనదేశంలోని జాతులమధ్య స్నేహం సన్నిహితం గావడం; అని చెప్పాలి. వీనికి ఫలితంగా మనదేశంలోని రాజకీయజీవితం పూర్తిగా ప్రజాయత్తంఅయింది. నూతనరాజ్యాంగ ప్రణాళిక ఏర్పడింది. ప్రపంచ రాజ్యాంగప్రణాళికలలోకల్లా మనదే హెచ్చుగా ప్రజాయత్తమైనదని చెప్పడాన్ని ఎవ్వరూ కాదనజాలరు. యూ. సో. సో. రి. యొక్క సుప్రీం సోవియటుకి జరిగిన ఎన్నికలూ, యూనియన్ రిపబ్లిక్కుల సుప్రీం సోవియట్లకి జరిగిన ఎన్నికలూ దీనికి వుదాహరణలు."

1939 లో 18 వ. పార్టీకాంగ్రెసు జరపబడింది. సోవియటుయూనియను లోని శ్రామికప్రజా, పార్టీ కలిసి కమ్యూనిజంయొక్క విజయంకోసమై సాగించిన పోరాటంయొక్క ఫలితాలని క్రోడీకరిస్తూ స్టాలిన్ రిపోర్టు నిచ్చేడు. నూతన పరి స్థితులమధ్య కాంగ్రెసు సమావేశమయింది. "ఈనాడు పెట్టుబడిదారీదేశాలు రాజ కీయ - ఆర్థికరంగాలు రెండింటా గొప్ప సంక్షోభాల ననుభవిస్తున్నాయ"ని ఈ కాం

గ్రెసులో స్టాలిన్ చెప్పేడు. పెట్టుబడిదారీదేశాలు దుస్థితులనీ, నూతనార్థికసంక్షోభాలనీ అనుభవిస్తూన్న కాలం యిది. “కాని సోవియటు యూనియను ఈ సంవత్సరాలలో వృద్ధిపొందింది. సుఖసంపన్నం అయింది. ఆర్థిక - వైజ్ఞానికాభివృద్ధి పొందింది. రాజకీయశక్తి - సైనికశక్తి యింకా వృద్ధిపొందింది. ప్రపంచంఅంతటా శాంతి సంరక్షణ చేయడానికి పోరాటం సాగించబడింది.”.

ఇతరప్పుడు మాదిరిగానే ఈ పార్టీకాంగ్రెసులోకూడా స్టాలిన్ పార్టీప్రచారం మీదా పార్టీసభ్యులకి, కాడర్లకి, మార్క్సిస్టు - లెనినిస్టువిజ్ఞానం నేర్పవలసిన ఆవశ్యకతమీదా ఎక్కువ ప్రాధాన్యతనిచ్చి చెప్పేడు. “బోల్షివిక్కులు విజ్ఞానశాఖలన్నింటిలోనూ నేర్చుకుతీరవలసిన శాఖ ఒకటుంది. సమాజాభివృద్ధిసూత్రాలని, శ్రామిక విప్లవాభివృద్ధి సూత్రాలనూ సోషలిస్టు నిర్మాణాభివృద్ధి సూత్రాలని, కమ్యూనిజం యొక్క విజయాన్ని బోధించేమార్క్సిస్టు - లెనినిస్టు విజ్ఞానమే అది.” మన కాడర్లకిబోల్షివిస్టుధోరణిలో తరిఫీదునివ్వాలి.

అన్ని శాఖల పనులలోనూవున్న కాడర్లు సమాజాభివృద్ధి సూత్రాలని బోధించే మార్క్సిస్టు - లెనినిస్టు విజ్ఞానంలో నిపుణత సంపాదించ గలిగేటట్లు తోడ్పడాలి; ఏమంటే — “లెనినిస్టు తాను ప్రత్యేకకృషిచేసిన ఏ గణిత శాస్త్రాన్నో, వృక్షశాస్త్రాన్నో, రసాయనశాస్త్రాన్నో పట్టుకుని అదితప్ప మరొకటి చూడకుండా కూర్చుంటే అతడిని లెనినిస్టు అనలేము. తనకినచ్చిన శాస్త్రంలో మట్టుకు నిపుణత సంపాదించిపూరుకోలేడు లెనినిస్టు. అతడు రాజకీయాలలోనూ, సమాజవ్యవహారాలలోనూకూడా పనిచేసేవాడు గావాలి. మనదేశంయొక్క భవిష్యత్తునందు ఆతురత గలవాడై వుండాలి. సమాజాభివృద్ధిసూత్రాలు తెలిసినవాడై వుండాలి. ఈసూత్రాల్ని సమన్వయించగలవాడై వుండాలి. దేశంయొక్క రాజకీయ మార్గదర్శిత్వంలో పట్టుదలగా పనిచేసేవాడు గావాలి.” అని చెప్పేడు, స్టాలిన్.

ఈ కాంగ్రెసులో స్టాలిన్ ఎన్నో ప్రధానములయిన సిద్ధాంతసమస్యల్ని వివరించేడు. వాటిలో రెండింటిని గురించి చెప్పడం ముఖ్యం. నూతన సోవియటు మేధావుల్ని గురించిన దొకటీ, రెండోవి రాజ్యాంగసమస్యని గురించి. నూతన సోవియటు మేధావుల అవసరాన్ని గుర్తించకపోవడమూ, వారిని చీదరించుకోవడమూ ననేవానికి విరుద్ధంగా తీవ్రపోరాటం సాగించాలన్నాడు. సోవియటు మేధావులకి సరియైన తరిఫీదు నివ్వకపోతేనూ, వారియెడ సక్రమమైన దృక్పథం అవలంబించకపోతేనూ, మేధావులయెడ అసహ్యాభావాన్ని విడిచిపెట్టకపోతేనూ కమ్యూనిజంయొక్క పూర్ణవిజయాన్ని సాధించడం అసాధ్యమనీ, స్వల్పకాలంలో పెట్టుబడిదారీదేశాలని ఆర్థికంగా దిగతొక్కి ముందుకిపోవడం సాధ్యపడదనీ, స్టాలిన్ ఉపదేశించేడు. నూతన సోవియటుమేధావుల సిద్ధాంతాన్ని ఆయన ముందుకి తేచ్చేడు. ఇది సోషలిస్టుమేధావివర్గం, వీరు ప్రజలలోంచి వచ్చేరు. కార్మిక-కర్షకులలో చేయీ-చేయీగలిపి వీరు కమ్యూనిజంకోసమై పోరాడుతూన్నారు.

రాజ్యాంగయంత్రపు ప్రాముఖ్యతకి సంబంధించిన సమస్యని ఆయన చర్చించేడు. కమ్యూనిజంకోసం సాగించే పోరాటంలో, పెట్టుబడిదారీముట్టడి

ఇంకా ఛేదించబడకపూర్వమే రాజ్యాంగం అంతరించుతుందనే సిద్ధాంతం రాజ్యాంగంయొక్క ప్రాముఖ్యతను గుర్తించకపోవడమేనని స్టాలిన్ విమర్శించేడు. అప్పటికి వున్నంతకాలమూ సోషలిస్టురాజ్యాంగాన్ని బలపరచడం ఎంత ప్రాధాన్యమో చూపించి, తాను స్వయంగా యూ. సో. సో. రి. యొక్క శ్రామికప్రజల స్వార్థంకోసమై రాజ్యాంగాన్ని బలపరచడం ఎంత ప్రాధాన్యమో చూపించి, తాను స్వయంగా యూ. సో. సో రి. యొక్క శ్రామికప్రజల స్వార్థంకోసమై రాజ్యాంగాన్ని బలపరచడానికి నిరంతరం పనిచేసేడు.

స్టాలిన్ దేశరక్షణకై విశేషశ్రద్ధ తీసుకుంటాడు. దేశీయరక్షణకి సంబంధించిన విషయాలని ఎంతచిన్నదైనా ప్రతిదానినీ స్వయంగా పరిశీలిస్తాడు. మందుగుండు కర్మాగారాలు, విమాననిర్మాణం, టాంకుల నిర్మాణం, నౌకాబలాల, సబ్మెరీన్‌బలాల నిర్మాణానికీ సంబంధించిన ప్రతిచిన్నవిషయాన్నీ స్వయంగా పరిశీలిస్తాడు మిలిటరీసరఫరాలు, ఆయుధాలూ మొదలగు విషయాలలోనూ, రెడార్మీసైనికులయొక్క, కమాండర్ల, రాజకీయప్రచారకుల పాదార్థికసుఖస్థితికోసమూ, రాజకీయవిజ్ఞాన ప్రచారంకోసమూ విశేషశ్రద్ధ చూపేవాడు.

కమ్యూనిజానికి శ్రేష్ఠుడైన పైలట్‌లాంటి స్టాలిన్ ఎప్పుడూ తనస్థానాన్ని విడవడు. చుట్టుప్రక్కలనున్న పెట్టుబడిదారీదేశాల ప్రభుత్వాలు చేసే పనుల నెప్పుడూ ఒకకంట కనిపెట్టిచూస్తూనేవుంటాడు. సోవియట్‌నౌకని ఆయన ఎప్పుడూ నూతన కమ్యూనిస్టువిజయాలకై ముందుముందుకే నడుపుతూంటాడు.

జర్మనీతో యుద్ధంతప్పదని ఆయనగ్రహించేడు. అందుకే అద్భుతమైన రాజకీయచాతుర్యంచూపి 1939 లో సన్నిహితంగావున్న ప్రమాదాన్ని తప్పించుకుని తద్వారా కొంత ఊపిరిపుచ్చుకుందుకు అవకాశాన్ని సంపాదించేడు. అపని ఎంతో ఉపయోగకరం అయిందని కాలమే నిరూపించింది. పోలిషు ప్రభుత్వం దండెత్తి వచ్చిన జర్మను సైన్యాలకి భయపడి దేశాన్ని దానిగతికివాన్ని వదిలిపెట్టి పారిపోయినప్పుడు వెంటనే రెడార్మీ పోలీషు భూస్వాముల పీడననుంచి పడమటి యూక్రెయిన్‌నీ, పడమటి బైలోరష్యాని విడిపించి తమ కర్తవ్యాన్ని నిర్వహించుకున్నాయి. ఇది లెనినిస్టు - స్టాలినిస్టు జాతీయ నీతివిధానానికి అనుకూలమే. దీని వలన సోవియటుయూనియన్‌యొక్క శక్తీ, అంతర్జాతీయప్రతిష్టా వృద్ధిపొందేయి.

ఇది కామ్రేడ్ స్టాలిన్‌యొక్క 69 వ సంవత్సరంలో (1939) జరిగింది

ఈ ఏడాదిలోనే ఉజ్బెకిస్తాన్ శ్రామికప్రజ 270 కిలోమీటర్ల పొడవుగల స్టాలిన్ గ్రాడ్ ఫెర్గనాకాలవని 45 రోజులలో తవ్వి పూర్తిచేసేరు. ఈ ప్రమాణంగల కాలవ సామాన్యంగా తయారుచెయ్యడానికి ఒకేడేళ్ళు పడుతుంది. దీనిని తవ్వడంలో సోవియటు ప్రభుత్వమూ, బోల్షివిక్‌పార్టీ, స్వయంగా స్టాలినూ విశేషమైన తోడ్పాటు నిచ్చేరు. ఈ వీరకృత్యాల పూర్తి అయ్యేక గ్రాండ్ ఫెర్గనాకాలువ నిర్మించిన శ్రామికప్రజ స్టాలిన్‌కి గీతంలో ఒక అభినందనం పంపేరు. దానిలో ఆయన లెనిన్‌యొక్క అనంతరవారసుడనీ, ఒక్క బోల్షివిక్‌పార్టీకేగాక సోవియట్ యూనియన్‌లోని ప్రజలందరికీ ఆయనపేరు ఉత్సాహాన్నిఇస్తుందనీ అభినందించేరు.

# దేశదేశాల నాయకుడు

స్టాలిన్ యొక్క అద్భుతజీవితం వీరోచితపోరాటంలోనూ, ప్రయత్నాలలోనే గడిచింది. పడుచుదనంలోంచీ పార్టీపనికి, శ్రామికవర్గంకోసం, శ్రమజీవులయిన మానవజాతికోసం పనిచేసేడు. మార్క్స్-ఎంగిల్సుల సిద్ధాంతాలతో ప్రథమ పరిచయం ఏర్పడిన నాటినుంచీ, ఆయన విప్లవోత్పాదకమైన మార్క్సిజాన్ని సమర్థిస్తూ, ప్రచారం చేస్తూనేవున్నాడు. 1890 ల ఆఖరునాటినుంచీ, లెనిన్‌తోపాటు, అదే మార్గాన, అటు యిటూ కుడిఎడమలకి దారి తప్పకుండావస్తూనే వున్నాడు. జారిస్టు అధికారుల చేతులలో నిరంతరం యిబ్బందుల పాలవుతూ, జైళ్ళకు, ప్రవాసాలకి పంపబడుతూ, తిరిగి తిరిగి పారిపోయివచ్చి పనిలో నిమగ్నుడవుతూనేవచ్చేడు.

అక్టోబరు విప్లవంకోరకు చేస్తూన్న ప్రయత్నాలలో ఆయన పార్టీని నడిపించేడు. అక్టోబరు సోషలిస్టు విప్లవ విజయాన్ని సంపాదించేడు. నూతన సోషలిస్టు రాజ్యాంగాన్ని లెనిన్‌తోగలిసి నిర్మించుకువచ్చేడు. అన్ని రంగాలలో దానిని కాపాడేడు. లెనిన్‌తోచేరి మూడవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ని నిర్మించి, అపమ్యూనిస్టుల బారినుంచీ, మార్క్సిజం - లెనినిజంకి శత్రువులయినవారి బారినుంచీ కాపాడేడు. కమ్యూనిస్టుపార్టీల అంతర్జాతీయ సమ్మేళనకి ఆయన నాయకుడు. అంతేకాదు, ప్రజల ప్రేమకి పాత్రుడైన నాయకుడు.

మార్క్సిస్టు సిద్ధాంతాయుధాన్ని స్టాలిన్ ఎప్పుడూ పదునుగానే వుంచుతాడు. దానిని పనిలో పెట్టడానికి ఎప్పుడూ సిద్ధంగా వుంటాడు. దానిని పట్టుకోనేది ఎల్లాగనో నేర్పుతూంటాడు. లెనిన్‌తో కలిసీ, స్వయంగానూకూడా మార్క్సిజం—లెనినిజం సిద్ధాంతాన్ని కార్యాచరణకో మార్గదర్శిగా వినియోగించేటట్లు అభివృద్ధి చేసేడు. జాతీయసమస్య; ఒకదేశంలో సోషలిజం విజయం పొందదానికీ సంబంధించిన ప్రశ్న; సోవియట్ల ప్రాముఖ్యతకి సంబంధించిన ప్రశ్న; పెట్టుబడిదారీ ప్రపంచంచేత ముట్టడించబడియున్న సోషలిస్టు దేశంలో రాజ్యాంగ యంత్రానికి సంబంధించిన సమస్య; కమ్యూనిజంకోసం చేసే పోరాటంలో శ్రామికవర్గ నియంతృత్వం ఒక ఆయుధం; దేశాన్ని సోషలిస్టు పరిశ్రమలమయం చేయడం; కులక్కువర్గాన్ని నశింపజేయ్యడం; వ్యవసాయాన్ని సమ్మిష్టిచేయడం; సోషలిస్టు కాడర్లను తయారుచేసుకోవడం; ప్రజలలోంచి సోషలిస్టు మేధావుల్ని తయారుచేసుకోవడం,— ఇంతేగాక ఇంకా ఎన్నో సిద్ధాంతాలకీ, కమ్యూనిజాన్ని సాధించడంలో అవలంబించవలసిన కార్యవిధానాలకీ సంబంధించిన సమస్యల్ని- స్టాలిన్ పరిశీలనచేసి, సమాధానాల నిచ్చేడు.

ఎవరో ట్రాట్‌స్కీయిస్ట్‌చేత దొంగపోటుగా కాల్చిచంపబడ్డ సెర్గీ కిరోవ్ 1934 లో అయిదో లెనిన్‌గ్రాడ్ రీజినల్ కాన్ఫరెన్సులో మాట్లాడుతూ ఇల్లా చెప్పేసు :

"స్టాలిన్‌యొక్క మూర్తిని అన్ని దృక్కోణాలనుంచీ చూడగలగడం అంత సులభసాధ్యం కాదు. ఈ మధ్యనీమధ్య లెనిన్ లేకుండానే కార్యాన్ని నిర్వహించుకోవలసివచ్చిన కాలంలో మాత్రమంలో ప్రధానాభివృద్ధులు, నూతన నిర్మాణాలు, నినాదాలు, ప్రధానకార్యనీతి, అన్నీ స్టాలిన్‌యొక్క సృష్టులే. ప్రధానమైన పనంతా-ఈవిషయాన్ని పార్టీ తెలుసుకుతీరాలి-కామ్రేడ్ స్టాలిన్‌యొక్క మార్గదర్శకత్వాన, ఆయన ప్రోత్సాహంపొంది. ఆయన నాయకత్వాన సాగింది. అంతర్జాతీయ రాజతంత్రంలో ప్రధానసమస్యలమీద నిర్ణయాలు ఆయన సిఫారసుమీద చేయబడ్డాయి. ప్రధానసమస్యలేకాదు. శ్రామికుల్నీ, రైతుల్నీ మొత్తంమీద మనదేశంలోని శ్రామికప్రజల సుఖదుఃఖాలకి సంబంధించిన వైతే చిన్నచిన్న సమస్యలుకూడా ఆయన దృష్టిలోంచి దాటిపోలేవు.

"సోషలిస్టునిర్మాణం విషయంలోనేగాక, మనపనిలో చిన్నచిన్న సమస్యల విషయంలోకూడా ఇది యింతే. ఉదాహరణకి మనదేశరక్షణని తీసుకోండి. పైన నేను వుదాహరించిన సాధనలన్నీ కేవలం స్టాలిన్ కారణంగానే సాధ్యపడ్డాయని చెప్పితీరాలి.

"ఈమానవుని బలిష్ఠమైన మనోబలమూ, అద్భుతమైన నిర్మాణ చాతుర్యమూవలన సోషలిజాన్ని సాఫల్యయుతంగా నిర్మించుకుంరావడంలో వచ్చే పెద్దపెద్ద చారిత్రకపు మార్పుల్ని పార్టీ సకాలంలో సాధించగలుగుతూంది."

కమ్యూనిజంయొక్క పోరాటంలో ఆయన వహిస్తూన్న ప్రధానపాత్రంచే, ఆయనకిగల గొప్పప్రతిష్ఠకి కారణం ఇదే. పార్టీ, యువకమ్యూనిస్టులీగు, సోవియట్ యూనియన్‌లోని శ్రామికప్రజ, ఇతరదేశాలూ ఆయన నంత ప్రేమతో చూడడానికి కారణం అదే.

స్టాలిన్‌యొక్క ఏభయ్యో జన్మదినోత్సవం సందర్భంలో ప్రపంచం నాలుగు మూలలనుంచి, వచ్చిన అభినందనాలకి సమాధానంఇస్తూ,

"కామ్రేడ్స్ ! సందేహం వద్దు. భవిష్యత్తులోకూడా నేను శ్రామికవర్గం నిమిత్తం, శ్రామికవర్గవిప్లవం నిమిత్తం, ప్రపంచకమ్యూనిజం నిమిత్తం నాశక్తుల్ని, నాయుక్తుల్నీ. అవసరపడితే నా శరీరంలోని ఆఖరుబొట్టువరకూ రక్తాన్నికూడా ధారపోస్తా" నన్నాడు.

ఈ మాటలు హృదయపూర్వకమైనవే నని అందరూ ఎరుగుదురు.

మార్క్సిజం - లెనినిజం సిద్ధాంతంలో గంభీరమైన జ్ఞానంకలిగి, పార్టీకి, లెనిన్‌కే, కమ్యూనిస్టు ఇంటర్నేషనలుకీ, ఆత్మసమర్పణం చేసుకున్న స్టాలిన్ అద్భుతమైన నిర్మాణచాతుర్యంగలవాడు. ఈలక్షణాలు ఆయనకి ఎంతో చిక్కు సమస్యల్నికూడా చులకనగా గ్రహించగల నేర్పుని కలిగించేయి. వాటిని అవ

సున్నితంగా, అర్థంఅయ్యేలాగ ప్రజాసామాన్యానికి బోధించగల నేర్పు కలిగింది. లెనిన్‌లాగే లక్షలకొద్దీ ప్రజలకి మార్క్సిజం - లెనినిజం సిద్ధాంతాన్ని బోధించ గలడు. ఆయన చాలా నిరాడంబరజీవి జీవితపద్ధతి, ఆకోరికలు, ఇతరులతో ఆయనకిగల సంబంధాలూ అతిసాధారణాలు. ఈనిరాడంబరత బోల్షివిక్కుకి ఒక ఆభరణం. పార్టీసభ్యులు, యువకమ్యూనిస్టుసమితి సభ్యులు అందరిలోనూ ఈభావాన్ని కలిగిస్తాడు. మనందరినీ నిరాడంబరంగా, మర్యాదగా జీవించమని బోధిస్తాడు.

"స్టాలిన్ చాలా పుస్తకాలు, అద్భుతమైనవి వ్రాసేడు. వానిలో చాలా పుస్తకాలు మార్క్సిస్టువాఙ్మయంలో ప్రామాణ్యగ్రంథాలు. కాని, నీ వెల్లాంటి వాడివని అడిగినప్పుడు 'నేను లెనిన్ శిష్యుడిని. నా ఆదర్శం ఆయనకి తగిన శిష్యుడి ననిపించుకోవడమే' నన్నాడు. (హెన్రీ బార్బ్యూసే, స్టాలిన్.)

స్టాలిన్‌కి పెద్దలన్నా, చిన్నవాళ్ళన్నా ప్రేమ. యువకుల సౌభాగ్యం విషయం లోనూ, వారికి కమ్యూనిస్టుతరఫీదు నివ్వడంలోనూ, వారి ఆరోగ్యం, శరీరబలం విషయంలోనూ, విశేషశ్రద్ధ చూపుతాడు. వారు బాగాచదువుకుని, సంగతులన్నీ ఎరిగి, కమ్యూనిస్టుయోధులుగా యోగ్యతని ప్రదర్శించగలగాలని ఆయన ఇచ్ఛ. యువకమ్యూనిస్టు సమితియొక్క అభివృద్ధికీ, దానికిగల పలుకుబడికీ, ప్రధాన కారణం స్టాలినే. పిల్లలూ, యువకులూ ఆయనని ప్రేమపాత్రుమైన మిత్రునిగా, తండ్రినిగా, గురువునుగా, కామ్రేడ్‌నుగా చూసుకుంటారు.

పనిచెయ్యడంలో ఆయనకున్న ఓపిక అద్భుతం. మనదేశంలో అంత అల్లాగ పనిచేసేవాడు మరొకడున్నా డనుకోను. తెల్లవారగట్ల నాలుగింటివరకూ ఆయన పనిచేస్తూనే వుంటాడు. ఆయనకిగల అభిరుచులు అనంతం. లెనిన్‌లాగే ప్రజల విషయంలో, కమ్యూనిజంయొక్క విజయం విషయమై పనిచెయ్యడంలో ఒళ్ళుదాచుకోడు.

హెన్రీబార్బ్యూసే స్టాలిన్‌ని అద్భుతంగా చిత్రించేడు.

"రాత్రివేళ రెడ్‌స్క్వేర్‌లో పచారు చేస్తూంటే ఆ సుందరదృశ్యంయొక్క యవనికలో కాలం రెండు భాగాలుగా వేరుచేయబడినట్లు తోస్తుంది. ఒకభాగం నేడు భూమిమీదల్లా ప్రశస్తమైన దేశంయొక్క వర్తమానయుగమూ, 1917 కి పూర్వపు రెండోభాగమూ. (ఇదంతా ప్రాచీనయుగం) ఆ చీకట్లలో మునిగివున్న నిర్జనమైన స్క్వేర్‌లో సమాధిలోవున్న వ్యక్తి ఒక్కడే మెలకువగావుంది, తన చుట్టూ, నగరంలో, దేశంలో, విజృంభిస్తూన్న జీవితాలని కాపాడుతూన్నట్లు అనిపిస్తుంది ఆయనే నిజమైన మార్గదర్శి. శ్రామికులాయన ఓమ నాయకుడూ, కామ్రేడూ, తండ్రీ, సోదరుడూ ననీ, ప్రేమతో అందర్నీ బుజ్జగిస్తాడనీ మహో త్సాహపడతారు. నీవు ఆయన్ని ఎరక్కపోవచ్చు. కాని, ఆయనకి నీవు తెలుసు. నీ కోసం పనిచేసేడుగాద. నీ వెవరయినా సరే, ఈ పరోపకారి సహాయం నీ కుంది. నీ వెవరివయినాసరే నీ భవిష్యత్తులో శ్రేష్ఠభాగం ఈ రెండో మనిషి

చేతుల్లోవుంది. ఈయనకూడా అందర్నీ కాపాడుతూన్నాడు. అందరికోసం పని చేస్తూన్నాడు. ఆ మానవుని మేధస్సు విజ్ఞానవంతుడిది. మొగం శ్రామికుడిది. వేషం సైనికుడిది."

పరిపాలనా కళలోనూ, కార్యనిర్వహణ కళలోనూ స్టాలిన్ మనగురువు. ఈ కళయొక్క ప్రధాన నిబంధనలలో ప్రజా సంబంధం వొకటి. ప్రజాసామాన్యం యెడ వుండవలసిన దృక్పథమూ, పెట్టుకోవలసిన సంబంధమూయొక్క పరిపూర్ణతకి ఆయన వొక ఉదాహరణ. ఆయన ప్రజలకి బోధించడమేగాక వారినుంచి కూడా నేర్చుకుంటాడు. ప్రజలలో సంబంధం కలిగివుండడం నిజమైన బోల్షివిక్కుకి గుర్తు అని ఆయన చెప్తాడు. ప్రజలతో సంబంధమూ, సన్నిహితత్వమూ, అంటే ఇచ్చకాలాడడంకాదు.

పంథాల విషయంలో మెత్తదనం కూడదనడానికి స్టాలిన్ వుదాహరణ. బోల్షివిక్కు వుండవలసిన ముఖ్యలక్షణాలలో ఇదొకటి. బోల్షివిక్ విద్యాభ్యాసంలో ఇది చాలా ఉపయోగకరమైన ఆయుధం. మార్క్సిజం - లెనినిజం సిద్ధాంతాలకి తప్పుదర్థాలు తియ్యడానికీ, వాటిని పెడదార్లు తొక్కించడానికీ, చేయబడే ఎంత చిన్నప్రయత్నాన్నీకూడా అలుసుదనం చూపి వదలకూడదని, అదే బోల్షివిక్ పద్ధతియనీ, స్టాలిన్ బోధిస్తాడు. లెనిన్‌లాగనే ఆయనకూడా కమ్యూనిజానికి శత్రువులయినవారియెడల నిర్దయగా, కఠోరంగా వుండమంటాడు.

తనపొలాన్ని ప్రేమించే వ్యవసాయదారునిగా పాటలలో ఆయనని వర్ణిస్తూంటారు. మనవున్న అమూల్యనిధి ప్రజలు, కాడర్లు. ప్రజలయెడల, కాడర్లయెడల, మానవమాత్రులయెడల ఆయనకిగల సద్భావనయే స్టాలిన్‌ని ప్రజలు అంత విలువతో చూసుకోడానికి కారణం. ఆయననుంచి మనం నేర్చుకోవలసిందిదే.

మార్క్సిజం - లెనినిజం సిద్ధాంతంలో ఆయన నిరంతరకృషి పరిస్థితుల్ని సమగ్రంగా సమాలోచన చెయ్యడంలోనూ, ముందే తెలుసుకోగలగడంలోనూ సమర్థుణ్ణి చేసేయి. కొత్తవాటిని పసికట్టగల నేర్పు ఆయనలో విశేషంగా వుంది. అందుచేతనే బోల్షివిక్ దూరదృష్టికి ఆయనే దృష్టాంతంగా వున్నాడు. అదేగనక లేకపోతే, నాయకత్వం వహించగలగడం, సోవియట్ రాజ్యాంగనౌకని నడిపించగలగడమూ అసంభవం.

మాస్కోలోని స్టాలిన్ ఏరియాలోని తన వోటర్లని ఉద్దేశించి 1937 డిసెంబరు 11 న ఆయన యిల్లా చెప్పేడు.

"వోటర్లూ, ప్రజలూ, తమప్రతినిధులు తమతమ పనులకి తగినవారనిపించుకునేలాగ ప్రవర్తించాలనీ, రాజకీయ కుతర్కాలలోకి దిగిపోకూడదనీ, తమతమ స్థానాలలో లెనిన్‌మాదిరి రాజకీయవ్యక్తులుగా నిలబడగలగాలనీ, లెనిన్‌మాదిరిగా నిర్దిష్టమూ, స్పష్టమూఅయిన విధంగా ప్రజాసేవలో పాల్గొనాలనీ, లెనిన్‌మాదిరిగా ప్రజాశత్రువులయెడ నిర్దయగావ్యవహరించాలనీ, పరిస్థితులు క్లిష్టంగావుండి, ఏదోఒక ప్రమాదం రాదోయూందని లోచేటప్పటికి కంగారు పడకూడదనీ, భయచిహ్నాలు

కూడా చూపరాదనీ, లెనిన్‌లాగా నిర్భయులుగా వుండాలనీ, లెనిన్‌లాగే కఠినపరిస్థితులు వచ్చినప్పుడు సరిగ్గా ఆలోచించి, మంచి - చెడ్డలు విచారించి, తెలివిగా, నిశ్శంకంగా కార్యక్రమంలో పెట్టగలగాలనీ, లెనిన్‌లాగనే మర్యాదగలిగి, ముక్కుకి సూటిగా పోయేవారయి వుండాలనీ, లెనిన్‌లాగనే తమప్రజంనీ ప్రేమించేవారయి వుండాలనే, కోరాలి."

స్టాలిన్‌లో ఈ లక్షణాలన్నీ వున్నాయి. తన స్థానంలో ఈ రాజకీయవేత్త ఎప్పుడూ లెనినిస్టులాగనే వ్యవహరించేడు. లెనిన్ మాదిరిగానే స్పష్టమూ, నిర్దిష్టమూనైన ప్రజాసేవలో పాల్గొనేవాడే. పోరాటంలో లెనిన్‌లాగే నిర్భయుడూ, నిర్భయుడూను. క్లిష్టపరిస్థితులువచ్చి, దేశం ప్రమాదాలలో చిక్కుకునివున్నా, ఆయన కంగారు పడలేదు. చివరకి భయచిహ్నంకూడా చూపలేదు లెనిన్‌లాగనే. మంచి సమాలోచనా, మంచి - చెడ్డలు విచారించవలసిన నేర్పూ, అవసరమయ్యే చిక్కు సమస్యలు వచ్చినప్పుడు ఆయన లెనిన్‌లాగనే తెలివిగా, నిశ్శంకంగా నిర్ణయాలకి వచ్చేస్తాడు. లెనిన్‌లాగ ఆయనా మర్యాదగలవాడు. ముక్కుకి సూటిగా పోతాడు. లెనిన్‌లాగనే ప్రజల్ని ప్రేమిస్తాడు. అందుకే ప్రజ లాయన నంత ప్రేమతో చూస్తారు. వారు లెనిన్‌ని ప్రేమించినట్లే స్టాలిన్‌నీ ప్రేమిస్తారు.

"బ్రహ్మాండమైన కష్టాలపై పొందిన విజయాలపరంపర ఆయన జీవిత చరిత్ర. 1917 నాటినుంచీ ఆయన చేస్తూన్న పనులలో ఒక్కపనివలన ఎవ్వడేనా ప్రముఖవ్యక్తి కాగలడు. ఆయన యినుపమనిషి. ఆయనపేరే ఆయన్ని వర్ణిస్తూంది : స్టాలిన్ - ఉక్కు. ఉక్కులాగే ఆయన విరగడు. ఎక్కడికక్కడకి సర్దుకోగలడు. ఆయన ప్రపంచజ్ఞానమూ, అనంతమైన విజ్ఞానమూ, ఏకాగ్రత, సక్రమస్థితికోసమై ఆయనకిగల ఆసక్తి, పట్టుదల, శీఘ్రత, నిశ్చితత్వం, నిర్ణయాలగంభీరత, అవసరానికి తగిన మనిషిని ఎన్నుకోవడంలో ఆయనకుగల చాకచక్యమూ ఆయనకిగల అధికారానికీ కారణాలు.

"చనిపోయినవారు జీవించగలది భూమిమీద ఒక్కచోటనే. విప్లవకారులున్న చోట్లనల్లా లెనిన్ జీవిస్తాడు. కాని, మిగిలిన ఎవరిలోకంటేనూ హెచ్చుగా స్టాలిన్‌లో లెనిన్‌యొక్క ఊహలూ, మాటలూ జీవించివున్నాయి. మనరోజులనాటి లెనిన్ ఆయన...." (హెన్రీ బార్బూసే, స్టాలిన్.)

స్టాలిన్‌యెడ తమకిగల ప్రేమని అభిమానాన్ని ప్రజలు పాటలలో ప్రకటిస్తారు. ఆయనని వారు పీడితప్రజలని ఉద్ధరించిన వాడినిగా మంచి రాజకీయవేత్తనిగా వర్ణిస్తారు. నిశితమైన దృష్టిగల నిర్భయమైన షైరిడేగగా పోలుస్తారు. దాఘేస్థాన్ పర్వతవాసుల పాట ఒకటి చూడండి :

ఓడవెనక - గాడిలా
కర్రువెనక - చాలులా
లక్షలాదిగ - నీవెంట
వచ్చివేస్తా - మెచటికైన

దారితప్పము - గమ్యమొక్కటే
బాటవెంబడి - వచ్చివేస్తాం.

చిన్నజాతియైన లాక్సు స్టాలిన్‌మీద పాడేపాట చూడిండి.

నదులు సముద్రాన్నీ
ఇనుము ఇనపరాతినీ
పసిరిక సూర్యుడినీ
పక్షులు దక్షిణ దిశనీ
వెతుకుతాయి - వెతుకుతాయి
కాని, మనుష్యులు
సుఖసత్యాలకి
వారి మనస్సులు
మిత్రత్వానికి—
వారిభావములు
నీ వేపునకూ
ఉరుకుతాయి, పరుగెడతాయి.

స్టాలిన్ జీవితం శిక్షలకొలది ప్రజలకి జ్ఞానం కలిగిస్తుంది. ఆయన గంభీర మూర్తి శ్రామికప్రజని వారిపోరాటంలో ఉత్సాహాన్ని కలిగిస్తుంది. ఆయనమాటలు శ్రామికవీరులని నూతనాద్భుతాలని నిర్వహించప్రోత్సహిస్తాయి. ఆయన భావాలు మన మార్గాన్ని చాలా దూరంవరకూ స్పష్టంగా చూపుతాయి.

సర్వవిజయిమైన సోవియటు యూనియను కమ్యూనిస్టుపార్టీ ధ్వజంక్రింద పూర్తివేగంతో సాగుతూన్న సోవియట్ రాజ్యాంగనౌకకి చుక్కానికడ స్టాలిన్ దేశదేశాల మిత్రుడూ, గురువూ, నాయకుడూ అయిన స్టాలిన్ సళంగులా నిలబడి వున్నాడు.

"మాకు సుఖజీవితం ప్రసాదించిన నీకు వందనాలు" అని సోవియటు యూనియన్‌లోని పిల్లలు అంటాచు. ప్రపంచంలోని నాలుగుమూలల ప్రజలూ, ఆయనపేరును భక్తి - ప్రేమలతో ఉచ్చరిస్తారు. కమ్యూనిజం పొందిన అనంత విజయాలకీ, సోవియట్ ప్రజలని నడుపుతూన్న ప్రకాశమానాలయిన ఉన్నత శిఖరాలకీ ఆయనపేరు ఒక జెండా.

మన శత్రువులకి గర్భనిర్భేదకంగా మన శ్రామికప్రజలకి, అందరు శ్రామిక ప్రజలకీ ఆనందోత్సాహకరంగా కామ్రేడ్ స్టాలిన్ చిరంజీవి కావాలనే మనవాంఛ.

# వివరణలు

పుట

3. * ఇలియా చావ్‌చావాజే: (1837 - 1907) జార్జియన్ దేశీయుడు. గ్రంథ కర్త, ప్రచురణకర్త. దాసత్వం రద్దుచెయ్యబడాలని ఆందోళన చేసేడు. జార్జియన్ భాషా, విజ్ఞానం వీటిని సమర్థించేడు. ఉదారవాదులైన రాజకుటుంబాలు జార్జియాలో పెట్టుబడిదారీవిధానపు వృద్ధికి ప్రయత్నించాలని వ్రాసేడు.

3. * N. G. చెర్నిషేవ్‌స్కీ: మేధావి వర్గానికిచెందిన 19 వ శతాబ్దపు విప్లవ కారుడు. రైతువిప్లవం రావాలనీ, గొప్ప భూస్వాములు తొలగించబడి, గ్రామ కమ్యూన్‌లు ఏర్పడాలనీ అన్నాడు. ఈయన వ్రాతలని లెనిన్ చాలా మెచ్చుకున్నాడు.

11. * ట్రాన్స్ - కకేషియా: జార్జియా, ఆర్మేనియా, అజర్బయిజాన్‌లు మూడూ కలిసి ట్రాన్స్ కకేషియా అనబడతాయి.

12. * నోయా జోర్డానియా: జార్జియాదేశీయుడు. 'లీగల్ మార్క్సిస్టు.' పెట్టుబడిదారీవిధానం వృద్ధిపొందడం అత్యవసరం అనీ, అది అభివృద్ధికర మనీ వాదించేడు; ఈ పెట్టుబడిదారీవిధానపు వృద్ధి పెట్టుబడిదారులా, శ్రామికులా సహకారం వలన సాధించబడాలన్నాడు. జార్జియా దేశపు జాతీయతాభివృద్ధి వాంఛించేడు.

13. * శ్రామికవర్గపు విముక్తికై పోరాడే సంఘం (పీటర్సుబర్గు): ఆర్థిక పరిస్థితులు బాగుపరచుకుందుకు శ్రామికులు జరిపే పోరాటాన్నీ, జారిజానికి విరుద్ధంగా జరిపే రాజకీయ పోరాటాన్నీ జత కలుపుతూ లెనిన్‌యొక్క మార్గదర్శకత్వాన రష్యాలో మొట్టమొదట స్థాపించబడ్డ సంస్థ. 'శ్రామిక వర్గోద్యమంయొక్క వెనకబలంగల విప్లవసంస్థకి మూలం' అయిన మొదటి సంస్థగా వర్ణించేడు దీనిని లెనిన్.

13. * ఎకనామిస్టులు: రష్యన్ ప్రజాసామాన్యం - రైతులు, కష్టజీవులు - చాలా వెనకబడివున్నారనీ, వారు రాజకీయాలలోకి రాలేరనీ, అందుచేత నెమ్మదిగా సాగాలనీ, వీరు నమ్మేవారు. లెనిన్ వీరిని 'ఖ్వోస్టిస్టు' లని పిలిచేడు. ఖ్వోస్టు అంటే రష్యన్‌భాషలో తోక. వీరి నీతితంత్రానికి అర్థం పార్టీ శ్రామికవర్గాన్ని ముందుండి నడిపించేదానికిబదులు వెనకాల వుండాలనే గనక వీరిని లెనిన్ 'ఖ్వోస్టిస్టు' లన్నాడు. వీరికి 'ఎకానమిస్టు' లని పేరు రావడానికి కారణం, శ్రామికవర్గం ఆర్థిక విషయాలతోనే-అంటే పనిగంటలు, జీతాలు, సౌకర్యాలతోనే - సంబంధం పెట్టుకుని, జార్‌తో పోరాడే పనిని ఉదారవాదులయిన పెట్టుబడిదారులకి విడిచిపెట్టా లనడమే.

16 * లీగల్ మార్క్సిస్టులు: జార్ ప్రభుత్వం నిషేధించిన మార్క్సిస్టు సంస్థలలో వీరు ఉండరు. పనిచెయ్యరు. వీరికా పేరు రావడానికి కారణం ఇదే. రష్యాలో ఇంకా మిగిలిన ఫ్యూడల్ పరిస్థితులద్వారా పెట్టుబడిదారీ విధానం

అభివృద్ధిని చూపడంచూసి, వీరు పెట్టుబడిదారీ విధానానికి రష్యా తగిన చోటని అన్నారు; అంతవరకే. అక్కడనుంచి, సోషలిస్టు విప్లవంవేపు సాగడానికి వీరు అంగీకరించరు.

16 * చెరెన్‌స్టీనిస్టులు: చెరన్‌స్టీన్ జర్మనీ దేశీయుడైన సోషల్‌డెమాక్రటు. 1890 నాటివాడు. పెట్టుబడిదారులూ, శ్రామికులూ పరస్పరసహకారంద్వారా శాంతిపద్ధతులలో సోషలిజంలోకి పరిణతిపొందవచ్చుననే అభిప్రాయాన్ని వెలిబుచ్చేడు. ఈయన వాదాన్ని అనుసరించేవారు చెరెన్‌స్టీనిస్టులు.

17 * ర. సో. డె. లే. పా: రష్యన్ సోషల్ డెమాక్రటిక్‌పార్టీ 1898 లో స్థాపించబడింది. బుండ్, పోరాటసమితులు మొ॥నవి ఎన్నో కక్షలిందులో వున్నాయి. దీనిని స్థాపించినవారిలో లెనిన్ ఒకడు. 1903 లో దీనిలో రెండు భావఘోరణులు ఏర్పడి పార్టీ అధికసంఖ్యాకులూ (బోల్షివిక్కులు), అల్పసంఖ్యాకులూ (మెన్షివిక్కులు), గా విడబడింది. బోల్షివిక్కుల నాయకుడు లెనిన్. ఆ తరువాత కాంగ్రెసుకి (1905) మెన్షివిక్కులు హాజరు కావడానికి నిరాకరించేరు. 1908 లో ఏకీభావం మళ్ళీ కుదర్చబడింది. కాని, అది కాగితంమీదనే వుండిపోయింది. బోల్షివిక్కులు విప్లవవాదులుగానే వుండిపోయేరు. విప్లవసంఘాలలో పనిచేస్తూనేవచ్చేరు. మెన్షివిక్కులు దూరంగా నిలబడి పూసుకున్నారు. బోల్షివిక్ నిర్మాణాలనీ, నీతితంత్రాన్నీ విడిచిపెట్టాలని వత్తిడి తెస్తూనేవచ్చేరు. చివరకి 1912 లో మెన్షివిక్కులు ఎక్స్పెల్ చేయబడడంతో పార్టీ రెండుగా విడిపోయింది. బోల్షివిక్కులు 1918 మార్చిదాకా ర. సో. డె. లే. పా. (బోల్షివిక్కులు) అనే పేరునే వాడుతూవచ్చేరు. ఏడవపార్టీ కాంగ్రెస్‌లో లెనిన్ సూచనమీద పార్టీపేరు రష్యన్ కమ్యూనిస్టుపార్టీ (బోల్షివిక్) అని మార్చబడింది. 1922 లో సోవియటుయూనియన్ ఏర్పడ్డాక దీనిపేరు సోవియట్‌యూనియన్ కమ్యూనిస్టుపార్టీ (బోల్షివిక్) అయింది - C. P. S. U. (B)

24. * దాష్నాక్: దాష్నాక్సుటూమ్ పార్టీ. శ్రామికవర్గంలో సంబంధంలేని ఆర్మీనియన్ జాతీయవాదుల పార్టీ. 1890 లలో స్థాపించబడింది. ఆర్మీనియన్ పెట్టుబడిదారుల స్వార్థాల్ని సమర్థించింది; విప్లవం తర్వాత సోవియట్‌ప్రభుత్వానికి విరుద్ధంగా ఫ్రెంచి, బ్రిటిష్, జారిస్టు ఇంటర్వెన్షనిస్టులతో చేరి వారికి సాయంచేసింది.

32. * బ్లాక్ - హండ్రెడ్లు: ఫ్యూడల్ జమీందార్ల అనుచరులు. గూండాలు. యూదుల వేటాడే వుద్యమాన్ని బాగా నిర్మాణయుక్తంగా సాగించేరు. శ్రామికుల సమావేశాలు భగ్నం చెయ్యడానికి ఉపయోగించబడ్డారు. రైతులని చంపి వారి ఆస్తులు నాశనంచెయ్యడంలో పేరుపడ్డారు.

40. * కూ దే థా: Coup d'etat అమలులోవున్న రాజ్యాంగ యంత్రంమీద ప్రజలద్వారాగాక పైనుంచి హఠాత్తుగా బలీయమైన ఆక్రమణ సాగించడం.

44 * బన్‌డిస్టులు ; బన్‌డ్‌లో చేరినవారు. రష్యా, పోలండ్, లిథూనియాల లోని యూదు శ్రామికసంఘం. 1897 లో మొదట స్థాపించబడింది. 1901 వరకూ యూదులకి సమానపౌరసత్వ హక్కులుఅడిగింది. తర్వాత 1905 లో జాతీయ విజ్ఞాన స్వాతంత్ర్యం కావాలనే వాంఛని ప్రకటించింది. బోల్షివిక్కులతో చాల సందిగ్ధమైన విధానాన్ని అవలంబించింది. 1920 లో దీనిలోంచి ఎన్నోదళాలు విడిపోయి బోల్షివిక్కులతో చేరిపోయినాక, కొద్ది మంది శుద్ధ మితవాదులు మిగిలిపోయేరు.

46. * క్యూరియా : చట్టాలుచేసే అధికారమూ, న్యాయవిచాణచేసే అధికారమూ గల సభ.

51. * గాన్‌ట్‌లెట్ : రెండు వరసలలోపున్న మనుష్యుల మధ్యనుంచి. ఎవరి దగ్గరకి వచ్చినప్పుడు వారు కొడుతూండగా ఖైదీని నడిపించే శిక్ష.

51. * లిక్విడేషనిస్టులు : శ్రామికవర్గోద్యమం చట్టబద్ధమార్గాలలోనే నడవాలనీ, అందుచేత రహస్య కార్యక్రమం అంతా చుట్టి దూరంగావుంచాలనీ వాదించే వారు.

51 * ఓట్జోవిస్టులు : బహిరంగ కార్యపద్ధతుల్ని విడిచిపెట్టాలనీ, డ్యూమాలో పాల్గోకుండా బహిష్కరించాలనీ వాదించినవారు.

81 * ముస్సావాటిస్టులు : ముస్సావాట్ అనేది ముస్లిం డెమాక్రటిక్ పార్టీ. 1912 లో స్థాపించబడింది; అజర్‌బైజాన్‌లో పెట్టుబడిదారీ విధానం కావాలనీ, సమీపప్రాచ్యంలోని ముస్లిం ప్రజలంతా తుర్కీ సామ్రాజ్యాధీనంలో ఏకం కావాలనీ వారి కోరిక. 1914-18 యుద్ధంలో జారిజానికి తోడ్పడ్డారు 1918 లో బాకూ కమ్యూన్‌కు విరుద్ధంగా యుద్ధంచేశారు. 1920 లో డెనికిన్‌కు తోడ్పడ్డారు.

114 * కమ్యూన్‌లు : ఆర్టెల్సు : ఆర్టెల్స్‌లో ప్రధానోత్పత్తి సాధనాలు సమిష్టిగా నిర్వహించబడతాయి. ఇంటికి సంబంధించిన పెరళ్లూ (కూరగాయలపెరళ్లూ, చిన్నచిన్న పళ్లతోటలూ) ఇళ్లూ, పాడిపశువులూ, కోళ్లూ మొదలగునవి సమాజఅధీనం చేయబడవు. కాని కమ్యూన్‌లో ఉత్పత్తేగాకుండా, పంపకం కూడా సమాజపరం చెయ్యబడుతుంది.

## పద్యాలు

* Intervention : హస్తాక్షేపం

Offensive : అభియానం

Advance : పురోగతి

Retreat : తిరోగమనం



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA113B106 |
| పుస్తకం పేరు | ప్రజానాయకుడు స్టాలిన్ |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 149 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Hasin |
| స్కాన్ చేసినది | Hasin |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |